ఓం

శ్రీగురుభ్యోనమః

శ్రీవెలివెర్తిరామదాస స్వామివారిచే

రచించబడిన



# పరిపూర్ణ

# గురుసారసంగ్రహము

ఓం

శ్రీగురుభ్యోనమ:

శ్రీశివరామ దీక్షితాచలగురు పరబ్రహ్మణేన్నమ:

శ్రీఅచల పరిపూర్ణ తత్త్వార్థ సుభోదంబగు

# పరిపూర్ణ గురుసారసంగ్రహము

ఇయ్యది

పరిపూర్ణానంద అన్నమరాజవంశోద్భవుండగు

## శ్రీవెలివెర్తిరామదాస స్వామివారిచే

రచింపబడి సకలవేదవేదాంత సిద్దాంతులగు పండితోత్తములచె

పరిష్కరింపబడియె.

ప్రకాశకులు

వెలివెర్తి గురుపీఠం

గ్రామం: వెలివెర్తి; మండలం: శంకర్‌పల్లి

రంగారెడ్డి జిల్లా. ఆంధ్రప్రదేశ్.

2012

వెల : రూ. 100

ఓం

# శ్రీసద్గురవేనమ:

# శ్రీ శ్రీధరస్వామి గురు పరంపర వేదాంత గ్రంధము

**అచల పరిపూర్ణ తత్వ గురుసార సంగ్రహము:**

(పరిపూర్ణ గురుసార సంగ్రహము నిర్గుణ గురుస్థవము శ్లోకములు. మానసపూజ పద్యములు గురుభజన కీర్తనలు. ద్విపదవాక్యములు. ప్రార్థన హరిభజన కీర్తనలు. ద్విపద మూడుభాగములు. పరిపూర్ణ తత్త్వకీర్తనలు. ప్రకృతిపురుష రహిత కందార్ధ దర్వులు. సర్వార్ధ నిర్గుణ సీసార్ధ దర్వులు పదిభాగములు)

ఇది పరిపూర్ణానంద అన్నమరాజ వంశోద్భవుండగు వెలివెర్తి రామదాసుచే ప్రణీతంబై సకల వేదవేదాంత సిద్ధాంతులగు పండితోత్తములచే పరిష్కరింపబడియె.

ప్రకాశకులు:
అన్నమరాజు భాస్కర్‌రావుగారు
గ్రామం: వెలివెర్తి
మండలం: శంకరుపల్లి
రంగారెడ్డి జిల్లా
తెలంగాణ 501203

పంచమ ముద్రణము
1000

హెచ్చరిక



ప్రకాశకులు

గ్రంథప్రాప్తి స్థానము
అడ్రసు

అన్నమరాజు భాస్కర్‌రావు గారు
(పోస్ట్&విలేజ్) వెలివెర్తి
మండలం: శంకర్‌పల్లి
జిల్లా: రంగారెడ్డి తెలంగాణ PIN: 501203
పోన్ నం: 9676481329

# శ్రీరామస్తుత్తి

శ్రీరామాచంద్రగురునీ చింతయామారనె - మారామాచంద్రవరునీ మదిలోన మరువనే !!ప!! చెలియా రమ్మనిపిలచీ చెప్పెనొకమాటనె - పలుకూల నోట అమృతము లొలుకాగచెప్పెనె !!శ్రీ!!1!! తను మాన ప్రాణమూలు ధారబోసితీని - తరమూ గానట్టి మాయను తరులా జెతానెనె !!శ్రీ!!2!! ధర్మార్ధాకామమూలు దయజేతునానే మర్మాముంచాక మోక్షమార్గాము చూపెనె !!శ్రీ!!3!! ఇహ పర సౌఖ్యములు ఇచ్చాగించకనే అహము వుడుగగ నాయెండ అని సూత్రమెసెనె !!శ్రీ!!4!! శరణాగత బిరుదు తనగురు జెప్పినట్టాగనె -గురువాక్య పాలనాము మరిచేయా సాగెనె !!శ్రీ!!5!! సాంఖ్యతారకమనస్కా దారీయెరుకానెనె సాంఖ్యాలేనీది అచల సాగ్జాయుజెసెనె !!శ్రీ!!6!! రాజ కంకణము యిదియూ రంజిల్లూచుండునే - తేజాత్మా వుండువరకు పెంపు వర్ధిల్లూనే !!శ్రీ!!7!! పతియూ గురుదైవమూ నాగతి తానే ఆయెనె- సతతామూ స్వప్న జాగ్రత యిక తానే ఆయెనె !!శ్రీ!!8!! అన్నామరాజా వంశా ఆనంత్తకృష్ణుడు - కనెను సరస్వతి జననీ ఘనునీ శ్రీవిష్ణునీ !!శ్రీ!!9!! భక్తా కోటికి నాకూ బంధాము బాపెనె- ముక్తి నాథూడు రామా మూర్తవతరించెనె !!శ్రీ!!10!! భాగవత సాంప్రదాయుడు భరద్వాజా గోతృడూ - వేదమే యజురు వేదా ఆదీశాకస్తూడూ !!శ్రీ!!11!! వేదవేదాంత్త వేద్యుడూ వెలివేర్తి వాసుడూ - సాధుకేశవపురమున నాదూ ప్రాణేశుడూ !!శ్రీ!!12!!

## శ్రీలక్ష్మీనరసింహ స్తుతి

నరసింహ్మా యోగానంద లక్ష్మీ - నరసింహ్మా భోగానంద సాక్షీ !!న!! యోగాభారము మదిలో త్యాగాముజేసియూ - భాగావతోత్తామ భారహన్మయవరా !!నర!!1!! క్షేత్రాము ముచు కుందూని దివ్యాక్షేత్రామూ - గాత్రామైతివి దివ్యా జ్ఞానినిర్మించిన - మాత్రంబున దివ్యా సూస్త్రాముపగు !!నర!!2!! సింహ్మామూ రిపుగజమూలకును నారా సింహ్మామూ - బ్రహ్మాండంబూన బలమాగు అసురూల - సంహ్మారము నారాసింహ్మాకారము !!నర!!3!! జ్ఞానమూ గ్నేయంబున గలుగూ - సుగ్జానమూ గ్జాన గ్జానంబాగు సూన్య అంకురమూకు - మానూగ బయలూవు మరి నిర్భయలూవు !!నర!!4!! నందమూ యోగంబున గలుగూ ఆనందమూ-పోందిబ్రహ్మామయ్యి అందరానిపాద - మందు ఆచలులాకు ముందు వెనుకనే !!నర!!5!! దాసూడు - కేశవపురిలో రామదాసూడూ - వ్యాసాట జెందెన్నూ - మోసకారుల కొరకూ దూషాకులను బాపీ దోషమెంచక బ్రోవూ !!శ్రీనరసింహ్మా!!

యిందువలన సకలసజ్జన శిరోమణులగు- అచలగురు సముదాయస్తులకు తెల్పబడే విన్నపమే మనగా చిత్తగింపుడి.

1. శ్రీ మద్వేదాంత సారుండును- సచ్చిదానందతీతుండును - అతీత అచలపరిపూర్ణుండును మహాఅద్వైత శిద్ధాంత ప్రతిష్టాపనాచార్యులగు పండరీపురనివాసులు పరిపూర్ణ బోధామృతులగు శ్రీ శ్రీధరస్వాములవారు - భాగవతమును భగవద్గీతలును - యదార్థఅర్థములను గ్రహించి - అద్వైతవ్యాఖ్యానమను బృహద్వాశిష్ఠ సిద్ధాంతమును - భక్తులకు సులభోపాయముగ తెల్పునటుల ప్రకటించిసచ్ఛిష్యుడగు -శ్రీశివరామదీక్షితులకు అచలగురు పీఠాభిషిక్తులను చేసినపండితోత్త ములు.

2. శ్రీ మద్రామడుగు వంశపయ:పారావార సుధీరులగు - శ్రీ శివరామదీక్షితులు గురువాజ్ఞ ప్రకారం అఖండజ్ఞాన సంపూర్ణులై జీవన్ముక్తులగు వీరు శ్రీసాందీపవాక్యములును - దీక్షితీయమును అచల గ్రంధమును సకల భక్తశ్రేణులకు బహుదూరార్ధము సమీపములో అందునటుల ప్రకటించి సంస్కృతంబున వెల్లడిచేసి - వారణాశి క్షేత్రమునకు వెళ్లి అక్కడ పండితులు రాజున్ను వీరిని పరీక్షించదలచి విచారించగా - షోడశాక్షరి భావమునె సిద్ధాంతము చేసిరి - వీరలట్లుచేయగా అధికారియగు రాజు ఖడ్గముతో వీరి శిరస్సు ఛేదించిన వారు అయిరి - అట్లు ఛేదించగా వారి శరీరమునుండి ఖడ్గము బయలులో త్రిప్పినట్టు అయి వారి దేహముకు ఏమాత్రము గాయములేక రక్తములేక యీవల నుండి ఆవలికి వెళ్లిపోవడమేకాని తునుకలు కావటములేదు - తదుపరి వారలందరు విస్మయులై శరణాగతులైరి వారి అపరాధక్షమాపణం చేసి తిరిగి వచ్చి ప్రియశిష్యుడైన శ్రీమత్ అప్పారావు మంత్రికిన్ని యచలబోధ వెల్లడి చేయుమని అధికారంబొసంగి కేవలాత్మయై యుండి నారాయణపురంబున వెలగుచుండిరి.

3. ప్రకృతి పురుషద్వయదోషరహితుడును త్రిగుణాతీతుండును క్షరాక్షరోపాది విలక్షణుండు నగు శ్రీమత్ కంబాలూరి పురంబున శ్రీమదప్పారావు తమ గురుకృపాలబ్ధులై - స్వగురురచన గ్రంథములగుశివరామదీక్షతీయమను అచల గ్రంధంబులు యెల్ల వారికి చక్కగ బోధపడునటుల ఆంధ్రంబున ప్రకటించి అనేకులను జీవన్ ముక్తులను జేసి - పరశురామ శీతారాములకు నరశిహ్మదాసుకు అచలగురు పీఠాభిషిక్తులజేసి అభయంబిచ్చి పరిపూర్ణులైవుండిరి యీ నరశిహ్మదాసుగారిచే భద్రాద్రి రామశతకమును - పరశురామసీతారామ శతకమును అనేక భక్తి తత్వకృతులు రచించిరి.

4. శ్రీమత్ పరశురామ సీతారామ స్వాముల వారు గురువనుగ్రహముచేత నిష్టాగరిష్ఠులై ఆత్మానాత్మాతీతమైన కేవలాత్మ నిష్టులై వుండ వీరిని కొంతమంది దుష్టులు పరీక్షించదలచి తినరాని పదార్థములును - త్రాగరాని వస్తువులు తెచ్చి సమర్పించిన అందుకు సందేహింపక గురుప్రసాదస్తు అని సమీపమున తెమ్మన్న అట్టి వస్తువులు అన్ని మిఠైలడ్డుకోవా పుష్పఫలాదులు మొదలైనవి ఆయెను. వీరి మహిమ చెప్పదోచక విస్మయులై - అందరు భయంబునొంది - శరణాగతులైన వారినను గ్రహించిన వారైరి. యిదిగాక

బాలులకు వృద్ధులకును స్త్రీలు పురుషులనెటి భావమును యెంచక సర్వసమిష్టి భావముగ బోధించి అనేక జీవకోట్లను పవిత్రమునుజేసి - విదేహకైవల్యములో వున్న మహోత్తములు. వీరుతమ సహోదరియగు శ్రీశేషమాంబ అంతరంగము శోధించి అంతరంగ భక్తికిమెచ్చి అచలబోధ వెల్లడికి

వరంబులిచ్చి శ్రీమత్ భాగవత కృష్ణదాసులకు అదే ప్రకారం అధికారంబిచ్చి ఎర్రగొండపాలెంలో బట్టబయలై వుండిరి.

5. శ్రీమత్‌శేషమాంబ తనగురుకృపాలబ్ధముచే- అనేకవుపనిషత్తులు-వేదవేదాంత సిద్ధాంతంబులు పరిశోధించినదై యెదార్థమును తెలసి - అనేక తత్వరహస్యములు కృతిరూపకము బ్రహ్మైక్యబోధ యను గ్రంధంబు ఆంధ్రంబున బాలులకైన తెల్యునటుల రచించి అనేక భక్తులకు అచల బోధ పొందుపరచి ముక్తికరతలామలకము చేసి ముక్తిప్రదాయిని అని సాధువులచే కొనియాడబడి తనభక్తులలో నిర్వాహకులైన శ్రీమత్‌భారేశ్వరులను మదనూరు గోపాళాచార్యులకు శ్రీచంద్రమాంబకును బోదాధికారంబొసంగి యేమిటమీకు భయంబులేదని వరంబులిచ్చి మునిదేవునిపల్లెలో సహజామనస్కసమాధి పట్టాభిషిక్తులై పరమపదమైన మహాపెద్దలు.

6. శ్రీమత్‌గుముడవెల్లి వంశపావనులైన శ్రీమత్ భారలింగదేశికేంద్ర ప్రభువరులు తమ గురువాజ్ఞ జవదాటక తన నాశ్రయించిన భక్తులకెల్లలేదనక అచలబోధ బోధించుచు తత్వరహస్యం బంతయు అంతరంగులకు యెరిగించుచుండెను. వారలకు శ్రీధరుడే అనునట్లు భక్తులకు తోచు చుండెను. వీరలకు ఒకసమయంలో అచలగురుపీఠముకు యెవరు నాభక్తులలో అర్హులై యుందు రోయని తనస్వగురువును ధ్యానించి తెల్పగా వారికి స్వగురుస్వప్న ప్రసన్నంబై యీఅచలగురు పీఠమునకు నీభక్తబృందములలో నొకడైన వెలివెర్తి అన్నమరాజురామదాసుడు అర్హుడై వున్నాడని తెల్పి అదృశ్యంబాయ. అంతవారు అపారవార సంతోషులైవుండి కొన్ని దినములకు రామదాసులను యేకాంతములో పిలచి తమగురువాఖ్యము విన్నవించి అచలబోధ వెల్లడిచేయుమని అభయంబిచ్చిన నాఅధికారముకాదని భయంబునొందిన నీకు యెందునను ప్రపంచా మాయాభ్రాంతులు అంటకఅడవిలోవున్న అయోధ్యయై వర్ధిల్లును అని ఝుడియకుమని శిరంబున కరంబుమోపి యీమాటరహస్యములో వుంచుము గురుమహిమ తనకైతానె వర్ధిల్లును అనివరంబిచ్చి కొంతవరకు అయినతదుపరి శోభకృతునామ సం!!జ్యేష్టశుద్దదశమి!!10 గురువారము రోజున పరమపదమైన బయలులో ఐక్యమొందిరి.

7. శ్రీమదన్నమరాజు వంశపయఃప్వారావార సుధీరులైన -అనంతం పుత్రుడైన అనంతకృష్ణయ్య నిజపత్ని పరమపతీవ్రతా శిరోమణియగు సరస్వతమ్మ గర్భజనితులు దశమ పుత్రీపుత్రులను కని వారలందరు మరణించగా సుపుత్రలాభముకై శ్రీఆంజనేయులను ప్రార్థించి భక్తిజేయగా ప్రసన్నులై మూడు ఫలములను యిచ్చిరి. తదుపరి వారిగర్భమందు ప్రథమం హన్మంతరావు ద్వితీయం అనంతలక్ష్మమ్మయును తృతీయం రామచంద్రరావును జన్మించిరి. వీరి బాల్యదశయందే పితృవు మరణించెను వీరిని మేనత్తఅయిన భాగీరతమ్మ పుత్రవాచ్ఛల్యముతో పెంచుచుండెను. వీరిలో రామచంద్రరావును విద్యాభ్యాసముకై యెన్నోవుపలాలనముచేసి అభ్యసింపుమని తమవారు యెంతగా బుజ్జగించిననువినక పారిపోవుచుండిరి. అంతపదిపన్నెండు సంవత్సరముల ప్రాయమున అక్షరముతెల్వి లేనిదే పూర్వజన్మవాసనా విశేషముననో తత్కాలదైవానుగ్రహముననో రంగశాయి నామాంక్కితముగ సీసపద్యములు వీరినోటపలుకబడియెను. అందుసారాంశమే మనిన!!

సీ!! శ్రీరంగనాయకా శ్రితకల్పవృక్షమా శింధుకరుణానిధే శివనుతాఖ్య మాధవమీనామ మంత్రంబు సమకూర్చు మరిగిస్మరించెదా మనసునందు - కేశవగోవింద కృష్ణదామోదర- పాశ భంజన దేవ పరమపురుష - నారాయణాచ్చుత నరసింహననుగావు ననుగన్నతండ్రివి నప్రమేయ అనుచు మీనామమెప్పుడు అనుదినంబు- తలుచుచుండెద నీకరుణలోలుకనయ్య చారుశ్రీకృష్ణ

విష్ణు శ్రీపాదములను- చేరికొలచెద రక్షించురంగశాయీ !!

యీరీతిగ వారికితెల్యకయే వారివాక్కునుండి కొన్ని పల్కబడెను. తదుపరి వీరిస్వప్నమందు ఒక దివ్యపురుషుడు వచ్చి బంగారము ముత్యములు చేతులోబెట్టి అయిదు అక్షరముల మంత్రమును తెల్పి అదృశ్యులైరి. మేల్కాంచి స్వప్నముల మంత్రముయాదికి వచ్చి - యెవరికి తెల్యజేయక జపించుచుండగా కొన్నిదినములకు హఠాత్తుగాఅచలగురుండగు భారలింగదేశికేంద్ర ప్రభువరులు వెలివెర్తికి విజయంచేసి దర్శనమివ్వగా హన్మంతరావును రామానందులను వీరిజననీ సరస్వతమ్మయును పరతత్వముకై ప్రాధేయపడి వేడగా వారుదయాంత:కరుణులై తారక సాంఖ్యా మనస్కంబులు బోధించిరి. గురుపుత్రులు కొందరు వీరికి చిన్నతనముకూడదని అయ్యగారికి తెల్పినను వినక వారి అధ్యవసాయముకు అచ్చెరువొంది మహాదయానిధులై పరిపూర్ణబోధను బోధించిరి. దినక్రమేణ అనేక కృతులు పద్యములు శ్లోకములు మొదలైనవి యవ్వనప్రాయము వరకే రచించి అనేకదివ్యస్థలములు ప్రదక్షించి శ్రీశైలము, మంగళగిరి, భద్రాచలము, కూర్మాచలము, శేషాచలము, రాజమహేంద్రం, కాకినాడ, విజయనగరం, జగన్నాథం, కలకత్తా, కాశీ, గయా, ప్రయాగ, అయోధ్య, పండరిపురం మొదలైన దివ్యక్షేత్రములు చుట్టివచ్చి తమగురువాజ్ఞ ప్రకారం సత్యవతిగృహిణి సహితులై వెలివెర్తి మొకాంలో వుండి తననాశ్రయించిన భక్తులకు భక్తివైరాగ్యజ్ఞానంబులు తత్వమార్గము బోధించుచు నిష్కళంకులైన అంతరంగులకు అతీత అచలమార్గము చక్కగా బోధించుచు అనేకులను కృతార్తుల జేయుచు ముముక్షులకు ముక్తికరతలామలకముకై భారలింగశతకము దేశికేంద్రశతకము పరిపూర్ణ గురుసారసంగ్రహము ప్రకృతిపురుషరహిత కందార్థదర్వులును సర్వార్థనిర్గుణ సీసార్థదర్వులను గురుపూజావిధి సంస్కృత శ్లోకములును నిర్గుణగురుస్తవషోడశ శ్లోకములను సాంఖ్యతారక ఆమనస్కముగల ద్విపద వాక్యములను గురుర్వష్టకములు మొదలైనవి విరచించిన వారైరి. తదుపరి తననిజపత్ని యగు సత్యమాంబగారి పితృగృహమగు కేతిరెడ్డిపల్లె గ్రామమునకు సతీసమేతముగా జని అచట తన గురువాజ్ఞను పరిపాలించునట్లు సత్యమాంబగారికి పీఠాధిపత్యము నధిష్టింపజేసి వారుకేతిరెడ్డి పల్లె పురమందుబయలై నిలచిరి.

8. శ్రీసత్యమాంబగారు తనభర్తయెక్క ఆజ్ఞానుసారముగ అచలగురు పీఠాధిపత్యము వహించి తననాశ్రయించిన భక్తులకు మహాశక్తిస్వరూపిణిగా తోచబడి ముముక్షువులకు ముక్తికరతలామలకములగునట్లు అచలబోధను వెల్లడిజేసిన లోకపావని. ఇట్లు తమబావగారైన శ్రీశ్రీహనుమంతరావు గారి యేకైక పుత్రుండగు శ్రీసుగుణాకరమహారాజు గారిని రావించి తనభర్త యును స్వగురుండునుయగు అయ్యగారి ఆజ్ఞానుసారముగా వంశపారంపర్యముగా పీఠాది పత్యము యిచ్చి వారు పండరీ పురక్షేత్రమందు నిజబయలునందు బయలై నిలచిన పరిపూర్ణులు.

9. తదుపరి శ్రీసుగుణాకరరావు సద్గురువులు కొంతవరకు దేశాటనముచేసి పండరి పురమగు పుణ్యస్థలములను దర్శించి, తన్నాశ్రయించిన భక్తబృందములకు పరిపూర్ణబోధను తెల్పి కడతెర్చిన మహానీయులు వీరలుసుగుణములనెడి అలంకారములను ధరించిన సార్థకనాములు. వీరు తమ పర్యటనలో చిందుకూరు గ్రామమునకు విజయము చేసి సహోదర వాత్సల్యమున శ్రీమాధవరెడ్డిగారిని అచలబోధ వెల్లడిచేయుటకై అధికారంబిచ్చి యీసంగతిని

భక్తబృందమునకు తెలియపరచి తిరిగి తనస్వగృహమగు వెలివెర్తిగ్రామమునకు చేరి హెవళంబినామ సంవత్సర చైత్రశుద్ధ షష్టి శుక్రవారము రోజున కుంఠితములేని వైకుంఠమందు చేరుకొనిరి.

10. శ్రీమత్ మాధవదేశికులు వెలివెర్తి అచలగురు పీఠాధిపత్యము వహించి శ్రీసుగుణా కరప్రభువుల ఆజ్ఞానుసారముగ తత్పీఠమునందలి శిష్యులయెక్క కోరికలను తీర్చుచు శ్రీశ్రీసుగుణాకరప్రభువుల యెక్క ధర్మపత్నియగు శ్రీశ్రీమాణెమ్మగారిని వారిజేష్ఠపుత్రులగు శ్రీరామచంద్రరావు ప్రభువులకున్న వెలివెర్తి అచలగురు పీఠాధిపత్యము తనగురువాజ్ఞ ప్రకారము నడుపవలయునని ఆజ్ఞనొసంగిరి. తిరిగి తానుచిందుకూరు గ్రామముచేరి ఆపురంబున అచలపీఠంబును స్థాపించి శ్రీశ్రీ బత్తుల వెంకటస్వామి రెడ్డిగారి ధర్మపత్ని యెంకమ్మ తృతీయ గర్భజనితులు రామచంద్రారెడ్డి గారికి పీఠాధి పత్యము ఒప్పగించి విళంబినామ సంవత్సర పుష్య శుద్ధ దశమి సోమవారము ద్వాదశి భావమై నిలిచిరి.

11. శ్రీమత్ మాధవదేశికుల ఆజ్ఞానుసారముగా శ్రీశ్రీశ్రీ రామచంద్రరావు ప్రభువులవారు వెలివెర్తి అచలగురు పీఠాధిపత్యము వహించి శ్రీమత్ఇందిరమ్మ ధర్మపత్ని సహితులై తన్నాశ్ర యించిన భక్తులకు భక్తి జ్ఞానవైరాగ్యములు అతీత అచలమార్గంబును బోధించుచుండిరి. ఇట్లుండగా వీరి ప్రథమ పుత్రుండగు శ్రీశ్రీశ్రీ సుగుణాకరరావు ప్రభువులవారిని రావించి వెలివెర్తి అచలగురు పీఠాధిపత్యము తనగురువాజ్ఞ ప్రకారము నడుపవలెనని ఆజ్ఞనొసంగిరి. అదేప్రకారము కర్నూల్ జిల్లా మాసపేట గ్రామనివాసులు శ్రీశ్రీ పెద్దవెంకటయ్యగారి ధర్మపత్ని ఎల్లమ్మ గర్భజనితులు శ్రీమద్దిలేటి గారికి అచలగురు పీఠాధిపత్యము వహింపజేశి భక్తులను తరింపజేయుమని ఆజ్ఞ నొసంగి శ్రీ ప్రజోత్పత్తి నామసంవత్సర పుష్యశుద్ధ పాడ్యమి సరియగు తేది: 5-1-1992 ఆదివారం రోజున కుంటితము లేని వైకుంఠము చేరిరి.

ఓం శ్రీ గురుభ్యోనమ:

సత్పురుషులారా నిజాం యిలాకాలో వుండబడె వెలివెర్తి అనుగ్రామములో నివసించి వుండెడువైశ్యకులజుడగు అనంతకుల గోత్రోద్భవుండగు రుష్యశృంగరుషి సాంప్రదాయకుండునగు కోటికె వెంకయ్యగారికిని తత్పత్ని వీరమ్మగారి గర్భజనిత షట్పుత్రులలో తృతీయ పుత్రుండు లక్ష్మయ్య గారును శివరామదీక్షిత సాంప్రదాయకుడైన గుముడవెల్లి వంశోద్భవుండైన శ్రీభారలింగ దేశికేంద్రులచే అనుగ్రహమును పొందిఅద్వైత భావము నెరంగి తదుపరి తద్భారలింగ దేశికేంద్ర ప్రియశిష్యుండైన శ్రీరామదాసుగారిచే పరిపూర్ణబోధార్థము చక్కగావడశి కృతార్థులై సకల ముముక్ష జనులు కృతార్థులౌట కొరకై శివరామదీక్షత గురుపీఠవేదాంతార్థ గ్రంథములను ప్రకటించుటకై స్వగురు రచితంబగు గ్రంథంబులను స్వగురుండైన శ్రీమత్ అన్నమరాజ వంశోద్భవు లగు రామదాసుగారిని విచారించగా వారులోకోపకారార్థముగా రచియించి నటువంటి గ్రంథంబులను ప్రకటించుమని ఆజ్ఞాపించిరి. వాటిని లక్ష్మయ్యగారు సంతోషముతో గైకొని తన స్వంతద్రవ్యముచే భారలింగశతకము దేశికేంద్రశతకము పరిపూర్ణగురుసారసంగ్రహం మొదలైన గ్రంధములు ముద్రింపించి ప్రకటింపజేసిరి.

క!! కోటికె లక్ష్మయ్యకు యిల - సాటియు లేరనుచు మదిలొ - చాటుచునుండన్ - కోటికి పడిగెత్తును యిఘ మాటే రానీదు మాట - చూస్తిని రామా!

సీ!! కోటికే వంశాబ్ధి కొమరొప్ప లక్ష్మయ్య కులసతి క్రిష్టమ్మ కూర్మితోడ తత్ గర్భజనితులగు తగ వీరమాదేవి తదుపరి నాగమ్మాతరుణిగల్గె - రాధిక గల్గెను రమణతో కడపట రంజిల్లగా నాగమాంబవరుడు - యిక్ష్వాకు వంశంబు యిలవీరయాఖ్యుణి సతియు మణ్యమ్మకు సుతుడునైన వెంకటాఖ్యుండు ముగ్గరు సుతులతోడ - వేడ్కతో వీరుఅందరు యఘము బాయ - రామగురు బోధగైకొని రమ్యమైన - పరమపదముకు ప్రాప్తులై భక్తులైరి !!

క!! యేకాదశ సతిసుతులను -చీకాకుల బెట్టుకేలు-క్షితిమీదిపుడున్ - రాకడపోకడలెందుకు నీకృపనేకాని యిఘను నిత్యమురామా !!

దక్కన్‌హైద్రాబాదు నిజాంసర్కారి అలీలోగౌలిగూడెం కాపురస్తులూ గోపికారుషి సాంప్రదాయ కుండునగు చాలికె వెంకన్న తత్పత్ని గంగమ్మ గర్భసంభూతులగు చెంద్రయ్య నిజపత్ని క్రిష్టమ్మ ద్వితీయుడు నారాయణ సత్పత్ని వీరమ్మ వీరలు యిక్ష్వాకులు గోత్రజులై వర్ధిల్లుచు శ్రీ అచలగురుండగు శ్రీమదన్నమరాజ రామబ్రహ్మము కృపాపాత్రులై పరిపూర్ణ అనుగ్రహమును పొంది నిజశిష్యులై వుండిరి!!

యిట్లు విజ్ఞాపించువారు శ్రీమత్ భారలింగ దేశికేంద్ర ప్రియశిష్యరత్నమగు రామదాసుగారి నిజ సేవకుండునై అచలబోధగైకొన్న కాంశెట్టి వీరయ్యగారి పుత్రుడగు వెంకయ్య మొకాం మునిదేవునిపల్లె తా!!కల్వగూరు జి!!మెదక్

విరోధికృతునామ సంవ్సత్సర కార్తిక శుద్ధఏకాదశి గురువారము రోజు

అనుష్ఠానవిధి

!!శ్లో!! గురుర్బ్రహ్మ గురుర్విష్ణు గురుర్దేవో మహేశ్వరా- గురు సాక్షాత్ పరబ్రహ్మం - తస్మైశ్రీ గురువేన్నమ:

శ్రీ గురుతారక మంత్రం

అస్య శ్రీ గురుతారక మహామంత్రస్య - పరబ్రంహ్మరుషి: - గాయిత్రీ చంద: - శ్రీ గురుపరమాత్మ దేవతా - హంభీజం - సహశెక్తి: - సోహం - కీలకం మమ శ్రీ గురుకృపా ప్రసాద సిద్యర్థే జపెవినియోగ:!!

అద:కరాన్యాస:

హంసాం - అంగుష్టాభ్యానమ: - హంసీం - తర్జనీభ్యానమ: - హంసూం - మధ్యమాభ్యానమ: హంసైం - అనామికాభ్యానమ: - హంసౌం - కనిష్టకాభ్యానమ: - హంస: కరతలకరపృష్టాభ్యానమ:!!

అద:అంగన్యాస:

హంసాం - హృదయాయనమ:- హంసీం - శిరసేస్వాహ - హంసూం - శిఖాయైవషట్ - హంసైం - కవచాయ హుం - హంసౌం నేత్రత్రయాయవౌషట్ - హంస: - హస్త్రాయఫట్ - ఓం భూర్భువస్సు వరోమితి దిగ్భంధ: !!

అధద్యానం

!!శ్లో!! ఊర్ధామ్నాయగురో:పదం- త్రిభువనోంకారాఖ్యసింహ్మాసనం - సిద్ధాచార సమస్త వేద పఠితం షడ్చక్ర సంచారిణం - అద్వైతసప్వర దగ్ని మేకమమలం - పూర్ణ ప్రభాశోభితం - శాంతం శ్రీ గురుపంక జంభజమన - శ్చైతన్యచంద్రోదయం

అధ: పంచపూజా

లం - పృధ్వితత్వాత్మనె - శ్రీ గురుపరమాత్మ దేవతాభ్యోనమ: - గంధం సమర్పయామి - హం - ఆకాశతత్వాత్మనే - శ్రీ గురుపరమాత్మ దేవతాభ్యోనమ: - పుష్పంసమర్పయామి - యం - వాయుతత్వాత్మనే శ్రీ గురుపరమాత్మ దేవతాభ్యోనమ:- ధూపమాఘ్రపయామి - రం - తేజోతత్వాత్మనే శ్రీ గురుపరమాత్మ దేవతాభ్యోనమ: - దీపందర్శయామి - వం - సలిలతత్వాత్మనే శ్రీ గురుపరమాత్మ దేవతాభ్యోనమ: - అమృతోపహార నైవేద్యం సమర్పయామి - సం - సర్వతత్వాత్మనే శ్రీ గురుపరమాత్మ దేవతాభ్యోనమ:-మంగళ నీరాంజనాది సర్వోపచార పూజాన్ సమర్పయామి!!

అధమను:

ఓం శ్రీగురుభ్యోనమ:

!!శ్లో!! బిందుర్మధ్యేగురోర్శిష్యం - దృష్టాద్రాష్టాంతబోధకం - ద్వాదశీ షోడశీ మంత్రం జపతే జన్మరహిత:!!

అస్య శ్రీద్వాదశాక్షరీ మహామంత్రస్య - అచలరుషి: - అవినాశచంద: - అభవోదేవతా - అమృత భీజం - అప్రమేయశక్తి: - అయమాత్మతత్వమశ్యాది గ్నానరహిత కీలకం - అఖిలకాలేష పరిపూర్ణ మస్తి - మాయాసహితమే తత్ర్వ పంచంనాస్తితి నిశ్చయశిద్యర్థం - ద్వాదశాక్షరీ మహామంత్ర జపంకరిష్య:

అథకరన్యాస:

యేతన్మిధ్య - అంగుష్టాభ్యానమ: - శుద్ధవియత్ - తర్జనీభ్యానమ: - కించిన్నాస్తి - మద్యమాభ్యా నమ: - యేతన్మిధ్య అనామికాభ్యానమ: - శుద్ధవియత్ కనిష్టకాభ్యానమ: - కించిన్నాస్తి కరతలకర పృష్టాభ్యానమ:

అథఅంగన్యాస:

యేతన్మిధ్యా - హృదయాయనమ: - శుద్ధవియత్ - శిరశేస్వాహ - కించిన్నాస్తి - శిఖాయైవషట్ యేతన్మిధ్య కవచాయహుం - శుద్ధవియత్ నేత్రత్రయాయవౌషట్ - కించిన్నాస్తి హస్త్రాయఫట్ ద్రష్టదరిశన దృశ్యాదిసహిత - అహంపదార్థ రహిత - భూర్భువస్సు వరోమితిదిగ్బంధ:!!

అథధ్యాన్నం

శ్లో!! అచలంచాద్యం సర్వలోకేషుపూర్ణం - సర్వాతీతం స్వానుభూతావగమ్యం - సర్వాబాద్యం సర్వకర్తృత్వశూన్యం - సర్వావేద్యం సర్వరహితంనమామి !!

శ్లో!! ఆవాచ్యంహ్యా ఖండంహ్యా లక్ష్యంహ్యా బాద్యంహ్యా - సంగంహ్యా వేద్యంహ్యా చింతంహ్యా రూపంహ్యా సాద్యంహ్యా నాద్యంహ్యా తీతంహ్యా నంతంహ్యా శుద్ధంహ్యా బుద్ధంహ్యా నామంనమామి !!

శ్లో!! మృత్యుజన్మభయ దు:ఖవర్జితం - సర్వదృశ్యదృగ్ద్రష్ట నాశనం - అప్రతర్క్యామమలం నిరామయం అనుపమానమచలం నమామ్యహం !!

అథమంత్రం

శ్లో!! యేతన్మిధ్యశుద్ధవియత్ - కించిన్నాస్తితితేమయా - కృపయాపరమంప్రోక్తం - భజాగ్రే ద్వాదశాక్షరం !!

షోడశాక్షర మహామంత్రం

అస్యశ్రీ షోడశాక్షరీ మహామంత్రస్య - నిరంజనరుషి: - నిరహంకార ఛంద: - నిరామయ దేవతా - నిరావరణ బీజం నిస్త్రైగుణ్యశక్తి:- నిర్గుణప్రజ్ఞానరహితకీలకం - నిఖిలకాలేషమాయా సహిత మహకారణ శరీరరహిత నిశ్చయశిద్యర్థం - షోడశాక్షరీ మహమంత్ర జపంకరీష్యే !!

అథకరన్యాస:

నిర్మూలం - హృదయాయనమ: - యేతత్ జ్ఞానశరీరం - శిరశేస్వాహ - నాస్తికేవలం - శిఖా యైవషట్ - నిర్మూలం - కవచాయహుం యేతత్ జ్ఞానశరీరం - నేత్రత్రయాయవౌషట్ - నాస్తికేవలం హస్త్రాయఫట్ - సమస్త నిర్మోహ త్రైకాలేష - మద్రహిత నిశ్చయో - బూర్భువస్సు వరోమితిదిగ్బంధ:!!

శ్లోకం!! సర్వనిగమ గుహ్యం - శాశ్వితం సర్వకాలం - సకల దివిజవద్యం - సర్వదిక్పూర్ణమ చలం - సకలభయనివారం - సర్వలోకాంతరస్తం - సకలముని హృదిస్తం - సర్వదేశ ప్రశస్తం !!

శ్లోకం!! నజ్ఞాతం పరవస్తు రూపరహితం - నిశ్తేజమమృతం సదా - నిశ్శబ్దం నిరుపాసనం నిరుపమం నిర్దేశ్యరహితం స్తితం - నిత్యాభాస వివర్జితం విహిత - సద్వ్యాపారసూన్యం సదా - నిస్సంగం నిరుపాధికం నిరవయం - నిత్యంహృదింభావయె !!

శ్లోకం!! ఆనందరహితోస్మి నిత్యమచలం - నిర్ఘాతనిర్ఘోతనిరింద్రియత్వం - నిర్మోహనిర్ద్వంద్వ నిరూపసత్వం - పరాత్పరం నిత్యామహంనమామి !!

అధమంత్రం

శ్లోకం!! నిర్మూలమేతధాజ్ఞాన - శ్శరీరం నాస్తికేవలం - షోడశాక్షరితత్ సిద్ధ - మిమ వప్ఘనిశంభజే !!

దృష్టదాష్టాంతం

శ్లోకం!! స్వప్నేప్రతీయ్యమానాని - రూపానిచయధాతధా - కర్పూర దీపసంయోగ - జ్యోతిరూపం యధాతధా !!

సర్వం సద్గురు చరణార విందార్పణమస్తు - ఓం తత్ సత్ పరబ్రహ్మార్పణమస్తు -సర్వవిఘ్న ప్రశాంతి - శ్శాంతి: - శ్శాంతి: !!

సంపూర్ణము

శ్రీశివరామ దీక్షిత గురవేన్నమ:
శ్రీమదప్పలార్య గురవేన్నమ:
శ్రీ పరశురామ శీతారామగురవేన్నమ:

# శ్రీ శేషమాంబగారి కృతులు

1.కీర్తన: రాగము:

శరణాజేశెదాను గురురాయా-నన్నుచేపట్టు కరుణానిధెయా !!ప!! నేరములెంచాకు స్వామి-నిన్నునెరనమ్మి యున్నానాదేమి నేను నీదానానుసుమ్మీ- నీపాదపద్మములె నమ్మి!!శర!! పరులాబారికి నన్ను ద్రోయాకు-నాపాప పుణ్యములాను యెంచాకు- పడరాని భాధాలబెట్టాకు యిదిపాతకురాలాని యెన్నాకు !!శర!!1!! దండిదాతవానివింటీ- నీకన్నాదైవము లేడంటీ- నీదాపు నేనుజేరుంటీ నీవె దయవుంచుమని వేడుకుంటి !!శర!!2!! క్షుత్పిపాసలకోర్వజాలా - నన్ను కష్టపెట్టుట నీకు మేలా నాభాగ్యాము నిన్నాననేలా - భక్తమానాస హృదయాబ్జాలోలా !!శర!!3!! చుట్టాపక్కములానేడ బాసితి నాచుట్టున్నవారి విడనాడీతి - నీవెనా చుట్టాముగాని మాది నుంచితి నిన్నెంతోనమ్మి !!శర!!4!! నరులాను నమ్మలేదయ్యా - నిన్నె నమ్మితి నాకితర సొమ్మేలనయ్యా నన్నుపోషించనీవెనయ్యా నేనెన్నెన్నో విధమూలా నమ్మీతినయ్యా !!శర!!5!! నన్నూరక్షించాకయున్నా నానాతిప్పాలుకల్గు అన్నన్నా - పరులు యీ మాటాలు విన్నా వారు పక పకనవ్వరోయన్నా !!శర!!6!! దేహదారుఢ్యాము బాద నేలేవాలేకున్నాను వాదా - నన్ను యిహమందువుంచితె మేధా-నీవు యిదుగో రమ్మని పిల్వరాదా !!శర!!7!! శేవాకురాలానుసుమ్మీ - శేషమ్మ జేసిన మనవి చెవినుంచుకొమ్మీ- శాశ్విత పదవి నాకిమ్మూ- యీ శరీరమెనీదాయసుమ్మీ !!శర!!8!! .పగలు రాత్రులు నిన్నేమారాను- నీవె పరిపూర్ణా రూపామనియెదాను -పాతాక హరుడావని విన్నాను- శీతరాములె గురుడానుకున్నాను !!శర!!9!!

2. కీర్తన: రాగము:

చాలునమ్మ సంసార సుఖము చాలునమ్మ-చాలుచాలు సంసార సుఖము మేలు లేదు మేననిత్యము సారెసారెకు గురుణి జేరి సత్యముగ వర్తించవమ్మా !!చాలు!!1!! వోద్దు వోద్దు కుజనుల పొందు రాద్దు గాద్దు - యెద్దువలెయెగిరింత లాడెవు వద్దువద్దని చెప్పగాను కొద్దిగుణములు మానిగురుణి వద్దజేరి వుండవమ్మా!!చా!!2!! పొట్టబోకు పరులని వారనిమూట్టబోకూ వట్టి మాటలు గావుచెప్పెదఘట్టిగ చెడిపొయ్యేదవునీవు- పట్టు విడుపులు లేనివస్తువ దిట్టముగ తెలశుండవమ్మా !!చాలు!!3!! నిందెల్యాలా పొందెదవూ నీ అందమారా- సుందరీమణులందరికీ నీ వందనబులు జేసి నీమందిరంబున నుండి గురుగోవింద నామము తలచవమ్మా !!చాలు!!4!! బోటులెల్లా నవ్వుదురూ నీపాటుకెల్లా- కోటివిధముల జెప్పినను వినవేటికి నీమదము నీనోట సద్గురు స్మరణచే ముమ్మాటికి తరియించవమ్మా !!చాలు!!5!! చేష్టలుడిగీ సద్గురువూల సేవ జేసి శరణుజేసి పరము జెందిచేసి చెయ్యని దానవయ్యి-శేషమ్మ జెప్పిన వాక్యమందున శ్రద్ధచాలవుంచవమ్మా !!చాలు!!6!! పంతమ్మాలా పరులకు నీస్వాతంత్ర మ్యాలా-పరిపరీ విధములను జెప్పిన పరువు బారుచు పొయ్యెదవు నీవు పరశురాముల శీతరాముల పాదములు నమ్మితె నీకు !!చాలునమ్మా!!7!!

3. కీర్తన: రాగము

సద్గురు రాయుని రమ్మానే చాననామనవిగైకొమ్మనె-త్రివిధా దీక్షలొనర్చెనె- నాశిరమూపై హస్తాము జేర్చెనే !!స!! నొసటా భాశితరేఖాదీర్చెనే-నీనోముఫలమెమంచానెనే !!స!!1!! మూడు మండలమూలుజూపెనే-నడ్మి ముక్తికాంతతో పొందు గల్పెనే !!స!!2!! చిన్నానాటి నుంచివున్నానే-నేచింతజేయక నేనుండానె !!స!!3!! వాదభేదము వదాలించెనే-ప్రణవనాదాము చెవి నాటించెనే !!స!!4!! పతితా పావనా బీరుదున్నాదే-భక్తపరిపాలనశేయారమ్మానె!!స!!5!! యేడుమేడల నేక్కించెనే-రొండుకోడెపాముల నాడించెనే !!స!!6!! భ్రూమధ్యమున చూపునిల్పెనే-మంచి పున్నామ వెన్నెలలో నుంచెనే !!స!!7!! పాతకముల పారాదోలెనే-బట్టాబయలూలొనా మనసు గల్పేనే !!స!!8!! శేషమ్మా మొరవీనుమానానే-నీకు శేవాకురాలాని చెప్పావే !!స!!9!! పరాశురాముని శీతారామునీ నన్ను పాలించినా గురు దేవూని !!సద్గూరు!!10!!

4. కీర్తన: రాగము:

యెందుకు యీదేహమూ - గురుమహిమ దెలియని దెందుకూ సందేహమూ- యెందుకూ యీ దేహమూ యిఘ యెందుకూ యీ మోహమికనూ - సందుగొందుల నిండి యుండిన సమర సైఖ్యము జెందకున్నది !!యె!!1!! కోటి జన్మములెత్తి నరగర్భమందున వాటమూగా బూట్టి - కాటుకాపక్షూల రొంటిని మాటుబెట్టిచూచి - త్రికూట మధ్యమునందు యుండిన సూటి దేలియాన్నారకున్నది !!యె!!2!! వందనంబులు జేసీ గురు పాదుకలు తన శిరమునందున మోశీ - నిందనిందల దగులకను మదిసంధియంబులు మాని - బ్రహ్మామందు జేరియుండి పరమానందమందు జెందకుండిన !!యె!!3!! యెన్ని జెప్పినగానీ తనమతము విడువాకుండుటా అదియేమీ- యెన్ని విధములనైన పంచావన్నె చిల్కలు చూచిచూచి- కన్నులా యందున్న కాంతిని కలసి మెలశి వుండనేరని !!యె!!4!! మండలామధ్యామునా యుండిన యాకుండలీపై నున్నా- యెండమావులు తీగె మెరుపుల దండిగా గనుగొనుచు బహుగా- నుండవని నీమదికి దెలసియు పండువెన్నెల జూడకుండిన!!యె!!5!! చెవిన యిల్లూగాట్టి చెప్పేను శేషమ్మ జెప్పిన సూటీ - మాటి మాటికి చూచిచుక్కల కోటి సూర్యచంద్ర ధ్వనులు - గోట మీటుచుదాటి పొయ్యే బాటదెలియా నేరకున్నది !!యె!!6!! పరశురామునీ పరమైన శీతారాములే గురుడానీ - పరమహంసా రూపమయ్యూ బయలులో విహరించుచూమతి - పరవశంబైపరమ పదమై పరము జెందానేరకున్నది !!యెందు!!7!!

5. కీర్తన: రాగము:

సద్గురు సేవకురండీ మీరు సర్వము బ్రహ్మామనండీ- సాధుల సేవించండీ మీరు సంతోషము నుండండీ !!స!! అంగడి బేరంబనుటా యీ దేహముండదనివినుటా-గురుస్మరణ జేయ్యు నీనోటా దురితములు జారవిచ్చోటా !!స!!1!! మలమూత్రంబులగుంటా మాంసరక్తముల పెంటా దీనిమమతవిడచి నీవుంటే నీవు మరలబుట్ట విఘవెంటా!!స!!2!! అష్టపాశముల బట్టి హరిషడ్వర్గము గోట్టి- యివివట్టి వనుచు మనసుబుట్టి నీకు బట్టబయలె మరిఘట్టి !!స!!3!! పంచకోశంబుల జూట్టి మీరు పంచేద్రియముల నేట్టి - పరిపూర్ణమూ చేపట్టి యీ పాపములను బడగోట్టి !!స!!4!! పరమ భక్తిమీకుండీ ఆపరమ పదము దెలశుండి- శీతరాములె గురువనుచుండీ నీవు స్థిర మానసమున నుండీ !!స!!5!!

6. కీర్తన: రాగము:

యేమనందు సద్గురు మహిమా యెంతానికందూ - అంతాయింతయాని వివరింతా మంటె మంతానమునసూ నామనసేమి లేదాయ ॥యే॥ యెన్నాగరాదు వేడుక మీరియున్నాది గాదు యెన్నెన్నోజన్మాము లెత్తాగ గురుజేరి - పన్నుగ నేటికి పరిశుద్ధామైతీని ॥యే॥1॥ చూడాగరాదు చూపులోన రూపాములేదు - చూపురూపులేని సూత్రాము దెలసీతె - పాపామెలేదాయ పరమ పాదంబాయె ॥యే॥2॥ తత్వదముగాదు తానసెవాంచా త్వంపదము లేదూ - ఆశిపాదమనియెటి ఐక్యాభావముగాదు - అన్నిదేశములందు ఆవారించిన మహిమ ॥యే॥3॥ నెనేమిలేదు నీవనె మాట నిల్వాగరాదు - నీవూ నేను లేని నిజభావ మెరిగీతె - నిర్వి కల్పమాయ నిగమా గోచరమాయ ॥యే॥4॥ పలుకాగరాదు పరిపూర్ణమై బాధాయులేదు - పరశురాముల శీతారాముల రూపాము బయలంద్వైఖ్యమాయ భావామ భావమాయ ॥యేమనందు॥5॥

7. కీర్తన: రాగము:

నమఃశివాయనవే దేహము నమ్మరాదుగదవే - బొమ్మలలోని యెమ్మిక జూచి-నమ్మికైనది గదవే ॥నమః॥ శివపంచాక్షరి మంత్రములోను శివుడున్నాడనవే - శివజీవైక్యసంధానము దెలసితె శివశివశివశివశివాశివాయని ॥నమః॥1॥ నలినహిరణ్యా గర్భములోను హరుడున్నాడనవే - అదె నీవారశూకాగ్రంబనుచును - హరహర హరహర హరహరాయని ॥నమః॥2॥ అంగము లోపల లింగరూపమై పొంగుచునున్నాడే - అంగస్థానము జంగంబెరిగితె - లింగలింగశివలింగా యని యును ॥నమః॥3॥ పంకజముఖిరోపరాత్పరుండంటు శంకరుడున్నాడె- చక్కనిగుహలో సాక్షిరూపమై దిక్కుదిక్కు నాల్దిక్కుల జూచుచు ॥నమః॥4॥ మనసులలోనె మాయరూపమై మర్మముగలవాడే మనుసే అతడని మర్మముతెలిసితె మహాదేవ మహాదేవ మహదేవాయని ॥నమః॥5॥ కనుగొంటీనని కన్నుల యెందున ఘనుడున్నాడనవే - కనులజూచితె కీలకమంతయు - ఘంటానాదము గణగణ మ్రోయగ ॥నమః॥6॥ శేవ్యమతము యీలాగుయనుచు శేషమ్మజెప్పెగదవే -శెరీరమందున్నా శాణను దెలసితె శంభోశంభో శివశంభోయని ॥నమః॥7॥ పరశురామ శీతారాములు యీ - పద్దతి దెల్పెగదే- బాగుగ వీటితో పనియేమనుచును - బయలులోన నిర్బయలు జూడుమనె ॥నమః॥8॥

8. కీర్తన: రాగము: చంద్రకౌంస్

నమ్మరాదుగదవె నీమాటలు నమ్మనుయికపోవే- వన్నెలుచిన్నెలు యాలజేసెదవు - నేడు గురుని సొమ్మైతివి నేజెల్లా ॥నమ్మ॥1॥ బ్రమ్మావిష్ణాదులనూ రుద్రుని పరగదేవతలనూ ప్రొద్దుబోక నీవు పోట్లాటబెడితివి హద్దులేదుగదవే నెజెల్లా ॥నమ్మ॥2॥ పరాశర్యులానూ పుత్రుని వ్యాసవశిష్ట లనూ - గాసిబెట్టేదవు ఘడియ ఘడియకును - మోసపుచ్చితివి గదవే నేజెల్లా ॥నమ్మ॥3॥ ధర్మరాజు లాను భీమార్జున నకులసహదేవులనూ - అతనడిగిన రాజ్యంబివ్వకుంటెను - అడవికి బొమ్మంటివి గదవే నేజెల్లా ॥నమ్మ॥4॥ పరమమునీంద్రులనూ జ్ఞానుల పరమభక్తులానూ- యిలమీది జనులను విడువకనీవు- వారిసొమ్మైతివి గదవేనేజెల్లా ॥నమ్మ॥5॥ మాయలోమాయవివే నీ మహిమలు మరుపురాదు గదవే - సాధులనైనను చంకబెట్టుకునె- సాహసమున్నది చాలుచాలు పోవె ॥నమ్మ॥6॥ పరువులుబారకువే నీవునన్ను భయపెట్టకపోవె - పరశురాముల శీతారాములా పాదరక్షలతో పడగొట్టెదను ॥నమ్మరాదు॥7॥

9. కీర్తన: రాగము:

తారకనామము దలచితె ముక్తి దెగ్గర వున్నాదీ-తారక నామము తలువని వారికి తరిమె నన్నాదీ !!తా!! మోక్షముకావలె నన్నవారికీ మోక్షము లిచ్చినదీ-కుక్షిలోపలా మర్మము దెలసితె గూఢమై యున్నాది- అంతర్లక్ష్యము చూచిన వారికి రమ్యంబైనాది- నిక్షేపంబై నమ్మిన వారికిరక్షక మైనాది !!తా!!1!!కామముకోరినవారికినెల్లకామము లొసగినదీ కామ క్రోధగుణంబులు విడిచితె కనుపడుచున్నాది-నేమకర్మము లేక జగంబున నిండుక యున్నాది-నామరూపములేక చూచితె రమ్యంబైనాది !!తా!!2!! అర్థము కావలెనన్న వారికి అర్థము లిచ్చినదీ-మంత్రాశిద్దికొరకునై జపము జేశితె సిద్దంబైనాది-చిన్ముద్రలు పట్టి చూచినవారికి శిద్దంబైనాదీ-బుద్దిమంతులై కనుగొంటెను పరిపూర్ణంబైనాది!!తా!!3!! పంచభూతప్రాపంచంబంతా పరువంబున్నాది-సంచిత కర్మము లన్నియుబట్టి ద్రుంచివేశినాది-కొంచమనక గురుసూత్రము తోడుత గోష్ఠియున్నాది- నియ మించియు ధ్యానించిన వారికి నిర్మలమ్మైనాదీ !!తా!!4!! శరణనెవారిని కరుణించెదనని బిరుదు వేశినాదీ-సేవజేసి గురు భజనజేసితె శ్రేష్టుండన్నాది-చెడిపోకను రామానామము దలచితె శాశ్విత మన్నాది - శేషమ్మజెప్పినా వాఖ్యములన్ని చెవిజోరుమన్నాది!!తా!!5!! పరిపరివిధముల ప్రస్తుతిజెసితె పరమైయున్నాది - పరశురాములా వారినోటను పలుకుచునున్నాది శిరులు సంపదలు ఒసగెద ననుచు శిద్దంబైనాదీ - శీతారాములు నాకుజెప్పితె స్థిరమైవున్నాది!!తా!!6!!

10 కీర్తన: రాగము:

సర్వసూన్యమే బ్రహ్మంబనుచూ చాటుచుండురోరి-సర్వప్రపంచముమాయాయని దాని సందిదెలియరోరి !!స!! దశవతారాలనేటి మాటలు వుత్తవిగదరోరి- దనరమునుల రుష్యాదులందరి జాడలేదురోరి !!సర్వ!!1!! బ్రహ్మదేవేంద్రా ప్రభృతులు అంతా ప్రకృతి పురుషులోరీ-ప్రకృతికి పరమై యున్నదీ వస్తువు ప్రేమతో గనరోరి!!సర్వ!!2!! యెక్కడజూచిన వక్కటైయున్నది వేరులేదురోరి వెలిలో లోపలవెలుగుచు నున్నది వేరులేదురోరి!!సర్వ!!3!! పలుకుల కందక భావమునంటక పర మున్నదిరోరి-పరమా నందము జెందియు నీవును బయలు దెలియరోరి!!సర్వ!!4!! పరశురామ శీతారాములు మన పాలిటగలరోరి-బాగుగ శేషమ్మ జెప్పిన వినకపరము దొరుకదోరి !!సర్వ!!5!!

11. కీర్తన: రాగము:

బ్రహ్మమనరా భ్రాంతివిడరా -పారబ్రహ్మమనరా భ్రాంతివిడరా అజ్ఞానమనె తిమిరమంటా కుండియు నీవు- ప్రజ్ఞానబ్రహ్మమాని పలుకుచుండరా !!బ్రహ్మ!! ఆహమనె వత్తివిడచి ఆరూటి నంటాక - అహంబ్రహ్మోశ్మాని ఆనందించుమిరా !!బ్రహ్మ!!1!! తత్వాదమనియేటితాత్పర్యమంతాదె-అశితత్వా మసియాని తలచూచుండారా !!బ్రహ్మ!!2!! అయిదులైదులు యిరువై అయిదింటి మీరున్న-ఆయమాత్మ బ్రహ్మమాని అచలామృతంగ్రోలరా !!బ్రహ్మ!!3!! పరశురాములు శీతారాములే గురుడాని-పరగశేషమ్మ జెప్పిన భావమె నిజమానరా !!బ్రహ్మ!!4!!

12. కీర్తన: రాగము:

మనుసా నామాటయు వినవే నీవునామనవీయూ చేకొనవే-మనుసా నామాటవిను మనవీయు చేకొను-మరువాక గురుమంత్రా మననాశాయవెనీవు !!మ!!1!! మదమూను విడచి వుండావే గురుచరణములందునిల్వావే మరణమ్యైవేళ్ల మరుపుదాగులునేమొ మరువాక గురు స్మరణా మరిమారిశాయావె !!మ!!2!! వాదభేదము లేలనె నాదము వీని మోదమొందారాదే-వదలాక

గురుసేవావప్పుగా సేయుచు-విదితాముగా గురుణీ వినుతి జేయవెనీవు !!మ!!3!! తల్లితండ్రులెవరే వోమనసా యీదారాపుత్రాదులు యెవరే - తనువూ నిత్యమాని ధనమూ కాసించేవు- తర్లిపొయ్యే వేళ్ల తనవెంటా రాబోదు !!మ!!4!! పరుగు బారకవుండావే యీపాపాసంసారము విడచియుండావె పరిపూర్ణ భోద దెలసి పరమా నందముజెంది పరశురాముల శీతారామూల దలువావే !!మ!!5!!

13 కీర్తన: రాగము:

ఆనందమాయానామనుసెంతో అతిమోదమాయ - ఆనందమాయేను యే అందమును బాయ - సచ్చిదానందమూను సంపూర్ణమాయెను !!ఆ!!1!! త్రిగుణములు బాయా దినదినము పొచిదీసినట్టాయ - తీరైనమనసెందు తిరుగాకపొయానూను తియ్యాని మామిడిపండూ తిన్నట్టాయను !!ఆ!!2!! అన్నాదిబాయాఅల్హామనెది నదివీడిపొయా - అనుదినము గురుశేవ అనుకూలమాయాను - అమృతాపానమునాకు అనుభావమాయెను !!ఆ!!3!! కన్నాదిబాయా కామక్రోధములు కడకేగిపొయా - కలలోవస్తువలన్ని కానరాదాయెను కదళీఫాలంబును కబళించి నట్టాయ !!ఆ!!4!! అంతాతానాయా ప్రాపంచాము యెంతో వింతాయా - అంతారంగము నందు సంతోషమాయెను - ఆనందావార్ధిలో మునుగాడమాయెను !!ఆ!!5!! పాపామెపొయా పరశు రాముని శీతారామూలనమ్మి- ప్రేమాతో శేషమ్మా జెప్పినవాఖ్యాము - పంచదార తేనెమించి నట్టాయనూ!!ఆ!!6!!

14 కీర్తన: రాగము:

చప్పారాని మానిపండూ అది చెప్పితె జనులకు తెలివయ్యియుండూ!!ప!!పంచభూతములకు మించీయున్నది పండూ - సంచీతఖర్మముల ద్రుంచివేసిన పండు - పంచాక్షరి మంత్రంపైన యున్నది పండు - పరమాభక్తులాకు పరిపూర్ణామయ్యుండు !!చ!!1!! నాదూబిందుకాళ లంటా కుండిన పండూ - వాదాభేదమూల వదలించినాపండు - క్రోధాగూణంబులా కోట్టివేసిన పండు- సాధుసజ్జనులాకు సంపూర్ణామైయుండు !!చ!!2!! హరిషడ్వర్గములాశ అణచీనదాపండు- అరశిత్రిగుణములాను పెరికివేసినపండు- ఆశపాశమూల కోసివేసిన పండు- దాసూలైనవారి దగ్గారనేవుండు !!చ!!3!! స్థూల సూక్ష్మ కారణాలమీరినపండు- తుర్యాతీతమై సుషప్తిజెందనిపండు- సురులాకాభేద్యామై చూడరానిపండు - ఆర్యూలైన వారి కానందమైవుండు !!చ!!4!! అయిదు వర్ణమూల కావాలిదాపండు హరిహరాదులాకు అలవిగానిపండు- అన్నరామబ్రహ్మా మనుభావించిన పండు- అతిగా శేషమ్మాకు అనుకూలమై యుండు !!చప్పారాని!!5!!

15 కీర్తన: రాగము:

సర్వాసూన్యామె బ్రహ్మామయ్యా-వోశిష్యనీకు సర్వాసూన్యామె బ్రహ్మామయ్యా !!ప!! సర్వా సూన్యామెబ్రహ్మాంఅరమారలేక వున్నది సరసాముగాను జూచితె సొజ్ఞాచె తెలియవయ్యా !!సర్వా!!1!! మూడుగుణామూలుబాయనాయ్యఆమీదనున్నా మూడువాసనలుబాయనయ్యా మూటీనాడూ మయున్నా ముక్తికాంతేమాయా - మూలము లేనిశెలీరా మేమిలేదానవయ్యా !!సర్వా!!2!! ఆరూ శెత్రూలననచవయ్యా నీలోనయున్నా ఆరూచేక్రములు దాటావయ్యా- మేరుశిఖరా మందున్నా మ్యాడమీదీకి నెక్కి మీదుకిందు జూచితె మిళీతామైయుండునయ్యా !!సర్వా!!3!! అంటిఅంటాక యున్నాదయ్యా- ఆరూపమయ్యి కంటికివెలిగా నున్నాదయ్యా - యింటికిలోగాను కంటికి వెలిగాను జంటా బాయాక వెనువెంటా నంటున్నాదయ్యా !!సర్వా!!4!! పూట్టూచావూలు లేనీదయ్యా-

యీ మాటలన్ని వట్టీవిగావూ చూడవయ్యా - యిట్టీమాటలు మున్నుయెవ్వారు జెప్పలేదయ్యా- గుట్టూ బాయాలు అయినా పోట్టాలోనుంచావయ్యా ‼సర్వా‼5‼ పగాలూ రాత్రూలు లేనిదయ్యా పరిపూర్ణామయ్యి బాధాలేమియులేనీదయ్యా- సాధూలదగ్గర సంపూర్ణామైనాదయ్యా భేదా భేధములాను ఛేదించివున్నదయ్యా ‼సర్వా‼6‼ రేపూమాపూలు లేనిదయ్యా ఆపారాబ్రహ్మాము పాపాలోదాపూ అయినాదయ్యా- ప్రాపూదాపూలేకా కోపాతాపాములేక - యెప్రోద్దు జూచినాను యెకామైవున్నాదయ్యా ‼సర్వా‼7‼ బయాలే భావానశాయరయ్యా - బయలూలోబయలై పరమా నందాము జెందావయ్యా- యిట్టిదీ అనిదాన్ని వర్ణింపారానీదయ్యా- అట్టీవస్తూవ జనులా కగుపడకావున్నాదయ్యా ‼సర్వా‼8‼ యెరుకా మరుపూలు లేనిదయ్యా అపరబ్రహ్మాము యెప్పాటి వలెనూ వున్నాదయ్యా- గోప్పాకొంచ్యాముగాకా కోరికేమీయులేకా - తప్పూవప్పూలు లేక దెగ్గార వున్నాదయ్యా ‼సర్వా‼9‼ యిందందూఅనకా వున్నాదయ్యా- సందూగొందూలూ సమారాసమయ్యి యున్నాదయ్యా- నిందానిందాలు లేక పొందూటేమియు తెల్యాకా- యెందెందు జూచినా నీకందందె వున్నాదయ్యా ‼సర్వా‼10‼ శాయారానిపనులూ శాయాకయ్యా- సద్గురుణీజేరి శేవాజేశి పరమూ నొందావయ్యా - నాచెల్లెలైనా శేషమ్మ జెప్పినభావమంత - చెవినాటివినవయ్యా శ్రేష్టూడౌనీవౌదు వయ్యా ‼సర్వాసూన్యామె‼11‼

16 కీర్తన: రాగము;

చాలునే సంసార సాగరమూ - మానసమ మంచి మార్గమున్నది మరియు గోప్యమూ ‼ప‼ యిక్కడక్కడ తిర్గిబోలూ చిక్కములో చిక్కియున్నావు- పెక్కుమాయావిద్యాల లోను చిక్కకె ! దక్కాకె ! మ్రొక్కాకె ‼చా‼1‼ నాడునేడని యనక యున్నాది - నాల్ దిక్కులాకు నాటుకొనినా నమ్మికైనాదీ - వాటమైనా రాజమార్గము సూటిదెలియా నేరకున్నవు - మాటిమాటికి జనన మరణాము మానదే ! పూనాదే ! వినదే ‼చా‼2‼ ఇట్టిదట్టిది యునక యున్నది ప్రాపంచమంతా వట్టిదాన్ని నమ్మియున్నాదీ - ఇట్టి భావమూను మున్నూ యవ్వరూ జెప్పాగలేదే - అట్టిమార్గము తెలిసితె నీవు ! పుట్టవె ! గిట్టావె ! నెట్టవే ‼చా ‼3‼ అందు యిందని యనక యున్నదీ - పరమాత్మ రూపా మెందు జూచిన సందులేనిది - సందేహమూ లేదు చూడు సర్వంతార్యామై యున్నదీ - మందబుద్ధి విడచీతె దాని పొందవే- అందవే-చెందవే ‼చా‼4‼ చక్కనీ మార్గామును జూడవే - సంసారమంత యెక్కడి నుంచోచ్చె చెప్పవే - మక్కూవతో గురు వాక్యమూ మన్ననా సేయుచూ నుంటే - దు:ఖమూలు బోయి బయలులో చిక్కవే ! దక్కవే ! యెక్కవే ‼చా‼5‼ కోశమూలబాసి యుండవే - దేశికులాజేరీ దోశిలొగ్గి దాశి వయ్యేవే - ఈషణాత్రయములానూ విడచియుంటేను నీకూ శేషమ్మ చెప్పిన భావము - చెందవే - పొందవే - అందవే ‼చా‼6‼ భయభక్తూల చేతదిరుగవే - పరశురామూనీ సీతరామూల సేవ జెయ్యవే - వాద భేదామూలు మాని బోధజేశి బాధమాన్పీ - పరమా గురువూల ముందార నీవు ! పాడావే ! ఆడావే ! వేడావే ‼చా‼7‼

17 కీర్తన: రాగము;

పెద్దలా శేవయందు బుద్ధి నిలుపుకో వలెన్ - ఇద్దరీ నడుమయున్న యుక్తి దెలియ గావలెన్ ‼పె‼1‼ మూడుమూడు మూటిజాడ ముందుతెలియగావలెన్ - మూటి నడుమాయున్న ముక్తి కాంత గనుగొన వలెన్ ‼పె‼2‼ పంచవింశతి తత్వ బాటదెలియగావలెన్ - పంచసంస్కార మునకు మించియుండగావలున్ ‼పె‼3‼ అంతరింద్రియము లణంచి ఆత్మదెలియగావలెన్ సంతసమును గురునిజేరి సన్నుతింపగావలెన్ ‼పె‼4‼ వాదభేదములు రెండువదలి యుండగా

వలెన్ - నాదములో నాదు విని ఆనంద మొందగావలెన్ ॥పె॥5॥ ఆత్మశుద్ధిజేశి ఈ యహములేక పోవలెన్ - అరి షడ్వర్గము లందు మనసు అంటక యుండవలెన్ ॥పె॥6॥ అండమూలో వున్న రూపు దండిదాను కోవలెన్ - దాని ఖండన జేసేటి యుక్తి గనవలే సద్గురు కృపన్ ॥పె॥7॥ బయలులో బయలు నిర్బయలు తానుగావలెన్- బయలుయందు భావముంచి- పరముజెంద గావలెన్ ॥పె॥8॥ పరగ శేషమ్మజెప్పిన బాటదెలియ గావలెన్ - పరశురాముని సీతారాముల భజన సేయా గావలెన్ ॥పె॥

18 కీర్తన: రాగము;

వేంచేసె నమ్మాలారా సద్గురురాయూడు - వేంచేసె నమ్మాలారా ॥ప॥ వేంచేసె నమ్మాలారా వేదమనే అందోళిక మెక్కి- సాధనా చతుష్టయములు శౌరులు వేయగాను ॥వే॥1॥ ధీరులయ్యాన వారికి త్రివిధా దీక్షాలొనర్చి తీరైన ఆమనస్క భావము - ధీయుతముగను తెలిపెద ననుచును ॥వే॥2॥ మూఢూలయినా వారికి మూక్తీమార్గామిచ్చి - మూలము లేని శరీరా మేమీలేదాని చెప్ప ॥వే॥3॥ రాగ ద్వేషామూలు రావద్దు వద్దానూచు - బాగైన పరిపూర్ణభావము బాలులకైనను దెలిపెద ననుచును ॥వే॥4॥ శరీరమూ లేకయున్న శేషమ్మ హృదయమందు - చేతన్యుడు లేడని తెలుసుకొండి జనులారా యనుచూ ॥వే॥5॥ పరమాభక్తులందారు పరివారమూలు సేయ - పరశూరామూని సీతారాములు ఇచ్చటికి ॥వేంచేసె॥

19. రాగము; ఆనందభైరవి: ఆటతాళం

ఇటువంటి గురుసేవా యెవరీకి దొరకీని- కుటిలా రహితులయిన గుణవంతులకె కాక॥ఇ॥1॥ పద్మాసనమూ వేసి పణతీ రమ్మానీ పిలచీ- ముదమూన శిరాముపై కదశీ హస్తాముంచాను॥ఇ॥2॥ తనుమాన ధనములు ధారబోయు మానేను-తరమూగానట్టి మాయను తలువా వద్దనిచెప్పె॥ఇ॥3॥ మూడు దీక్షాలోనర్చి ముందుగా నావాలజేర్చి - మూలమూలేని శరీరా మేమీ లేదాని చెప్పె ॥ఇ॥4॥ పరమా రహస్యమిది మరువా వద్దనిచెప్పె - పరశురామునీ సీతారామూల జేరుమానే ॥ఇటు॥

20. రాగము; పంతువరాళి: ఆటతాళం

బ్రహ్మైక్యమెట్లా ఘటించూ వారి ప్రేమ యెందుకు తొలగించూ ॥ప॥ బ్రహ్మైక్య భావము బ్రహ్మవేత్తల కెరుక - ఇమ్మహిలో నుండే హీనుల కేమెరుక ॥బ్ర॥1॥ వేదాముల్ చదివీననేమి వెనుక- యాగాముల్ చేసీననేమి- వేదవేదాంత వినోదము తెలియాక- వాదభేదమూలు వదులాని వారికి ॥బ్ర॥2॥ మునివేషములు దాల్చితేమి- ముక్కూ మూయుచూ గొణిగీతేనేమి - ముక్తిమార్గా మానే మూలామూ దెలియాక - మూఢచిత్తులయ్యి మునిగేటి వారికి ॥బ్ర॥3॥ యాత్రాలు దిరిగీన నేమీ యోగభ్యాసాము చేసిన నేమీ - నేత్రమందున గురు సూత్రాము దెలియాక - క్షేత్రక్షేత్ర జ్ఞాని తెలియాని వారీకి ॥బ్ర॥4॥ సాధూలమనీ పల్కితేమి సంసారము విడచీన నేమీ - పూర్ణభావమనే సంజ్ఞాయు దెలియాక- పుట్టూచూ చచ్చూచు పోరలేటి వారీకి ॥బ్ర॥5॥ పండితూలా మంటేనేమి మేము భక్తులామని పల్కితేమీ - పరశురాముని సీతారామూల దెలియాక - పాపపుణ్యమూల పడిపొయ్యే వారికి ॥బ్రహ్మైక్య॥

21. రాగము; సౌరాష్ట్ర: జంపెతాళం

వినర బ్రహ్మైక్య బోధంతా నీవు వినకుంటె చెడుదూవు వింటే మేలంతా ॥వి॥1॥ తీర్థయాత్రలు తిరుగబోకూ నీవు త్రిగుణముల బట్టిదీ కొల్వనివకూ - వేదాంత మార్గాల కొరకూ నీవు సాధు

సజ్జనులతో సాహవాస మిడకూ ‼వి‼2‼ కర్మకర్తృత్వల మీరీ నీవు నిర్మలంబైనట్టి నిర్గుణము జేరి - మనసు సొమ్మశిల్లగ జెయ్యరోరీ నీవు నెమ్మదిగ జేకొమ్మి ఇమ్మైన దారీ ‼వి‼3‼ సారె సారెకు జెప్పనేలా - నీవు సగుణ నిర్గుణములా జాడగనవేలా - సంసార మంతయూ బేలా నీవు సంశయం బులు మాని జరుగు జాగేలా ‼వి‼4‼ ఘడియ ఘడియకు నిమిషమైనా - నీవు ఘనమైనా సద్గురుల గలయకేమైనా - పరముదొరకదు కొంచమైనా నీవు బయలులో బయలయ్యి బ్రతుకు యేమైనా ‼వి‼5‼ యింద్రియా విషయముల బూనీ నీవు ఇహపరా సౌఖ్యములు కోరితే హానీ - వినుము జీవన్ముక్తి దానీ నీవు విడువకా యుండుటే యిదీ మంచిది దానీ ‼వి‼6‼ ఈషణా త్రయములను విడచీ నీవు దేశికుల కృపచేత తెలివొంది నడచీ - హీన గుణములనెల్ల గెలచీ జగము యిరువు జేసుకయున్న మాయనే గెలచీ ‼వి‼7‼ సేవజెయ్యగరోరి మనమూ గురుని శేవజెయ్యకపోతె చెడిపోవుటనుమూ- సేవకుడగమ్మి ఈదినమూ శేషమ్మాచెప్పిన మాట వింటేనె ఘనమూ ‼వి‼8‼ పరులమాటలు చెవులవినకా - నీవు పగలు రాత్రులు గురు భజన యేమరకా - పరిపూర్ణ మిదియు గాదనకా - పరశురామబ్రహ్మమె గురుడు స్థిరమాయె గనుకా ‼వి‼

22. రాగము; మోహన: ఆటతాళం

ఏమి జెప్పుదునమ్మ సద్గురు మార్గ మేమి జెప్పుదునమ్మ ‼ప‼ ఏమి జెప్పుదునమ్మ యేమాన రానీది - నేమకర్మము లేని నిర్మాల గురుమార్గ ‼మే‼1‼ యిందు అందు యనక యెందూన జూచీన - సందులేక వున్నదీ ఆది నాల్గు సాధానముల మీరింది - అంది పొందరాక యెందుయేమి లేక - సందేహమూ లేక సర్వం తానైనాది ‼ఏ‼2‼ ఆవలీవల యనక యేవాల జూచిన ఆవరించి యున్నది - ఆరూపమై ఆనంద మయమైనది - కేవలముగానూ ఈభావాము దెలసితె- ఖేదమోదములానే బాధ లేకున్నాది ‼ఏ‼3‼ కొన్ని దేశములాని కొన్ని కాలములాని యెన్న బడక యున్నది - వన్నెలుగాక సన్నుతింప రానీదీ - వున్నాది అన్నాది విన్నా దేమియు లేక - మిన్నూ మన్నూలాలో మిళితమై యున్నాది ‼ఏ‼4‼ వసుదాలో నణగాక వార్ధిలో మునుగాక - వహ్నీన గాలానిదీ వాయువుచాత వణుకుబట్ట రానిదీ - విశదముగాను ఈవివరాము దెలసితె- పసి బాలాదులాకు బయలైయున్నాది‼ఏ‼5‼ వర వశిష్టులాకు వాల్మీకాదులాకు వర్ణింపరాకున్నది - వాసవాది వరుల కందరానిదీ - పరశురాముని రామబ్రహ్మము కృపసేయ - పరగ శేషమ్మాకు బయలయ్యి యున్నాది ‼ఏ‼

23. ఆదితాళం రాగము;

నిర్వికారమై నిశ్శంబ్ధంబై నిండి యున్నదది తెలియరయా - నీవు నేననే భావమంతటను నిలువలేదది చూడరయా ‼ని‼1‼ బట్టబయలు యాపరమ పదంబని భావములోపల యుంచ రయా - ఇట్టిదియని వర్ణింపరానిదని గుట్టు దెలసి సుఖమొందరయా ‼ని‼2‼ కన్నుల జూడగ వన్నెలు గాకను వెన్నెల బయలై యున్నదయా - సన్నుతింపగను శక్యము గాకను సర్వసమంబై యున్నదయా ‼ని‼3‼ పరులు బలికినా పలుకులు పలికితె పాపములో బడిపోదురయా - పరబ్రహ్మమనే భావమంతటను పరిపూర్ణంబై యున్నదయా ‼ని‼4‼ జనులుజేసినా శాస్త్రము నమ్మితె జనన మరణములు జెందునయా - జనకుడు శకునకు చెప్పిన భావము చలనము లేకను యున్నదయా ‼ని‼5‼ పరశురామునీ రామబ్రహ్మం భావం బిదియని తెలియరయా- స్థిరముగ శేషమ్మ చెప్పినవాక్యము చిత్తమందునను వుంచరయా ‼ని‼

24. ఆదితాళం రాగము;

బయలే బ్రహ్మమురా కేవల బయలే బ్రహ్మమురా - బయలేబ్రహ్మము పరమ గురువులా - పదములు నమ్మిన పరమ భక్తులకు ॥బ॥1॥ యెన్న వశముగాదూ మరిదాని కన్న ఘనములేదూ - మిన్ను మన్నులకు మీరియున్నదది- సన్నుతిజేయను జాలకుండినది అన్ని దేశముల అలముక యున్నది ॥బ॥2॥ చూడవశముగాదూ చూడ్కుల చూపు నిలువలేదూ - ఏడ వెదకినను యేమిలేనిదది - ఆడఈడ యన కంతటవున్నది చూడచూడగా చోద్యంబైనది ॥బ॥3॥ మూఢులైనవారూ దానీ మూలము గనలేరూ - మూడుగుణములను ముంచివేసినది- మూలమాయను మునుపె తోలినది - ముక్తిమార్గముకు మూలమై యున్నది ॥బ॥4॥ మండలముల నుండి అది బ్రహ్మాండమంతనిండి - తిండితిననిదది పండుకోనిదది - పండితజనముల కండ్లై యున్నది - కుండలి మీదను గూఢమై యున్నది ॥బ॥5॥ క్రోదగుణము లేకా అది సమ్మోద మందబోకా - వాదభేదములు వదలియున్నది - నాదు బిందుకళ లంటకున్నదది సాధు జనులకు సంపూర్ణమైనది ॥బ॥6॥ పరశురామ సీతా రామబ్రహ్మము కృపచేతా- పట్టుబడినదది పరుగు లెత్తదది - పరగశేషమ్మ భావమందున్నది ॥బయలే॥

25. ఆటతాళం రాగము; మధ్యమావతి

శూన్యముగావలెరా తన మనసు దానిలో లీయ్యము గావలెరా ॥ప॥ శూన్యము గావలె మనసూ దాన్యము సేయగవలె - చయ్యచయ్యన గురుని పదముల సాష్టాంగ మొనరించు చున్నది ॥శూ॥1॥ జీవుడానవలెరా త్రిగుణాత్మకంబైన జీవుడే దేవుడురా- జీవుడూ దేవుడూ లేడని స్థిరముగ తనమదికి తెలసియు- త్రిగుణ రహితంబైన బ్రహ్మ మందునైక్యము జెందుచున్నది ॥శూ॥2॥ హరుడానవలెరా తనమనసు ననుపుర హరునీ గన్గొనరా - హరుడు పురహరుడులేడని ఆత్మయందున దెలుసుకోని - మది అగణితంబైన బ్రహ్మ మందు నైక్యము చెందుచున్నది ॥శూ॥3॥ బయలానవలెరా తనమనసు నను బట్టబయలే కనుగొనరా - బయలులో బయలు వెలి బయలు సర్వం బయలె యనుచును బయలుయందె నైక్యమగుచును - పరవశంబున జెందుచున్నది ॥శూ॥4॥ చేష్టలుడుగవలెరా బ్రహ్మైక్య మందున శ్రేష్టుడూ గావలెరా - సేవ చెయ్యక గురుపదంబును జేరనేర రటంచు శేషమ్మ జెప్పిన భావమంతయు - స్పష్టముగ దెలశుండు చున్నది ॥శూ॥5॥ పరమెరుగ వలెరా తన మనసులేదని స్థిరము గావలెరా - పరశురాముని సీతారాముల పాద పద్మములందు నిరతము భక్తిచేతను పూజసేయుచు- పరమానందము జెందుచున్నది ॥శూ॥

26. ఆటతాళం రాగము; మోహన

మూలమూలేని శరీరా మెమీలేదానె మనసా - మునుపే బ్రహ్మాది రుద్రుల మూలమేమీ లేదె మనసా ॥మూ॥1॥ శాస్త్ర పురాణముల యందూ చెవిసోకా నివ్వకె మనసా -చేకోని లోకుల మాటలు కాకూల కుతలే మనసా ॥మూ॥2॥ దూషణా జేసినా నిన్ను విశేషా మనుకోవె మనసా ఈషణాత్రయామూలాను - విడిచీ యుండావె మనసా ॥మూ॥3॥ పోట్ట కొరకు నరులా చుట్టూ దిరుగాకే మనసా- పట్టూ విడుపూలులేని - బయలు దెలియావె మనసా ॥మూ॥4॥ చదువులెన్ని చదివినా సారమేమిలేదె మనసా- చావూ పుట్టూకాలూ లేనీ చదువు చదువావే మనసా ॥మూ॥5॥ కోటీ విద్యాలు నేర్చిన కూటీ కొరకే మనసా - నీటూగా సంసారములో సూటీ దెలియావే మనసా ॥మూ॥6॥ యెప్పుడు గురుస్మరణా తప్పకాచెయ్యావే మనసా - అప్ప గురు పాదాదాన్యము యెప్పుడూ యేమారకే మనసా ॥మూ॥7॥ ఛీఛీ పరులా చేతులో చిక్కూబడాకే మనసా - శివరామ

దీక్షితూల చిత్తమందుంచే మనసా !!మూ!!8!! పరశురాముని సీతారాముల భావ మందుండీ మనసా - పరగా శేషమ్మచిత్తము పరమానందముజేందె మనసా !!మ!!

27. ఆటతాళం రాగము; ఆనందభైరవి

లేదులేదు ఇది తెల్పకమోక్షము లేదనితెల్పుడి జనులారా- కలదు కలదు కైలాసము కన్నుల కనుగొనుడి సూ జనులారా !!లేదు!!1!! భావింతుమొ భావించలేమొయని భయపడుచుందురు జనులారా - పర్శవేది ఇనుమును సోకితె పగిదైన భావమిది జనులారా !!లేదు!!2!! శాస్త్ర వాసనలు నిజమని నమ్మితె శాంతములేదు జనులారా - సుస్థిర మానస యుక్తిచేత పరవస్తువు తెలయుడి జనులారా !!లేదు!!3!! అండపిండ బ్రహ్మాండములందూ నిండియు యున్నది జనులారా - దండిగ గురుడు దెల్పక తెలియదు దాని తాత్పర్యము జనులారా !!లేదు!!4!! వేషభాషలను జూచి మీరు సంతోష పడుదురూ జనులారా - శేషమ్మ జెప్పిన వాక్యములన్నీ చెవిని జోర్రవూ జనులారా !!లే!!5!! పరశురామ సీతారామయ్యా పదములు నమ్ముడి జనులారా - పాతకులను పావనముజేసునూ పరిపూర్ణుడు సుజనులారా !!లేదు!!

28. ఆటతాళం రాగము; శుద్దకాంబోజి

ఇంతకన్న మరి యెక్కువలేదని చింతసేయనేలా సంతసమూ గురువాక్యము దలచితె అంతతానాయా !!ఇ!!1!! వేదశాస్త్ర ఇతిహాసములన్నీ వెనుక నెలయమాయా - వేదసారము తెలసిన పిమ్మట యేమిలేకపాయా !!ఇ!!2!! దృక్కులలోపల దృశ్యమంతయూ తూలిపోవుటాయ- ఎక్కడ జూచిన బ్రహ్మమయంబిక యేమిలేకపాయా !!ఇ!!3!! ధనము ధాన్యమూ మీదిప్రేమలూ తగులక నేపాయా - తల్లిదండ్రిమరి దైవము గురుడని తలచుట ఘనమాయా !!ఇ!!4!! తనుమన ధనములు గురుని సోమ్మని ధారబోయుటాయా - తరముగాని సంసార సముద్రము దాటిపోవుటాయా !!ఇ!!5!! సేవజేసి గురు కీలక మెరిగితె శ్రేష్టుండయిపాయా - శేషమ్మ జెప్పిన వాక్యము వినకా చెడిపోవుటలాయా !!ఇ!!6!! పరమ పదంబును యెరిగిన పిమ్మట భక్తుండయిపాయా - పరశురామ సీతారాముల కృప పరిపూర్ణంబాయా !!ఇంత!!

29. ఆటతాళం రాగము; శంకరాభరణం

కలగాదు యికను ఈబ్రహ్మపదవి కలగాదు యికనూ !!ప!! కలగాదు యికను ఈ కలియూగ మందున - కల్లగాదు వినుడి ఘనబ్రహ్మ పదవీని !!క!!1!! అది యెట్లంటేనూ చెప్పెద మీకు ఆనందముగనూ హరిహరాదులకైనా అలవిగాని బ్రహ్మ - మందుజేరి దానిపొంది సుఖించండీ !!కల్ల!!2!! మూఢత్వంబుననూ మూర్ఖులయ్యీ ముందుతెలియకనూ - మురికి దేహముచూచి మురయుచు నున్నారు - ముక్తిమార్గమనే మూలము దెలియాక !!కల్ల!!3!! అధికూల మనుచూ - అడవిలో బడె రానందమనుచూ ఆశపాశ బద్ధులై చేడిపోవూచూ అంధకార బంధముననూ చిక్కుకున్నారు !!కల్ల!!4!! సాక్షాత్కారముగా సద్గురుకృపా సాధించ లేకా- సారములేదు సంసారము యని యమృత- సారాము గ్రోలేటి చవిగాన కున్నారు !!కల్ల!!5!! శాస్త్ర వాసననూ శేషమ్మ మాట చెవినాటకానూ - చేరి సద్గురువుల సేవచేయ్యకాను - క్షేమ మెరుగక జనులు చెడిపోవుచున్నారు !!కల్ల!!6!! పరశురామునీ సీతారామ పరబ్రహ్మంబానీ పరి పరి విధమూల ప్రస్తూతిసేయూచు పరమ పదంబనె బయలెరుగ కున్నారు !!కల్ల!!

30. మేలుకొలుపు రాగము; భూపాలం

తెల్లవారెను మోహతిమిరం బెల్ల బాయెను జ్ఞానఉదయం - బల్ల ప్రబలంబాయ తన మనసేల్ల స్థిరమాయెన్ ఆత్మా మేలుకోనవే !!తె!!1!! మూడు గుణములు మణిగిపాయను ఏడు ధాతువు వెనుక బట్టెను - ఏడయేమియు లేకపాయను యెరిగి మేలుకోనవే !!ఆత్మా!!2!! అష్టతనవులు అడవిబట్టెను - అష్టమదములు హోమిక మణగెను - కష్టసుఖముల కాంక్షదీరెను ఘనత మేలుకోనవే !!ఆత్మా!!3!! అష్ట ప్రకృతుల ఆటలుడిగెను అష్టపాశము లపుడె వీడెను - ఇష్ట మేమియు లేక పోయెను ఇప్పుడె మేలుకోనవే !!ఆత్మా!!4!! వాసనాత్రయ మొదలిపాయను ఈషణాత్రయ మిపుడె వీడెను - విన్నదేమియు లేకపాయను వేగమేలుకోనవే !!ఆత్మా!!5!! సాగరంబుల చప్పుడుడిగెను వాదభేదము వదలిపాయను - నాదమప్పుడె నశ్యమాయెను నయమె మేలుకోనవే !!ఆత్మా!!6!! మండలములనే మమత మానెను - కుండల స్థలి కూలిపాయను -పండువెన్నెల భావమాయను పరగ మేలుకోనవే !!ఆత్మా!!7!! మనసు బుద్దియు మరల జనియెను మానిపాయను జనన మరణము - మమత ఏమియు లేకపాయెను మరియు మేలుకోనవే !!ఆత్మా!!8!! గురుడు శిష్యుండేకమాయను - కలము గోత్రము లేకపాయెను - కుడీ యడుమలు సమమె ఆయెను గురుతెరుక బాయన్ !!ఆత్మా!!9!! పరశురాముని సీతారాముల - భజన నిత్యము సేయుటాయెను - బాగుగా శేషమ్మ భావము బయలో గలిసెన్ !!ఆత్మా!!

31. మంగళ హారతులు

కర్పురంపు హారతివ్వరే గురురాజయోగికి కర్పురంపు హారతివ్వరే !!ప!! కర్పురంపు హార తివ్వరే రెప్పల నడిమి నేర్పరి గలసి - అప్పుడిప్పుడనక మీరు గొప్ప కన్నుల కోర్కెదీర !!క!!1!! చెవులు కన్నులు ముక్కు మూశీ - శరీరములో శాంతకుంభపు కాంతిజూచి - చైతన్య మనెడివాని సెవజేసి మాయాబాసి ఆశపాశములు గోసి - దేశికోత్తము చేరిమీరు !!క!!2!! రెప్పవాల్చక రెండు చూపులూ- కనుబోమ్మల నడుమ తప్పకుండ నిల్పి మాపులూ- చెప్పతరముగాని వన్నెలు చప్పుడు సేయకచూచి - వొప్పుగాను మ్రోయుచున్న ఓంకారము గలసి మీరు !!క!!3!! పంతము నను ఊర్ధ్వదృష్టినీ - యెక్కినిక్కి - పశ్చిమాభిముఖముగా దీని - కొంతసేపు నిలపి అచట వింతవింత లన్నిచూచి - సంతోషమాయననుచు స్వామిసద్గురు జేరిమీరు !!క!!4!! కన్నులు సగము మూసి చూపునూ - భూమధ్యమందు వెన్నెల బైటజేర్చి మనమును - సన్నపు బిలము నందునుండి సహస్రార చక్రముననను - ఉన్న పరమాత్మనెపుడు ఉపముచే తనే గ్రహించి !!క!!5!! పరిపూర్ణ బోధ దెలసియూ - పరశురాముని సీతారాముల మీరు కొలచియూ- పదపడి శేషమ్మ చెప్పిన భావమంత దెలుసుకోని - పరిపరి విధములను బోక పరమనందముజెందు చున్నది !!కర్ప!!

16 కీర్తన: రాగము:

మంగాళమనిపాడరమ్మా - మంగాళమనరేమీమనసు చెలించాక - పొంగూచు భ్రూ మధ్యంబూన నుండీ !!మ!! పంచావింశతి తత్వామనె పళ్లెరములోనా - పంచెవన్నెలు దీర్చి అంచితముగా బోధాంతమందు వెలిగించేనాగురుగాని వంచానలేకాను !!మ!!1!! మూడు మండలమూలు దాటుచు కుండాలీపైని పండూవెన్నేల జూచూచు - అండపిండ బ్రహ్మాండ భాండమూల - నిండీ వెలుంగూచు నుండీన గురునాకు !!మ!!2!! మంటిమింటి సందుమార్గము యెరిగీయు - కంటీలోపలవున్నావంటీ దేలశి దానంటాకపరమై ఘంటానాదాము ఘణఘణ మ్రోయగ !!మ!!3!! బయలేభావన జేయుచు బయలులోబయలై పరమానందమూను జెందూచు

పరశురామ వరశీతారామయ్యాను - పరిపారివిధమూల ప్రస్తూతి జేయుచు ‼మ‼4‼

శ్రీ పరశురామ శీతారామనరసింహదాసు సోదరియగు-శేషమాంబ విరచితము పరమతత్త్వములు

సంపూర్ణము

హరి ఓం

**శ్రీశేషమాంబ ప్రియశిష్యుడగు - శ్రీభారలింగ రచిత**

**పరమతత్వములు**

1 కీర్తన: రాగము:

మంచిగురుడు దొరికి నాకు మర్మము దెల్పెనే- నాసంచితా ఖర్మముల బట్టి దృంచివేశెనే ‼మంచి‼ పంచాక్షరి తెల్పి పాటించు మానెనె - దీన్కి మించినాబ్రహ్మైక్యమూను గాంచుమానెనే ‼మంచి‼1‼ తారకామంత్రాముతో తరించు మానెనే - యీసారములేని సంసారము వీడుమానెనే ‼మంచి‼2‼ హంసతారకంబు దెల్పి ఆదరించెనే - నా అంతరంగమందు హంస వింత తెల్పెనే ‼మంచి‼3‼ వేదవాఖ్యమూల అర్థంయెరుకజేశెనే - యీ నాదుబిందుకళలో వినోదము జూపెనే ‼మంచి‼4‼ మూలమేమిలేనిదనుచు షోడశీతెల్పేనే - యిదియుజాలమూతోనైన యింద్రజాల మనియెనే ‼మంచి‼5‼ ద్వాదశాక్షరిజేప్పి చక్కని తోవజూపెనే - యీదారికంటె యెక్వరాజ దారి లేదనే ‼మంచి‼6‼ పరిపూర్ణామనియె భావము బయలు అనెనే - యీపరమ గురు శేషమ్మ భజనశాయగల్గెనే ‼మంచి‼7‼

2 కీర్తన: రాగము:

యిందూలోపలజేరానందామైనావే - ఘాటమందులోపలజేరా నందామైనావె అందా మైనావె బ్రహ్మానందమైనావె ‼యి‼ యిహపారా సౌఖ్యములు యిచ్చాయుంచాకె - అహం భావమును మానిఅచలా మొందావె ‼యిందూ‼1‼ ముదమొప్పశాంభావి ముద్రాజూడావె - ముద్రాలో సద్గురుమూర్తి యున్నాడే ‼యిందూ‼2‼ సంతోషపడి జేగామంతా జూచితివే - భ్రాంతులెల్లను బాశి శాంతీ నొందావె ‼యిందూ‼3‼ వాశీగ శేషమ్మ చెరణాలెనమ్మవె - శాశ్వీత బ్రహ్మాపదవి చేరీసుఖించావె ‼యిందూ‼

3 కీర్తన: రాగము:

యాలాముణిగేరు - యెర్రిబాలాలు తిక్కాబాలాలు చిన్నిబాలాలు స్థానాము యెరుగారు మీరు ‼యాలా‼ పాపాలాడెటి భావి పరిపూర్ణమైనాది - చాపాల బావిలో చెలులాడెరు చాపాల భావిల చెలులాడె నరులాకు - పాపాము వదులాదు పట్టింది అన్నా ‼యాలా‼1‼ గంగా యెమునల నడుమా ఘనమైనా కొలనుంది - మంగళప్రదమైన మార్గామున్నాది - అంగాన లోపాల అమరా స్థానముంది - శృంగారంపు బోటి చూడాగలేరు ‼యాలా‼2‼ తడువాని యెండాని స్థానాము గనవాలె - తడశియెండేది స్థానామగునా - విడువాక శేషమ్మ చెరణాలు నమ్మితె - తడువాని స్థానాము దయశేయుమనకు ‼యాలా‼

4 కీర్తన: రాగము

సుదతీరో గురుడెంతో సులభుడోయమ్మ - సూటిదప్పక ముక్తి చూపించెనమ్మా !!సు!! నడినాళమున దృష్టి నాటించెనమ్మా- యిడపింగళలు నడిచె విధిదెల్పెనమ్మా !!సు!!1!! మూడునాడుల పైన ముక్తివుందమ్మా- ముక్తి కాంతనుగూడి ముద్దాడవమ్మా !!సు!!2!! యేడుకొండలపైన యెరుకాజేశెమ్మా- మూడుమండలమూల మీదానొయమ్మా !!సు!!3!! గాలీమానసు దృష్టి కదులాదోయమ్మా- కీలు దెలశితె ఆత్మా నీవైతివమ్మా!!సు!!4!! శేషాశేయనుని పదము చేపట్టావమ్మా - శేషమ్మ గురుశేవ క్షేమామాయమ్మా !!సు!!5!! భ్రాంతులన్నియు బోయి బయలాయనమ్మా- భారాదాసుకు అంతా భ్రమలొదిలేనమ్మా !!సు!!6!!

5.హారతి: రాగము:

హారతి పాటాలు బాడారమ్మా-సద్గురునకు మంగళహారతి పాటలు బాడారమ్మా!!ప!!హారతి పాటలు బాడరె హాంకారమంతయు విడచీ ఓంకారనాదము బలుకగ ఓంనమ:శివాయాని !!హారతి!!1!! మనుసాని పళ్లెములోను మమాతాని జ్యోతీనిలిపి-వాద భేదమనె వత్తిజేశియును సాధనంబులనె చమురుబోశియును-వేదాంతబున వెలగించూచును-ఖేదమోదములు నొందకమీరును !!హారతి!!2!! ఆశాపాశాములన్నీ విడాచీ -సంసారామనేది మోసామని మీమదికి తెలాశి -దేశికోత్తముజేరి మీరును-దాసునీదరిజేర్చుమనుచును దోశిలొగ్గియు వేగమె గురుని నివాసమె సోహంసోహం బనుచును !!హారతి!!3!! తాపాత్రయాములానుబాశీ తానె తానయ్యా తాత్వర్యామంతాయూనుదెలశి-తనుమన ధనములు తనగురునకు మది- తాత్పర్యము మదితగ నడంచుచు- తల్లితండ్రిమరిదైవము గురుడని-తారకనామము దలచుచు మీరును !!హారతి!!4!! ఆత్మానాత్మాలాదేలశీ అంతారమూనా ఆరూటిపోందూవిడచీ-అరుపట్టణములను దాటుచు మేరు శిఖరమనె మేడజేరుచును- జోడుమేళములు వేడుక మ్రోయగ- ఆడిపాడెటి హంసను కనుగొని !!హారతి!!5!! బయలెభావన శేయుచు పరమాశేషమ్మ పాటలెల్లాను బాడుచు- పరిపూర్ణంబనె బాటదెలశియును పరుల మాటలు పదపడివినకను-భారదాసుడును భవము దేరియును పరమానందము జెందియు మీరును !!హారతి!!6!!

ఓం
అస్మత్ గురుభ్యోన్నమ:

**శ్రీధరస్వామి పరంపరపీఠిక వేదాంతగ్రంథము**

శ్రీమత్ అన్నమరాజవంశ భారద్వాజసగోత్ర భాగవతసాంప్రదాయకుండునగు అనంతక్రిష్ణయ్య సతీతిలకమగు సరస్వతిగర్భమందు ప్రథమపుత్రుడు హన్మంతరావు ద్వితీయపుత్రుడు రామదాసు గారిచే రచియింపబడిన పరిపూర్ణభక్తియగు గురుకీర్తనలు, పరమతత్వకీర్తనలు, భగవత్‌కీర్తనలు గురుపరంపర అచలమహత్యము కందార్థదర్వులు సర్వబోధసీసార్థదర్వులు సర్వభక్తశ్రేణికి సులభముగా దెలి యుటకై ప్రకటింపబడియె.

‼శ్రీమద్గురువరు పాదపంకజములన్ - చిత్తంబులో నిల్పియున్ నేమంబూని మనంబు నంద్దిడుకొనిన్ సేవింతు సద్భక్తిచే కామంబేమిట లేమిజేసి నిన్నున్ భావింతు సత్వరముకై - నామంబున్ భజియింతు దేవ యితరంబు లేదంచు నెల్లప్పుడున్ ‼

గురుర్‌బ్రహ్మా గురుర్‌విష్ణు గురుర్‌దేవో మహేశ్వరా - గురుర్‌సాక్షాత్ పరబ్రహ్మా తస్మైశ్రీగుర వేన్నమ:

**శ్రీఅచలగురవేన్నమ:**

**శ్రీధరస్వామి గురుచరణారవిందాభ్యోన్నమ:**

‼శ్లో‼ శ్రీధరస్వామినం నిత్యం - బోధకారణమవ్యయం - భావాతీతం మహంవందే సుకజ్ఞానైక నిర్మలం‼

**శ్రీ శివరామ దీక్షిత గురవేన్నమ:**

‼శ్లో‼ వందారు జనమందారం ! వందేహం త నిరంతరం ! రామడుగు వంశజం శుద్ధం ! శివరామాఖ్యదీక్షితం ‼

**శ్రీ అప్పలార్య గురవేన్నమ:**

‼శ్లో‼ కామాది రిపుహంతారం ! కారుణ్యం అమృతసాగరం ! కంబాలూరప్పలార్యానాం దానం వందే చ మద్గురుం ‼

**శ్రీమత్ పరశురామ శీతారామ పరమేష్ఠి గురవేన్నమ:**

‼శ్లో‼ పరశురామాన్వయాబ్ధి ! చంద్ర మనోరమం ! నిత్యానందం మహంవందే ! సీతారామ: పర:పరం ‼

**శ్రీశేషాచల పరమగురవేన్నమ:**

‼శ్లో‼ పరశురామాన్వయంబోధి ! హిమాంసశ్చ మనోరమం ! శీతారామస్య భక్తనాం! శేషాచలగురుం భజే ‼

**శ్రీభారలింగ నిజగురవేన్నమ:**

‼శ్లో‼ శేషాచలాన్వయంబోధి ! భారదేశిక ముత్తమం ! నిరంజనం నిరాకారం ! భార లింగ గురుంభజే ‼

ఉపజాతివృత్తం!! శ్రీమస్సదాదివ్య శుభాకరాత్మం ! శ్రీమస్సదా భవ్య సంపూర్ణసూత్రం ! శ్రీమస్సదా మవ్యయమప్రమేయం ! శ్రీమద్గురుం భారలింగంభజామి !!

శ్రీభరద్వాజ గోత్రకళశాంభుది పూర్ణచంద్రం- శ్రీభారదేశికపాద కమలసేవితం శ్రీఅన్నమరాజ వంశాంభుది పారిజాతం శ్రీరామచంద్రం సద్గురు భజామ్యహం!!

**శ్రీసత్యాచలసద్గురవేన్నమః**

శ్రీరామచంద్రదేశిక కారణం - పూర్ణబోధ ప్రభావితం - భక్తాభీష్ట ఫలప్రదం - సత్యాచలం సద్గురుంభజే!!

**శ్రీసుగుణాయార్య సద్గురవేన్నమః**

సత్యాచలాన్వయంభోది సుగుణదేశిక ముత్తమం - బోధానంద ప్రదీపికం - సద్గురుం భజామ్యహం!!

**శ్రీమాధవార్య సద్గురవేన్నమః**

పరిపూర్ణబోధ సిద్ధాంతం - సుగుణదేశిక కారణం - మాధవార్యం మనసా సద్గురుం తం నమామి!!

**శ్రీరామచంద్ర నిజగురవేన్నమః**

అన్నమరాజవంశ తిలకాన్వయ భారద్వాజగోత్ర సంపన్న మురాంతకాది సురభాస్కరమౌని పదాబ్జముల్ మదిం ! తిన్నగనమ్మి దాసులకు తీర్థప్రసాదము లబ్బజేయు ! మీకన్నను మిక్కిలిన్ ధరలోగానము కంటిమి రామదాసులన్!!

**నిర్గుణగురుస్తుతి**

వందేశ్రీగురు దేశికేంద్రమతులం వందెజగస్వామినం - వందేశ్రీధరబ్రహ్మరుద్రనిలయం వందేసహస్రారకం - వందేమౌనిగణార్చితాంఘ్రియుగళం వందేజగత్సేవితం - వందేరాగవివర్జితం సుచరితం వందెసదాశ్రీగురుం !!1!! వందేశ్రీధర సద్గురుం శరణం వందేమహావైభవం - వందే శ్రీశివరామదీక్షితమణిం - వందే మహద్గోచరం - వందేశ్రీగురుమప్పలార్యమనిశం - వందేమహ ద్వైతకం - వందేరామగురుంమదియ్య హృదయంవందేసదా !!2!! వందేభక్తజనాను కంపమమలం వందేజగత్పూజితం - వందేశేవిత శేషమాంబ హృదయాం బొల్లాసనేకం వరం - వందేతత్వరమం గురుం నతుజామోదావహం శ్రీకరం - వందే భారగురుం భజేయమనిశం వందే !!3!! వందేహం శ్రితరక్షక ధ్రుమవరం వందే కృపాంబోనిధిం - వందేపూర్ణ సుబోధనామృతధరం వందే సుదీక్షా త్రయం - వందేసంఖ్య గుణాధిక ప్రవీణం - వందే సుమోక్షాధికం - వందే భక్తవశీకరం భవహరం వందే !!4!! వందే దీనజనానుపాలనకరం వందే దయాంబోనిధిం - వందే సజ్జనహృత్సరోజ వసతిం వందే ఫలాదాయకం - వందే శాంతిదమాద్యుపేతవరదం వందేతి మాయాహరం - వందే ద్వంద్వ విషాదభేదనకరం వందే !!5!! వందేపూతచరిత్ర సూత్రవిభవం - వందేధరనాయకం - వందే తాపదవాగ్ని శీతంజలం - వందే మమత్వాపహం - వందే వేదపరార్ధ తత్వనిపుణం వందే త్రిలోకా ధిపం - వందేతీత్యక్షరాక్షరాఖిలజగద్వందేస !!6!! వందే రజ్జు భుజంగభ్రాంతి సదృశ వ్యామోహ సంహారకం - వందే మండలత్రయ శూన్యమాధ్యమభవం వందే సమస్తాత్మనం - వందే ప్రాకృతజన్మ కర్మరహితం వందే అనిత్యాక్షయం - వందే నీశ్వరసర్వపూర్ణమచలం వందే !!7!! వందే విశ్వసమస్త

వస్తు నిచయాం తస్తం సదాభాస్కరం - వందే బోద్ధమఖండ మక్షయమజం వందే నిరావర్ణకం వందే నిర్వ్యయ నిర్విశేష నిలయం వందే మవ్యాపకం - వందే నిత్యనిరంజనం నిరుపమం వందే !!8!! వందేంతర్బహిరంత రాంతర గతం వందేద్వితీయ్యం విభుం - వందె మూలమమూల మక్షయ మజస్రస్తం ప్రపూర్ణం పరం - వందే కారణకార్యకర్తుకరణాతీతా తదీయాత్మకం - వందే నాహతసంహిదాతతీ పదం వందే !!9!! వందే జ్ఞానజమోహజాల గ్రహసంగ్రాసైక వ్యాపారకం - వందే దుర్ఘర దుష్టదుస్సహమ సంసార దు:ఖచ్ఛిదం - వందే నీశ్వరమీశ్వరం ద్విరహితం - వందే సహం కేవలం - వందే నిర్మమతాఖ్య రూపరహితం వందే !!10!! వందే నిర్గుణ నిర్వికారమభయం వందేసదా నిశ్చలం - వందే నిర్మల నిర్వికల్పవిమలం వందే నిరాధారకం - వందే నిష్క్రియకం - నిరామయకరం వందే నిరాలంబకం - వందే వాచ్యక వాచ్యరూపరహితం వందే !!11!! వందే షోడశమంత్రరూప ప్రకృత్తేర్దూరం నిరాకారకం వందే ద్వాదశమంత్ర సారమచలం వందే సనాతనం శుచిం- వందేపూర్ణతరం ప్రశాంతమనఘం వందేసదా విద్యకం- వందేహంగ్మనసోర గోచర మముం వందే!!12!! వందే సత్వ రజస్తమోగుణ గణ వ్యామోహసంఛేదకం- వందే నిశ్చల నిష్ప్రపంచ నిరవాద్యానేక శ్రేయోనిధిం - వందే సర్వభయాపహం సురచిరం వందే అఖిల వ్యాపినం వందే పూజ్యమసేవ్యభక్తనివహై వందే !!13!! వందేమ్మన్నమరాజ వంశజలధే పూర్వరక్షకా నాయకా శ్రీ రామాంహ్వయదాస కల్పితమిదం శ్రీసద్గురు ప్రీతయేయద్వద్వర్ణ పదార్థా హీననుభవ స్తోత్రేత్ర సర్వం గురుక్షంతుం తచ్చరణారవిందయుగళం- స్వాంతేసదాశ్రీగురో !!14!! యెభక్త్యా సతతం పఠంతిపరమం స్తోత్రంశుభాదాయకం - తేషాం జన్మజరావిపతి మరణ వ్యాధ్యాదితోనో భయం- మోక్షానందసుఖంకరస్తఫలవత్ సంప్రాప్తితే తైరిమం - సత్యం నాత్రవిచారణాస్తి భవతాం శ్రీమద్గు రోశ్యాసనం!!15!! వందే నాదిమధ్యమాంత మఖిల వ్యాపార శూన్యంశుభం- వందేసద్గురు బోధరూప మమితం వర్ణాశ్రమాభావకం - వందేసర్వదిగంతరాళ గిరిగంహ్వాభ్యంతరాళస్థితం వందేబ్రహ్మా సనాతనం సుఖతరం వందే సదాశ్రీగురుం !!16!!

శ్రీ గురుమానస పూజ కీర్తనలు

!!క!! శ్రీకరుణాకర శుభకర-ప్రాకట గురురాజయోగ భవ్యసుశీల-నీకును నిజముగ మ్రొక్కెద చేకొను గురుదేశి కేంద్ర సద్గురుచంద్ర!!

!!క!!శ్రీ కరమగు సద్గురునకు-సాకల్యముగాను పూజ సల్పెద భక్తిన్- మాకును పరము లొసంగుము- భీకర గురు దేశికేంద్ర సద్గురుచంద్ర!!

1. ఆదితాళం: రాగము: కల్యాణి

శ్రీ గురునాయక నమోనమో - ఆశ్రితఫలదాయక నమోనమో - బాగుగనేలవె వేగమె మ్రొక్కెద !!శ్రీ!! పాపవిమోచన నమోనమో - పావనరూపక నమోనమో-పరమ దయాకర పరమ శుభాకర !!శ్రీ!!1! రసికజనార్చిత నమోనమో - వసుమతి పావన నమోనమో - సుచరితచారిత పశుపతి పావన !!శ్రీ!!2!! పరబయలాస్పద నమోనమో - పరమపురుషహర నమోనమో - యెరుక మరుపు గల యెరుక నణంచెటి !!శ్రీ!!3!! అచలాత్మాఘన నమోనమో సచలాత్మానుత నమోనమో అచలాచల నిర్వచన నిరంతర !!శ్రీ!!4!! వెలివెర్తీపుర నమోనమో - కలిసంహారక నమో నమో - వెలిలో అంతట నిలయ నిజాస్పద !!శ్రీ!!5!! రామదాసనుత నమోనమో - నామ సుధారస నమోనమో - బ్రామికలణచెటి కామసంహారక !!శ్రీ!!6!!

2. ఆటతాళం: రాగము:

!!క!! స్థిరచిత్తంబున మీపద - చరణంబుల ధ్యాన్నమతిచె స్మరణముజేతున్- హరిహర అజుడవు నీవని - కరుణించవే దేశికేంద్రా !!సద్గురుచంద్రా!!

గురూదేశికేంద్ర దయాపర ప్రభూ సుగుణసాంద్రా- పరాపరంబుకు పరుండవయ్యిన ధరాదిపతివని బిరాన నమ్మిన !!గు!! సదాధ్యాన్న మొసగూ - నీపదసదా స్మరణజేతూ సదాచార్య నీదయారసంబనె - నిధానముంచవె మదిన్ సేవించెద !!గు!!1!! సేవింతు పదమూ జగద్గురు భావింతు పరమూ - గావింతును నీపూజయుభజనము - రావించవెకృప గావించెదనుతి !!గు!!2!! ధ్యాయామిదేవా దయానిధె పాయానుసేవా - వేయివిధంబుల వినుతు లొనర్చెద కాయేంద్రియము లుపాయముచేతను !!గు!!3!! ధరాయందునున్నా వెలివెర్తి పురామందునున్నా స్మరించెదను సత్వరంబుకొరకై - మరేమి లేదికవరంబువేడను !!గు!!4!!

3. ఆదితాళం: రాగము:

!!క!! రావే సద్గురు శేఖర రావేగురురాజయోగ తేజవిరామా - రావేనిను సేవించెద రావే గురుదేశికేంద్ర!!సద్గురుచంద్రా!!

గురుదేవ బ్రోవజాగులేక- రావెప్రభువరా-రావెప్రభువరా సురరాజగురువరా !!ప!! సర్వ మయుడ వనుచునిన్ను సన్నుతించెదా - కర్మమయుడననుచునాపై మర్మముంచకా !!గురు!!1!! అగుణమైన దానిలోన సగుణమూతోడా - సుగుణులంత సన్నుతించ సులభమూతోడా !!గురు!!2!! రాపుసేయమేరగాదు దాపునీవయా - యేపాపమెంచ బోకవచ్చి చూపునీదయా !!గురు!!3!! తామసించ మేరగాదు త్వరగరాదేవా - స్వామి యంచతరముగాదు ధామనీమయా !!గురు!!4!! రామదాస రమ్యపోషకామ సంహరా - శ్యామకోటి సోమసుందర నామగంహరా !!గురు!!5!!

4. ఆటతాళం: రాగము:

!!క!!ధరసింహ్మాసన మందున మరిరత్నపు మరకతములు మంగళకరమౌ-వరసింహ్మాసన మిచ్చెద యిరవందగ దేశికేంద్ర సద్గురుచంద్రా!!

ఆసనామిచ్చేనురా ఆచార్యమణి-సింహాసనా మిచ్చేనురా !!ప!! ఆసనామిచ్చేను నీకిదె భాసమాన విలాసశుభకర - ఆశపాశవినాశ పరమోల్లాస గురువర సుప్రకాశ !!ఆస!!1!! అచ్చమైనా భక్తిచే పచ్చాలపీఠము మచ్చికలరగయుక్తిచే - హెచ్చుగా రత్నాలుమౌక్తిక మణులు మరకత మమరి నట్టి - స్వచ్ఛమగువైఢూర్యముల పెంపెచ్చినాకెంపాజ్రమలరిన !!ఆస!!2!! ఆరుమెట్లా మేడలో బంగారు కాంతిచె అందమైనా వాడలో - మేరుశిఖరమునందు వెలగేటి తేజపీఠంబందునిల్చియు - వేరులేకను సాధుజనులకు సారమయ్యిన పరమగురుడని !!ఆస!!3!! హేమసింహాసనమునా హెచ్చైన కృపగల ప్రేమతో వేంచేయుమా - తామసించకుమయ్య వోపను నేమముతొ పూజించెదానిక-రామదాసు డనయ్యి మ్రొక్కెద నామనంబును సంతసించగ !!ఆస!!4!!

5. ఆటతాళం: రాగము:

!!క!! ఆద్యంతంబులు లేకను చోద్యంబగు పాదములకు పాద్యములిత్తున్ భేద్యంబు లేక కొనుమిక సాధ్యంబుగ దేశికేంద్రా సద్గురు చంద్రా!!

పాద్యామిచ్చెద పావనాంగా మీపాదపంకజములకు పరమాశుభాంగా !!ప!! స్వచ్ఛమౌ వుదకాము యెచ్చాగనుండాగ - యిచ్చాదీరగ పాద్యామిత్తునోయయ్యా !!పాద్యా!!1! కందర్పశతకోటి సుందారంబును మీరి - అందామయ్యిన పాదాబృందాములకును !!పాద్యా!!2!! కోటిభాస్కర తేజా కోమాలపదయూగ - మేటిదాతలో నీకూ సాటియెవరయ్యా !!పాద్యా!!3!! వాసిగ వెలివెర్తి యీశా లోకేశా - గాశీబాపుము రామాదాసా నీవాసా !!పాద్యామిచ్చెద!!4!!

6. ఆటతాళం: రాగము:

!!క!!హస్తము మస్తక మందిడి సుస్థిరమగు పదవిజూపి అస్థిరముడిపే హస్తంబుల నర్ఘ్యంబును యిస్తిని గురుదేశికేంద్రా !!సద్గురుచంద్రా!!

అర్ఘ్యంబిచ్చెదనయ్యా నన్నాదరించుమాయయ్యా -అర్ఘ్యంబిచ్చెద దుర్ఘట మొదలియు శీఘ్రమె కేవల స్థిరపదమొందను !!ప!! పొందుగ మిముపూజించీ - మునుపందముగను సేవించీ పొందిరి బ్రహ్మానందము బుధులని - ముందుగవినినే అందము తోడుత !!అర్ఘ్యం!!1!! శుద్ధోదకమును దెచ్చీ మతిశుద్ధితోడ పెంపెచ్చీ - ముద్దుగాను హస్తార్ఘ్యంబిచ్చెద - శిద్దులలో పరిశుద్ధాత్ముడవని !!అర్ఘ్యం!!2!! ధారుణి వెలివెర్తీశా నినుదలతును భువనప్రకాశా - మేరువయగు సహస్రారము నందున ధీరుడవంతట వేరును లేదని !!అర్ఘ్యం!!3!!

7. ఆటతాళం: రాగము:

!!క!! స్వచ్ఛమగు నదుల వుదకము మచ్చికతో దెచ్చి మీకు మతిశుద్ధముతో యిచ్చెద ఆచమనంబును మచ్చికతో దేశికేంద్రా !!సద్గురుచంద్రా!!

ఆచమనం గురువాచమనం ముఖాచమనం పునరాచమనం - ఆచమనంబిదె చేకొను మిచ్చెద - మీచరణంబుల లోచనముంచెద !!ఆచ!!ప!! శుద్ధోదకము సువాసన తోడుత శ్రద్ధచాతపరి శుద్ధుడనైయ్యిక !!ఆచ!!1!! శృంగారంబుగ పొంగిచెలంగిన -గంగాయమునల సంగో

దకమును !!ఆచ!!2!! మించిన భక్తి వహించి నుతించుచు- మంచిగమిము పూజించి భజించుచు !!ఆచ!!3!! వాసవాది సురవందిత లోలన- భాసమాన సుమ్మానస ఖేలన !!ఆచ!!4!! యిమ్మహిలోపల యిలవెలివెర్తిల - సోమ్ముువు నీవని నమ్మియు నిచ్చెద !!ఆచ!!5!!

8. ఆటతాళం: రాగము:

!!క!! పంచామృతముల తోడను మంచిగ స్నానంబుజేసి మించిన దయతో సంచితములు పోదోలుము-అంచితముగ దేశికేంద్ర !!సద్గురుచంద్రా!!

పంచామృతంబుల తోడను గురవే మంచీగ స్నానాము శాయవే -మంచిగ భక్తి వహించి ముంచిచ్చెద - సంచితములు అనె వంచానర హరయాను !!ప!! క్షీర శర్కర పెర్గుతోడనూ స్నానం సారమౌ తేనెఘృతంబునూ - సారసంబుగ నీకు సన్నుతించుచునిత్తు - కరుణీంచి కృపయుంచి మరిస్నానమొనరించూ !!ప!!1!! శుద్ధోదకం మీదె చూడవే గురవే ముద్దాగ మురయూచు శాయవే వద్దానెనిలచియు సుద్దులన్నియుజెప్పి - బద్ధాపామరముల శ్రద్ధతో ధృంచీయు !!ప!!2!! ఆనంద బాష్పామృతంబునూ పరమా ఆనందఅమృతాజేలంబును - అభిషేకమొనరింతు అందామౌమేనుకు - అందిచేకొనవయ్య నిండారు దయతోను !!ప!!3!! వరధార వెలివెర్తియందునా రామావరదూడవని జేగమందునా- సరసీజసన్నూత సకలావేదములన్ని - వర్ణించలేవు నావశమయ్యి నంతాను !!ప!!4!!

9. ఆటతాళం: రాగము:

!!క!!గంగా యమున సరస్వతి శృంగారంబైన నదుల సంగమజలమున్ మంగళస్నానము శాయవెఅంగుగ గురుదేశికేంద్రా !!సద్గురుచంద్రా!!

జలకమాడావెదేశిక జాగుశాయాకే - జలకమాడుమిక జలములొసంగెద ఫలము లొసంగియు పరమశాంతమున !!ప!! అంగమీదే అభ్యంగమీదే - గంగాజలమును రంగుచెలంగ వుప్పొంగుచు స్నానము అంగుగశాయవె !!జల!!1!! నేనునాదే యిఘ లేనేలేదే- పోనెపాయనిక లేని సంఘమును రానురాను గురు రాములసాక్షిగ !!జల!!2!! అభయమీడావే నాభయము బాపావె అభిషేకంబును అర్పించెద యీత్రిభువన దేశిక భవహర గురువర !!జల!!3!! యిందిరేశా వెలివెర్తి మందిరీశా-సుందరాంగ మునిబృంద సురార్చిత - వందనమున జలమొసగెద దయతో !!జల!!4!! రామదాసూ వేడెను ధామబ్రోచూ-నామనసందున నేమమునీవని నోముఫలించును స్వామి సాక్షియిఘ !!జల!!5!!

10. ఆటతాళం: రాగము:

!!క!! అభయప్రదాత వనుచును - అభిమానము లెల్లమాని అహమునువీడీ-అభివస్త్రంబుల నిచ్చెద శుభముగగొను దేశికేంద్రా !!సద్గురుచంద్రా!!

అభివస్త్రాములిచ్చెదాను ఆదరించావే -గురవే -అభిమానాదూలన్ని బాపి అభయముంచావె !!ప!! పట్టుపీతాంబరమూ నిత్తూకట్టుకోవయ్యా-గురువే-దిట్టమైన ఝుట్టినిత్తూ పట్టుదమరయ్యా !!అభి!!1!! రంగుగా బంగారు చేలము చింగులుజారా గురవే - భంగము లేకాను పరమానంద మొందగా !!అభి!!2!! పగిడి జల్తారంచూ దోతులు పాగశెల్లాలు -గురవే-మిగులహేమా తేజామైనా మించినంగీలూ !!అభి!!3!! శాలువా దుషాల కప్పుమేలుగో దేవా-గురవే-యేలు వాడావనుచూ అన్ని చాలగోదేవా !!అభి!!4!! యిమ్ముగాను వెలివెర్తిలో సమ్మతితోడా - గురవే - నమ్మిన వారాలకెల్లా యిమ్మునీవాటా !!అభివస్త్రాము!!5!!

11. ఆటతాళం: రాగము:

!!క!!అజ్ఞాన తిమిరమణచియు సుజ్ఞానాంజనము నొసగె సౌజ్ఞుడవనుచున్ యజ్ఞోప వీతమొసగెద-ప్రజ్ఞుడగురు దేశికేంద్రా !!సద్గురుచంద్రా!!

యజ్ఞోపవీతామిదుగో సద్గూరునాధా యజ్ఞోపవీతామిదుగో !!ప!! యజ్ఞోపవీతాము యెలమీతో నిచ్చెదాను - అజ్ఞానమూనూ బాపే సుజ్ఞాననాధా !!య!!1!! మశపిపీలిక బ్రహ్మమగు దేహమూలయందు - వసియించె సూత్రామిదుగో నిజగురునాధా !!య!!2!! ప్రజ్ఞాన మనియె బ్రహ్మేపటుతారసూత్రాము - సుజ్ఞాన సూత్రామిదుగో మద్గురునాధా !!య!!3!! మూడు తోమ్మిదులూ యిరువైయేడు సూత్రమ్మూలు - జోడూలు ధరియించుమీ వేడూకతోడా !!య!!4!! రామాదాసుండూ గాని నేమాముతో నిచ్చే - పామారమేమీ లేకా పరమాత్మునాకూ !!యజ్ఞోపవీతామిదుగో!!5!!

12. ఆటతాళం: రాగము:

!!క!! శంఖున్ చక్రకిరీటము లంకితమణికుండలములు రాజిత భక్తిన్ యింకననేక సుభూషణ మంకెతొగోను దేశికేంద్రా !!సద్గురు!!

ధరియించూ గురునాయకా ఆభరణముల్ కరుణించిమునినాయకా - ధరియించావయ్యా సుందరమైన కాంతిచే మెరయూచునున్నట్టి దివ్యాంబరమూలు !!ప!! మకరాకుండాలంబులూ కేయూరములు మణులా కిరీటంబునూ - వికసించూ మౌక్తిక విపులా హారంబులూ - ప్రకటించూ రత్నాల పచ్చాల పతకాము !!ధరి!!1!! పోగూలుంగారంబులూ కడియంబులుపాలుపైన మొలత్రాళ్లూ పగలేకగొనవయ్యాపసిడిమయంబైన - పగడాలుముత్యాలు పచ్చాలహారమల్ !!ధరి!!2!! గుణవంతూ లకునెల్లానూ గురిగనియున్నాగుణమె సూభూషాణమూ అణువూలో అణువయ్యి అంతాట వెలుగయ్యి -సుగుణూన కెప్పుడు సూరిభూషణమూలు !!ధరి!!3!! సుందారా కారూడవూసద్గురుదేవా సురలోక పూజ్యుడవూ-యెందారెన్నన్నా నీయందేముందుండీయు రంథీయేమియు లేక రామ దాసుడు నిచ్చూ !!ధరియించూ!!4!!

13. ఆటతాళం: రాగము: హిందుస్థాని (బతాదేసఖి అనుమెట్టు)

!!క!! గంధ కచూరము కుంకుమ చందనకర్పూర మగరు అందంబలరన్ గంధము మేనుకు నలరెద- సుందరమగు దేశికేంద్రా !!సద్గురుచంద్రా!!

గంధమింపూగాబూసేదా అందమౌగురునకు గంధమింపూగా బూసేదా !!ప!! పరిమేళ గంధాము పచ్చాకర్పూరామూ - పన్నీటదీసిపూసేదా పరమైనాగురునకు !!గంధ!!1!! అత్తారు పన్నీరు వుత్తామ అగరూబుక్కా - మెత్తాగనలరేదానికా వుత్తామదేహికి !!గంధ!2!! చందాన గంధాము గంధాకచూరాము - అందమొందాగా బెట్టెదా సుందారామూర్తికి !!గం!!3!! కర్పూర గంధాము కమ్మానివాసన - నేర్పులేకానూ రాగానూ దర్పాసంహరికి !!గంధ!!4!! వసుధాలో వెలివెర్తివర రామదాసుడు - విశదమొందాగా వేడాగా వరగూరునాకు!!గంధ!!5!!

14. ఆటతాళం: రాగము:

!!క!! చంగల్వకుసుమ చంపక సంగతి చామంతి వకుళ శతపుష్పంబుల్ అంగుగ సర్వసు పుష్పం రంగుగగొను దేశికేంద్రా !!సద్గురు!!

వోజగద్గురునాథ శ్రీసాద్గురూనాథ పూజా జేసెద మన్నాధా !!ప!! పూజజేసేద పొన్నపొగడల పారిజాత సుపుష్పచయములు -రాజిగను కరవీరజాజి కదంబకుసుమము లిడేదకన్గొను !!వొజ!! మల్లేలు మొల్లాలు మలయామారుతమూలు యుల్లాము రంజిల్లగా - కొల్లలేని కలువపువ్వులు బిల్వపత్రము తులశి దళములు - తేల్లగన్నెరు మొగిలిపువ్వుల యెల్లపుష్పములెలమి జేర్చెద !!వొ!!1!! బంతీచామంతీ గోరెంతాసంపెగాలు సంతోషమొదవాగనూ - వింతగల నీలోత్పలంబులు చంపకము వకుళములు కలహర - మంతనమున అశోకమతశీ కాంతిగల పుష్పము లొసంగెద !!వొ!!2!! హరిహారసురనార గురువూలకెల్లను గురువూనీవనీవిందునూ - సరసముగ సర్వాంగ పూజయు సకలపుష్పము తోడజేసెద - వరుసతో శ్రీరామదాసుని వరములిచ్చియు కరుణ జూడుమి !!వోజగద్గురునాథ!!

15. ఆటతాళం: రాగము:

!!క!!కర్పూర మగరుగంధము మెప్పగు ఘృతమగ్నియందు మురయుచు వేతున్ ఘుప్పున ధూపంబొసగెద వప్పగగొను !!దేశికేంద్రా!!

ధూపమాఘ్రాపయామి దీపం దరిశయామి ధూపమాఘ్రపయామి - వోపాపహరణ గురువర తాపాదు:ఖాది సంహర !!ధూప!! చందాన మగరు చూర్ణాంబందామౌ గంధములునూ పొందూగా అగ్నియందిడుచుందూ ఆఘ్రాణమొందూ !!ధూప!! సర్వాభూతాంతరమునా సాన్నిధ్యమయ్యియున్నా - నిర్మాల శ్వాసమూల సర్వాసూగంధమూను !!ధూప!! ఘూప్పు ఘూప్పున పరిమళ మూప్పాతిల్లూచు - నున్నా మేప్పుసు గంధమూలా వోప్పుగాగొనుము గురువర !!ధూప!! పరమాపావానన్నామం భక్తాసంత్రాణశీల - కరుణాతో రామదాసుకు వరమూ లీచ్చీనవాడ !!ధూప!!

!!క!!వత్తిత్రయముల తోడను మత్తత లేకుండ ఆజ్యమగ్ని చెలంగన్ వుత్తమ దీపంబిచ్చెద అత్తుగగురు దేశికేంద్రా !!సద్గురుచంద్రా!!

16. ఆటతాళం: రాగము:

దీపామర్పించెదానికా దివ్యా అవ్యాత్మకు దీపామర్పించెదానికా !!ప!! కనాకాపళ్ళేరామందునా నీలాంజనములూ ఘనామైనా గోఘృతబునా అనయము వత్తిత్రయముల తోడుత వినయ విధేహికి విశదము వెలుగగ !!దీపా!! పంచార్తులివిగోనిచ్చెదా పరిపూర్ణునాకు పంచాగ్నులూను హెచ్చగా - వంచనలేకను వప్పగ కొనుమిక - వాంఛిత మొసగియు మించిన వేడ్కతో !!దీపా!! చూపురూపుకు దాపునై చూడ్కూలలోనా పాపాలోపాల పరమునై - వోపికతోడుత తేపకు కనినను ప్రాపుగ వెలగెటి ఆపోజ్యోతిని !!దీపా!! ధరాలో వెలివెర్తి యందునా వరరామాదాసుకు వరాములిచ్చెటి స్తలమునా - సరగునా దీపంబొసగెద కృపతో - బిరుదు వహించిన కరుణ జూపుటకు !!దీపా!!

17. ఆటతాళం: రాగము:

!!క!!శాల్యన్నము షడ్రసములు మేలగు బహు పంచభక్ష్యపక్వాన్నంబుల్ చాలగ అర్పించెదకొను శీలముగల దేశికేంద్రా !!స!!

ఆరాగించుమి దేశికేంద్రా మమ్ము ఆధారించుమి సుగుణాసాంద్రా ఆరాగించుమి మంచి అన్నామాజ్యంబును కూరగాయలు పప్పుచారూ షడ్రసమూలు-సారవంతములైన భక్ష్యములూ పరమాన్నములు మరి - క్షీరశర్కర పెరుగు మీగడలు-మధురంబులైయ్యున బూరెమప్పడమొడియ మొబ్బట్లు- రసవంతమయ్యున తేనెషర్కర కదళిద్రాక్షలునూ- సరసముగ చకిలాలు గరిజలు సొండిగలు చేగోళ్లు అరిశలు - బర్ఫిబూంది జిలేబిపేడలు అర్పితముబహు పిండివంటలు ॥ఆరా॥ పృథ్విజలంబగ్ని వాయువాకాశంబు - సతతమాయా సంకలితామయ్యునసర్వ - చేతనాచేతనము లన్నియునూ మీకర్పితంబగు ప్రీతిగాపర ఆత్మనాత్మలునూ ఐక్యంబులయ్యున రీతియగు నిజ రూపమును గల్వా- సర్వంబు జనగను ఖ్యాతియగు ఆబయలు బ్రహ్మంబు - దాతవని ప్రఖ్యాతివినినే చేతనంబును మదిలో నిడుకొని - చేతో ముదమున సేవజేసెద ప్రీతిగను భోంచేయు దయతో ॥ఆరా॥ సంచీతాదులు దొలగా మించిన భక్తిచే - వంచానలేకా వైరాగ్యా జ్ఞానంబుచే- మంచీగర్వణ జేతుచేకొనుమూ మరియాదతోడుతకాంచి అర్పణ సేయుదయతోను బహు వింతలయ్యున యెంచ రాని భవము బాపూమూ-నెనరుంచి వేగమె-మించినా పరిపూర్ణమున నిల్వా వంచనేమిట లేక మీబిరుదెంచి బ్రోచియు కరుణ జూడుడి-మంచిగను వరరామదాసుని మించినా స్థలమందు నుంచియు ॥ఆరాగించుము॥

18. ఆటతాళం: రాగము:

॥క॥పోక లవంగము ల్యాలకు లాకులు కర్పూర జాజి జాపత్రులతో మీకును విడెమర్పించెద చేకొనుమిక దేశికేంద్రా ॥సద్గురు॥

విడెములర్పించెద విధివ్రాతా బాపేటి గూరుదేవా-వడిగా త్రిమూర్తుల వశముగానివాడ గురుదేవా ॥వి॥ పండుటాకులు మంచీ పచ్చాకర్పూరాము గూరుదేవా నిండు వేడుకనిత్తూ దండియాలకులతో గూరుదేవా ॥వి॥ జాజి పాలంబులూ తగులావంగంబూలు గూరుదేవాజాపత్రి వక్కాలు జయమైనా మడుపూలు గూరుదేవా ॥వి॥ అత్తారు పన్నీరు అగరుకస్తూరియుగూరుదేవా వుత్తామ పరిమెళము చిత్తాము రంజిల్లా గూరుదేవా॥వి॥ శరణాగతత్రాణా బిరుదాంకితాదేవా గూరుదేవా- కరుణాతో వరరామదాసు నేలినవాడ గూరుదేవా ॥విడెము॥

19. ఆటతాళం: రాగము:

॥క॥ తను మన ధనమర్పించియు వినయంబుగ బోధవడశి కరుణను బొందన్ ఘనమగు యెరుకను దక్షణమును యిచ్చెద దేశికేంద్రా ॥స॥

అక్షయాత్మ సద్ధర్మా గురుదేవా దక్షాణర్పింతు మహానుభావా ॥ప॥ ధనము ధాన్యాము తను వింద్రియములూ మనసు భూత తన్మాత్రా ప్రాణములూ ॥అక్ష॥ అష్టాబంధూలు అన్ని నీ సొమ్మూ - కష్టపెట్టాకు కలవూ నా సొమ్మూ ॥అక్ష॥ దేహి దేహముగల మోహమూలు అహమెరుకాత్మ అన్ని నీపాలు ॥అక్ష॥ నేనునాది సర్వమును నీదాయె అనాది బంధములు పోనాయె॥అక్ష॥ యెందా రుండీన నేమిలేదాయె ముందు వెనుకాను నీవెమాకాయె ॥అక్ష॥సర్వామర్పింతు నీకూ సర్వేశా మర్మాముంచాకు మదియు విశ్వేశా ॥అక్ష॥ నేను లేకాను నీవెనాకాయా నేను మేను మరిచితె తానె ఆయా ॥అక్ష॥ లేనిమాయ లేకుండా జేయుమీ కాని మాయకాకుండా చేయుమీ ॥అక్ష॥ యేమి లేనీది లేకానెపాయె రామదాసుకు జోకాలెదాయె ॥అక్షయాత్మ॥

20. ఆటతాళం: రాగము:

!!క!! శృంగారమైన గురునకు -బంగారపు పళ్ళెరమున సంగతితోడన్ -మంగళహారతు లిచ్చెద -అంగుగవర దేశికేంద్ర !!సద్గురుచంద్ర!!

హారతులీచ్చెద హరిహరసన్నుత -సురవరసుందరగురువర భావహర!!ప!! కర్పురహారతి కాంతిచెలంగగ -వోర్పుతో మాయను తీర్పును జేతూవని !!హా!!1!! పంచభూత మయ పళ్ళెము లోపల-పంచకళాత్మై ప్రబలెటిదానిని!!హా!!2!! ఘుంమ్మని పరిమెళము నెమ్మది జాయాగను మమ్ముల బ్రోతూవని నెమ్మదితోడుత!!హా!!3!! జ్యోతులు రొండును ప్రీతిగజేసియు ఖ్యాతిగ వెలాగెటి ఆపోజ్యోతిని !!హా!!4!! పొందుగ వెలివెర్తి మందిరమందున అందముగానూ బ్రహ్మానంద ముప్పొంగగ !!హార!!5!!

21. ఆటతాళం: రాగము:

!!క!! నాదము లోపల తుదిగల-మోదంబగు ప్రణవపుష్ప మర్పించెదయే భేదంబులేక కొనుమిక మీదయతో దేశికేంద్రా !!సద్గురుచంద్రా!!

మంత్రపుష్పము మరియు జేర్చెదనూ మహనియ్య మూర్తికి మంత్రపుష్పము మరియు నిచ్చెదనూ-మంత్రపుష్పంబిచ్చేదను మది సంతసించగ అంతరంబున-తంత్రములు బరిమార్చ నీ పరమంత్రమె నుతియెంచెదానిక !!మంత్ర!! సాహస్ర శీరుషాదేవా పాదాక్షిబాహు సాహస్రమూలు గలభావా సాహస్రనామ రూపము సరగునాధరియించుచూను సాహసంబుగ జగము యుగములు సమయించిపెంచి సృష్టించెమూర్తికి !!మంత్ర!!1!! విశ్వశంభుడ వీవెనంచూనూ విశ్వాక్షివనుచు శాశ్వితుండవు నీవెనంచూను- విశ్వధరుడవు విశ్వమయుడవు విశ్వకర్తవు విశ్వభోక్తవు విశ్వమె నీవైనవాడవు విశ్వశించుమివేగ మ్రొక్కెద !!మంత్ర!!2!! నీలతో యదమధ్య మందూనా విద్యూర్లేఖ నిండియుండిన స్థలము నందునా నీవారశూకమున నాతి మధ్యను నూతి మీద నీతిపై వెలగేటి ఆపోజ్యోతి రూప అనంతరూపికి !!మంత్ర!!3!! హేమపుష్పం బిదిగో నిచ్చెదనూ గైకొనుముదేవా ధామ సంతోషంబుతోడాను - నేమముతో అర్పించెదానిక రామ దాసుడనయ్యి నీకిక- నామొరాలించియు వేగమె క్షేమముతొ ననుబ్రోచువాడని !!మంత్ర!!4!!

22. ఆటతాళం: రాగము:

!!క!!ప్రాదక్షణంబు జేసెద ప్రాగ్దక్షణ పశ్చిమోత్తరంబగు దిశలం పదపడిసేతు ననేకము పధమునకును దేశికేంద్రా !!సద్గురు!!

ఆత్మప్రాదాక్షణ మాచార్యునకును అర్పించెదనేడూ-యిదెచూడు ఆత్మప్రపంచంబంత్తట కలదని ఆదీ గురువుచె తెలసి మరికలసి!!ఆత్మ!! మనసుకాయములు మరి చరియించుచు అనిశము నీలోనా నెలెనా-తను ప్రాదాక్షణము ఘనముగ జేసియు గణుతించెద నిన్నూ-యిఘమున్నూ !!ఆత్మ!!1!! దండము దాండమఖండ సనాతన నిండు కరుణ జూపు నీవె దాపూ-పండిత పావన పరమపదాస్పద దండిదాతవయ్యా మాయయ్యా!!ఆత్మ!!2!! దిక్కుదిక్కులకు పిక్కటమైనా పూర్ణస్వరూపికిని-సఖునీ అక్కడ యీక్కడ యెక్కడననకను వక్కడైనవాన్నీ నేపూని !!ఆత్మ!!3!! అష్టాంగబుల సాష్టాంగంబుగ అంజలి జేసెదనూ-మదితోనూ సృష్టిలో వెలగె వుత్కృష్ట స్వరూపికి నిష్టతోడ మ్రొక్కినేదక్కి!!ఆత్మ!!4!! శరణుశరణుగురు చరణములకుమది స్తిరముతో మ్రొక్కెదను దక్కెదనూ పరమదయాళుని భక్తశరణ్యుని ప్రార్థించెదవేగా మదిబాగా!!ఆత్మ!!5!! అఖిలాత్మకుడని సకలములోగని సన్నుతీంత్తు వినుమూ యిటుకనుము అకలంకంబగు ఆపర బ్రహ్మకు అందము తోడుతనూ వేడుకనూ !!ఆత్మ!!6!! యిలలోపల వెలివెర్తిలో నిన్నె ఈశుడనుచు నమ్మి మదిగమ్మి- కలలో రామదాసుడు నిన్నే పలువరించినాడూ దయజూడు !!ఆత్మ!!7!!

22. ఆటతాళం: రాగము:

!!క!! యిష్టంబగు దైవంబని-అష్టాంగము చేత నీకు స్పష్టము తోడన్- నిష్టతొ మ్రొక్కుదు నిరతము-శిష్టస్తుత దేశి కేంద్ర!!సద్గురుచంద్రా!!

శరణుజేతునయ్య గురువరా రెండు కరములెత్తి-శరణు జేతునయ్య గురువరా - శరణు శరణు శరణుశరణు కరము భుజములురము శిరము-పాదములూను ధరనుమోపి శరణు జేతు పాదములాకు!!శ!! మ్రొక్కులిడుదుపదులునూర్లనూ వైవెయిలు లక్షలెక్కలేని కోట్లమార్లునూ యెక్కు వైన అర్బుదములు మిక్కిలీ అక్షోణులూను ఘ్రుక్కునా అనంతములును మక్కువాతో మ్రొక్కెదాను !!శ!!1!! దండమిడుదు నిండువేడ్కతో వైరాగ్యమొదవ ఖండమునకూ నిండుభాక్తితో దండమూ సాకారమునకు దండి నీరాకారమునకూ దండమూనాదచలమునకు దైవమునకు గురునకెపుడు !!శ!!2!! దాసవరద దేశికోత్తమా వెలివెర్తివాస మోసరహిత దాతమ్రొక్కెదా ఆశపాశనాశ యీశవాస వాస దేశికేంద్ర దాసుడైన రామదాసపోష వేషబాషనీకు !!శ!!3!!

23. ఆటతాళం: రాగము:

!!క!! ఛత్రంబులు చామరము పవిత్రపు వింజామరములు ఆంధోళికముల్ పాత్రుడనై నీకిచ్చెద-మిత్రుడవగు దేశికేంద్ర !!సద్గురుచంద్రా!!

రాజోపచారంబులు రాజిగగురుతేజమునకు !!ప!! ఛత్రంబులు చామరములు నృత్యంబులు సల్పుచునిక !!రా!!1!! వేదాంబులు శాస్త్రంబులు భేదించియు చదివెదనిక !!రా!!2!!అష్టాదశ పౌరాణము నిష్టతొవినుపించెద విను !!రా!!3!! ఆర్యులు సదాచార్యుడనుచు స్మరియించుచు సారముగని !!రా!!4!! అందాంబగు దశనాదము మీ ముందలను మ్రోయుచుండ !!రా!!5!! వాద్యాంబులు వాయించుచు చోద్యంబగు పాటలచేనిక!!రా!!6!! యోగాంబగు భోగంబులు బాగుగ సమకూర్చవె అనిమది !!రా!!7!! వేదాంతము వెల్లడిచే వచియించెద సుచరితములకును!!రా!!8!! స్మరియించుచు భజియించెద కరుణించియు పరమొసగుదువని!!రా!!9!! దాసులలో దాసుడు రామ దాసుండును భూషించును యిటు!!రా!!10!!

24. ఆటతాళం: రాగము:

!!క!! స్వచ్ఛమగు భక్తితోడను హెచ్చరికయు జేసెదాను యిచ్చతొ మదినే- స్వచ్ఛమగు ప్రభుడవీవని మచ్చికతో దేశికేంద్ర !!సద్గురుచంద్రా!!

హెచ్చారీకయు జేసెదా శ్రీదేశికేంద్ర హేచ్చారీకయుజేసెదా - హెచ్చరికనే జేసెదానిక అచ్చమైన భక్తిచేతను సచ్చరిత్రుడవనుచు - మదిపెంపెచ్చినా వైరాగ్యమెచ్చగ !!హె!! భక్తాసంత్రాణశీలా సద్భక్తులాకూ మూక్తూలిచ్చేటిదాతా భక్తులాహృదయాద్రివాస భవభయార్ణవ దూరశూరా రక్తిగల మాయాపహర విరక్తిగల్గె శూక్తివీవని !!హె!!1!! తాత్వాదత్వంపాదమూ ఆశిపదము అనియె తీప్పాలేమియు లేకనూ వుత్తమాపురుషుండువయ్యి సత్తుచిత్తనె సగుణమంటక రిత్తయగు ఆకాశశబ్దము వుత్తదయ్యిన సత్తనిజముకు !!హె!!2!! నిన్నూ వర్ణింపాతరమా దండిగ బయలై నిండీ యుండినవాడ - మన్ననతొ కృపవుంచిమాయనె కర్మయెరుకనుపట్టిధ్వంచియు- వున్నవాడవు యనుచు యిటులా సన్నుతించెద సగుణగతుడని !!హె!!3!! పరిపూర్ణరూపుడవూ వర దేశికుండవు పరమార్థమగు రూపివీ పరమపద మార్గస్తులకు నీవు పరమపద మొసంగెవాడవు కరుణతొవరరామదాసుకు పరమపదమె అయ్యినాడవు !!హె!!4!!

25. ఆటతాళం: రాగము:

‼క‼ ఆలించుమయ్య నామొర లాలించుము అనెటి యెరుక రంకులు బాసి దూలించు మయ్య కృపతో పాలించుమి దేశికేంద్రా ‼సద్గురుచంద్ర‼

లాలీలాలిలాలీ-లావణ్యా గురుశీలాలాలి ‼ప‼ లాలీలాలీ యనుచూ లాలిని యదనీలోలత గలుగును ‼లాలీ‼1‼ లేనిపోనిదోచ్చి పూనీయు చేసేను కాని కార్యములు- నేనూ మేనూ లేనిది- రానిదిపోనిది పూనిక కల్గెను ‼లాలీ‼2‼ చాలూ యెరుకాచలము చాలగ నన్నిగజాలి బొందించెను మేలూయేమీలేదు- మూలములేనిది పాదముసాక్షిగ ‼లాలీ‼3‼ వూగీవూగీ వుయ్యలబాగుగ మొదటి తావునుజేరును- లోగాలేనీదోచ్చివేగమె- జేసియుయేగు నెచటికో ‼లాలీ‼4‼ ముందూవున్నా నందము- సందిడకనుఅది యెందైనున్నది-పొందరానిది యెవరికి- అందంబైనా అచల పదంబును ‼లాలీ‼5‼ రామదాసూ మనవిది లాలించియు రక్షించుటకై ప్రేమరస ముప్పొంగియు- కామంబులు నిర్ధామముగాగను ‼లాలీ‼6‼

26. ఆటతాళం: రాగము:

‼క‼ జోజోముద్దుల మురహర జోజోగురు సుప్రకాశ జోయఘువీరా జోయని జోగల బాడెద జోజోగురు దేశికేంద్ర ‼సద్గురుచంద్రా‼

జోలపాడుదామురారె - జాగులేకజాణలారా జోలపాడుదామురారె ‼ప‼ చాల మేలుగల్గు యెరుకజాలిబాపె ధీరునాకూ ‼జో‼ రమణులారమీరు మంచీ విమలమైన పదవి కొరకూ - అమలుడైన సద్గురుండూ శ్రమలుబాపు భ్రమలులేకా ‼జో‼1‼ రింగురింగునూగుచున్నా టుంగు టుయ్యాలపైనా - అంగలింగ భంగమైనా మంగళాత్మయుండువేగా ‼జో‼2‼ జాణలార గురుని గలసే జాడదెలసి బోధవడసీ- మానుగాను కీలుదెలసీ శాణలయ్యి పరము గలసీ ‼జో‼3‼ దేహి దేహమూలులేని కేవలాత్మ మేలుదెలసీ - అహమేమిలేకనూ వీదేహతత్వమందు వెలసీ ‼జో‼4‼ మునులూ సీద్దూలు పొగడీ ముందాల నాట్యమాడ - ఘనులుసన్నూతిజేసిగంతూలు వేయగాను ‼జో‼5‼ జోజో సద్గూరుచంద్రా జోజో మద్గూరుసాంద్రా - జోజోచిన్మాయభంగా జోజో పరమాత్మ రంగుణి ‼జో‼6‼ ధారయందూ వేలివెర్తి దైవారాయూణినమ్మీ - పరమాపదమీచ్చెనాని ప్రార్థన జేయుచూను ‼జో‼7‼

27. ఆటతాళం: రాగము:

‼క‼ నిద్రించుమయ్య నాకిక భద్రంబగు పదవియందు బాగుగగల్పీ - రౌద్రంబుబాపి కృపతో నిద్రించుమి దేశికేంద్రా ‼సద్గురుచంద్రా‼

పవ్వాళించుమయ్యా పరమాపదమందూనా - సవ్వామయ్యినమంచీ అవ్వాయా పదమూనా ‼పవ్వా‼ ముక్తీకాంతతోను సత్యలోకంబునా - శక్తులైదూను గొలువా ముక్తిపై నిద్రించూ ‼పవ్వా‼1‼ మునులు సీద్దూలునూ ముందూనుతి జేయగా - ఘనులూ మిమ్ములబొగడి గంతూలు వేయాగా ‼పవ్వా‼2‼ అయ్యామ్రొక్కెదమాయ కయ్యాము మాన్పవె - సయ్యాసయ్యనబట్టె దయ్యాముబాపావె ‼పవ్వా‼3‼ దూదీపరపూపైన దుప్పాటిగప్పావె - నీదె దయగాంచెనె నిన్నెసేవించెనే ‼పవ్వా‼4‼ మయమె సూవర్ణము మంచామునందూనా - నయమైనా పరుపూ తక్యాల పాన్పందునా ‼పవ్వా‼5‼ అందమౌపాన్పూ నానందాముప్పొంగగా - సుందరాకార గురుసుఖ నిద్రాజెందాగా ‼పవ్వా‼6‼ నాలుగుమేనూలా నాలుగావస్తాలా - ఆవాలీ బయలూలో మేలూగాగల్పియూ ‼పవ్వా‼7‼

నిన్నేనమ్మితినీ అన్యామే మెరుగాను-కన్నా తండ్రీవి నన్ను కన్నావే రక్షించీ !!పవ్వా!!8!! రామదాసుడు అని ప్రేమానీ దుంచావె - ధామాసార్వభౌమా దయతో యిటుగాంచావె !!పవ్వా!!9!!

28. ఆటతాళం: రాగము:

!!క!! షొడశవుపచారంబుల వీడక పూజింతు యెరుక వేగమె బాపీ కీడుతొలంగెటి సత్కృప జూడుమినిజ దేశికేంద్రా !!సద్గురుచంద్రా!!

పూజసేయుదాము పూని మానసమున సద్గురు !!ప!! పూజ జేయుదము రాజీవాక్షుని రాజిగ సర్వము పోదోలుటకై !!పూ!!1!! రాజయోగవిరాజితుడగు మహ-రాజతేజ సామ్రాజ్యునకెపుడు !!పూ!!2!! షోడశోపచారంబులతోడను-షోడశిరూపము తోడను గూడుక !!పూ!!3!! నేను నీవు బ్రహ్మాండము సర్వము- తానేనని సంధానము జేయుచు !!పూ!!4!! రాకపోకలనె జోకబాయుటకు-ఏకాత్మగు సర్వాత్మ ప్రకాశికి !!పూ!!5!! తేజంబగు యేరుకాత్మ ప్రపంచము-పూజకుపూజని పూర్ణ పదముగని !!పూ!!6!! పరమపదంబగు బయలాస్పదమున నిరతమునుండే నిలుకడతోడుత !!పూ!!7!! ధారుణి లోపల తగ వెలివెర్తిల - సారసమున గురుపాదముకెప్పుడు !!పూ!!8!!

## ఏడు వారాల కీర్తనలు

29. కీర్తన: రాగము:

!!క!!ఆదిత్యవారమందున-ఆదిపరబ్రహ్మమునకు అతులిత భక్తిన్ పాదుగ మది భజింయించెద మోదంబున దేశికేంద్రా !!సద్గురుచంద్రా!!

ఆదిత్యవారామునుండి-శ్రీహరినీ దాలంతాముగండీ !!ప!! ఆదిత్యవారాము పాదుగామదినిల్పి-ఆదిఅంత్యములేని ఆదిబ్రహ్మంబును !!ఆ!!1!! భానువారము బాహ్యభక్తీ మదిలోపూనిచెతము నిల్పూశక్తీ-మేనుమారచి లోనునాదాసంధానాము-మానూగజేసీయు కానికార్యము బాసి !!ఆ!!2!! సూర్యుని వారామునాడూ-ఆర్యవర్యుడౌ నారాయణూడు చేరిరక్షించును కోరి నూతించీన దారిదోరికి యేమాబారి దూరంబవును !!ఆ!!3!! త్రిగుణాము లైక్యాముజేసి- మనలో అగుణాము లన్నియుబాసి సగుణాముతోడ నిర్గుణమూను భజియించి- సద్గూణములతోను గురునీ స్మారింతాము !!ఆ!!4!!అష్టావిధంబులభక్తీ-వేగానిష్టతో జేయుడీ ముక్తీ-దుష్టా గూణంబుల దూరాము జేసియు-స్పష్టముగనుమోక్ష సామ్రాజ్యములు నిచ్చు !!ఆ!!5!! వేగామె వెలివెర్తి యందూ- యెపుడు బాగుగల్గును జ్ఞానమందూ-జాగులేకనునిత్య స్వామీనిదలచీతె- యెగూనుమాయా సంయోగాము బాసీయు !!ఆ!!6!!

30. కీర్తన: రాగము:

!!కం!! యిందుని వారమునందున-పొందుగ భజియించెదాను చెందిన వేడ్కన్-బంధముల నెల్ల బాపుము అందంబుగ దేశికేంద్ర!!సద్గురు!!

యిందువారమూ-చంద్రవారమూ-చంద్రధర నీనామస్మరణ జేసే వారమూ !!ప!! ఫాలనేత్రునీ పరమగాత్రునీ వాలయముగాసూరి హృదయ లోలనేత్రుణి !!యి!!1!! శంభోశంకరా విశ్వంభర హరా - అంబవినుత ఆదిఘనత కుంభినీనుతా!!యి!!2!! గిరిజ జీవన గురుజనావనా-పరమపురుష భవ్యవేష నెరనమ్మి శివా!!యి!!3!! చండికేశ్వరు ప్రచండయీశ్వరూ-దండిగానుగొలుచు చుండు నుందు యీశ్వరూ!!యి!!4!! భృంగికేశ్వరా-సంగమేశ్వరా-అంగలింగభంగ దీగంబరా దేవా !!యి!!5!!

నందివాహనా ఆనందపావనా వందనంబు సనకసాదిబృందపాలనా ॥యి॥6॥ కాలకంఠునీ నీల కంఠునీ- శూలధరుని కాలహరుని మేరుధీరునీ ॥యి॥7॥ భయవిహారుణి భక్తత్రాణునీ సవినయముగ సన్నుతించి భజనజేయుడి ॥యి॥8॥ ఆర్తిబొందియూ వెలివెర్తియందునా పూర్తి అయిన స్మరణ సంపూర్తితోడనూ ॥యి॥9॥

31. కీర్తన: రాగము:

॥క॥ మంగళవారము మరువక-అంగుగనుతియించెదాను పొంగిచలంగే మంగళకరమగు గురునకు-రంగుగవర దేశికేంద్ర ॥సద్గురుచంద్ర॥

మంగళవారం రంగానీవారం-మంగళవారము - రంగామృతమును భృంగములామై గ్రోలేటి వారం॥ప॥ శ్రీవాసుదేవంశ్రిత కల్పాభూరుహం చిన్మాయరూపం సన్మునీదీపం-భావభావమా గమ్యాతీతం సావధాన పరి పూర్ణాభరితం॥మం॥ శ్రీరామారామం-సదారామరామం కారుణ్య ధీమం- కరుణాసూధామం-మేరుకోటిసమధీరప్రకాశం-మారకోటి సుందర ఘనతేజం ॥మం॥ గురుతార వేషం -గురుపుత్రాపోషం పరమామృతభాషం-పండితాభూషం-కరుణాకర శ్రీహరి పరమేశం పరమపురుష సత్పావన చరితం॥మం॥ పూజీతాగాత్రం పుణ్యాచారిత్రం- రాజీవనేత్రం రసికా జనస్తోత్రం రాజయోగజనసేవిత సూత్రం రాజరాజగురురమ్యసుపాత్రం ॥మం॥ యిలాధరాయీశం వెలివెర్తివాసం-సలలీతదాసం-హృదయావిలాసం-కాలకాలసత్పావనశీలం- మేలుగవర రామాంహ్యా యలోలం॥మంగళ॥

32. కీర్తన: రాగము:

॥క॥ బుధవారము బుధవర్యుని-సదనంబున జేరికొలచి సన్నుతి జేతున్ సుధనంబగు నీ నామము-వదలుండను ॥దేశికేంద్ర॥

నామంభజే బుధవారంభజే-హరి-॥ప॥ నామంబునయగుణ ధామంబు నరసుర స్తోమంబు జగదభిధామంబునగు గురు ॥నా॥ కృష్ణంభజేవుత్కృష్టంభజే- బాలకృష్ణం కరుణ తరదృష్టం దురితభవనష్టం కమలజాద్విష్ణుం కృపాగురు॥నా॥ రామంభజేరమ్యధామంభజే రఘురామం దివ్యగుణదామం అసురసంహరం దీనమందారం దశరధ ॥నా॥ నందంభజే గోవిందంభజే- ఆనందం నమితముకుందం నమల సూచందం- నచ్చుతాసాంద్రం-సదానందం॥నా॥ దేవంభజే వాసు దేవంభజే గురుదేవం దైవతాలోలం దివ్యమణిశీలం-భవ్య మణీఖేలం-హరోహరి॥నా॥ యీశంభజే హృషి కేశంభజే-ధర-యీశం యిందిరాధీశం సర్వసర్వేశం-సన్నుతాకాశం-రామ హృదివాసం ॥నా॥

33. కీర్తన: రాగము:

॥క॥ గురువారము గురుభజనము లరుదుగ అర్చనము వందనము శ్రవణంబున్ బరువడి దాస్యముతోడను స్మరియించెద ॥దేశికేంద్ర॥

గురువారామనుచు తెల్వారయ్యా-గురుపుత్రులారా-గురునామ భజనశాయరయ్యా ॥ప॥ గురువారంబని గురుతుదెలసుకొని కరువు దీరగను హరిపరమేశుని ॥గు॥ ధ్యాన్నామూలాము

గురుమూర్తయ్యా- నీదానముజేసి మానుగ గురియు నిల్వారయ్యా- పూనుడి మంత్రమె గురుర్వచనమని - దీనబంధు హరి దిక్కునీవెయని ॥గు॥1॥ పూజామూలామె గురుపదమయ్యా- మోక్షామూలాము- రాజీగురుడొందవాలెనయ్యా - తేజంబగు గురుకృపగల్గితె జాలు - రాజీవాక్షుడు సాదృశ్యంబగు ॥గు॥2॥ గురునామాస్మరణ సేయరయ్యా యెల్లాప్వాటికిని గురుమంత్ర జపము శాయరయ్యా - గురువెంటను తానెంటనె నంటియు - గురుపదసేవయు కుదురుపరచుకొని ॥గు॥3॥ దేవాదేవూడు గురుమూర్తయ్యా నిజదేవుడువుండె ఠావూ తెల్పియు చూపించయ్యా- పావన మూర్తగు పరబ్రహ్మమని కేవలబ్రహ్మములో నైక్యంబగు ॥గు॥4॥ గురుబ్రహ్మ గురుడువిష్ణుడు హరుడూ గురువూకంటెనూ వేరె పరమూనులేదూ ఘనుడూ - అరమరదుగ గురుడష్టబాంధవుడు సర్వ మయుండగు సర్వముగురువని ॥గు॥5॥ మనసూ వాఃక్రియను యేకము జేసి వెలివెర్తియెందున- ఘనమైన పూర్ణభక్తితోను - వినయము తోడుత విభ్రమ లొదలియు - అనయము రామదాసుని గూడియు ॥గు॥6॥

34. కీర్తన: రాగము:

॥క॥భార్గవవారము నెప్పుడు-శాఙ్గాపద్మాదిధరుని సన్నుతిజేతున్ దుర్గము వదలప వర్గము- మార్గంబుకు దేశికేంద్ర ॥సద్గురుచంద్ర॥

భజోశుక్రవారం సద్గురు భగవంతుని నామం- భజోవిక్రముణి భజోసక్రమము అజాది రూపుణి విజైభవాయని ॥భజో॥ సనకసనందనమునీంద్రభృందము సదానుతించెటి హరి స్వరూపుణి ॥భజో॥1॥ సురాసురార్చితు స్తుతుల్నొనర్చెద - పరాత్పరుని బహువిధానములచే ॥భజో॥2॥ రుషుల్తమలో నిర్విషంబుచే- దుర్విషంబువీడను దురాంతకునిమది ॥భజో॥3॥ స్తుతుల్ నుతులు మది స్థితంబుజేసియు - గతులుబాపి పరగతివ్వ మనుచును ॥భజో॥4॥ యిలందు వెలివెర్తి కలందునిత్యము - ఫలంబు గోరకపరంబు సహితము ॥భజో॥5॥

35. కీర్తన: రాగము:

॥క॥ శనివారము భజియించిన ఘనమొందిన పూర్వకర్మ ప్రారబ్దంబుల్ మనుజన్మ జరామృత్యువు-చనిపోవును దేశికేంద్ర ॥సద్గురుచంద్ర॥

మందవారమునాడురా ఆనందముగ భజియించరా- అందమైనా ఆదిబ్రహ్మను అందిపొంది సుఖించరా ॥మం॥ యీశునీ మునిధీశునీ శనియేశునీ రుషివాసినీ-వాసవాదివేషునీ సర్వేషునీ పరమేశునీ ॥మం॥ విశ్వమెనారాయణం విశ్వపతినారాయణం-శాశ్వితము నారాయణంసద్గురుణి పారాయణం ॥మం॥ అహముగ్రహములు తానురా అంతతానై వెలసెరా- సోహంభావము పూనరా- అహంభావంబణచరా॥మం॥ సంకటంబులు బాపురా సర్వసౌఖ్యము లిచ్చురా అంకెకును హరినామ మెప్పుడు బొంకులెల్లను బాపురా ॥మం॥ స్మరణముక్త్యని తెల్పరా-యీ కలియుగంబున నిల్వరా- మరణమొందెసమయమున యిగ మంచిపదవిని జెందురా ॥మం॥ ప్రేమగురుడిటు చిల్కెరా రామదాసిటు పల్కెరా స్వామియని నుతియించరా నేమమెరిగి భజించరా ॥మంద॥

# పరిపూర్ణ గురుసార సంగ్రహం

1.ఆదితాళము: రాగము:

గణుతించెద నినుగణనాయకా - గణుతించెద నినుగణనాయక వినుతించెద విశ్వ వినాయకా - వరనాయకా -ఫలదాయకా !!గ!! మూలాధారా ముఖ్యకమలమున- మెలగుచుండిన దైవానాయకా ముఖ్యనాయకా ముక్తిదాయకా!!గ!! వసశషలనియెడి వర్ణబీజముల వసియించిన విఘ్ననాయకా - విమలనాయకా - విద్యనాయకా !!గ!! కుండలి శక్తియు మెండుప్రణవమును వుండు సద్భాక్తి విధాయకా-మునినాయకా- మది బాయకా !!గ!! అర్ధచంద్రమండల సద్యోముఖ వర్ధభూతకళదాయకా-ఆదినాయకా అతిదయాకరా !!గ!! పూర్వములో వుదయించిన అపోజ్యోతికి ప్రతిఫలదాయకా శుభదాయకా - సురశేఖరా !!గ!! వుదయము లోషడు శతమజపము నీకు మొదలర్పితము గుణాకరా సుగుణాకరా-వసుధాకరా !!గ!! యీ సమయము వెలివెర్తిలో రామా దాసు నుతించినవాడా గురికాడా గుణధీరా !!గ!!

2. ఆదితాళము: రాగము:

ఓం గాయిత్రేనమా-హరీం-ఓంసావిత్రేనమా ఓంగాయిత్రేన్నమోము సావిత్రేంన్నం-ఓం సరస్వతిహుంపటుస్వహ !!ఓం!! ఆధారస్వాదిష్ట మణిపూరకనహతశుద్ధ ఆగ్నేయాగ్రభద్రా స్వరూపిణీ !!ఓం!!1!! ఆకార ఊకారమకార రూపిణీ - సాకారమైన నీరాకార దివ్యారూపి !!ఓం!!2!! త్రైలోక్య సుందారి త్రైగుణ్యవందాని-ముల్లోకరాణీరొపల్లావపాణీరో !!ఓం!!3!! చిన్మాయచిద్రూపి వున్మాని సద్రూపి - అన్మానముంచాక సన్మాన మూనబ్రోవు !!ఓం!! అక్షరరూపిణి సాక్షి స్వరూపిణి-రక్షించు వేగమె అక్షాయసద్దార్మి!!ఓం!! నామరూపామణి సోమసుందారీరో నామదిబాయకు సామాది యానారో !!ఓం!! వసుధాలోవెలివేర్తి అసురాసంహారిణి- విశదాము రామదాస వచనా నివాసిని !!ఓం!!

వృ!!శ్రీగురు బ్రహ్మవిష్ణు శివశేఖరు ఆదివినాయకాదులన్ - శ్రీగురువాసవాదిసుర శిద్ధగణంబుల సోమసూర్యులన్ - శ్రీ గురు సర్వ దేవతలు చిత్తగుజీవుడు నాదిదేవుడున్ శ్రీగురుముఖ్యకారణము సద్గురుసర్వమటంచు మ్రొక్కెదన్!!

3.ఆదితాళం రాగము:

గురుబ్రహ్మ - గురువిష్ణు గురుసాంబశివుడాని మరువక వర్ణింతురా సద్గురుదేవా కరుణించి కృపవుంచరా !!గు!! నగురోరధికంబాని నయమైన శృతులందు- మిగులుందూవని విందూరా సద్గురుదేవా సుగుణంబెనినువేడగా !!గు!! విశ్వేశుడవునీవు విశ్వామయుడవునీవు విశ్వామంతయునీవేరా- సద్గురుదేవా శాశ్వితుండవునీవేరా !!గు!! కర్తావుభోక్తావు కారణ మయుడావు కారుణ్యనిధినీవేరా సద్గురుదేవా కీర్తిపారుండావురా !!గు!! తల్లితండ్రిదొరదాత కులదైవ మాప్తులు యెల్లాబంధుడ వీవెరా- సద్గురుదేవా యుల్లామందను కొంటిరా !!గు!! శృతులందు స్మృతులందు యితిహాసముల యందూ - వెతుకసర్వమునీవేరా సద్గురుదేవా అతిపూర్ణుడవు నీవేరా !!గు!! అంతా నీవైవుండయెంతో వింతలమాయ భ్రాంతీచెమరిపించెరా - సద్గురుదేవా చింతాబాపియు బ్రోవరా !!గు!! భాసుర వెలివెర్తి వాసునెప్పుడు రామదాసు వేడెనుకావరా సద్గురుదేవా గాశి యెరుకను బాపరా !!గు!!

!!శ్రీమద్గురువరు పాదపంకజములన్ - చిత్తంబులో నిల్పియున్ నేమంబూని మనంబు నంద్దిడుకొనిన్ సేవింతు సద్భక్తిచే కామంబేమిట లేమిజేసి నిన్నున్ భావింతు సత్వరముక్తై - నామంబున్ భజియింతు దేవ యితరంబు లేదంచు నెల్లప్పుడున్ !!

4.అటతాళం: రాగము: కల్యాణి

గురుమహరాజ గురుమహరాజ గురుదేశికేంద్ర సద్గురుమహరాజ !!ప!! నిత్యానిరాకార నిర్మల నిర్గుణ- సత్యస్వభావ సద్గురుమహరాజ !!గు!! రానిపోనివాణ్ని పూనినుతించ్చాగ - రానాయనిటు బ్రోవ !!గురు!! దొరవాని నమ్మిన దయబుట్టి బ్రోవాను- మరుపు జెందకుమయ్య !!గు!! శరణంటి శరణంటి చపలమేమియులేక- తెరుపుమరుపులబాపు !!గు!! నిరతాము నీనామస్మరణా పరుండాను - కరుణించి కడతేర్చు !!గు!! అన్యులవేడా నాకన్యులు లేరు - నీ కన్యాడగాను సద్గురుమహ !!గు!! పరమభక్తుల నెల్లపరిపాలనముశాయ - బిరుదు నీకున్నాది !!గు!! హరిహరబ్రహ్మ సురానరవందిత- నిరుపమానుండ సద్గురు !!గు!! స్థూలసూక్ష్మ కారణా మహకారణ - లీలపరుండ సద్గురుమహ !!గు!! జాగ్రతస్వప్నా సుషుప్తి తూర్యాతీత - సగుణ నిర్గుణ రహిత !!గు!! సాకార రహితా చిదాకాశశూన్యా నీరాకాశ నిజదేవ గురుమహ !!గు!! నాదుబిందుకాళ నామరూపాత్పర- సాధుజనార్చిత గురుమహ !!గు!! సత్తుచిత్తానంద సారంబులకు నన్ను- నుత్తమపురుష సద్గురు !!గు!! తారకసాంఖ్యా మనస్క భావాతీత- వాచామగోచర సద్గురుమహ !!గు!! అండపిండాండ బ్రహ్మాండ మార్తాండ- తండోపతండ సద్గురు !!గు!! నిత్యానిరంజాన నిరుపద్రవాఖండ అత్యంతనిర్మాల గురు !!గు!! నిర్మోహ నిర్వ్యాజ్య నిర్మాల నిశ్శేష- నిర్వచనానంద గురుమ !!గు!! నిష్కామ నిష్క్రియ నిష్కాళ నిష్కర్మ - దుష్కర్మదూర సద్గురు !!గు!! నిర్భేద నిర్వాద నిర్వేద నిర్వాయ- నిష్ప్రపంచామయ గురు !!గు!! నిస్సంగ నిర్ద్వంద నిజభక్త జనవరద- దుస్సంగదూర సద్గురు !!గు!! నిర్లక్ష నిరపేక్ష నిర్దీక్ష నిర్మోక్ష - నిర్లేప అజమచల గురుమహ !!గు!! ఆవర్ణ రహిత సర్వావర్ణవిజితా - నీరావర్ణ నిజదేవ గురుమహ !!గు!! రామదాస హృదయవాసవిలాస- భ్రమనాశ బారేశ సద్గురు !!గు!! ధారుణి వెలివెర్తి ధామపరంధామ - దైవశిఖామణి గురుమహ !!గు!!

5. ఆదితాళం: రాగము

గురుచరణం సద్గురుచరణం మద్గురుచరణం-దుర్గుణహరణం !!ప!!చరణం సంస్తుతకరణం సద్గుణభరణం భవహరు తరుణం !!గురు!! నందంపూజిత బృందంసేవిత చందం- బ్రహ్మానంద సురేంద్ర !!గురు!! యీశం ముక్త్యాకాశం పరమప్రకాశం గురువర హరిపరమేశం !!గురు!! శీలం సత్వదవాలం సజ్జనపాలం భగవన్ లీలసులోలం !!గురు!! గాత్రం పరమపవిత్రం చిన్మయసూత్రం పరమ రహస్యచరిత్రం !!గురు!! సర్వాంతర్బహిరంతర ఆత్మం - నిర్వచనా నిరంతరరూపం !!గురు!! నాదంప్రణవ వినోదందశవిధ భేదాభేద మనోస్థిరపాదం !!గురు!! దండం దైవమఖండం పరమప్రచండం- సుతమార్తాండసుతాండం !!గు!! వాసం వరధర హాసం వెలివెర్తీశం- దాసవిలాస విహారం !!గురు!! వరరామాంహ్వాయ మదిపరితాపం పరిచ్ఛేదించినపండితఖేలం !!గురు!!

6. ఆదితాళం: రాగము: ధన్యాసి

గురుడు యెంతో ఘనుడు దొరికేనే గణుతింపరాని గురుడు యెంతో ఘనుడు దొరికేనే !!ప!! గురుడుయెంతొ ఘనుడు దొరికె గూఢమైనా పదవిదెల్పె-గురుతుగా పరతత్వమొంది గురుతు లేక యుండుమనెనే !!గురు!! తనయ యిటురమ్మనుచు బిలచెనే తనకరము నిజముగ శిరముపైనిడి భవము దులిపేనె- తనుమనంబులు ధనసమూహము ధారబోయుము శిష్యనీవని

వినయముగ దీక్షత్రయంబులు-సవినయంబుగ తెల్పజేసెనె ‼గురు‼ భారమగు దుర్భరముబాపెనె భవమంత భస్పంబనుచు భూతిచె నుదుట తుడిచేనే - కరుణతో త్రివిధ ప్రసాదములురువడిగ నందించె ముదమున - మరచిపోయిన సస్వరూపము మరల నామది కెరుక జేసెనే ‼గురు‼3‼ పంచముద్రలు వేగ కనుమనెనె సాఖ్యంబు యిదియని పంచవిశంతి పరగతెల్పెనే - పంచవిశంతి మీరియున్నా పండు వెన్నల ఆత్మనీవని - యంచరానిది దీనికన్నను మీంచీనది యెరిగింతు ననెను ‼గురు‼4‼ వున్నదచలము లేనిదెరుకనేనే - వున్నచల మందున లేనికల్పన యెపుడు లేదనెనే - వున్న అచలము నామరూపంబన్నదేమియు లేదు కనుమని -మన్ననతో కనుసొజ్ఞచే మేల్ కన్నులకు కనుపించజేసెనె ‼గురు‼5‼ యెరుకమూలంబేమి లేదనెనే యేర్పాటుకల్గిన ప్రకృతి పురుషద్వయము మిధ్యనెనె- మీరియుండిన బ్రహ్మపదమును కోరికేమియులేక కనుమనె అరమరేమియు లేక శరణని ఆర్తిబొందిన యెరుక బాపెనె ‼గురు‼6‼ అందరాని మార్గమిది అనెనె- శివరామదీక్షితులంది పొందిన భావమిది అనెనె - యీ ధరందున నిజగురుండగు భారలింగ ప్రభువరేణ్యులు - శ్రీధరుండెయనగ వెలసియు రామదాసున కభయమొసగెనె ‼గురు‼7‼

7. ఏకతాళం: శుద్ధకాంభోజిరాగము

గురిగనెవారికి మరుగు దెలయుటకు-గూఢమైయున్నది గురునామం అరమరలేకను భక్తులందరికి-అమృతసారమె గురునామం ‼ప‼ అరిషడ్వర్గములనె దుర్గుణముల అణచివేసు సద్గురునామం- హరిహరాది అజయింద్రాదులకు ఆదిదైవమె గురునామం ‼గురి‼1‼ యీషణ వాసన దోషగుణంబుల యిడుముల బాపెడి గురునామం ఆశపాశముల కోసివేసి - నిజదాసుని జేసును గురునామం ‼గురి‼2‼ జన్మమృత్యుభవ తరుణోపాయము జగమునందు సద్గురునామం- ఘనముగ యిహపర సుఖదు:ఖంబుల - యిడుములబాపెది గురునామం ‼గురి‼3‼ సంసారంబనె విషవృక్షంబుకు సారఫలంబె గురునామం - సంశయ రహితుల బాయక యుండుటె- హింసలు బాపెది గురునామం ‼గురి‼4‼ అనేకజన్మ అర్జితభవముల అణచివేసు సద్గురునామం - పునర్భవంబుల పూనకుండ సంపూర్తియు జేసును గురునామం ‼గురి‼5‼ ప్రకృతి పురుషులనె ద్వయదోషంబుల పారదోలినదె గురునామం - సుకృత పుణ్యముల బంధ మోక్షముల వికృతము జేసును గురునామం ‼గురి‼6‼ శరణనెవారిని కరుణించెదనని బిరుదు వేసినది గురునామం- పరమ పదమె సుస్థిరమని నమ్మిన జనులను బ్రోచినది గురునామం ‼గురి!7‼ భారలింగమును నమ్మిన భక్తుల బాధమాన్పినది గురునామం - ధరలో రామదాసుకు ధారకపోషక లాభమె గురునామం ‼గురి‼8‼

8. ఆదితాళం: రాగము: బీంప్లస్

గురుడూ లాభించెనమ్మా గురిదెల్పేటి గురుడూ లాభించెనమ్మా గురుడూ లాభించెను శరణన్నవారినీ కరుణించూ నెవరైనా అరమారెంచని తండ్రి ‼ప‼ పాదతీర్థంబిచ్చియూ ప్రాసాదాము పరిపూర్ణ దయనిచ్చియూ-ఫాలామందున బ్రహ్మవ్రాలుతూడచివేసి పరమా మంత్రంబును పరగా బోధించీయు-బేదమెంచక త్రివిధదీక్షలు మోదమొందగజేసియెరుకను- పాదులేపితినసుచూ భవమూ భయము బాపెగదమ్మ కోమలి ‼గురు‼1‼ నేనానె హంకారమూ లేనిదియానిదీని నొదులుమానెనె- మేనూనేనొక్కాటె మూలాములేదాని షోడశిమంత్రాము చాలాభోదించెను రాని బయలులో లేనిదెప్పుడు లేదులేదనిలేపిచూపియు-వున్న బయలులో వుండునీవని వున్న నిజమును

బయలు పరచెను ॥గురు॥2॥ అక్షిభావముజూపెనె నాలోనున్న సాక్షి భూతునిగల్పెనే - దీక్షాతోయేమి అపేక్షించాబోకాని చక్షూలందున బిందునాదాము కళలన్ని-వీక్షణంబును జేసి అంతయు యింద్రజాలం బనుచు తేల్పీ మోక్షమార్గము అపుడెచూపెను అక్షయంబగు రక్షణీయుడు ॥గురు॥3॥ బట్టాబాయలు నందునా యెప్పుడు యేమిపుట్టావు నిజమానెనూ- గుట్టుద్వాదశి దెల్పీ దిట్టాము జేసియు-వట్టి బట్టాబయలూ దిట్టాము చూడాని-రట్టుజేసెటియెరుక నెప్పుడు బట్టబయలున నిల్పవలదని-కట్టుజేసియు బయలునందున వట్టిబయలువు కమ్ముకమ్మనె॥గు॥4! గురుడు నారుడుగాడనీ అనుభవమూన హరుడూ ప్రత్యేక్షమాని గురిలెస్సా దెలసేను గుణనిర్గుణంబులా పారలానంటకనుండు పరమాపాదంబయ్యి ధరలోగల వెలివెర్తి యందున ధన్యుడాయను రామదాసుడు కరుణకును పాత్రుణ్ణి జేసెను పరమ సద్గురు ప్రభువరుండును ॥గు॥5॥

9. వ కీర్తన: ఆదితాళం: రాగం :

గురురాయ సద్గురురాయ - మద్గురురాయ సద్గురురాయ- గురురాయ నీ నిజసూత్రము గన - ధరలోగల మహామహుల కందనిది ॥ప॥ యజ్ఞ యాగజపక్రతువులకూ - బహుసొర్ఘలైన మాయవిద్యలకు - అజ్ఞానంబున అన్నియు సల్పిన సుజ్ఞానులకే సులభము కఠినము ॥గురు॥1॥ భక్తికి సులభుడవని వింటి సద్భక్తులదాపని మదిగంటి - భక్తదీనులకు బహుసులభుండవు- భక్తితో నినుగని పట్టవచ్చునయ ॥గురు॥2॥ సృష్టిస్థితిలయ కార్యముకూ- వుత్కృష్టమైన మాయాత్మకునూ - సృష్టిక్రియలకును కష్టసుఖములకు-అష్టఆత్మలకు ఆవలచలమయ॥గురు॥3॥ జగము యుగము వుళ్ళక్కంటా యీ జగమెరుకధిపతి లేడంటా - జగజాలంబనె గల స్వపంబున గల వస్తువ మేల్కన్న నచలమయ ॥గురు॥4॥ అహమె జగముకు మూలమయా-యీ అహమె జగమున వెలసెనయా అహం జీవేశ్వరుడాహమె సర్వము-అహముడిగినా అంతఅచలమయ ॥గురు॥5॥ యోగికి భోగికి సూటౌనా సన్యాసి భావముకు సాటౌనా ఆగమబోధల కందగరానిది వేషబాషలకు వేరైయున్నది ॥గురు॥6॥ ఖండాఖండముగాకుండూ-అదిదండిగ బయలైనిండుండూ -మెండుగ దశదిశలందున యుండును - దండిగ ద్వాదశి నిండుఅర్థమిది ॥గురు॥7! రాజయోగి గురుకృప గల్గి నిజరాజ బాటలో దరిజేరి - రాజరాజనిజరాజ దరిశనము రామాదాస భావాన్వ యార్థమిది ॥గురు॥8॥

10. ఆదితాళం: రాగము:

గురుడేమో తెల్పెనే నిజగురుడేమో తెల్పెనే- ననుకలమేల్కజేసెనే గురుడుతెల్పె భవతాపము లణచియు -పరమపదంబని బయలెనిజమని॥గు॥ తనుమాన ధనమూలూ త్వరగా నాకిమ్మనే తాను నేను అనె తర్కమొదులుమని-వాద భేదముల వాంఛలుడుగుమని ॥గు॥1॥ పదియారు వినుమనె- మదిపాటించి కనుమనె - మోదముతోడుత మూలము లేనిది- కీలుదెలసి దీని జాల మొదులుమని ॥గు॥2॥ పదిరెండూ తెల్పెనే అదిపరమేదో చూపెనే - పరిపూర్ణంబిదె పరమ పదంబని - నిరతముమదిలో మరువకనిలుమని ॥గు॥3॥ యెరుకాతో తెల్పెనే ఆ యెరుకా మిధ్యానెనె యెరుకజగంబులు యేమిలేనివని -అరమరలేకను అచలము కనుమని ॥గు॥4॥ దాసాపోషకుడే నిజ దాసారక్షకుడే దాసవరద బారేశ దేశికుడు-దాసుడైన రామదాసును బిలచియు ॥గు॥5!

11. ఏకతాళం: రాగము:

గురుంభజే సద్గురుంభజే శ్రీహరింభజే పురహరంభజే ॥ప॥ నామంబు సద్గుణ స్తోమంబు

సద్గురు నామంబు సత్వదభీమంభజే ‼గు‼1‼నాదంబు దశవిధ భేదంబు ప్రణవానాదంబు సద్గురుధామంభజే ‼గు‼2‼ యేకాత్మయై సర్వలోకంబు నిర్మించె ప్రాకటముగ నేలె పతింభజే‼గు‼3‼ ద్వయంబు లెల్లను మయంబులయ్యిన - భయంబులణచెటి నయంభజే ‼గు‼4‼ గుణత్రయములనె గణంబులెల్లను - గతంబు జేసిన పతింభజే ‼గు‼5‼ కృతాకృతంబులు గతంబుజేసియు - కృతార్థులను జేసేగురుంభజే ‼గు‼6‼ కామంబులను నిర్మూలంబులౌ - నిష్కామంబుతోడుత స్వామింభజే ‼గు‼7‼ ఖండాగుణంబుల ఖండించి యెమపుర - దండాన బాపెటి దాతంభజే ‼గు‼8‼ యోగీంద్రులకు ఆత్మక్షేమంబు జేసియు - ఆగంబు బాపెటి హరింభజే ‼గు‼9‼ నామామృతంబును పానంబుజేసిన క్షేమంబుజేసెటి రామంభజే ‼గు‼10‼ చిదంబరాంబర విధంబులేకను- పదంబుయగుపర నిజంభజే ‼గు‼11‼ యిలందువెలివెర్తి వెలందుదురముల - దూలించి ద్రుంచెటి మేలుంభజే ‼గు‼12‼ దాసుండునగు రామదాసుండు దలచితె - మోసంబు బాపిన యీశంభజే ‼గు‼13‼

12. ఆదితాళం: రాగము:

సద్గురుదేవా మహనియ్య భావ-మద్గురుదేవా - నిండు నిరుపమ నిత్యనందా కృపాంభుధి మండలాత్రయ తీతాఖాండనిర్మలతేజ ‼గు‼1‼ పంచాభూతామయ- పంజారాత్మకునన్ను- మించి వాటిని ధృంచి వంచానబాపే సద్గురు ‼గురు‼2‼ దేహింద్రియా విషయ మోహపాశముగాల- ఆహంబులనుబాపె సోహంబు కవలీ సద్గురు ‼గురు‼3‼ తప్పువప్పులు అనె తిప్పాలెంచకదాయ- గుప్పిరక్షించెటి వప్పూలకుప్పా సద్గురు ‼గురు‼4‼ రాకపోకలు గాల రాపటంబులు బాప యేకచక్రధీశా యెవ్వారు సరినీకు సద్గురు ‼గురు‼5‼ ధరయందువెలివెర్తి ధాముడై శ్రీరామ - వరదూడె నిజమాని వర్ణింతు నిరతాము ‼గురు‼6‼

13.ఆదితాళం: రాగము

గురుభోధ బొందని నరులు మోక్షపదవికిని పరూలు-అరమరొందెటి మాయవాదులు ఆత్మకనహరులూ ‼ప‼ చదువులెల్లను చూడసద్గతి వరదుడె గురుడూ - చతురులందరు పరముకై గురుశృతము బొందిరీ ‼గురు‼1‼ మునులకును రుషియెతులకును బహుఘనులకెల్లాను మనుజ యోగుల మహిమకెల్లను ఘనుడెసద్గురుడూ ‼గురు‼2‼ నారదాది సనకస నందనాదులకూ మీరినా మదనారి దక్షణమూర్తియె గురుడూ ‼గురు‼3‼ కృష్ణునకు సాందీపగురు వోశిష్టరాము లకూ - విష్ణు బ్రహ్మ సురలకును వుత్కృష్ణుడె గురుడూ ‼గురు‼4‼ హరుడు తన గురుడల్లముడు అని అతివకును దెల్పె- హితులజేసెను యుద్ధవార్జున పతిజనార్ధనుడూ ‼గురు‼5‼ కులము శాస్త్రము కలిమి ప్రకృతుల గుణముచేతాను- కల్లగల హంకారమున గురుకానకున్నారు ‼గురు‼6‼ దాసదాస తద్దాసులకు గురుదాసవర్యులకూ - దాసుడగు రామదాసు మనవిది మోసదూరులకూ ‼గురు‼7‼

14.ఆదితాళం: రాగము:

గురుదేవా ననుబ్రోవవేరా-బ్రోవా-కావాలేవా-జాగు యింకేల ‼ప‼ అంగలింగాంగ ఆత్మా ప్రసంగా-భంగా-సంగా-విహంగ-శుభాంగా పుంగావ ‼గురు‼1‼ రాపుయేలరా భువన భూపాల- వోపా-ఆపా-దాపా ప్రాపూ నీవంటి ‼గురు‼2‼ యెవరులేరూ నీకన్నా వేరంటి-వింటి కంటి ఆంటి- ముక్కంటి సన్నూత ‼గురు‼3‼ దేవదేవాది దివ్యాదీకార-వీరా-శూరా-ధీరా పారాకు లేకాను ‼గురు‼4‼ బ్రాంతిమూలా మహమాయ నంతా-యెంతో వింతాకాంతా అంతామాయానె ‼గురు‼5‼ వందనాత్మ వెలివెర్తి మందీరా- అందా-బృందా- నందా ఆనందాత్మకార‼గురు‼6‼

15, ఏకతాళం: రాగము:

గురుచంద్రమా గుణసాంద్రమా !!ప!! కరుణామృతకర కలుషోద్భవహర - పరమశాంత వరపావననుత !!గురు!!1! దీనమందిరా దివ్య సుందరా- కాననదు:ఖభవార్ణవ సన్నుత మానిత శుభకర మంగళాత్మ !!గురు!!2!! సద్వేషణ-మృదుభాషణ సద్బోధామృత సజ్జన సేవిత-ఆద్వేషామయ అమితదయా !!గురు!!3!! సర్వేశ్వరా పరమేశ్వరా - పరమపురుష హరి ప్రకృతిహర - సర్వంతరాస్థిత సర్వమయా !!గురు!!4!! భువనేశ్వరా భవనాశకా - సవినయ సత్వద సన్మునిసన్నుత- అవ్యయరూపక అమితదయా!!గురు!!5!! ఫలదాయకా-గురునాయకా-సలలితహృదయాంబుది కరుణాకర-యిల వెలివెర్తిల వరదాతా!!గురుచంద్రమా!!6!!

16. ఆదితాళం: రాగము:

దేవా మహానుభావా గురుదేవా మహానుభావా - దేవదేవ నా భావము లోపల కావుమనుచు పదకమలము వేడితి !!ప!! సిద్దాసనమున స్థిరముగ నిల్పియు ముద్దుగ కరమును శిరమున జేర్చిన !!దేవ!!1!! ఫాలమునందున భస్మముబూసియు-కాలకర్మముల కడద్రోచిన !!గురు!!2!! మూడు దేహములు ముణుగుటకై తన-మూడు రేకలలో ముదమున వ్రాసిన !!దేవా!!2!! తను మనధనములు వినయంబుగగొని ఘనమగుబోధను అనువుగదెల్పిన !!దేవా!!3!! దీక్షాత్రయములు మోక్షపదంబుకు సాక్షిగదెల్పియు అక్షయమగునని !!దేవా!!4!! త్రివిధకర్మముల తీర్పునుజేసియు - భవరోగంబుల భంగము జేసిన !!దేవా!!5! శరణని అన్నను కరుణతో జూచియు- తిరమగు నచలము కరుణతో జూపిన !!దేవా!!6!! అభయం బొసగియు అదరకుమనుచును - శుభమగు ననుచును బయలులో నిల్పిన !!దేవా!!7!! భాసుర వెలివెర్తీశుడవనుచును - భూసురుడగు రామదాసును నేలిన !!దేవా!!8!!

17. ఆటతాళం: రాగము:

గురుణీ సేవించావె చిత్తామా-సాద్గురుణీపూజించియు వత్తామా గురుణీ దర్శించీ దుర్గుణమూలెల్లను బాయ- కరుణించి వేగామె వరమూ లొసంగూను !!ప!! ఆసాన శయనా నుష్టానం గురుడు వాసమయ్యిన దివ్యస్థానం- ఆరలేకా దాసులై ఆజ్ఞాకు లోబాడి- వాసిగా క్రియలన్ని వరుసాక్రామముజేసి !!గురు!!1!! అభ్యంగనాదూలతోనూ గురుణీ ఆనందమును జేయుచూను- ఆపాదమస్తాక పర్యంతరంబూను అందిసేవించూచు నిండారుభక్తిచే !!గురు!!2!! తల్లిదండ్రియు దాత దైవం - విద్యాధనమూ ప్రియుడు స్నేహితూడు - యుల్లామందున బంధువర్గామె తానాని- యెల్లాకోరిన వస్తువేమైనా యిచ్చూచు !!గురు!!3!! యేదికోరునో అదితెచ్చి యేభేదామొందగ ముందే యిచ్చీ - వాదుచేయక వారికోరికెలెల్లాను సాదారంబుగదీర్చి సంతోషమొనరించి !!గురు!!4!! మనుసూవాక్కును కాయములునూ మరియు మర్మాముంచక యేకాముగనూ ఘనులార యిటుజేయ కల్మాషంబులు బాయు- అనుమానమును జేయు నదియెనంకురమవునూ !!గురు!!5!! నాల్గువీధంబులా యిటులా సేవా మేలుగల్గును మనకూ చాలా వాలాయముగ బట్టబయలుండా జూపియు కీలు వెలివెర్తిలో కుదుర పరచజేయు !!గురుణీ!!6!!

18. ఏకతాళం: రాగము; ముఖారి

గురుదైవము సాటీలేరిఘ గురుదైవముసాటి !!ప!! గురుదైవములకు సరిలేరెవ్వరు ధరలో నైనను పరలోకంబున !!గురు!! తల్లిదండ్రులైనా తలపను యెల్లబందులైనా కారిక ముల్లోకంబున ముఖ్యాముఖ్యులు కొరగారెంతా ఘనులైయున్నను !!గురు!!1!! దేవుణికృపలేకా దేహికి తేటపడదు

మోక్షం రక్షం-దైవము సత్కృపతగులక సద్గురు సేవయు దొరకదు భావము నిలువదు !!గురు!!2!! దేశికుదయబూట్టె వరకును దేవుడు చేకొనునా జీవుల దేశికువలనుపదేశము జెందిన - దాసుల దైవము చేకొని బ్రోచును !!గురు!!3!! త్రిగుణాతీతుండూ తిర్గియు గురు రూపముదాల్చీ - భక్తుల-సుగుణుల జేసియు సగుణము బాపియు- అగుణము జూపియు అందులచేకొను !!గురు!!4!! దాసులలోపలనూ వరరామ దాసుకు దాపిలనూ ఆయను - దేశికు చరణము బాసుట లేకను దేవుణి లోపల తానైక్యంబగు !!గురు!!5!!

19. ఆదితాళం: రాగము: కల్యాణి

శ్రీగురునామాం తలుతాం తలుతాం-చింతాలన్నియు బాసి నిలుతాం నిలుతాం-బాగూగ మదిలోన బాయాకుండగ భక్తి -వేగామెసేవించి త్యాగామన్నియుసేసి !!ప!!1!! గురుమంత్ర మెమారకుందాం వుందాం-గురుపుత్రులామయ్యి యుందాం యుందాం-గురువాజ్ఞ మీరాక గురితోను నడచీతె గురురాహస్యబును గుట్టంతా బయలవును !!శ్రీ!!2!! నాలుకతో నామామందాం అందాం-నానారూచులుమాని యుందాం యుందాం-జాలిమాలిలేక కానిపల్కులుమాని పాలు మాలక గూరుపద్దాతి పల్కూచు !!శ్రీ!!3!! వీనూలనాదాము విందాం విందాం-వినుతి జేయుచు యెపుడు నుందాం నుందాం మానుగ శబ్దాము మరియేది వినకాను-పూనీప్రణవంబును నాదబ్రహ్మంబాని!!శ్రీ!!4!! కన్నూల రూపాంకందాం కందాం-ఘనబ్రహ్మమని పొగడుచుందాం చుందాం- మనమూతో విశ్వరూపము వేగకనకాను- అనయాము అచలమందానంద మొందూచు !!శ్రీ!!5!! పరనిందె నిందెలు పాతాం పాతాం- పరులా నిందెలుజేయ వెరుతాం వెరుతాం-దురభిమానంబులు దు:ఖాసుఖంబులు - నిరభిమానులమయ్యి నిత్యానందము తోను !!శ్రీగురు!!6! వరవైభవంబును పొందేం పొందేం - శిరివెలివెర్తిలో చెందెం చెందెం- పరమ పాదంబును స్థిరమైనా దనుచూను- వరరామ దాసుడు వర్ణించుచుండూను !!శ్రీగురు!!7!!

20.ఏకతాళం: రాగము:

శ్రీగురుచరణము చిత్తములోపల చింతన సేయర వరేవరే- జాగును లేకను నీలో గుణముల త్యాగము సేయర వరేవరే !!శ్రీ!!1!! పంచభూతముల చెంచలములబడి వంచన బొందకు వరేవరే యెంచరాని దివ్యంచిత ఆత్మేమంచిగనుండర వరేవరే !!శ్రీ!!2!! ధర్మాధర్మాము ఖర్మములనుకొని దలచియుండరా వరేవరే- మర్మముకని నిజ ధర్మము పూనియు నిర్మలమొందర వరేవరే !!శ్రీ!!3!! జ్ఞానభక్తివైరాగ్యంబులమది మానుగనిల్వర వరేవరే - జ్ఞానాజ్ఞానము మీరినవస్తువు ధ్యాన్నము శాయర వరేవరే !!శ్రీ!!4!! శ్రవణమననిధి ధ్యాసలయందు శ్రద్దనువుంచర వరేవరే - శమదమ వుపరతి శాంతిసమాధులు సల్పుచు నుండర వరేవరే !!శ్రీ!!5!! పెద్దలజూచిన ప్రేమతో మ్రొక్కియు ముద్దుగ నుండర వరేవరే - హద్దుమీరినా సుద్దులు బాశియు అట్టె నిలువరా వరేవరే !!శ్రీ!!6!! ఆత్మానాత్మల వీడికేవలా ఆత్మను తెల్సర వరేవరే- ఆదినాది అనాదుల కావలిభేదము తెల్సర వరేవరే !!శ్రీ!!7!! అన్నియు మానియు వున్నది దెలసియు నిన్ను నీవదులర వరేవరే- సన్నుతించకను రాకనువున్నా మన్నన తెల్సర వరేవరే !!శ్రీ!!8!! పూర్ణపూర్ణ సంపూర్ణమైన పరిపూర్ణంబెరుగర వరేవరే వర్ణమైన యెరుకార్ణవ మొదలియు నిర్ణయమెరుగర వరేవరే !!శ్రీ!!9!! యీధరలోపల వెలివెర్తందున యిదియు బల్కెరా వరేవరే - సాదరంబుగా సద్గురు వచనము ఆధారంబనె వరేవరే !!శ్రీ!!10!!

21.ఆదితాళం: రాగము:

భజియించావె మనుసా-భజియించావె మనసా భవహరు పదములు భజియించావె !!ప!! అగమసంచిత ప్రారబ్దములనెల్ల తొలగించె నిజగురుని భజియించావె !!భ!!1!! తాపత్రయా దు:ఖపాపమణంగును రాపు శాయక నిత్యంభజియించావె !!భ!!2!! దాతావ్రాసినవ్రాత భూతితో అటుగొట్టి బాధమాన్పినవాణ్ణి భజియించావె !!భ!!3!! సకల దేశకాల సర్వావస్తువులందు- వికసింప కను నీవు భజియించావె !!భ!!4!! యిహపార సుఖదు:ఖ యింద్రజాలాదుల అహములన్నియు బాసి భజియించావె !!భ!!5!! యెరుక మరుపులరెండు యెరిగె యెరుకను బాసి- పరమె నిర్భయలాని భజియించావె !!భ!!6!! బయలు నిర్భయలైన భావమెకలదీక- బయలందెలయమౌను భజియించావె !!భ!!7!! భారలింగేశుని భారమెకలదు - దుర్భయమేమి లేదాని భజియించావె !!భ!!8!! రామదాసుని యెపుడు రట్టాడిబెట్టాక - నేమామేమియు లేక భజియించావె !!భజియించావె మనుసా!!9!!

22.ఏకతాళం: రాగము:

భజనజేసెదను గురురాయ- నేభక్తి చెలంగగ ప్రభురాయా - భజన జేసెదను సుజన దాయకుడ- అజసురాదులు అమరిన శ్రీగురు !!ప!! విధియు దెల్పదూ గురురాయ- నామదియు నిల్పదూ ప్రభురాయ - సదనమందునను సాన్నిధ్యంబై పదిలముజేసుకొ అది నీదాయను !!భ!!1!! మనసు వాక్కునను గురురాయా మరిక్రియ భావము ప్రభురాయా - సన్నుతింపుచును విన్న వించుచును అన్నింద్రియములు అభిముఖి మొందియు !!భ!!2!! రాగతాళముల గురురాయ బహురమ్య నాదముల ప్రభురాయ - వేగగానమున వీణధరించియు భాగవతోత్తమ భవహరు నామము !!భ!!3!! సర్వభూతదయ గురురాయా అదిసంకటమున్నది ప్రభురాయా- సర్వభూతదయ పశ్చాత్తాపము నిర్వహింపుమిక నీవై నాయడ !!భ!!4!! అచంచలంబగు గురురాయా ఆదియు లభించిన ప్రభురాయ - వచింపరానీ అసమానంబగు విశదంబగుగద అచలసమాజము !!భ!!5!! నిరుపేదకుడను గురురాయా- నాకుదొరికితివీకద ప్రభురాయ- సరసుడ వెలివెర్తి విరసము బాపియు వరరామదాసుని వర్ణనాలించుమి !!భ!!6!!

23.ఆదితాళం: రాగము:

భజియింతమురండీ నిజగురుభక్తులార లెండి- భజియింతము గురుపావన చరితము - సుజనగణంబులు సొంపు వహింపగ !!ప!! గురుడే హరుడనుచూ శ్రీహరిస్మరణే ముఖ్యమనుచు పరోపకారం మిదంశరీరం బను వచనమె మనదేహతపస్సని !!భ!!1!! కులమదములుపూడ్చి ద్రవ్యాకలిమి మదములార్చి- కిలకిల నవ్వెటి కుంకలు జూడగ - కలకాలము మనకరువుదీరగను !!భ!!2!! ఆటలు ఆడుచును హరిగుణ పాటలుబాడుచునూ - సూటిగ మనగురు మేటిని మనలో పూటకు కనుగొనిమాటలచేతను !!భ!!3!! తాళమృదంగములూ తప్పక వీణెనాదములనూ కాళ్లకుగజ్జెలు ఘల్లని మ్రోయగ వాలలాడె హరిలీలలు సరెయని !!భ!!4!! యీ కలికాలమునా స్మరణాముక్త్యని శృతులనగా- లోకులమాటలు లోగొని వెరువక - ప్రాకటముగగురు పద్ధతెనిజమని !!భ!!5!! తాంబురమీటుచును చిరుతలు ఝుమ్మని వేయుచునూ - కుంభినిపై దిందిమ్మని ఆడుచు అంబర ప్రణవము ఝుమ్మని మ్రోయగ !!భ!!6!! ఇమ్మహిలోపలనూ వెలివెర్తీశుని దలచుచునూ స్వామికార్యమున హత:ప్రాణమని - నేమముగని శ్రీరామరామయని !!భజియింతము!!7!!

24.ఏకతాళం: రాగము:

భజరే భజరే గురునామం - భక్తితోదలచుమి హరినామం !!ప!! భజరే భజరే భక్తితో మనుసా సుజన గణంబున సుస్తిరస్థితిచే !!భ!!1!! స్మరణకీర్తనము కరుణగల్గుటకు - స్ఫురణగల్గ విస్ఫురణ మాన్పుయిక !!భ!!2!! ధ్యాన్నధారణము మానుగజేయను - తానెసమాధికి కారణమగుటకు !!భ!!3!! యోగులకైనను భోగులకైనను - త్యాగుల కైనను బాగనుతించెటి !!భ!!4!! యెంతవారు రవ్వంత తెల్యకను చింతలనొందుట అంతయు బాపెటి !!భ!!5!! సంశయంబులను ధ్వంసము చేసును- హంసను దెలసియు సంకట మొదులను !!భ!!6!! యిలలో వెలివెర్తందున దలచుచు ఫలమును గోరక కలకాలంబను !!భజరే భజరే!!

25.ఏకతాళం -శుద్దకాంభోజిరాగం

భజియించెద నిను భక్తిమీర నాభవములోదులరామా- శ్రీ- అజరుద్రాదుల కందనివాడవు ఆదిమూర్తిరామా !!ప!! దీనులలోబల్ దీనుడ నేనిక దివ్యపురుషరామా- శ్రీ-దానవ సంహారదాస జనార్చిత దయజూడుమి రామా !!భ!!1!! మొరబెట్టిదనే మొదలెలేదని మోదముతోరామా -శ్రీ- అరమర లేకను పరబయలుకు నన్నర్పించుమి రామా !!భ!!2!! దబ్బర యెరుకనె మబ్బును బాపియు దరిజేర్చుమి రామా-శ్రీ-నిబ్బరంబుగను నిజమచలంబె నిశ్చయింపురామా !!భ!!3!! నిజములోనే నేనీచ పదార్థము సుజన వరదరామా -శ్రీ-దుర్జనితంబగు నేననె యెరుకనె పుట్టిముంచురామా !!భ!!4!! యిలలో వెలివెర్తీశ బారెశయిందిరేశరామా-శ్రీ- ఫలములోసంగియు రామదాసుని పరము జేర్చు రామా !!భజి!!6!!

26.ఏకతాళం: రాగము:

పాహి గురురాయా మాంపాహి గురురాయ -పాహిగురురాయ మాంపాహి గురురాయ !!ప!! మూర్తులాకవలి గురుమూర్తి సంపూర్తివని-ఆర్తిబొందితి అభయమిడవె గురు రాయ !!పా!!1!! పుట్టుచును గిట్టుచును దిట్టముగ నుండుటకు - పట్టేమిలేదు చేపట్టు గురురాయ !!పా!!2!! జీవుడని దేవుడని భావించెవాడనని - పోవజూడకు పొడచూడు గురురాయ !!పా!!3!! కారాణాకార్య కర్తృత్వములు గలదాన్ని - కరుణతో బోదోలికావు గురురాయ !!పా!!4!! అంగలింగము రొండు భంగబుజేసి - నాసంగంబుబాపు మునిపుంగ గురురాయ !!పా!!5!! ప్రకృతిపురుషద్వయం ప్రబలమై నీలోన - వికృతినొందెటిది వినికనవు గురురాయ !!పా!!6!! రజ్జుసర్పభ్రాంతి వతుగా నుండె యెరుక ముజ్జంగంబులతోడ మణుగు గురురాయ !!పా!!7!! అండపిండాండ బ్రహ్మాండభాండములు - నీ అండలేనివెలేక నుండు గురురాయ !!పా!!8!! రామదాసుడు నిను పూనినిత్యము యెపుడు- తానేమి లేక పోనాయ గురురాయ !!పాహి!!9!!

27.ఏకతాళం: రాగము::

జెయజెయగురవె - జయసద్గురవే -జయ జయయనినే జయంబుగొని నినుభజించుటకు యిదిజనించనాయను !!జెయ!! పరాకుశాయక బిరానవచ్చియు- కరంబుచాతను దురంబుబాపిన !!జెయ!!1!! యురంబుపై నీకరంబు మోపియు - స్థిరంబుయగు నిజపరంబు జూపిన !!జెయ!!2!! భవాంతక నాభవంబులన్నియు - నివారణించే నిజాపరాత్పర !!జె!!3!! నిరంతరము నీనిజంబె గతియని - స్మరించువాడను హరింపుమాయను !!జెయ!!4!! క్షరంబుపై అక్షరంబుకావలి పరుండు వేరని స్థిరంబుజేసిన !!జెయ!!5!! ధరందువెలివెర్తి పురందునిత్యము - పరంబెబయలని గుర్చందజేసిన !!జెయజెయ!!6!!

28.జంపెతాళం: రాగము::

భారలింగప్రభోభారలింగప్రభో- భారలింగా పరాదేవలింగప్రభో !!ప!! సారంబులేని సంసార సాగరముకు - వారధేశినయట్టి వసుధలింగ ప్రభో !!భార!!1!! దేహంబు తెరువిడచి దేహి మాత్రము గాక - అహముకు మీరితివి దేహిలింగప్రభో !!భార!!2!! అంటిఅంటక మాయగెంటి ఆరుటిపైన - వంటిగనున్న ముక్కంటిలింగప్రభో !!భార!!3!! ఆత్మనాత్మలకు పరమాత్మవయ్యిన - కేవలాత్మవే నీవైన అమితలింగప్రభో !!భార!!4!! సారవిహీన భావార్ణవంబును బాపి - భారముంచిన భక్తత్రాణలింగప్రభో !!భార!!5!! యెన్నిబోధలుగన్న అన్ని బోధలుసున్న - యెన్నరాదీబోధ యచలలింగప్రభో !!భార!!6!! బయలునిర్బయలైన బయలందు లయమయ్యి - నయమైన బ్రహ్మమైనావు లింగప్రభో !!భార!!7!! అండపిండాండబ్రహ్మాండ భాండంబులో - నిండియుండిన బయలు దండిలింగ ప్రభో !!భార!!8!! కరుణతోవెలివెర్తి వరరామ దాసును - మరువక బ్రోచేటి మహిమ లింగప్రభో !!భార!!9!!

29.ఏకతాళం: రాగము:

భారలింగమహరాజ గురుజై భావలింగమహరాజ గురుజై-భారలింగమని భావము లోపల భారమునీదని భక్తితోనమ్మితి !!భా!!ప!! కాశిలింగమహరాజ గురుజై - కాలహరణ మహరాజ గురుజై - కాలకర్మముల బాధమాన్పినీ లోనజేర్చు కరుణాలవాలగురు !!భార!!1!! సేతులింగ మహరాజ గురుజై భీతిహరణమహరాజగురుజై - దాతవయ్యి విఖ్యాతితోడ విధివ్రాతబాపి ప్రఖ్యాతి గాంచితివి !!భార!!2!! హంపిలింగమహరాజగురుజై - ఆత్మలింగమహరాజగురుజై -కంపమొందుటలు ద్రుంపివేసి నన్నంపుమి బోధాపంపున నిజముగ !!భా3!! పూర్ణలింగమహరాజగురుజై పూర్వలింగమహరాజ గురుజై - నిర్ణయమెరుగ దయార్ణవమూర్తని -వర్ణించెను యిటువరరామదాసుడు !!భారలింగ!!

30.ఆదితాళం: రాగము:

యీసామాయామూనా బ్రోవు దేశికాకరుణాపాతే!!ప!! మోసమేమీలేకా సర్వమోహజాలము లణచావే !!యీ!!1!! కావూకావూ మనుచూ నిన్నుకోరీయున్నావాడారా - కావరామది వ్యాధీబాపి కామాసంహరధీవారా !!యీ!!2!! వ్యాపాకామయ్యున్నా మాయా మమతాలన్నీ బాపరా - కోపాతాపా మూలాననచీ దయతో నేలూజగధీరా !!యీ!!3!! దోషామూలన్నీయుబాపీ యీషాణములా నణచారా దాసూనీక్లేశామూలన్నీ తీశీయేలూ సురధీరా !!యీ!!4!! పరసతులా పరగతులా పొందూబాధా మాన్పీ బ్రోవారా - పరధానాపర లోకాహానికి పడనియకూ సుగుణాకారా !!యీ!!5!! వెతలూ జెందా నాకూయాలా కథలూదీర్చీ బ్రోవారా - మతమూమితమూ గతమూజేసీ- సుతునీ అట్టెకావారా !!యీ!!6!! తనువూ మనసూ ధనము నీకూనాడె చెందియుండెరా - వినుతీ జేయూచుండీనీలో ప్రణుతీ జేయుచున్నారా !!యీ!!7!! మొరనూ బెట్టాకానూవుంటె మోహమొరలోజేరురా - మరులూ జెందాకానూ బోధా మర్గుదెలసూకున్నారా !!యీ!!8!! భారలింగా దేశికేంద్రా బోధామదికీ నాటెరా శూరామగు యీయెరుకానెపుడూ సృక్కాజెసికావరా !!యీ!!9!! వాశీగానూ వెలివెర్తిలా దాసూలా రాక్షించరా - దాసాదాసూడైనా రామాదాసూనాధారించారా !!యీసా!!10!!

31.ఆదితాళం: రాగము:

హరహరమహదేవా-గురువే మమ్ముమరువాక బ్రోవుసాద్గురవే హరహరమహదేవా ఆత్మ స్వరూపాక-నిరతాము మీనామస్మరణా యెమారాము!!ప!!1!! దీనూలబ్రోచితివిగురవే మీ దివ్వాము చాతసాద్గురవే-మానాసమూన మీ నేమామేమారాక పూనీధ్యాన్నించూచు పామారమూలు

బాపి ॥హ॥2॥ అష్టామాదంబులబాపీ వేగా కష్టాముబాపెదిజూపీ- దుష్టాఖర్మంబులా దూరాము జేసియు - స్పష్టాముగాను యోగానిష్టాదెల్పినవాడా ॥హ॥3॥ దేహములోపాలవేగా - బ్రహ్మాందెల్పితీవి మాకుచాలా - అహంభావంబులూఅన్నిఅణంచియు - సోహంభావంబుకూ సోద్యామైమీరిన ॥హ॥4॥ మక్కువా మనసు లోపలనూ - మాగురుడు వుండేటిస్థానమిలనూ - ఘ్రక్కూన వెలివెర్తి నిక్కామౌ భక్తుల - పెక్కుయఘంబులా నృక్కాజేసినవాడా ॥హ॥5॥

32.అటతాళం: రాగము:

భరియింపానయ్యా సద్గురుదేవా- తరియింపావయ్యా భరియించానయ్యా యీభవ సాగారంబాగు-మరియింద్రియాదేహమాయా అవస్తాలు శెరణుజేసెదచేతబట్టియు దురము లన్నియు ధ్వంచివేసియు - తరుణోపాయము జేయనీవె దొరలు యెవ్వరు భువిలో నీవలె ॥భరి॥1॥ వశమూగాదయ్యా గుణగణామూలు వదులావోయయ్యా వశముగాని వెన్నో వసుధాలో ఆశించి రశికత్వమును మరచి రందిలో జేరితి ఆశపాశము లణగజేసియు నాశరహితంబిదియు నిల్పియు మోసములు గాశిలనుజేయను భాసమానుడవీవెకాని ॥భరి॥2॥ మేలొందీతయ్యా నీకీల్దెలియాలీలా బాసెయ్యా - ఫాలాభాగములోన పరమాత్మా రూపామై - చాలాగవెలుగొందె సకలాధిపతివయ్యి- మేలుగను వెలివెర్తి యందున పాలబడెనీభక్తుడొక్కడు - యేలువాడవు నీవెకాని వేరులేదు దయాలవాలా ॥భ॥3॥

33.ఏకతాళం: రాగము:

దండంబిదెగురునాధ అఖండసంపూర్ణసనాధ॥ప॥ దండంబిడెదను నిండుకరుణతో ఖండగుణంబుల చండుమునాయెడ ॥ద॥1॥ అండపిండబ్రహ్మాండ సర్వాండమండలాఖండ దండిగ సర్వదిశలందునిబిడమై - నిండుబయలునై నుండునాత్మను ॥ద॥2॥ చతుర్ధశా భువనేశా దశ చతురీంద్రియపురవాసా - చతురత్వమునను చక్రాయుధుడగు - సతతానందుని సన్నుతిజేసెద ॥ద॥3॥ సరససాహస్ర విహరషడ్చక్రకమల సంచార - సచరాచర నిర్వచనాస్పదమయ - సకలాత్మవర నిఖిలచరాత్మక ॥ద॥4॥ నామరూపసాకార ఆనామ రూప ఆకార - నామరూప అనామరూప మిధ్యాపవాద యఘతాప దవానల ॥ద॥5॥ జన్మమరణసాగరాము తరియించుటకై జ్ఞానధనమూ జ్ఞానాంజనమున గ్ణేయము కన్గోన - జ్ఞానా గ్ఞానము సూన్యంబగుటకు ॥ద॥6॥ వసుమతి వెలివెర్తీశ నినువర్ణించెద జగధీశా - విశదముతోడుత వినుతులొనర్చెద - పశుపతి సన్నుత పాపవిమోచన ॥దండంబిదె॥7॥

34.ఏకతాళం: రాగము::

మందుబెట్టినాడెగురుడూ విందుజేసినాడె ॥ప॥ మందుబెట్టినాడు రందిరోగముకు కుందుచు నుండె కుటిలబుద్దులకు ॥మ॥1॥ పంచదశామృతమూ స్వప్నసంచితాది హరణం - వంచించును కలలోచ్చిన తనువుల- యెంచరానివవి యేమిలేనివని ॥మ॥2॥ గుర్తుయెరిగె రోగంబాపను షర్తు జేశినాడె-పూర్తిషోడశిమాత్రలవుషదము - ఆర్తితోదిన్నను అంతవుళక్కనె ॥మ॥3॥ వున్నదాని యెందూ లేనిది వన్నెబాపుటకునూ - ధన్యతనొందిన ద్వాదశరసమును తిన్నగగ్రోలను తీర్పుజేసునని ॥మ॥4॥ నిముషములోపనూ నిజమును తెల్పిచూపినాడూ - సంశయ యెరుకను ధ్వంసం బగుటకు- అనిముషశిష్మాంబజమచలంబని ॥మ॥5॥ బయలు బ్రహ్మమనుచూ నిజమును బయలు జేసినాడూ నయము ఆయెనిక నమలమొందుటకు - భయములేక రామభక్తుని బిలచియు ॥మందు॥6॥

35.ఏకతాళం: రాగము:

గురుమంత్రంబులు గురిగజపించిన - గూఢమయ్యున్నది జీవా - నీకు వెడుకయ్యున్నది జీవా ‼గు‼1‼ యేకాక్షరమును యెంతజపించిన అంతయుశిద్ధియుజీవా - కర్మంతయు రాద్దగు జీవా ‼గు‼2‼ హంసాక్షరముల అంతరమందున అర్పణజేయుమి జీవా - నీహింసలు బాసునుజీవా ‼గు‼3‼ మూడాక్షరముల కూడిజపించిన ముక్తుండవవుదువుజీవా - జీవన్ ముక్తుండగుదువుజీవా ‼గు‼4‼ చెతురాక్షరముల చెలగిపలించిన చెందవుజన్మము జీవా ముందూ పొందవుజన్మముజీవా ‼గు‼5‼ పంచాక్షరముల పరగపలించిన సంచితమొదులును - జీవా మాయావంచన బాయునుజీవా ‼గు‼6‼ ఆరాక్షరముల అమరిజపించిన కారణమొదులును జీవా - మాయా మారణమొందును జీవా ‼గు‼7‼ సప్తాక్షరముల గ్లప్తితో నుంచిన గుప్తము తెలయునుజీవా - పరగుప్తము తెలయునుజీవా ‼గు‼8‼ అష్టాక్షరి జపమోర్పుతో జేసిన కష్టము బాయునుజీవా - పరానిష్టయు నిలుచునుజీవా ‼గు‼9‼ పది అక్షరములు ప్రస్తుతిజేశిన పారగదోలును జీవా - ప్రారుబ్దకర్మములుజీవా ‼గు‼10‼ ద్వాదశాక్షరీ మంత్రము దరచిన యేదియు లేదికజీవా - భయామేమియు లేదికజీవా ‼గు‼11‼ పంచదశాక్షరీ పరిశీలించిన పంచమ మొదులురజీవా -కలలొఛ్చిన తనువులజీవా ‼గు‼12‼ షోడశాక్షరీ వేడుకదెలిశిన- వీడును సర్వము జీవా - యెరుకొదిలియు పోవునుజీవా ‼గు‼13‼ సప్తకోటి మహామంత్రంబులు అవి సారము లేనివి జీవా - భవసాగరమీడదుజీవా ‼గు‼14‼ యిలవెలివెర్తిల వరరామదాసుడు యిటులబల్కెరా జీవా - కలయిడుపించుటకై జీవా ‼గురు‼15‼

36.జంపెతాళం: రాగము: సౌరాష్ట్ర

పోదాము పదర వోరన్నా -ప్రొద్దుబోతుంది గురుజేరి సేవింతమన్నా ‼ప‼ ఆధారమునకేగవన్నా ఆది గణపతిని అర్చించి అటుజూడవన్నా - చతురదళబీజములొయన్నా - అందు ఆరూర్ల ఆజపంబు అర్పించవన్నా ‼పో‼1‼ స్వాదిష్టకమలమునజేరి -అందు ఆదిబ్రహ్మనుపొంది అచటసేవించీ షడు బీజదళములనుగాంచి - అందు షడుసహస్రంబుల జపముగావించీ ‼పో‼2‼ ఘనమణీ పూరకము కేగీ - అందు ఘనమైన విష్ణువునుగాంచి వినుతించీ - దశదళా బీజలులనెంచీ అందు ఆర్వేల హంసలు అంటిగణుతించి ‼పో‼3‼ అనహతపురముకేతెంచి ఆదిరుద్రునిపూజించి అచట నివ సించీ - ద్వాదశ దళములనుగాంచి అందుఆర్వేలహంసలు హరునీకర్పించీ ‼పో‼4‼ శుద్దచక్రము నందునిలచీ ఆశిద్ద మాహేశ్వరునివద్ద కరుదెంచీ - పదియారు దళములగాంచీ అందు పదినూర్ల మంత్రంబు పరగవినుతించీ ‼పో‼5‼ ఆజ్ఞేయలోకమున కరిగీ అందు ఆదిసదాశివుని అర్చించి వెలసి ద్విదళబీజంబులా పొంచీ - అందుయేకసాహస్రమూలంబు గావించీ ‼పో‼6‼ సహస్రార మందునాకెగసీ - అందుసద్గురునిదర్శించి వినుతించికొలచీ - సాహస్రదళములో అలశీ అందు సాహస్రహంసలను స్మరియించికలసీ ‼పో‼7‼ భారలింగేశుని దలచీ బట్టబయలు నిర్బయ లైన బయలుతాగాంచీ- పరగపదిరొండుభావించీ యీధరలోన వెలివెర్తిపురమందు నిలచీ ‼పో ‼8‼

37. ఆటతాళం: రాగము: మధ్యమావతి

పోవెవోమనుసా -సద్గురుణిందు -త్యావెవోమనుసా -పోవెసద్గురు కడకు నీవిక ప్రొద్దు బోవును వేగమున యిక - తామసించకు క్షణములో మనకేమి గల్గునో తెల్యదాయను ‼పో‼ మొక్కితిననవే -మొదలేతనకూ దక్కితిగాదె -మ్రొక్కుమ్రొక్కుకు నీదు కృపగొని మోహజాలంబెల్ల

వదలియు -నిక్కముగ నీనిజమె గతియని - సాక్కియున్నాడనుచు తెల్పను !!పో!!1!! తాళాగ లేనె తనుమనధనములు వానీవిలేవె - తాళలేనిక తనదుమేల్‌గని తలచినప్పుడు గుండె ఝల్లనె వ్యాళ్ళమీరేను మోహమొదలీ వ్యాళ్ళద్యావె జాగుశాయక !!పో!!2!! వింతాలుయాలె దాసునితోడ పంతాముపలదె - అంత తనదై అంతతానై చెంతజేరక నున్నడాతని - చింతలెల్లను బాశి నీపద పంకజంబులె నమ్మినాడను !!పో!!3!! మరువాగలేనె తనకనుసొర్గ మరుపెందురాదే - మరువలేనిక తనదు సూత్రము మరచియుండదునే మొఘప్పుడు - తెరుపుమరుపుల యెరుకననచే భారమె తనదాయ నిజముగ !!పో!!4!! కారాణగురుడే - కర్మములన్ని ఖండించినాడె - కార్యకారణక్రియలు గలబహు కలుషములకడద్రోచి నిరతము- పూర్వఖర్మములణచి నిరతము రామదాసుని కీడుబాపెను !!పోవె!5!!

38. ఆటతాళం: రాగము:

పోవేసాద్గురునికడకు ప్రొద్దుబాయేనూ -మనసా !!పో!! పోవేసాద్గురుని కడకూ ప్రోద్దంత బోవనాయ- సేవజేసితె గురుడూ చేపాట్టునంతవరకూ !!పో!! వుదయాస్తమయములాను వుగ్రమూతోడా వధీయించి కొనగసాగెను వసుధకాలామూ మనసా !!పో!!1!! యిరువాదివక్కవెయ్యి ఆరునూరులూ మనసా -బరువాడి హంస తరుగగ పాయనాయూవు మనసా !!పో!!2!! నమ్మిని దూరాబోతె నట్టేట ముంచూ మనసా -పోమ్మీకా ప్రొద్దుబుచ్చకనమ్మకముతోనూ మనసా !!పో!!3!! పూట్టీనావన్ని భువిలో గిట్టుసిద్ధామూ మనసా - పాట్టూగవుండబోము పదవె పోదామూ మనసా !!పో!!4!! వెలివెర్తిలోపలాను వేగిరముతోను మనసా -సలలీతమూగా గురుణీ చరణములాకడకూ మనసా !!పో!!5!!

39. ఆటతాళం: రాగము:

మనసాసద్గురుణిందు త్యాగదే నామనవి వానితో తెల్పిరాగదె !!ప!! మనసా సద్గురుణిందు మరివేగా దెఛ్చితె - అనిశాము భ్రమదొలగా చేయునే మానహింసలెల్లను బారదోలునె పోవె !!మనసా!! పంతాముపలదానిపల్కవే - పరమాశాంతామె తనదయ్యి చిల్కెనే - వింతాల మాయాను అంతా మాయముజేశి - యెంతోసంతోషముజేశెనే చూడా అంతాతానె తానైనాడటె పోవె !!మన!! చూపురూపులు మాయాలాయెనే - చూచెరూపామె సాక్షితానాయెనె - చూపురూపులుగాల రాపు వదలుమాని చేపట్టిచైతట్టి చూపెనె - యెంతో రాపటంబుల యెరుకబాపెనె పోవె !!మ!!2!! కలలోన కరిగన్నట్లాయెనె జగము కలువరింతల పలుకులాయెనె - యిలలోనగల విద్యలలయాక కనుగొన్న - తిలకింప వఘటి లేదాయెనె తానపలుకె నిత్యము నీజమాయెనె పోవె !!మ!!3!! నేనైతే మొదలె లేదాయెనె మనసా నీవైతె పోనెపోనాయెనే - నేను మేను మనుసు లేకపోయినవెనుక తానైతెజాడాలేదాయెనే ముందు-పూనివున్నది నిజమాయెనె పోవె !!మ!!4!! యిమ్మాహివెలివెర్తి యీశుడేయెంతో సమ్మాతించియు మనలబ్రోచెనె - కొమ్మారో మనఖర్మ ధర్మములనుబాపీ యిమ్మయిన పదవేదొచూపెనె - పరమునమ్మాగ నిజమె బయలాయెనే పోవె !!మనసా!!5!!

40. ఆదితాళం: రాగము:

రారారారాగురువర రవ్వాశాయకు దివ్వాశుభకర !!ప!! ఆదినాదికినీవు అనాదివి నిజ పరదారివి నిరుపమ !!రా!!1!! పారవారవిహర - ఘోరభవార్ణవదూర విచారిటు !!రా!!2!! ధీరాగుణ గంభీర - శూరపరాత్పర సారవిదేయిటు !!రా!!3!! దాసహృదయవిలాస -దేశికముని గణ వాసవ సన్నుత !!రా!!4!! యిందూనందున పొందియు - యెందున జూచిన సందును లేకను !!రా!!5!!

నమ్మీ నానుమనంబున - యిమ్మహిలోపల సమ్మతితోయిటు !!రా!!6!! యేలీనీకృపసాటిల- రారు సురాసురరాజుల మేటిటు !!రా!!7!! యీశా వెలివెర్తీపుర - వాసనిరాశ సురేశ నిరామయ !!రా!!8!! రామాదాసునివేశ - దామసుధారస నామప్రకాశిటు !!రారా!!9!!

41. ఆటతాళం: రాగము:

మానాసాగురునెడబాయకమ్మా - మమతలోబడి పొరలాకెకొమ్మా !!ప!! సారామూలేనీ సంసారం - సరసామొదలీ విరసముమానియుండూ !!మా!!1!! బంధులూ నావారాని యనకూ అంధకారాబంధములోన బడకూ !!మా!!2!! యింద్రియా విషయములన్నిబాయు ముందెయిహపార సౌఖ్యములారోయియూ !!మా!!3!! సత్యామే అచలంబాని తెలయూ - వుత్తాదిజగమాయానివదలూ !!మా!!4!! తామసారాజాసాత్వములపై -ప్రేమలేకానీవేమీ లేకుండూ !!మా!!5!! నాలుగూ మహ వాక్యాములనూ - కీలుదెలసీనీవేమీ లేకుండూ !!మా!!6!! మూలమూలేని శెరీరం - జ్యాలామొదలీ నేనేమీ లేదనుమీ !!మా!!7!! బయలూలో నిర్భయలైనీవుండు - భావమంతాను బయలయ్యేయుండూ !!మా!!8!! భక్తితో బారేశునేమరకూ - యుక్తి రక్తీశెక్తియు మీరీయుండూ !!మా!!9!! ధారుణీ వెలివెర్తీ పురమందూ - రామదాసు జెప్పిన మాటనమ్మూ !!మా!!10!!

42. ఆదితాళం: రాగము:

యెంతనిచెప్పుదు కాంతుని మహిమలు - యింతిరోయిఘనేను మంతనమున గురి నిల్పెవారికి- అంతాతాననెను !!ప!! మూలములేనిది తోలుశరీరము వాంఛలుడ్గుమనెనూ - వీలులేని గురుమేలుచాత పరమూలము కనుమనెను !!యె!!1!! ఆకార ఊకార మకారములను మొదటికె విడుమనెనూ - ఆకారరహితమై సందులేని ఆఅచలమె కనుమనెనూ !!యె!!2!! పుట్టుచు గిట్టుచు మరలుచు నుండె యెరుకను విడుమనెనూ - పుట్టుట గీట్టుట మరలుటలేని అచలము కను మనెనూ !!యె!!3!! యిరుగుచు అరుగుచు తరిగెటీ దానిని కడకు జిమ్ముమనెనూ - యిరుగుట అరుగుట తరుగుటలేని అచలము కనుమనెనూ !!యె!!4!! కన్నదివిన్నది అన్నదిసకలము సున్న జెయ్యుమనెనూ - కనుగొన శక్యముగాకను వుండే అచలము కనుమనెనూ !!యె!!5!! ఆకాశాది భూతాలైదిటి జోకవదులుమనెనూ - ఆకాశంబున కతీతమయ్యిన అచలము కనుమనెనూ !!యె!!6!! మాయపాశమును కాలునిపదవిది మళ్ళీచూడకనెనూ - మాయనువీడియు గురుణి స్మరించియు మమతలుడ్గుమనెనూ !!యె!!7!! ఆదిఅంత్యములులేని కేవలా ఆత్మనుకనుమనెనూ - ఆది అంత్యములు గల యెరుకను యికపాదులేపుమనెనూ !!యె!!8!! ధరలో వెలివెర్తిల నివసించిన దాసుల బ్రోతనెనూ - భారదేశికుని నమ్మిన భక్తుల భవము లొదిలెననెనూ !!యెంతని!!6!!

43. జంపెతాళం: రాగము:

యేకోనారాయణునినమ్మూ మనస యేకముగ జెసునిన్గనుమూ యేకోనారాయణుని యేకముగ నమ్మితె - యెకామ్మమును -లేదు యేజన్మమును లేదు !!యే!!1!! యితర సంగము గోరబోకూ మనుస యిహపారాదుల గోరబోకూ - యితరభామల జూచి వికలించి నవ్వాకూ సతతంబు గురువాక్యస్మరణయెమారకూ !!యే!!2!! నాడులందున ప్రాణమాడూ మనుస నమ్మి నీవును వేగముననూ - యీడుజోడునులేక వాడవాడలయెందు - నాడిసోహంబానుచుండు జీవులయెందు !!యే!!3!! గురువాక్యములు వేగనమ్మూ మనుస గూడార్ధమును దెలసువినుమూ గురుగోప్యములు వేగ గురుతుగానమ్మితె - పరితాపమును భస్వపటలంబు గావించు !!యే!!4!! ద్వాదశాక్షరివేగనమ్మూ మనుస దారిదెలసును వేగనమ్మూ - ఆదిఅనాదులకును ఆది రూపముగనీ

మీరిసౌఖ్యములన్ని దూరియుండవె మనుసా !!యే!!5!! భారసద్గురు బోధనమ్మా మనస బాధ లన్నియుబాసు వినుమీ-శ్రీగురుని వెలివెర్తి శిష్యమందిరమున రామదాసుండు గనిపూని చెప్పెను నీవు !!యేకో!!6!!

44. ఏకతాళం: రాగము:

అదుగోసద్గురురాయుడు అల్లదుగో అదుగో అదుగో మదిపదిలముజేసుక కదలకచూచిన కనుపాపలపై అదూగో !!ప!! మేటీసద్గుణములకును బహుసూటీ - వాటముగను నడినాడికవాటము సూటులనున్నా సుందర విగ్రహుడదూగో !!అ!!1!! మించి సర్వంబునకును తామంచీ -అంచిత సర్వసమంచితుడై యేవంచనలేకను చంచలహరుడల్లదిగో !!అ!!2!! యేరిసద్గురు సాటిల మనకేరీ లేరుజగత్రయ శూరులకెల్లను - మీరిననిజగురుజేరికలిశె స్థలమదూగో !!అ!!3!! రాజారాజాది యోగ మహరాజా - పూజితుడగు పరిపూర్ణుడు అంతట - రాజిగనున్నడు వోజతోకను డల్లదూగో !!అ!!4!! వింటీ మద్గురుకృపచే మేల్గంటి - వంటరిగను తానంటక వెంటనే - తంటల యెరుకను అంటుబాపు అల్లదూగో !!అ!!5!! శరాణా గురుచరణములకు అనుదినాము - ధరవెలివెర్తిల సరగున గురిగన - స్థిరముగవెలగేటి పరమ స్వరూపంబదూగో !!అ!!6!! దాసూ సద్గురుతరులలో రామదాసూ మోసములన్నియు గాశిలజేసెటి - వాసవనుత ప్రఖ్యాతీయెతీశుండదూగో !!అదూగో!!7!!

45. ఆదితాళం: రాగము: రేగుప్తి

వోచ్చెగురురాయుణి చూడారమ్మా వోయమ్మలార వోచ్చే గురురాయుణి చూడారమ్మా !!ప!! వొచ్చెచూడుడిక వైభవంబుతో - సచ్చరిత్రుడు సాధురక్షకుడు !!వో!!1!! అందామౌమేను రథమూ నకూను - దశయింద్రీయములనె సుందారాశ్వములను మనముతోనూ - బుద్దిసారధై బుద్దికి సాక్షగు- సుద్ధిమీరి పరిశుద్ధాత్ముండై !!వో!!2!! చూపురూపులకే రాకాడమ్మా- చూపులేకుంటే రూప మెక్కాడగలదోయమ్మా- చూపురూపులకు శూన్యబీజమై - పాపలోగలదాన్ని పరములో గలుపను !!వో!!3!! పరమాభక్తులు పరివారింపా పరతత్వారహస్య పరమార్థామును తను బోధింపా - పరిపూర్ణా చలమె పరమపదంబని- గురిగనెవారికి మరుగుదెలపుటకు !!వో!!4!! దేహిదేహములు గాడోయమ్మా వీదేహితానై తేజారిల్లుచునున్నాడమ్మ - దేహిదేహవీదేహము కావలి - మోహరహితుడై మాయను బాపను !!వో!!5!! భారామయ్యాన గురుడోయమ్మా వరరామదాసుకు స్థిరమైన పదవీజూపెనమ్మా ధరలోగల దుస్తరభ్రమలన్నియు - మురయుచు మదిలో మరువకొదులుమని !!వోచ్చె!!6!!

46. ఆదితాళం: రాగము:

చూడరేగురునీ వేడరే చిత్తామశివుడని-చూడరేగురునీ వేడరే !!ప!! చూడరే చూడ్కూలనిండ చూపు మనసు వఘటిజేసి - యాడుజోడుగాని ప్రథమా దేవూడానుకొని పూనీ !!చూ!!1!! ధీరుడే గుణగంభీరుడే - దేదీప్యమాన్యుడు శూరుడేశుభకరతేజుడే - ధారుణిస్వారూపుడై ఆధారమై ఆడించు దానిని - పారమార్థిక చింతచేతను బేరమాడియు కారణాగురు !!చూ!!2!! ఆడరే పాటలుపాడరే హరిహరరూపుణి కూడరేభారంబిడరే - వాడవాడలయాడజూచిన వాసమయ్యెన వాసుదేవుడు జోడులేకనున్న నిర్మల జాడగని మీరోడకనుగురి !!చూ!!3!! అందరే హరిపదమొందరే అంతాట గలదని పొందరే ముక్తి నొందరే - అందరేమీలోనయున్న ఆత్మతత్వము తిరిగిచూచి - అందమైనా కేవలాత్మను అందిజీవన్ముక్తులైగురి !!చూ!!4!! యీశుడే సర్వాధీశుడే యిలలోన వెలివెర్తీశుడే ఘనసర్వేశడే - వాసవాసూలాకూనూ వర్ణింపరాకనున్న వరుని - దాసదాసూడైన రామదాసు హృదయము నందు చేకొని !!చూడరే!!5!!

47. ఆదితాళం: రాగము:

రాజైయున్నాడే మనగురుమూర్తి-రాజైయున్నాడే - రాజైయున్నాడమ్మా రాజారాజులకెల్లా - రాజయోగమునందు తేజామొందినమంచి ‼ప‼ అధినాధుండే హరిహరులాకాధార భూతుండే అది మధ్యాంతముల అప్రామేయుండయ్యి - నాదుబిందుకాళ నాటాకమావాల ‼రా‼1‼ దేవాదేవుండే దేవేంద్రాది సేవామానుండె- దేవాదేవుండెంతో దేదీప్యమానుడు- కేవాలముగ సర్వాధార పీఠంబున ‼రా‼2‼ గురువైయున్నాడే గురువులకంతా పరమ్మై యున్నాడే - గురుడైయున్నాడఖిలా జగమూ కాచార్యుడై - గుణమూ నిర్గుణమయ్యి గురిగన్నాఅంతాట ‼రా‼3‼ సాధూవైనాడే సజ్జనులాకు బోధూడైనాడే - వాదాభేదములాను పాదుపెకలించియు - వేదవేదాంత విధానమంతయు దెల్ప ‼రా‼4‼ కర్తఅయినాడే రామహృదయార్తి అయినాడే -వెర్తామయ్యిన మాయవేగమె బాపి సంపూర్తి జేసెదనాని బిరుదూ వహించియు ‼రా‼5‼

48. ఆటతాళం: రాగము: మోహన

వందనము గురుచరణముల కానందముగనే జేసెదా - మందబుద్దియు వీడి గురునకు దండములు అర్పించెదా ‼ప‼ కరము చరణము లురువు భుజములు శిరము ధరపై మోపెదా బరువడిగ సాష్టాంగమిడిబహు శక్తిమాయనుబాసెదా ‼వ‼1‼ వేలులక్షలు కోట్లుకోదువలు వెతలు తీరగమ్రొక్కెదా - మేలుగను గురుకీలుగనినే వాలలాడుచుమ్రొక్కెదా ‼వ‼2‼ నేనునేనని వాచ్య మెప్పుడు లేనెలేదని వేడెదా - పూని యెప్పుడు హృదయమున గురుస్వామినె పూజించెదా ‼వ‼3‼ యిందునందున యెందునున్నా నందమందే సుక్కెదా - సందులేని బ్రహ్మమునకు సన్నుతించియు సొక్కెదా ‼వ‼4‼ త్రిపుటిద్విపుటీ ద్వయముమిద్యకు తీవ్రముగ వినుతించెదా అపరిమిత ఆనంద తీతా అచలమునకె దక్కెదా ‼వ‼5‼ ఆదిఅంత్యములేని అచలానంద మందే గ్రుంకెదా - వాదభేదము లేనిదే నిర్భేదమున నివసించెదా ‼వ‼6‼ భారలింగా గురువరేణ్యుల భారమున దరిజేరెదా భూసురుండగు రామాదాసుడు యేమిలేదని యెంచెదా ‼వందనము‼7‼

49. ఏకతాళం: రాగము:

అర్చింతముగురు చరణకమలములు ఆర్తిబొందిమనసా - హృత్సరోజమున వదలక సద్గురు మూర్తికెపుడు మనసా ‼ప‼ నేనునాదియను సింహాసనమును పూనిపెట్టుమనుసా - మానుగపూజ పాత్రేంద్రియములు తానెయౌను మనుసా ‼అ‼1‼ అంగములోపల గంగా యమునల సంగజలము మనుసా - అంగుగ పాదముఖ హస్తార్ఘ్యంబులు పొంగుగనిడుమనుసా ‼అ‼2‼ పంచకళామృత పంచామృతమని కాంచియివ్వుమనుసా - యెంచగభారతి జెలశుద్ధోదక మాచమనము మనుసా ‼అ‼3‼ అభిమానాదులు అంతరమొదులుటె అభివస్త్రముమనుసా - త్రిభువనంబులో దివ్య సూత్ర మిడి గాయత్రనుమనుసా ‼అ‼4‼ గ్జానాగ్జానా గుణభూషణములు గణుతింపగమనుసా - ఘ్రాణ ఘ్రాణము చేతసుగంధము గల్పించవెమనుసా ‼అ‼5‼ కమలకాంతులనె విమలపుష్పములు విడచి మ్రొక్కుమనుసా - యిలలో పుష్పము లెన్నిగలవొ అవి అన్నిజేర్చుమనుసా ‼అ‼6‼ దీపాగ్నిలోషడు పేతముబోసియు ధూపమిడవె మనుసా - పాపలొ వెలిగేటి రూపమొకటిగని దీపమనవె మనుసా ‼అ‼7‼ తత్పద త్వంపద లక్ష్యనివేదన తప్పకసేయుమనుసా -వప్పుగమది సంకల్పవిడెముమన అప్ప కివవెమనుసా ‼అ‼8‼ మండలాత్రయమె మంగళహారతి ఖండముకిడు మనుసా- దండిగ ప్రణవమె మంత్రపుష్పమని అండజేర్చుమనుసా ‼అ‼9‼ యెరుకమరుపుగల యెరుకదక్షణని యెంచియివ్వు

మనుసా-మరువక తనుమన ధనమర్పితమని మరచియుండు మనుసా ॥అ॥10॥ ఆత్మప్రదక్షణమనో సంచారమె అయ్యివుండుమనుసా - ధాత్రి చరించుట భూప్రదక్షణమె దాతకౌను మనుసా ॥అ॥11॥ సర్వంబును బ్రహ్మార్పణమని దాని సంధిదెలయుమనుసా - సర్వంబునజననిర్మల పూర్ణమె నీవు గలయుమనుసా ॥అ॥12॥ గురుభారేశునికృప వెలివెర్తిలో కుదిరియుండు మనుసా - నిరతము రామాదాసు జెప్పినది నిత్యజేయుమనుసా ॥అ॥13॥

50. త్రిపుటతాళం: రాగము:

శరణూ సద్గురునాయకా పరమాదయాకర - శరణూ సద్గురునాయకా ॥ప॥ శరణుసద్గురు నాయకా శేవితాఫలదాయకా - న్యారామెంచాకరార మ్రొక్కెద రవ్వశాయకు దివ్వపురుషా ॥శ॥ నీర్గుణనీర్వికారా నిగమాగమానుత సుగ్ఞానజెనశేవితా - నిర్మలా గగనంబుభాతినిండి సర్వము నందునంటక- ఖర్మములు బరిమార్చనీనిజధర్మమేకద నిర్మలాకర ॥శ॥1॥ ఖండాఖండాతీతా నిండు ప్రభావా ఖండమండలదాతా - మండలాత్రయములకు మీదుగ కుండలగ్రమునందు నిరతము మెండుగా వెలగేటిబయలులో నిండివెలసిన దండిరూపక ॥శ॥2॥ ఆదివిగ్రహదేవా అమితా దయా పర వాదానీకరుణాలేదా - భేదమెంచకు మ్రొక్కెదను నీవాడనైతిని రవిశుభాకర- మోదమునయిటు బ్రోవరాగదె శ్రీధరాదామోదరా హరి ॥శ॥3॥ నిన్నెనమ్మితి ధీవరా ఆపన్నుడానైనున్నావాడను భూవరా సన్నుతించెద నామనంబున సర్వభూత దయాపరుండని - నన్ను మన్ననజేశికావు మనాధవందిత శ్రీకరాహరి ॥శ॥4॥ భక్తాజనకబ్రోవరా వెలివెర్తిల భక్తునిరక్షించరా - భక్తులదరి జేర్చెవాడవు భారలింగదయాంబుదేశిక - భక్తవత్సల రామదాసుకు ముక్తులొసగెటి మూర్తి గురువర ॥శరణా॥5॥

51. ఏకతాళం: రాగము:

దొరవానినమ్మీతిరా - గురుదొరవాని నమ్మీతిరా - ధరాధిత్రిభువన దొరావునీవని సరాన నమ్మితి పరాకుజేయకు ॥దొ॥1॥ దేవాదులకు దేవుడవే గురుపావానులకుపావనమె - నీవాడ నైనాను -ననునీభావామునందిడుకొనుటకునై ॥దొ॥2॥ ఆర్యులకారాద్యుడవే గురు ఆచార్యులకును అధిపతివే - పారాము నొందుటకూ సాదాచార్యుడ నీవెకదవే ॥దొ॥3॥ యోగూల సూయోగివిరా గురు భోగూలకతిభోగివిరా - జాగూనులేకాను భక్తునిబాగూగ నేలెదొరవే ॥దొ॥4॥ రాజూలకును రాజువురా -గురురాజ యోగూలకును యోగివిరా తేజాముతోడాను అంతట సహజామైనావు నీవని ॥దొ॥5॥ తల్లితండ్రి దొరదాతావే - గురు యెల్లబంధుడవు నీవెకదే -వుల్లాసమాయెను నీపదమెల్లా దిశలందు చూచియు ॥దొ॥6॥ ప్రేమతోడయిటు గాంచార -గురునామనసున వశి యించారా -ధామాముయైనావు రామదాసూడు నినుమదిసేవించగ ॥దొ॥7॥

52. జంపెతాళం: రాగము: నటభైరవి

యేమిర గురుదేవబ్రోవ జాగుయేలరా -స్వామి నిన్నెనమ్మినాను నామనోహరా ॥ప॥ నిన్నెకాని అన్యమెపుడు యెన్నబోనురా - సన్నుతించెదాను సర్వమయుడవనుచురా ॥యేమి॥1॥ న్యారమెంచబోకు తండ్రి ఆర్యసన్నుతా - నాభారమెల్ల నీదెయనుచు కోరి మ్రొక్కెద ॥యేమి॥2॥ సురనరాదులకును శిద్దవరులకెల్లరా - హరిహరాదులకు గురుడవైతివీవెరా ॥యేమి॥3॥ యెరుక దోచువరకు నికృపెంచివుంచరా - యెరుకమరుపు యేగినా తరియేది యెంచరా ॥యేమి॥4॥ యెందరున్ననేమి ఫలము కొందరోదేవ - రందిలోనివారు నావలె అందరోదేవ ॥యేమి॥5॥ మూలమేమిలేని దాన్ని ముంచుమెదేవా - మేలుగల్గె మూలమందె లీనమొందెదా ॥యేమి॥6॥ బాల్యమందునుంచి నీదు భారమోదేవా - చాలగా వెలివెర్తి రామదాసపాలకా ॥యేమిరా॥7॥

53. ఆదితాళం: రాగము:

దేవుని భజియించరా - గురుదేవూని స్మరియించరా !!ప!! దేవూని భజియించు పోవూ నీ యఘములన్ని - రావుజన్మానీకీ కావూనెల్లప్పడు !!దే!! గుకారా మందాముర - జీవ రుకారమె తెల్విరా - గుకారమాయాను రూకారామును బాపు - సాకారముల నీరాకార మొనరించె !!దే!! నామామెసారాముర - సర్వ నామాదిధామాముర - పామారమొదలీయు నేమాము దప్పాక యెమారబొకూమి కామాదులన్నిగూల్చె !!దే!! గురునామాసొధాముర జీవా- సరిలేదు భువనాముర గురునామ సొదాతో సరిగావు సర్వాము - హరిహరఅల్లా అనంతమొక్కాటియాని !!దే!! కాయెన మనసావాచా జీవాపాయక నుతియించరా - న్యాయాముయిదియె వుపాయము దోచినపుడు వెయ్యేలమాయైతె పొయ్యేవిచారామె !!దే!! భారమెగురుడానర నిర్భారమె బయలౌనుర - ధారుణి వెలివెర్తి ధామసంధానాము - కూరిమిగల్గెను రామాదాసూన కెపుడు !!దేవుని!!

54. ఆదితాళం: రాగము: శివరంజని

వర్ణింపాతరమా వరగురుమూర్తి వర్ణింపాతరమా !!ప!! వర్ణింపాతరమా నీవైభావతేజాము నిర్ణయింపగలేరు నిఖిలాత్ములైనాను !!వ!!1!! సేవించతరమా బ్రహ్మాదులకు భావింపతరమానా విన్నపంబిదె నవనీభృత్యులలోను- గావించాలేనీక నావిన్నాపంబిదె !!వ!!2!! ధ్యాన్నింపావశమా దక్షుల కైనా దర్శింపవశమా - ధ్యాన్నామానములకూ దగులాక నుందూవు - మన్నించినీవు నావిన్నాప మాలించు !!వ!!3!! స్తుతిజేయలేనూ సద్గుణనీది మతినిల్పాలేనూ - అతిదాయతొనీవె ఆధారించియు నన్ను - గతులేమిలేకాను మతికల్మషముబాపు !!వర్ణి!!4!! విన్నావించితినీ నావిధమంతా సన్నుతించి యునూ - కన్నాతండ్రివినీవె కన్నావురక్షించు- మన్నించవలెనయ్యా మరిరామాదాసునూ !!వర్ణింప!!5!!

55. ఆదితాళం: రాగము: యమన్‌కళ్యాణి

కాలము వచ్చెనురాజీవా కదులర గురుజేర - కాలము వచ్చెను కల్లగాదువిను - కాలుని దూతల పాలైపోకుమి !!ప!! యిల్లు సంపదంట యింటి యిల్లాలోఘుతంటా - వళ్ళు కొరకు నీవల్లిబిల్లి బడి-యుల్లములో మునుపున్నది మరచియు !!కా!!1!! తల్లిదండ్రులంటా సొదరు తనయులాప్తులంటా యెల్లజీవుడు వెళ్ళెటివేళ్ళలో - కల్లబాంధవులు కదులరొక్కరిఘ !!కా!!2!! మంటిబొమ్మ సుమ్మీ దేహము మలమూత్రముగుంటా - తుంటవిలుతుని తంటలొబడిగురు - జంటజేరి బోదంటక చెడితివి !!కా!!3!! కల్లసాగరముర మనకిదికాదనితెలయుమిరా - యిలగల వస్తువు లెన్నినమ్మినా - కల్లచూడు మది కాదునిజంబుగ !!కా!!4!! చెడి చింతించకుమీ వేగమె చపలబుద్ధిమానూ - చెడీ చింతించకు చేరె మృత్యువు - పరుగులెత్తి గురు మరుగున జేరుమి !!కా!!5!! నమ్మకు నమ్మకుమీ ప్రపంచము నమ్మిచెడకులెమ్మి- నమ్మిచెడితివానాటినుంచి నీవు- సొమ్మసిల్లియు నీవిమ్ముగ చెడితివి !!కా!!6!! భక్తినిలపునమ్మీ భవహరుపరము దెలసుకొమ్మీ- భక్తినిలపి తద్భావములోపల- యుక్తులుడిగి భవరక్తి విడువుమిక !!కా!!7!! పదిరొండునుతరచీ బట్టాబయలులోన గలసీ - పరిపరివిధముల పరువులు బెట్టక - ముదమునగురుపద కమలము మరువకు !!కా!!8!! దాసవిలాసుండూ శ్రీగురు దేశీకోత్త ముండూ - భాసుర వెలివెర్తీశ దురంధరు - మోసరహితుడని వాసిగ తలచుమి !!కాలము!!9!!

56. ఆదితాళం: రాగము:

కీలుతెలియరా మాయజాలమొదులరా- నిజగురు కీలుతెలియరా !!ప!! కీలుదెలశి మాయ బాశి కేలుమోడ్చి నేనులేని - దానికెపుడు సన్నుతించి తానులేని దారిజేందె !!కీ!!1!! కామ్యమొదులరా

కలుషమోహమొదులరా - కామ్యకలుషమోహ మొదలి కాంక్షలెగర జిమ్మినిలచి - నేమనిష్టలేమిలేని నిజమునందు నిలుకడయ్యె !!కీ!!2!! చింతలొదులరా గురుణి చెంత జేరరా - చింతలొదిలి చెంతజేరి మంతనమున మాయబాశి- భ్రాంతిరహితమయ్యె మార్గమెంతో ముఖ్యమనుచుదీని !!కీ!!3!! దోష మొదులరా ద్వంద్వమోసమొదులరా - దోషద్వంద్వ మోసమొదలి ఆశలన్నిబాశినీవు - దేశికోత్తము జేరికొలచి ధేయవిద్యలన్ని దూరి !!కీ!!4!! ఆహమొదులరా ఆత్మ అదితెల్యరా అహమువాచ్యమునకు మూలయాది లక్ష్యమేదొచూచి - మోహమేమి లేక యెరుక పాదులేపెవారిజేరి !!కీ!!5!! ఆర్తిబొందరా ఆత్మమూర్తి తెలియరా - ఆర్తిబొంది అచల సంపూర్తిదెలశి కలశి వెలివెర్తీ - శునమ్మిపల్కెరామదాసు యెపుడు పూర్తి అయిన !!కీలు!!6!!

57. ఏకతాళం: రాగము:

మాయనునమ్మగరాదూ యీకాయము నిల్వగబోదూ - ప్రాయము విషయము పరగ ధనంబును - వ్యయమగు చుండును స్థిరముగ నిల్వదు !!ప!! సత్యము బ్రహ్మమునమ్మూ అసత్య బ్రహ్మాండము జిమ్మూ - క్రొత్తపాతయని మొత్తమెరుగనిది - వుత్తమ బ్రహ్మము హత్తుము మదిలో !!మా!!1!! బంధువులెవ్వరుగారూ తనబంధము తీయగలేరూ - అందరుమనవలె వుండియు వుండియు తుదకు - చెందరుమనగతి బొందవరకెకద !!మా!!2!! యింద్రియభోగములన్ని అవి యింద్రజాలములన్నీ - రంధ్రబాండమున వుండిపోషణము - యెంతజేసినను సుంతైనుండదు !!మా!!3!! తొమ్మిది తూటులతొర్రా యిదినమ్మరాదురాబుర్రా - కమ్మసూత్రపు బొమ్మకైవడీ - యిమ్మగ అదియు వెళ్ళును యెన్నడో !!మా!!4!! వసుమతి వెలివెర్తందు ఇది విశదము తెలయుచునుండూ రశికజనంబుకు రాజైయున్నది - అసమానంబగు ఆత్మతత్వమును !!మాయను!!5!!

58. ఆదితాళం: రాగము:

యిదుగోగురుకీలుదెలయు మనసా మదిసంశయమీడి - అదుగో భవవార్ధి దాటుమనసా యిదుగోచూడుమిక సుగుణపదంబును - అరయబుధులకూ నలవియైన గురి !!యి!!1!! ఆరూ పారాలపైనాయున్నా సహస్రారకమలామేరూవందూన మెలగూచున్నా- ఆత్మజ్యోతియై అంతరమన్నిట ఆర్యులకెల్లను వేరులేనిదది !!యి!!2!! మూడారుద్వారములు బంధించి మూక్తిద్వారంబు మూతా దీసెటి నేర్పూతెలశీ - ముక్తీకాంతతో ముదమున కలసియు - మురయుచు భవముల బిరబిర వీడియు !!యి!!3!! జోడూ సంగతులగూడూకోనీ శాంభావివలన పంచెవన్నెలపీఠామెక్కీ వెడుకగలదానిపాయక చూచియు - వీడక యేకాంతజాడనె యిదియని !!యి!!4!! నయనాద్వయా మూల యెందునున్నా నాల్గూవర్ణమూలా నావాలసూక్ష్మమయ్యీయున్నా - నదెచిన్మయమును నదెచిద్రూపము - హరిహరబ్రహ్మ ఆత్మస్వరూపము !!యి!!5!! యెరుకాతొ యెరుక బయలులజూచీ మరుపేమిలేకా యెరుకాగురుమూర్తి కర్వణజేశి - స్థిరమతితోడుత చింతలణంచియు - ధరలో రామదాసు తెల్పినది !!యిదుగో!!6!!

59. ఆటతాళం: రాగము:

నిన్నెనమ్మీతినిజగూరునాధ -నన్నూమన్నాన శేయుమన్నాధా !!ప!! సగుణారూపాము తోడూతవచ్చీ - సుగుణాబోధానుజేశి పెంపెచ్చీ !!ని!!1!! జన్మజన్మాది ఘోరాకర్మములూ - అన్నా నించాకద్యంతూవునిజమూ !!ని!!2!! దేవాదేవాదులైనానేనమ్మా - భావామందూన నినునమ్మీ యున్నా !!ని!!3!! దేహబంధూలనమ్మా లేదికనూ - మోహబంధాము బాపునాయడనూ !!ని!!4!!

హరిహరాదూలు అయినాకోపింపా -కరుణాజూతూవు మరియుపోషింపా!!ని!!5!! నీవుకోపింపవ లేరు రక్షింపా - పోవుభయములన్నియు కటాక్షింపా !!ని!!6!! నిర్గుణాకారమయ్యున్నా దేవా -ధరలో వెలివెర్తి రామదాసుడూ !!నిన్నె!!7!!

60. ఏకతాళం: రాగము:

నమ్మవలదు జగమన్నా యిదినమ్మితె బహుకీడన్నా - నమ్మవలదు మనమెన్నవలదు జగ మున్నదనుట నేనన్న వాక్యమిది !!ప!! నేగల్గితె జగమన్నా నేలేకుంటెను అదిసున్నా - బాగ సుషుప్తిలో లీనమొందగను - యెక్కడబాయను లేనినేను అది !!నమ్మ!!1!! స్వప్నమువలె జగమన్నారొండు సత్తుచిత్తుసమమన్నా - స్వప్నములోపల సకలము గలిగియు - స్వప్నము మేల్కొన సర్వముళక్కివలె !!నమ్మ!!2!! అవతారములునుమాయ ఆఅవతారములెటుబాయె - ఆదిఅంత్యములుగల యీ జగమున - యెన్నిగల్గినా అన్నిదానివలె !!నమ్మ!!3!! దిక్కులేనిజగమన్నా దిక్కుంటెపోవుటౌ సున్నా- దిక్కువుంటె మున్న ధీరులుశూరులు - యెక్కడి కేగిరి యెమాయుగములు !!నమ్మ!!4!! జనకుడు శుకయోగునకూ యీజగమేమిధ్యని అనెను - నేననెభ్రాంతిని లేనిదొదులుమని - వున్నదచలముని తిన్నగతెల్పెను !!నమ్మ!!5!! పితృపితామహులేరీ మనపీరకులంతేమైరి- వుత్తదెకద వారుంటెను చూపుడి అత్తరివలెమనముత్తదె తెలియుడి !!నమ్మ!!6!! పార్థునకును హరినాడూ పరమార్థము తెల్పిఅన్నాడు అస్థిరమగు యెరుకాత్మవదలుమని -సుస్థిరాత్మనె చూడుము నిజమనె !!నమ్మ!!7!! జెన్మములెన్నె నావో యీజన్మతపై యెన్నొనో - మిణుగురువలె యిదియెన్నడుబోవునో - మేలుగనియు జన్మ మూలముబాయుడి !!నమ్మ!!8!! క్షణభంగురమీతనువూ అర క్షణసుఖమును మనపనులూ- అన్నలార నావిన్నపమును యిదె - అన్నివదలి నిజమున్నది తెలయుడి !!నమ్మ!!10!! నిజబయలటు గాదన్నా అదినిరతము వకవిధమన్నా - గజిబిజిలేకను ఘనపరమాత్మై - అజరుద్రాదుల కందరానిదది !!నమ్మ!!11!! రానిపోనిదిదె యనుచూ శివరామదీక్షితులు బల్కూ- లేనిపోని జగమేమిలేదు అని పూనుడినిజమే పుట్టుటకల్లనె !!నమ్మ!!12!! వెలివెర్తీపురమందూ భవభయములు బాయుచునుండూ మలినముబాపియు విమలము జూపియు - సలలితముగ గురు సౌజ్ఞకులోనై !!నమ్మ!!13!!

60. ఆదితాళం: రాగము:

చూచీతీనయ్యా చూడ్కులతోను చూచీతీనయ్యా - చూచీతీనయ్యా నేసుందారపరమాత్మా లోచానములలో విమోచనామూర్తిని !!చూ!!1!! పాపాలలోనా పీతంబందుపరమయ్యాయున్నా రూపాముజూచితె దీపాముఖవిధముంది - తాపాములన్నణగూ చూచినమాత్రాన !!చూ!!2!! అయిదూ అయిదూలూ యిరువైఅయిదా నాత్మానెరిగీతినీ - ఆనాత్మయెందూన ఆత్మనేననితెలశి - అవలీ తత్వంబూను అందిపొందగనాయె !!చూ!!3!! అచలాపదమయ్యా ఆత్మతొజూడ తననీజమయ్యా ఆత్మానాత్మలులేకా ఆదికేవలాత్మయ్యి - వచనామెన్నడు లేని వైభావపదవీని !!చూ!!4!! రూపూలేదయ్యా చూతామన్న యేపగిదోఅయ్యా - ప్రాపుదాపుఅంత పరిపూర్ణమయ్యుండు - వోపీకాతొదలువావనరా నామాము లేంది !!చూ!!5!! యీజన్మాగన్నా యిలయెందునా యిఘ పూట్టుసున్నా - సాజన్మసాకార సత్యానీరాకారా - తేజామచలముకన్నా రానీపాదంబూను !!చూ!!6!! దాసూడనయ్యా వెలివేర్తిలా వాసామోయయ్యా - భూసూరకులజూడ భూషాణమిదెనాకు - భాసూరంబుగ రామాదాసూడనైనిల్పి !!చూచి!!7!!

62.ఏకతాళం: రాగము:

అంతటనిండిన అచలము కనుగొని సంతసమొందవెవో మనుసా - అంతయింతయని గింతికిరానిది- వంతుగదెల్పవెవో మనుసా !!అ!!1!! యెరుకమరుపులకు యెరుకైవుండిన యెరుకను తెల్పవె వోమనుసా - మరుపులేక పరిపూర్ణమునందున - మగ్నతనొందవె వోమనుసా !!అ!!2!! చిల్లరబోధలనెల్లను మానియు చిత్తములోపల వోమనుసా - ముల్లోకంబుల దుర్లభమయ్యిన తెల్లముతెల్పుమి వోమనుసా !!అ!!3!! నాదుబిందు కళలంటకవుండె ఆదినితెల్పవె వోమనుసా బేదాబేధము లేకనుసర్వా- సాధనమొదులవె వోమనుసా !!అ!!4!! సంశయవృత్తులు ధ్వంసంబయ్యేటి చక్కిదెలియవె వోమనుసా - హంసాక్షరమును ద్వయదోషంబని సంకటమొదులవె వోమనుసా !!అ!!5!! క్షేత్రక్షేత్రముకు క్షేత్రంబైనా క్షేమమెరుగవె వోమనుసా- పాత్రపాత్రముకు పాత్రంబైనా - సూత్రము గలయవె వోమనుసా !!అ!!6!! సర్వేంద్రియముల వృత్తి ప్రవృతులు సమయజేయవె వోమనుసా నిర్వేంద్రియమై నిలచిన బ్రహ్మము - నీవె చూడుమీ వోమనుసా !!అ!!7!! దర్మాధర్మవృత్తుల మానియు నిర్మలమొందవె వోమనుసా - ధర్మములన్నియు ఖర్మములని నిజ - ధర్మముపూనవె వోమనుసా !!అ!!8!! సత్యాసత్యము లుత్తవి అనుకొని మత్తుబాయవే వోమనుసా - నిత్యానిత్యము లన్నిరిత్తయని నిజమునుతెల్పవె వోమనుసా !!అ!!9!! అచలగురుణి పదమాశ్రయించియు సచలము బాయవె వోమనుసా - నిశ్చలమయ్యిన నిజపదమొందియు- నిజమచలముగా వోమనుసా !!అ!!10!! గురు బారేశుని కృపసంపూర్తియు కుదిరియున్నదె వో మనుసా - గరిమెతోడుతా రామదాసుకు ఘనపద మబ్బెనె వో మనుసా !!అంతట!!11!!

63.ఆదితాళం: రాగము: ఫీల్

యేమిచిత్రామమ్మా చూడగా - సద్గురుణీమహిమా యెంతచిత్రామమ్మా చూడగా- యేమిచిత్రమమ్మా చూడ కోమలిరో రమ్మనిపిలచీ నేమనిష్టాలెల్ల దెల్పెనే - సద్గురురాయుడూ నోముఫలము నోచజేసెనె !!ప!! భామరోరమ్మానిపిలచీ భ్రాంతులెల్లాదులిపివేసే - కామకర్మామూల బాపెనె - సద్గురురాయుడు కామితార్థమెల్ల దీర్చెనె !!యే!!1!! వుత్తబట్టా బయలూలోనా వచ్చిపోయ్యే స్వపాజగము - వుత్తదానిరిత్తజేసెనె సద్గురురాయుడు-సత్తతోనుమత్తబాపెనె !!యే!!2!! జాలిబొందె తనువూనకునూ మూలమేమిలేదూలేదనే - మేలుగా గుర్తెరుగవోద్దనె సద్గురురాయుడు - కీలుదెల్పీ లీలబాపెనె సద్గురురాయుణీ !!యే!!3!! కోటిమాట్లాకైనాయిదియు కోమ్మరోమరువాకుమానె సూటి దప్ప బోకుమానెనె - సద్గురురాయుడు దీటులేని బాటజూపెనె !!యే!!4!! బట్టబయలూ బ్రహ్మమాని గుట్టుదెల్పి చూపిదీని- పట్టువదులాబోకుమానెను - సద్గురురాయుడు మొట్టమొదటి దాన్నికల్పెనే !!యే!!5!! వుండిలేనిదానవయ్యా వున్నవస్తువులోన గలసీ - చండివేతూ యెరుకనేడనే సద్గురు రాయుడు ఖండితముగా అభయమీడెనే !!యే!!6!! న్యారమేమి యెంచాబోకా రామదాసుడంచు దయతో - గారమూతో జేరదీసెనె - సద్గురురాయుడు భారకర్త తానెఆయనే !!యేమిచిత్రామమ్మా!!7!!

64.జుల్వతాళం: రాగము:

పూజశేతమమ్మ రండి పుణ్యులందరూను గూడి - రాజతేజుడైన సద్గురు రాజయోగికి !!ప!! వాడవాడవనితలెల్ల కూడి కలిసి గురునిజేరి - జాడదెలసి పాదములను పూని కడుగరే - వేడుకైన గంధమూను పూనిపెట్టి అక్షింతాలు - జోడుబాయకుండ వీడి వేడుకోనరే !!పూ!!1!! పత్రబిల్వము తులసిదళము మిత్రమైన కమలములను - పవిత్రపూలునునిచి మీరు పరగ మ్రొక్కరే - గాత్రమూను కదులని వకచిత్రమైన పూలువేశి - ధాత్రిలోన గురుడె హరుడు ధన్యుండానరే !!పూ!!2!! ధూపము

దశంగాముంచి దీపమూను వెల్గజేసి -చూపుపవన మొకటిజేసి రూపూచూడరే-సూపపంచభక్ష ఘృతము శాఖమన్న షడ్రసములు తెపకూ నైవేద్యమిడియు తాపమొదులరే !!పూ!!3!! మంచిగా తాంబూల దక్షిణంచితముగ యెంచి యిచ్చి-సంచితాదులట్టె బాశి వంచనొదులరే- కాంచనా పళ్లెరమున కర్పూరారతీ బెళగజేసి పంచమహాపాతకమల బాసి నిల్వరే!!పూ!!4!! ఆత్మప్రాదక్షణములు అపరిమితముగాను జేసి ప్రస్తుతించి పరగమ్రొక్కి ప్రణుతిజేయరే -ఖ్యాతి అయిన వెలివెర్తిల ప్రీతితోడుతాను అంత దాతదైవమనుచు గురుణీకీర్తి పొగడరే !!పూజశేతమమ్మ!!5!!

65. ఏకతాళం: రాగము: కళ్యాణి

సదానందభావం సద్గురుస్వామి యచలరూపం !!ప!! సదానందమై సర్వశూన్యమై - నిరా కారమై నిర్మలరూపై !!సదా!! పిండాండముగాదు అదిబ్రహ్మాండంబునుగాదు - ఖండఖండములు గాకనుయెప్పుడు - దండిగనుండె మెండు స్వరూపం !!సదా!!1!! రాకపోకలేదూ దానికి జోకయేమి లేదూ - రాకడపోకడ లేశముగాకను - యేకరీతియై యేమన కున్నది !!సదా!!2!! సాకారముగాదూ అది నీరాకారములేదు - సగుణగుణంబుల జాడలులేనిది యెక్కువతక్కువ లేన్నడుగానిది !!సదా!!3!! పక్షతిధులుకాదూ వారానక్షత్రములేదు - అక్షయముగ మహనిక్షేపంబై - మోక్షమార్గముకు మొదలె వున్నదది !!సదా!!4!! అందకమరియుండూ జగమున నిండివెలుగుచుండూ - అందక పొందక కుందకచెందక - నంతటవెలగె దిగంతస్వరూపము !!సదా!!5!! సకలదేశమందూ వుస్తువు సకలకాల మందూ - అకళంకంబై అంతట నిండియు - సుఖకరమై సురసేవితమైనది !!సదా!!6!! యెరుక మరుపులేదు అచలము యెన్నడెరుకగాదు - యెరుక మరుపులు యెన్నడులేనిది పరమపదంబై పావనమైనది !!సదా!!7!! అంతయింతగాదూ తెలుప అనంతరూపులేదు - అంతములేనిది ఆపరి పూర్ణము - యెంతనికనినను సొంతముకానిది !!సదా!!8!! తరుగులేనిబోధా భార గురుడు గన్నతోవా తరుగనిబోధను కరుగని వస్తువ శిరివెలివెర్తిలో స్థిరమైయున్నది !!సదా!!9!!

66.ఆదితాళం: రాగము:

అచలాగూరూడు యెంతో అధికూడోయమ్మా -అచలా మార్గముదెల్పి ఆధరించెమ్మా !!ప!! మూలాములేని గుర్తెరిగెదోయమ్మా - కీలించిచూచితె మేలులేదమ్మా !!అ!!1!! యీవుత్త బట్టబయ లేమిలేదమ్మా - యీవాక్యముకుసాటి యిఘలేదోయమ్మా !!అ!!2!! బయాలూలో బయలూను బయలూపరచమ్మా-నయమైనాబోధాచె భయముబాపెమ్మా !!అ!!3!! ఆత్మసూత్రము సర్వమాయ చూడమ్మా - ఆత్మజగములో బోమ్మాలాడించునమ్మా !!అ!!4!! భావభావములేక బయలాయనమ్మా ఆవలీవలఆనక ఆవారించెమ్మా !!అ!!5!! చేశీచెయ్యనిమంచి క్షేమామెరుగమ్మా - శేవాజేశితె గురుడు చేపట్టునమ్మా !!అ!!6!! యీసూత్రామెతప్పా యేదిలేదమ్మా - యెసూత్రామైనాను యెరుకానెకొమ్మా !!అ!!7!! వెలివెర్తిలోపల వేడుకాయమ్మా - ఫలమొందువారికి పరమూదక్కమ్మా !!అ!!8!! వరరామ దాసుకు వరమిచ్చెనమ్మా- కరువు దీరగ నిజము మర్గూదెల్పెమ్మా !!అచలా!!9!!

67. ఏకతాళం: రాగము:

రుణముదీర్పలేనూ సద్గురు రుణముదీర్పలేనూ !!ప!! రుణముదీర్ప నాతరముగాదు ఆధరణతోడ నీకరుణనె కానిక !!రు!! పుట్టుచావులేనీ బట్టబయలు జూపినావూ - యిట్టి బయలునకు బదులే మున్నది - మట్టుమితము లేనట్టి ధనంబుకు !!రు!!1!! ప్రాణమానధనములాదిగ పరగఆత్మ నిడినా లేనివస్తువలు పోనెపోవునిక - తానుయిచ్చినది తరుగని దాయను !!రు!!2!! దేవదేవునకునూ

సాటి దేవుడు లేడికనూ - దేవుడునిజబయలని దర్శనమును - సావధానముగ సమకూర్చినగురు ॥రు॥3॥ యెరుకబాయుటకునూ దక్షణ యెరుకయిచ్చినానూ - సరిపోదాయెను సకలం బొసగిన మరువనిదాయను మరితనసత్కృప ॥రు॥4॥ బ్రహ్మాదులకైనా గురునకు బదులు యివ్వతరమా బ్రహ్మానందము నొందజేశిపర - బ్రహ్మంబైనసర్వాత్మునకును ॥రు॥5॥ గురుణి రుణము దీర్వాకోటి విధులనైనతరమా - శరణని అన్నను బిరుదువహించియు - నిరహేతుకముగ వరము లోసంగిన ॥రు॥6॥ దాసదాసులందూ రామదాసునకును యిందూ - దేశికుకరుణచే దోషములన్నియు గాశిలజేశియు కలుషముబాపెను ॥రుణముదీర్వలేను॥7॥

68.ఆదితాళం: రాగము:

వారమయ్యా వారామయ్య గురుణివారము - పరమూగుట్టుదెలశీ బట్టబైటా గూడెవారము ॥ప॥ సంచితాప్రాలుబ్ధామూలమించినారము - దురితా పంచమహపాతాకమలా వంచినారము ॥వా॥1॥ హరిషడ్వర్గామూలానెల్ల అంటకుండెము - అంతారాహములేకాను మాయాచింతమానెము ॥వా॥2॥ తామసారాజాససత్వమీడినారము - శుద్దాధామ సత్వాగుణమూపూని వాడినారము ॥వా॥3॥ యింద్రియవిషయా విషయములా వీడినారము - గురూచంద్రాణి చరణాముశేవా జేశెవారము ॥వా॥4॥ అష్టమాదమూలబట్టిఅణచినారము - మేముదుష్టగూణమూలాబట్టి ద్యంచినారము ॥వా॥5॥ వాసనామలమూలబట్టికోశినారము - రాగద్వేషరోషభాషాలాను పాశినారము ॥వా॥6॥ వేద వేదాంతాములందె వెలగెవారము - వాదాభేదమూలు యెమిలేకా కూడెవారము ॥వా॥7॥ దారపుత్రా ధనములాను దలచబోమూ - వేగా మీరినాకాలూనిదూతల దూరినారము ॥వా॥8॥ పరమభక్తా వరులానెపుడు బాయకుండెము - యీధరలోగాల వెలివెర్తీలా దలచుచుండెము ॥వార॥9॥

69. జోలపాట: జంపెతాళం: రాగము:

జోసద్గురూవర్య జోసదాచార్య మాయాత్మ గుణదూర్య దాసజనవర్యా ॥జోజో॥ అండాండ బ్రహ్మాండములకు అంటకనూ - మెండుగా పదునాల్గు భువనములు మీరి - దండీశక్తికి దాపుయై దానిబాపీ - నిండియుండిన నిర్వికల్ప పవళించూ ॥జోజో॥1॥ ఆరుమేడలపైన జోడుబాయకనూ మేరుశిఖరముపైన మెలగుచును యెపుడూ - కారణముబాపి నిష్కారణంబయ్యి - పావకునిభంగి పరిపూర్ణమైనావూ॥జోజో॥2॥ పంచవర్ణంబులా ఫర్దలోపలనూ వెయ్యిరేకులపాన్పువెలయు చుండ గనూ - అంచయాననునొంచి ఆత్మనటుదెంచీ - మించియుండిన నిర్వికార నిద్రించూ ॥జోజో॥3॥ గంగభారతి యమున ఘననదులపైనా- పొంగెకాంతతోకూడి పోసగబవళించీ- సంగతిని బరి మార్చీ స్వచ్ఛమై వెలశీ - భంగంబులేని గురుపుంగ శయనించూ ॥జోజో॥4॥ నీలతో యదముపై నిలచియున్నట్టీ- మేలువిద్యుల్లేకమున వెలగుచుండీ - చాల నీవారశూకాగ్రపీఠమునా - వాలలాడెటి దీనిలోనసమయించూ ॥జోజో॥5॥ వాగ్మనోక్రియలచే వర్ణింపరాకా - ప్రగ్నవాదులకెల్ల తెలియంగ బోకా- దృగుదృశ్యములకు బహుదూరమయున్నా - సౌగ్నీవనుచు నేసమయించికలతూ ॥జోజో॥6॥ రాజరాజులకెల్ల రాజైనవాడా - దేవాదులకుదేవదేవుడవుగావా - రాజిగను వెలివెర్తి రామదాసునితో పూజగొన్నట్టి సంపూర్ణ రక్షించూ ॥జోజో॥7॥

70. లాలిపాట జంపెతాళం: రాగము:

లాలిపరిపూర్ణలాలీ - పరమాత్మ పరమేశప్రభుడలాలీ- లాలిమహివినుతలాలీ - లీలగల మాయ మటుమాయలాలీ !!ప!! శతకోటికల్పములునూ మీలోన మితిలేనిచిత్రములునూ - అతివేగచను దెంచియూ-సవరించిసమయించినీవేరుగవూ !!లాలి!!1!! బ్రహ్మాండభాండంబులు కరిభంగి ముందులేకనె కల్గుచూ - శిహ్మంబుగన్నమాడ్కీ నినుగనగ దండిశెక్తితొసమసునూ !!లాలి!!2!! అగ్నినైఋతి వాయువు ఈశాన్య మమరినా భువితొట్లెకు - గగనమె చత్తుగాను రవిశెశి తారలతి చిత్రములునూ !!లాలి!!3!! అందమౌపాన్పుపైనా పవళించి నిండువేడుకతోడనూ - పొందుభక్తుల నందరీ పోషించి ముందుముక్తులు నిత్తువూ !!లాలి!!4!! వాయుదేవుడు వీచియు వింజామరములు చల్లగవీయగా - పాయకార్మ్యలు అందరూ మీచుట్టుప్రణమిల్లి మ్రొక్కులిడగా !!లాలి!!5!! హరి హరాదులు బొగడగా దేవాదులందరును మిమువేడగా - నారదాదులు బొగడగా మీచుట్టు రమణులారతు లివ్వగా !!లాలి!!6!! దేహింద్రియములుగాకనున్నట్టి దేహికంటనివాడవూ - అహంబు యేమిలేకా ఆద్యంతశూన్యముకు మిగులుందువూ !!లాలి!!7!! వేదపురుషునికైననూ వర్ణింప దూరమై మిగిలుందువూ - కాదునే నుతియించనూ మీలోని వాడతప్పులు యెన్నకూ !!లాలి!!8!! వాచామ గోచరుడవూ నేదేహవాసనాగలవాడనూ - పోషించ నీభారము నాతండ్రినీచమాయను బాపుము !!లాలి!!9!! ధరలోన వెలివెర్తిలో శ్రీరామదాశిటుల నుతియించెను - భారేశుకరుణతోను బల్కెనిక కాపాడి రక్షించుమీ !!లాలిపరిపూర్ణలాలి!!10!!

71. రూపకతాళం: రాగము

హెచ్చరిక గురురాయ హెచ్చరిక గుణగేయా -మచ్చికతోమము బ్రోచెప్రభుడా నీకేచ్చారిక !!ప!! కంటి మింటికి సందూ వోంటీస్తంభమునందూ -అంటకను వశియించు హరుడా నీకేచ్చారిక !!హె!!1!! పంచాభూతామాయపట్నంబులోపాల -కాంతామించిన పరమాశాంతా నీకేచ్చారిక !!హె!!2!! నాశికత్రీవేణీ నయమైనా స్థలమందూ -వాశీవన్నెలు మీరు వరుడానీకేచ్చారిక !!హె!!3!! పంచాకళలాలోను పంచాలింగంబూలను -యెంచావాటిని నీలో ముంతూమీ హెచ్చారిక !!హె!!4!! శిరిగుల్కు వెలివెర్తి శ్రీధరానంతా ఘన -సరియెవరూ నీకు సంపూర్ణపర హెచ్చారిక !!హెచ్చారిక!!5!!

72. మంగళహారతి: జంపెతాళం: రాగము:

జయదేవ జయదేవ జయసద్గురు దేవా హరసద్గురు దేవా - హారాతిదేశిక ఆత్మాస్వరూప !!జయ!! భక్తపరిత్రాణ భవభయవినాశా - భవయఘవినాశా యుక్తాయుక్తామాయారిక్తాస్వాభావా !!జయ!!1!! పృథ్విఆపస్తేజా వాయువాకాశా - వాయురాకాశా - తత్వామహంకారా సత్యాశూన్యాత్మ !!జయ!!2!! బ్రహ్మాండభాండమై బ్రహ్మఅండములో - నిండు అండములో ప్రతిఫలించిన పరంజ్యోతు లొసగెదనూ !!జయ!!3!! క్షేత్రక్షేత్రంబులకు క్షేత్రమైయుండి పాత్రామైయుండీ - సూత్రసూత్రముల నిజసూత్రధారికినీ !!జయ!!4!! ఆత్మనాత్మాతీత నిజకేవలాత్మా ఆజకేవలాత్మా - నిత్యానిత్యా దృశ్య సత్యస్వరూపా !!జయ!!5!! వేదవేదాతీత వేదాంతసారా వేదాంతసారా - వాదభేదారహిత సారసు విచారా !!జయ!!6!! ధరలోనవెలివెర్తి విమలాత్మ తేజా విమలాత్మతేజా - వరరామదాస పరిపాలిత విచారా !!జయదేవ జయదేవ!!7!!

**పరిపూర్ణ భక్తి కీర్తనలు ముగిసెను.**

# ద్విపదవాక్యము భగవత్ ప్రార్థన

ద్వి!! శ్రీరమానాయక ఆశ్రితకల్పవృక్ష -సారసదళనేత్ర సజ్జనమిత్ర - నీలనీరదగాత్ర నిఖిల మునిస్తుత్య-ఫాలాక్షసన్నుత పరమకల్యాణ - పరమపావనగాత్ర భవ్యచారిత్ర - కరుణ రసాసముద్ర బిరుదాస్త్రముద్ర - పన్నగారీగమన ఫణిపతి శయన - సన్నుతపదకమల సాంబ్రాజ్యపూజ్య దీటులే నటువంటి మేటాదికార - హారిద్రహృదయేశ హరిఅప్రమేయ -పరమాత్మపరమేశ పరమ ప్రకాశ సకలకల్యాణగుణ సంపూర్ణకామ - అఖిలాండ బ్రహ్మాండ సర్వాధికార - షడ్గుణ ఐశ్వర్య సంపన్నసర్వ షడ్వికార రహిత సాధుజనరక్ష - కనకాంబరాధర కమనియ్యచేల - సనకాదిఋషి గణా సౌరక్షభార హేమమకుటాంబర ప్రేమభగవంత - హటకామణి రత్నహర కిరీట - వైజయంతీమాల వరశంఖుచక్ర విజయాజయాపాల విప్రజనపోష - సృష్టిస్థితీలయా త్రిగుణసుగుణాత్మ- అష్ట భోగామయ అమిత ప్రతాప - మకరకుండలకర్ణ మహిమా విలాస - సకలాత్మసచ్చిదా సాక్షిస్వరూప - కౌస్తుభ కేయూర కరకంకణాది - కస్తూరి కుంకుమ తిలకాలంకార - వేదవేదాస్తుత్య వేదాంతస్తొత్య - నాదుబిందూ కళామోదవినోద - అమితభువనోద్ధార స్థిమితస్వభావ - ఆదిమధ్యాంత అనాత్మఆత్మేశ - ధర్మ సంస్థాపనా ధర్మపరివార - నిర్మలనిశ్చలా ఖర్మపరివార - సర్వకర్తాభోక్త సర్వబంధుత్వ - నిర్వైరి నిజదేవ నిగమనిగమాంత - విశ్వేశవిశ్వాత్మ విశ్వస్వరూప - శాశ్వితసత్వద సర్వేశపాహి - మనసు వా:క్కులకును మరిఅగోచరము - మనువులకైనను మరిఅసాధ్యంబు - పంచభూత ప్రపంచ మంచితంబుగను - మించియునాడించు వంటినాటకుడు - సర్వంబు తానును తాను సర్వంబు నిర్వాణమొనరించి నిర్వాహకంబు - అంటకచేయుచు జంటనుగూడి - అంటినట్టెవుండి అంట డెవ్వియును - బ్రహ్మాదులైనను బలుకంగవశమె - బ్రహ్మస్వరూపంబు పరికించి పలుక - శేషణి కైననూ చేప్పంగరాదు - భాషిణీ అయిననుపరికింపలేదు - వ్యాసాదులకునైన వర్ణింపతరమా వాసవసురలైన లేశంబుగనరు - రవిఅయిన కవిఅయిన నరపతూలైన - యెవరికైననుగాని యెంచంగరాదు- వేదశాస్త్రపురాణ విద్యలన్నియును - వెతుకజాలక అవ్వివెర్రులై చదువు - బ్రహ్మ విష్ణు మహేశ బలమైనసురలు - బలుఆగ్నలోజిక్కి పనులుజరుపుదురు - అష్టదిక్పాలకూలాగ్న మించకను - అమరి యెవ్వరిదివారు అట్టెయేలుదురు - అంబుధులన్ని తమమేరదప్పకను నిమ్మళంబుగ అవ్వి నిలచియూయుండు - సూర్యుడు చంద్రుడును సురలు తారలును కార్యకార్యములందు కడుభయం బొంది - చేయుచునుందురు శ్రేష్టంబులన్ని - పాయనిఆగ్నలో పడియుండెదారు - మూడు కాలంబులు ముదమొంది తిరుగు - వేడుకతో సర్వభూతజాలముల ఆడించినట్టును ఆడుచునుండు - ఆడించకున్ననూ అన్నియూ మడుసు - పృథ్విఅపస్తేజా వాయు వాకాశ - సతత మాడించిన సరవాడుచుండు - కమ్మసూత్రపుబొమ్మకైవడిఅన్ని - నిమ్మళంబుగ సూత్రధారయ్యియిన్ని - పుట్టించురక్షించు గిట్టింపుచుండు - యిట్టిదైవంబునూ యెవరెన్న వశము తనసూత్రజాలంబు తనుయెరుగుచుండు - ఘనరుషివరులైన గణుతింపతరమ - లెక్కింపయెవరికి లెక్కకురాడు - దక్కించుకొనుటకూ చిక్కంగరాడు - వక్కడైయున్నావు వరులెవరులేక - నిక్కమ దైవంబు నిజపరబ్రహ్మ- నిన్నుప్రస్తుతిజేయ నేనెంతవాడ - నన్నుకటాక్షించ నాధుండవీవూ- యెన్నెన్ని జన్మంబు లెత్తితినొతెల్య- అన్నిజన్మములందు యెన్నిఖర్మములు- చేసితినొతెల్య తెల్వేమిలేక- చూసుతు నున్నావు సుమ్మినీవన్ని - నరుడనుజడుడనూ అతిమూర్ఖపరుడ - స్మరణదప్పిన మతిచాంచల్యుడాను దేహింద్రియావిషయ తెప్పలోజిక్కి - తెల్వేమి లేకను తగనున్నవాడ - నీగాలిసోకినా నీలమేఘమెగిరి- బాగుగ వెలుగొందు బానునిపగిది - చీకట్లుబోయినా తాకట్లుసమసు - యేకట్లులేకను యేగును అన్ని - మున్నునేజేసినాముఖ్యపుణ్యంబొ- యెన్నగానీభక్తి కానియోతెల్య - ఆర్యులసత్కృపనో అదియు

నేనెరుగ - నిరహేతుకాకృపా నీదికాబోలు - అజసురాదులకైన అందరానట్టి - భజనీయులకునైన పలుకరానట్టి - నామరూపములేక నమలమైయుండి - నోము నోచినవార్ని నోనరచేబట్టి - ఆకారరహితమై సాకారమొంది - పాకారి ప్రముఖులు ప్రస్తుతించగనూ - నిజదేవుడావయ్యి నిర్మలాకార - నిజగురురూపమున నీవైనవచ్చి - అభయమిచ్చితివెంత హరిస్మరణజేతు - విభుడవై భవముల విరిచివేసితివి - గుహుడు పిల్వనిరీతి గుణహీను కడకు - గరిమెతో విజయంబు గ్రక్కునజేశి - శరణనిఅన్నను బిరుదువహించి - కరుణతో శిరమునా కరమునుజేర్చి - అదరకుమని చెప్పి అభయంబులిచ్చి - మొదలంటిదాపముల నన్నిజల్లార్చి - శుభమస్తుయని తనకు అభిముఖుణి జేసి - విభవంబుబోధించె వింటినేనంత - తనుమనధనములు తగనొదులుమనియె - మనువులు మూడిచ్చె మహిమనేమందు - కారణత్రయములూ కడకేగుటకును - కమలాసనాదులు కడతేర్వలేని ఖర్మసంచితలిపి విమలంబుజేశి - నిర్మలభూతిపై నిజమందువ్రాశి- నొసలియందునదూర్చె నొనరతా వ్రాలు - పాసగను లిఖియించె మసులనివ్వకను - సంచిత ప్రాలుబ్ధఆగములన్ని - ముంచగ జేశెను ముఖ్యపురుషుండు - దివ్యముగ దీక్షాత్రయంబులు జేసి - సర్వాత్మతీర్థప్రసాదంబు లిచ్చి- సాక్షిభూతుని నాలోచక్కంగజూపి - అక్షుల సౌర్జ్ఞచే అచలంబు జూపి - నీవెనీకైవచ్చి నివసంబుజేశి- శేవలందగజేసి చేపట్టినిలచి - భావమునందునా భక్తిబుట్టించి - పావనమయ్యినా పరతత్వమంత- నాలోనె కల్పించి నన్నెరుకజేశి - నీలోన నన్నెపుడు చావొచ్చుదాక - మదిని వదులకు హృదయ సదన మందనియె - కదులనివ్వకుమని కడతేర్తుననియె - అవిధంబుగవారి ఆర్జ్ఞతోనుండ సావధానంబని సాధించినంత - మదినిల్చినిల్వక మరియేగుచుండ - అంతరముఖినయ్యి ఆత్మలోపలను - సతతంబును తనను సన్నుతిజేయు - చుండగా అగుపడి అగుపడనటుల - వుండెతానెప్పుడు అండబాయకను - నిండునాత్మానాత్మ నిజకేవలాత్మ - అండంబులోపల నంతబయలాయె - అండపిండాండ బ్రహ్మాండభాండములు - అంతయుతానాయె అందు బయలాయె - యెంతనితెల్పను యేమివశమౌను - అంతులేనట్టి అనంత స్వభావ - అప్పుడప్పుడు కృతుల స్రృతిజేయుచూను - చెప్పుచునుందువు చెలగినానోట - పలికించెవాడవు పల్కెవాడవును తిలకించనీవెకానిక వేరులేదు - బాల్యమునందునా యేదెరుకలేని - కాలంబునానోట పది పద్యములును- చెప్పించుకున్నావు మెప్పునీకయ్యి - వొప్పుగభక్తితాత్వర్యార్థ మదియు - నటు జేయుటయు నీవె నాకు దృశ్యంబు - అట్టికాలంబున అతిచిత్రమదియు - యిప్పుడైనను కాని యేకవనవిద్య- వొప్పిచదువగలేదు మెప్పైనతండ్రి - నేనుకల్పనజేయు నేదియురాదు - నీయార్జ్ఞకాగనే నిల్వకావచ్చు - యేదియు చదువక యెపుడైన వినక - యెవ్వరుచెప్పక యేది అడగకను - యెవరిసహాయంబు యెపుడొందనివక - సవరించితినీవె సద్గురూత్తమున- అచలగురుపీఠముకు అధిపత్యముకు- విశదంబుగను గురుడువిధము యోచించ - పరమగురురూపంబు ప్రత్యక్షమయ్యి పన్నుగానాపేరు విన్నవించగను - నాగురుమూర్తియు హర్షంబునొంది - బాగుగనున్నను భక్త రమ్మనుచు - కొన్నిదినంబులకు కొమరొప్పబిలచి - యెన్నికతోడుత యేకాంతమునను చెప్పెను తనగురుడు చెప్పినరీతి - చెప్పకెవ్వరికనియె చెప్పిన మాట - నాకు అంతరములో ఆశ్రమలేకా అధికారమును నాకు నలవియోయయ్య - నేనొల్లనీపాద కమలామృతంబు - నాకుజాలదియేను యిఘయేదివల్ల - ననుచున్న వానిని నయముతోజూచి - నాగురువార్జ్ఞనునాకిచ్చినట్టు - నీకు యిచ్చుట మాయ నిజశిష్యయనిన - నీకేమిభయమికా నిఖిలాత్మకుండు - సకలంబుతాజేయు సద్గురుమూర్తి - అనిపల్కినంతలోనమృడనైతి - వినిగురువార్జ్ఞలో నిమిడియుండగను - తదుపరి బోధయు తనువెల్లడింప - తనపుత్రులంతయు తర్కంబు జేసి - అడుగుచునుండినా అదివిన్నవింప

దుడుకని కొందరూ దుర్మార్గమనిరి - చెప్పవద్దని గురుడు చెప్పినమాట - వప్పుగా నిల్పక వసర జెప్పితిని - తప్పునాదెకాని తగయెవరిదిందు - లోకాప వాదంబులో నేనువెరచి - నిక్కంబుజెప్పినా నిజము నిజమయ్య - తప్పునాదిదియు తగను మన్నించు - వప్పగానసుగావు వరదసర్వేశ - యెవ్వరు నీతోటి యెవ్వరునీసాటి - అయ్యయెవ్వరు లేరు ఆత్మబాంధవులు - తల్లిదండ్రులుగారు తనయులుగారు - తలవమిత్రులు యెవరు తనకును గారు - సతులుపతులైనను హితులెవరుగారు తనవారుగారెవరు తనకెవ్వరులేరు - తనువీంద్రియము లైతె తప్పించుకొనును - పరులుయెవ్వరు గారు పరికించిచూడ - రాజరాజులనైన తేజసురులైన - రక్షించనొక్కరు పక్షంబుగారు - నీవె దైవముగురువు నిజనాధనాకు - నీవెదాతవు భ్రాతమీవె మాతవును - పితృపితా మహపతి బాంధవుడవు - హితబాంధవుడనీవు యిష్టశిద్దీవు - యెన్ని విధములు నిన్ను యెపుడు నుతియింతు అన్ని నీవెరుగుదువయ్య పరమాత్మ - లోకులలోపల లోకాంక్షను వినుము - కాకులవలె వారు కవ్వకవ్వనుచు - కొందరజ్ఞానులు కొరగానిమాట - లందురునిందించి నిరహేతుకమున - పలుకుచు నుందురు పలుగాకులయ్య - చులుకని ముక్తికై తలచుచునుండ - యేపాపమెరగక యెవరినే ననక - చూపిన సంసార సుడియందునుండి - స్వల్పదోషంబుల సగజేయుచుంటి - నిల్పులేకను కొన్ని సల్పినందునకూ - అల్పులునన్నెన్నొ ఆగడంబులును - సంసార విషయంబు సగ అంటదనుచు - సరగునార్జయు యిచ్చి విరివిగందుంచి - పరులనిందలకేల పడద్రోతువయ్య పరులకపకారంబు పరగనేనెరుగ - పరులకుపకారమె మరితోచినంత - పరతత్వమార్గమె పరగ బోధింతు - అదినన్ను అడగిన వారిమదినెరిగి - పదిలంబుగను పక్షపాతంబులేక - తెల్పుచుందును నీవు తెల్పినరీతి - సల్పుదు నీభక్తి మదికందినంత - యిన్నిటికిని సాక్షియిగనీవె అయ్య - నిన్ను పరిక్షింపనేనెంతవాడ - నీకుతెలియనిదొకటి నేజేయలేదు - నాకు దిక్కేనీవు నయ్యుండితీవి పారమార్థీకులు నరులన్న మాట - ఆలకించియు వారి కేదిజేయుదువో - అదినొనరించియు నాదరించయ్య- మాయసంసారంబు బాధతప్పించి- కాయకర్మములన్ని కడద్రోయవయ్య - అహం కారబీజంబు అది అంటుబాపి - అచలసమాధియె అదిస్థిరముజేశి - బ్రతికుండువరకును భారంబునీదె - బాగుగా అభయప్రధానంబు నుండె - మతిచెంచలముబాపి మన్నించవయ్య - అతిచెంచలంబులు అణిగించవయ్య - వరములేమియుగోర వోభక్త వరద - పరమపదంబైన పరగనేనడుగ - నిన్నాశ్రయించిన నిజదేవదేవ - నన్ను నీనిజమందు నైఖ్యంబుజేయు - యెన్నైన నేనొల్ల పన్నగాశయన - నన్నేమిలేకుండ నచలంబుజేయు - వోభక్తజనరక్ష వైకుంఠవాస - నాభయంబును బాపు నాధమన్నాధ - వోజగద్రక్షకా వోదీనపోష - రాజితో నామొర ఆలించవయ్య - నేజేయు పూజ నెనరుంచవయ్య - వోజదప్పినగాని వోప్పుకొనవయ్య - భక్తులకును నేను నాకు భక్తులును - భక్తులవెనువెంట బాగుందుననుచు - ముక్తినాధుడవయ్యి ముందుయీ రీతి - వ్యక్తంబుజేశితివి భక్తికీసులభ - అంతర సన్యాసమును చేశియున్న - మంతనసాధుత్వమయున్న ముఖ్య-సాధుల హృదయమున సన్నిహితమయ్యి- పాదుగానుందునని పల్కియున్నావు- సాధుల హృదయేశ సత్యస్వభావ - నాదబ్రహ్మానంద నమలస్వభావ - ఆపత్కాలాబంధుచూపునీదయను ఆపన్నశరణులఆర్థిభంజనుడ - ఆదిమధ్యానంత అచ్యుతకృష్ణా - ఆవసానమునదలువగైకొనేదేవ -ఆదినాధులకునూ ఆదైనవాడ - ఆనాదిమాయనుహరియించెతేజ - సర్వసర్వేశ్వరాసర్వేశపాహి -నిర్వచనీయుడానిత్యపరాకు - పాహిపాహిముకుందమాంపాహినిత్య - దేహిదేహవిదేహ దేదీప్యమాన- పావనగుణరామపట్టాబిరామ - పరమపావనరామపరంధామరామ - పరశురామా రామ పరమాత్మరామ - నరసింహ్మవామనయ్యోధ్యరామ- శ్రీరామజయరామబలరామరామ-

శ్రీలక్ష్మీనాయకా శ్రితజనరామ - దానవాంతకకోటి భానుశ్రీరామ - నారాయణారామ నరహరిరామ -సారస మునిజనా సన్నుతరామ - మచ్ఛావతారుడాస్వచ్ఛశ్రీరామ - యిచ్ఛకూర్మరామయాశవోరామ -శ్రీకృష్ణవుత్కృష్ణ విష్ణుశ్రీరామ - శ్రీపతిభూపతిశ్రీరామరామ - వుమాపతిసన్నుత వుత్తమరామ -శ్యామ వర్ణారామ సద్గురూరామ - కలిబుద్ధఅవతారకాకుస్తరామ - కలికావతారవోకల్యాణరామ -శ్రీరామరఘురామ శింధుగుణరామ - వెంకటరమణశ్రీవేదాంతరామ - సంకటహరణ భవ శంకరరామ - ధశరథ సుకుమార అసమానరామ - వసుమతిపతి రామ వరభద్రారామ- దశ ముఖమర్దనా దైవశ్రీరామ - రశికజనార్చితా లావణ్యరామ - వోరామ మారామ వైభవరామ - రారామ నాధామ నాస్వామిరామ - లోకలోకారామ లోకేశరామ - పాకారిసన్నుతాలోకాభిరామ - ననుగన్నవాడవు నాతండ్రిరామ - నన్నేలెవాడవు నాధవరరామ - ననుబెంచెవాడవు నామశ్రీరామ -నావంచనంబణచె ఆనందరామ - సుగుణగుణారామ సురవరారామ - అగుణగుణారామ ఆది శ్రీరామ - భవభయభంజనా భవ్యగుణరామ - సవినయసత్వదా సుజనవరరామ - కేశవా గోవింద వాసశ్రీరామ - దాసవిలాస దయానిధీరామ - కోధండధరరామ కోమలరామ - కోటి మన్మథరూప సాటెవరురామ - విశ్వంబరా రామ శాశ్వితరామ - వస్తువాహనరామ వైదేహిరామ -యమదండనాభయాఖండనారామ - శ్రమపరిహారకా క్షేమశ్రీరామ - భువిపాలకారామ బుధజనరామ -రవివంశకులరామ రాఘవరామ - మధుసూధనారామ మాధవరామ - మధురామృతానామ మక్కువరామ - పురుషోత్తమారామ పుణ్యశ్రీరామ - పురుషవాఖ్యాహర పరమశ్రీరామ - అప్రమేయారామ హరివరరామ - సుప్రదీపక రామ విప్రజనరామ - శ్రీజానకీరామ చిన్మయరామ - వోజనార్దనరామ తేజాత్మరామ - దామోదరా రామ ధన్యశ్రీరామ - వ్యామోహ సంఛేద కామహరరామ - ప్రద్యుమ్న అనిరుద్దప్రత్యేక్షరామ - శిద్దశిద్దరామ ప్రాశిద్దరామ - శ్రీఆదోక్షజ రామ శ్రీకరరామ - మాఆత్మబాంధవ్య శింధుసుధరామ - పక్షివాహనరామ లక్ష్మణరామ - రాక్షసాంతకరామ అక్షయరామ - యాగరక్షకరామ యోగాంగ రామ - ఆగమాగమవినుత అమితశ్రీరామ - దుష్టనిగ్రహరామ కష్టహరరామ - శ్రిష్టిసన్నుతరామ శిష్టాత్మరామ - వాసుదేవారామ వర్నింతురామ - పాశభంగారామ ప్రణవాంగరామ - సాలోఖ్య సామీప్య సారూప్య రామ - సాయుజ్యసారిష్ట సద్మోక్షరామ - పదవులందగజేశె సదయశ్రీరామ - వదన మందునా వెదములునున్నరామ- కరుణించు కరుణించుకరుణాలలామ- స్మరియింతు నీయెందు స్మరణుంచు దాక - యిట్లునెప్రార్థింతుయెల్లకాలంబు - యెట్లుకడతెర్తువో యేదెరుగనయ్య నాసుత్తి నీమది కందెనోలేదో - నావిన్నపము శృతమాయనోలేదో - నామదిపదశేవకైనమెచ్చితివో బంటుకుబంటునై బడలియున్నాను - కంటకంబులుబాపిజంటనీవుండు -మ్రొక్కెద నీకికా మోదంబు తోను- దక్కెద నీకికా దాశినేనయ్య - దశధిశలందునాదండ మర్పింతు - విశదంబు తోడుత వినుయెన్కముందు - యిరుప్రక్కలందునా యిరువుతోజేతు - అరలేనిభక్తితో అమితొందనములు - పలుమారునీకికా ప్రణతులొనర్తు - వీలులేనటువంటి వినుతులొనర్తు - అమిత వందనములు ఆర్పించెదాను - స్తిమితంబుతో నీకుతిన్నగాజేతు - వైలులక్షలుకోట్లు వేలనంతములు వాలాయముగ నమస్కార మర్పింతు- యిరువదివకవెయ్యి ఆరువందలును- అరువది ఘడియలకు అర్పింతుజపము- కలకాల మీరీతి గడుపు కృపవుంచి- కలలోనిపనులలొ తగిలించ కాను - మేలుకాకార్యముల్ మెలుగించ చేయు - చాలగావెలివెర్తి భాలగోపాల - వరరామదాశిటుల వర్ణించెనయ్య మోరలాలకించియు మోక్షంబులిమ్ము - శీఘ్రంబు శీఘ్రంబు శీఘ్రంబుయివ్వు - శ్రీరామ శ్రీరామ శ్రీరామరామ!!

భగవత్ ప్రార్థన ద్విపదవాక్యము సంపూర్ణము

# అఖండదైవస్తుతి

క!! శ్రీగణనాధునినిశము - బాగుగనేగొలిచెదాను - భక్తితొ యిపుడున్ వేగమెనను బ్రోచుటకును - త్యాగముగను రాగదయ్య సద్గురునాథా !!

73. గణపతి సుత్తి ఆటతాళం: రాగము:

పరమేశునందాన కరిమూఖవదనా - గిరిరాజ సుతనంద థరణిశుభాంగ !!ప!! పరమ పావన ప్రథమదేవర సకల విద్యల కార్యములకు ప్రకటమైయ్యిన వరగజానన సురనరాధిప సుప్రకాశ !!పర!!1!! బోజ్జాదికావేషగుజ్జు స్వారూపా -సజ్జానవిధేయ దుర్జాపహారి -విజనవాసు సుజనధేయుడ భజన జేశెదరయ్యనిన్నిక అజసురాధివరులకైనను అగ్రజంబగు విగ్రహుండవు అనుచుత్రిజగము ప్రస్తుతించెటి !!పర!!2!! మూషికవాహన మునిజనవేషా - భాషదిదేవాధి దీటుస్వారూపా - దాసవాస భక్తహాస ఆశపాశదురితనాశా - వాసపామెన నివాస దాసరామ భక్తరక్షణ !!పర!!3!!

సరస్వతిస్తవము

క!! సరస సరస్వతిదేవిని - సరసముతో నాదువా:కు - యందుననిల్చి విరసములేకను నన్నును - వరుసతో పలికించు మనుచు వేడెదయిపుడున్ !!

74. ఏకతాళం: రాగము:

నమస్కరించేద సరస్వతీ - నినునిధాన మొందీయు సరస్వతీ - సమంబుయగుదయ నాయందు యుంచియు - సనాతనంబగు పురాణరాణికి !!నమ!!1!! వాణీశారాదదేవి వీణాధరి రాణించి మ్రొక్కెద రమణీమణీ - పాణివాణిఆజరాణి వేద - గీర్వాణి అయ్యిన శార్వాణి శుభావాణి !!నమ!!2!! విద్వాలసద్దర్మిముద్దీయరో విద్యాధికారీవి విమలాక్షిరో- వద్దానేనిల్చీయు ముద్దూగ నానోట సుద్దులు అన్నియు వర్దీకజేయను !!నమ!!3!! పరాకుశాయకు వరాననా నీవాడనైతిని నిజాననా మొరాలకించియు బిరానవచ్చియు - సరానబ్రోచియు వరంబులివ్వుము !!నమ!!4!! సకలా విద్యాధికారి శారాదరో - అకలంకవైభావతెజాంబరో - ప్రకటించి పల్కూము యికనాదు వా:క్కూన సకలాము స్తుతిజేయు సుఖమూగ రామదాసు !!నమ!!5!!

ఆంజనేయప్రార్థన

గీ!! ఆంజనేయ నీవు అంజనారూపమై -రంథిలోవున్న శ్రీరాములకును సంజీవి ఆద్రిని సంతోషముతొదెచ్చి - భంజనుడవైతివీ భజేరామదూతా !!

75. ఆదితాళం: రాగము:

వీరాంజనేయ ఘోరాంజనేయ - మారూతివరపుత్ర మహదాంజనేయ !!ప!! వానారవీరవైభావ తేజ మానీతజేనమంగాళకార !!వీర!!1!! శ్రీరామదూత శ్రీతజనదాత - కారుణ్యమీత్రకనకాసుగాత్ర !!వీర!!2!! సంకాటహారా సకలాధికారా - హంకారదూర అధికాధికార !!వీర!!3!! బింకాముతోను హంకారులాను- సుంకాణగించె మంకూగుణాడ్య !!వీర!!4!! అసురాకులాంత శశిధారతేజ- అసమాన శ్రేష్ట వసుధాప్రాశిద్ద !!వీర!!5!! వుగ్రాదికారా విగ్రాస్వరూప - ఆగ్రహతాప అతిదుష్టహారా !!వీర!!6!! ఘోరవారాశిధూరగజేసి - పారాముజెందించా పరమాత్మసాటి !!వీర!!7!! మారూతిరాయ మంగాళ దాయ - వారాహిధూమ్రాక్ష వరమంత్రకాయ !!వీర!!8!! యెవరునీతోటి లేరుసుమేటి - సవరించి బ్రోవాను సద్గూణదాటి !!వీర!!9!! వింటీవోయయ్య బంటూనోయయ్య- కంటాకంబులు అన్ని గెంటు మాయయ్య !!వీర!!10!! పావాన వెలివెర్తి పరమప్రకాశ - పాలించుమీ రామదాసనుపాల !!వీర!!11!!

76. కీర్తన: ఏకతాళం: రాగము:

నారాయణహరి నమోస్తుతె - పారాయణ శ్రీనమోస్తుతె - కారణకర్తకు నమోస్తుతె -కలుష హారికి నమోస్తుతె ॥న॥1॥ త్రిభువనపాలక నమోస్తుతె - శుభసంపత్కర నమోస్తుతె - అభయదాతకు నమోస్తుతె - ప్రభురాయునకును నమోస్తుతె ॥నా॥2॥ పరమపురుషునకు నమోస్తుతె - దురిత దూరునకు నమోస్తుతె - భరిత ఖేలునకు నమోస్తుతె - భవభయ హరునకు నమోస్తుతె ॥నా॥3॥ త్రిగుణగుణాత్మకు నమోస్తుతె - సగుణతీతుకు నమోస్తుతె- అగుణరూపునకు నమోస్తుతె- అవ్యయ పదముకు నమోస్తుతె ॥నా॥4॥ కర్తకుభోక్తకు నమోస్తుతె - భక్తోర్లాసుకు నమోస్తుతె - భక్తిసులభునకు నమోస్తుతె - భగవంతునకు నమోస్తుతె ॥నా॥5॥ అంతరంగునకు నమోస్తుతె - సంతతమూర్తికి నమోస్తుతె - ఆదిమూర్తికి నమోస్తుతె - అఖిలాధారికి నమోస్తుతె ॥నా॥6॥ దుష్టనిగ్రహుకు నమోస్తుతె దుర్జనహారికి నమోస్తుతె - శిష్టపాలునకు నమోస్తుతె - సజ్జనశ్రేణికి నమోస్తుతె ॥నా॥7॥ సర్వాకారికి నమోస్తుతె - సర్వాధారికి నమోస్తుతె - సాకారునకును నమోస్తుతె - సర్వసర్వేశుకు నమోస్తుతె ॥నా॥8॥ హితదైవమునకు నమోస్తుతె - సతతప్రఖ్యాతికి నమోస్తుతె - పాతకహరునకు నమోస్తుతె పావనమూర్తికి నమోస్తుతె ॥నా॥9॥ రామకృష్ణునకు నమోస్తుతె - శ్యామవర్ణునకు నమోస్తుతె - స్వామి చరణమునకు నమోస్తుతె - ప్రేమాకరునకు నమోస్తుతె ॥నా॥10॥ నిరాకారునకు నమోస్తుతె నిరువైరేశుకు నమోస్తుతె - నిఖిలాత్మునకు నమోస్తుతె - నిశ్చలత్వముకు నమోస్తుతె ॥నా॥11॥ దీనబంధువుకు నమోస్తుతె - దివ్యసాంద్రునకు నమోస్తుతె దానవహరునకు నమోస్తుతె - మానవనాథుకు నమోస్తుతె ॥నా॥12॥ వెలివెర్తీశుకు నమోస్తుతె - వేదాంతునకు నమోస్తుతె- వసుమతీశునకు నమోస్తుతె - వరరామదాసుడు నమోస్తుతె ॥నారా॥13॥

77. కీర్తన: ఆదితాళం: రాగము:

శివశివశీవాశివాశంకరా - శివహరశంభోశంకరా ॥ప॥ గౌరిమనోహర శంకరా - గరళకంఠ శివశంకరా ॥శివ॥1॥ కరిచర్మాంబర శంకరా - కరుణభరణ శివశంకరా ॥శివ॥2॥ నాగభూషణా శంకరా - రాగరహితభవ శంకరా ॥శివ॥3॥ భస్మలేపనా శంకరా - భస్మాసురవర శంకరా ॥శివ॥4॥ రుద్రాక్షాధర శంకరా - రౌద్రగూణాధర శంకరా ॥శివ॥5॥ మృత్యుంజయా శివశంకరా - ముక్తాభరణా శంకరా ॥శివ॥6॥ త్రిపురాసూరహర శంకరా - త్రిపురపురాహర శంకరా ॥శివ॥7॥ భవభయభంజన శంకరా - భక్తసులభ శివశంకరా ॥శివ॥8॥ సదసదాత్మఘన శంకరా - చిన్మయవేషక శంకరా ॥శివ॥9॥ పురహరయీశ్వర శంకరా - పరమాస్వరాట్టువుశంకరా ॥శివ॥10॥ విశ్వేశ్వారశివ శంకరా యిలవెలివెర్తిల శంకరా ॥11॥ వరరామదాసానుత శంకరా - పరమగూరూవర శంకరా ॥శివ॥12॥

78. ఆటతాళం: రాగము:

జయజయరామా జయశీతరామా - నయగుణధామా నాధసూత్రామ ॥ప॥ శ్రీపతిరామా భూపతిరామా -వుమాపతిసన్నుతవుత్తమరామా ॥జయ॥1॥ కౌశికయాగసంరక్షరామా - కౌసల్యా సుత కరుణాలలామా ॥జయ॥2॥ లక్ష్మణఆగ్రజ లక్ష్మీశురామా - మోక్షస్వరూప ప్రత్యేక్షశ్రీరామా ॥జయ॥3॥ రాతినినాతిని జేశినరామా - భూతలమూన ప్రఖ్యాతివిరామా ॥జయ॥4॥ సుగ్రీవాంగద అగ్రజరామా- భార్గవరామునిభంగవిరామా ॥జయ॥5॥ హనుమంతుగూణావంతు జేశినరామా - ఘనభక్తులాకు వరమిచ్చినరామా ॥జయ॥6॥ వానరవీరులయేలినరామా- దానవులాను దండించిన రామా ॥జయ॥7॥ గుహుని రక్షించినగుణనిధిరామా - బహుసత్యసంధూడై బరగినరామా ॥జయ॥8॥ పక్షూలకూవరమిచ్చినరామా - యీక్షితిలో వీలక్షణరామా ॥జయ॥9॥ శరణన్న వారినికరుణించె

రామా - బిరుదువేశినా దివ్యఅవతారరామా ॥జయ॥10॥ శ్రీరామరాఘురామ వోరామరామా మారామదాసును మన్నించురామా ॥జయజయరామ॥12॥

79. కీర్తన: ఆదితాళం: రాగము: ఫీల్

శ్రీరామా జయారామ శ్రీసీతారామా - శ్రీశ్రీసీతారామా - వోరామామారామ వోసుధీశ రామా వోసుధీశరామా ॥ప॥ నారాయణాచ్యుత నరసింహరామ వోనరసింహరామా - పారాయణా రామ పరమేశరామ వోపరమేశరామా ॥శ్రీ॥1॥ మాధవధోక్షాజ మధుసూదనరామ వోమధుసూధన రామా - సాధురక్షణరామా సత్యశ్రీరామా వోసత్యశ్రీరామా ॥శ్రీ॥2॥ కేశావగోవిందకృష్ణశ్రీరామా వూత్కృష్ణశ్రీరామా- ఆశపాశావినాశ యీాశశ్రీరామా వోయీాశశ్రీరామ ॥శ్రీ॥3॥ విష్ణుత్రివిక్రమ విభుడ శ్రీరామా - వోవిభుడాశ్రీరామా - వైష్ణవసన్నుత వైభావరామా వోవైభావరామా ॥శ్రీ॥4॥ వేదవేదాంతార్ధ వేద్యుడారామా వోవేద్యుడారామా - నాదపీఠామునందు నటియించెరామా వో నటియించెరామా ॥శ్రీ॥5॥ శ్రీవాసుదేవ ఆశ్రితకల్పవృక్ష ఆశ్రితకల్పవృక్ష - రావయ్య రక్షించరఘుపతి రామా - వోరఘుపతి రామా ॥శ్రీ॥6॥ ధరలోన వెలివెర్తి వాసదాతవోయి రామా నీవుదాతవోయిరామా - మారామదాసూను మన్నించురామా వో మన్నించురామా ॥శ్రీరామా॥7॥

80.కీర్తన: ఆటతాళం: రాగము:

రామచంద్రా రాఘవేంద్ర ప్రేమయేలరాదయా - బృందమోహనాదిశౌరి యిందిరారమణీవరా మందరాద్రి గిరిధరా గోవర్ధనా గోవిందుడా ॥రామ॥1॥ అందమైననందారూపా పొందిభక్తి జేసెదా అందుయిందూ యెనకనిన్ను యెందునాను జూచెదా ॥రామ॥2॥ రమణగూణా సారసింధు రాజిత సుగుణాకరా - విమలగూణాసాంద్రచంద్రా రాజితానీరంజనా ॥రామ॥3॥ నీవేకానీవేరులేదు యేది యైనను రామయో - భావభావాములకు నంటనిభద్రమూర్తి వీవయో ॥రామ॥4॥ రామరామా రామనామా ధారురాముడరాగదె - రామదాసునిబాధమాన్పియు రక్షబెట్టుటఘనమయో ॥రామ॥5॥

81. కీర్తన: ఆదితాళం: రాగము:

రామరావే రఘుకుల ధామబ్రోవే - రామరామరామరాజకులోద్భవ - తామరసాక్షసునామ సురక్షిత ॥ప॥ తలతునయ్యా నిన్నేకొలతునయ్యా - పిలచెదనిన్నిక ప్రియరక్షకుడని - కలకాలంబును కరుణించుటకును ॥రామ॥1॥ కందునయ్యా కన్నులవుందువయ్యా - కందునురామ నిరామయ నిశ్చల - బిందునాదుకళలొందనిశితా ॥రామ॥2॥ అప్పరావేహరి కందర్పరావె - అప్ప అప్ప నీచొప్పున నన్నిఘ - యిప్పుడె కాచియు గుప్పమునీదయ ॥రామ॥3॥ అన్నరావే సర్వసంపన్నరావే - మన్నించు మినను పన్నగశయనుడ - సన్నుతిజేశెద ఆపన్నసురాధిప ॥రామ॥4॥ వాసుదేవా వరరామదాసు బ్రోవా - యేశినబిరుదిపుడేదొ దలంచుమి - యాసటజెందితి చూచుటయెన్నడో ॥రామరావె॥5॥

82. కీర్తన: ఆటతాళం: రాగము: భీంప్లస్

శీతారామాణం పాతకహరణం -దాతారామం -శీతామాతం ॥ప॥ భాగవతాగ్రగణ్యం సుభ్రాత్రుం భగవత్ సత్కృప బహునిక్షేపం ॥శీతా॥1॥ సద్గురుమాంత్రం సకల విద్యార్థం - మద్గురుచెరణం మహిని కుదార్థం ॥శీతా॥2॥ తవదాసార్చిత తత్తులశీదళ - భవరోగాంతకమవుషదమూ ॥శీతా॥3॥ సంసారార్ణవశేతోబంధం - హంసోహంసం ఆత్మరామం ॥శీతా॥4॥ వెలివెర్తీవర వేద వేదాంతాం-ఫలదాయకహరి పావనచెరితం ॥శీతా॥5॥ వరరామాహృది సదనసంచారం - కరుణాలలామం కాకుస్తసోమం ॥శీతారామాణం॥6॥

83. కీర్తన: ఏకతాళం: రాగము:

రామమాంత్రమూ పామరాంతమూ - నామమూలకన్నధామమైన మూలమూ !!ప!! అక్షరా ద్వయం రక్షణోపాయం - పక్షివాహనం లక్ష్మీనాయకం !!రా!!1!! చతురాక్షరం చెందుతాక్షణం హితులజేసు యెంతా పతితులైనగాని !!రా!!2!! శ్రీషడాక్షరం శీఘ్రమేఫలం- శిద్ధశీద్ధులాకు శిద్ధులిచ్చెశ్రీ !!రా!!3!! రామదాసునీ మోసపోకనీ - ప్రేమతోడ దివ్యానామమీచ్చె గురు !!రా!!4!! వేగమూగనూ వెలివెర్తి లోననూ - జాగులేక దీన్నిబాగుదలచముక్తి !!రామమాంత్రమూ!!5!!

84. కీర్తన: ఆదితాళం: రాగము:

విడువజాలనయ్యా రాఘవ మరువజాలనయ్యా - విడువజాలనిక విధియు దింపినను పడిపడినిన్నే శెరణముజేశెద !!వి!!1!! యెన్నిజన్మములనూ యెత్తిననిన్ను మరువకుందూ - నన్నిక యేమరకన్ని జన్మములు - సున్నజేయు ఆపన్నదయానిధే !!వి!!2!! జారవిడువకయ్యా నామొరవేగమే వినవయ్యా - జారచోర వీచారములోమది - దూరునుచూడుము నీయెడ నిలువదు !!వి!!3!! రాపుయాలనయ్యా నాయెడదాపువుగదనయ్యా - కోపగించకను ఆపదబాపియు - చేకొనుమో కరుణాకర శ్రీహరి !!వి!!4!! దాసదాసుడయ్యా రామాదాసుడు గదనయ్యా - మోసములన్నియు మొదటికిద్యంచియు - యేశినబిరుదిపుడేదొ తలంచుమి !!విడువజాలనయ్యా!!5!!

85. కీర్తన: ఆదితాళం: రాగము:

రామా రాఘుకులధామా - రామరామరామరాజవిజైభవ -పామరమార్గాది పాపావిఖండాన !!రా!!1!! సీతాలక్ష్మణ భరతశత్రుగ్నా - సీతామారుతి మూకసమేతా !!రా!!2!! అయోధ్యాపుర అల రాజాధిప - అంగదసుగ్రీవా భృంగసమేతా !!రా!!3!! దర్మసంస్తాప అధర్మా దురాంతక - కర్మహరణ నీష్కర్మ దయానిధె !!రా!!4!! రాజరాజమహరాజపూజితా - రాజతేజసురరాజశేవితా !!రా!!5!! సత్యవాక్య పరిపాలనశీలితా- నిత్యనీత్యనిజసత్యస్వభావ !!రా!!6!! వెలివెర్తిపురయిల రక్షాకర- సలలిత రామాదాసా రక్షక !!రామా!!7!!

86. కీర్తన: ఆటతాళం: రాగము:

రావయ్యాదశరధరామ - వోరాక్షాసాంతక సార్వాభౌమా -రావయ్యా రణశూర రవ్వాలన్నియు మాని - రాజీతోడరమ్మి రమ్యాగుణాధార !!ప!! చంద్రాచెకోరాములీతి నీకు చెయిజాచితిని ధర్మా ఖ్యాతీ - చేపట్టావయ్యా వో చక్రాయుధాధరా - చెలగీచేకొనవయ్యా క్షేమామేరుగకున్న !!రా!!1!! కామించియున్నాను సుమ్మీ నిన్నె నేమించుకున్నానునమ్మీ - భామారోరమ్మాని భ్రాంతూలన్నియు దులపీ - కామితార్థములివ్వె కాంతాస్థాలంబుకు !!రా!!2!! విజనాస్తాలంబూన గలశీ నావిధమూ లన్నియు నీవెతెలశీ - సుజనాసూఖంబూను సోంపూ వాహించీయు - భజనీయుడావయ్యి భక్తికి సులభామై !!రా!!3!! ఆవునిడువని ల్యాగాలీతి నిన్ను అనుసారించియునూ వున్నాను - దవ్వుకేగిన ఆవుతనయూల కడకేగె - గోవులీతిగనన్ను కనిపెంచటానీకి !!రా!!4!! సర్వాధిపతివానుకున్నా నీవె సర్వావాసుడవానికన్న- పర్వామురాకడ ప్రాణమానఘన - నిర్వాణావరరామదాస రక్షాశ్రిత !!రా!5!!

87. కీర్తన: ఆటతాళం: రాగము:

పలుకవెందుకురా పిలచినగాని పదరారామయ్య - పలుకవేటికి పంతమేలను చింతదోచె నిరంతరంబున - చిల్కపలుకులు ఆలకించియు శీఘ్రముగ మోక్షంబు లిస్తివి !!ప!!1!! ఝుడుపూ దోచెనురా జానకిరామ గడువూ జేయకురా - దుడుకుజేయకు దొరవునీవని తలచినమ్మితి

ధర్మసాక్షిగ - కడకుదోలుము ఖర్మములుమరి కరుణసాగర కలుషభంజన !!ప!!2!! నీసారివారూ యెవ్వరులేరని మురిశేవుగానీ - వాసవాదివినుతుడావని వేడినందుకు జూడనైతివి - వ్యాసటాయను నాదు మనుసుకు దోషమొచ్చును సుమ్మినీకిక !!ప!!3!! ఘనులాకిది తగునా వీనులవింటె మునులూ మెచ్చుదురా - పనికిమాలిన బంటునంచును పలుక అనుమానించెవేమో - వినుతి జేయుచునున్నవాడను వినవదేలను విశ్వరూపా !!ప!!4!! మరువాబోకయ్యా యెప్పటికిదియు స్థిరమూగాదయ్యా - యిరవుతోడుత రామదాసును కరుణజేసియు బ్రోవకున్నను - శిరియు మెచ్చకనిన్ను జేరదు కరువుగల్గును కానిచూచెవు !!పలుక!!5!!

88. కీర్తన: ఆదితాళం: రాగము:

రామాదయానిధే రామాదయానిధే రామా దయానిధే - రామాహరే !!ప!! నీలానీరదగాత్ర నిఖిలాంబుధాస్తుత - నిగమాదిసన్నుత రామాహరే !!రామా!!1!! నరులాను జేతూవు శిలలానైనను గాని - కరుణామృతారామ రామాహరే !!రామా!!2!! వానార వీరూలతోనైనా కార్యాము - వరుసా జేయించిన రామాహరే !!రామా!!3!! అజటాయువు సీతాకైపోరివోడినా - హస్తామందున లయము రామాహరే !!రామా!!4!! మారీచుమృగముకు మహిమాతో సర్వము - నీరూపమగుపాడె రామాహరే !!రామ!!5!! జంతూవులైనాను యెంచాక చెయిమోపి - సంతోషామొందిచె రామాహరే !!రామా!!6!! నరసూరామృగపక్షి క్రిమికీటాకములైన - సరగూనాబ్రోతూవు రామాహరే !!రామా!!7!! నీచము లెన్నూట నీతిగాదనుచూను - సచరాచేరమునేలె రామాహరే !!రామా!!8!! శతకోటి విస్తారమగునీదు చారిత్రా - పృధ్విపై నిండెను రామాహరే !!రామా!!9!! యితారాము లెంచాక గతినీవె అనితాల్వా హితమూలొందగజేయు రామాహరే !!రామా!!10!! వరుసాతో వెలివెర్తి వరరామాదాసును - నరశి రక్షించెటి రామాహరే !!రామాదయానిధే!!11!!

89. ఆదితాళం: రాగము:

యేమయ్యరామయ్యా ననురక్షించుటకును దీక్షవహించియు !!ప!! శృంగారంబగు రంగు చెలంగగ- బంగరుచేలము ముంగిటజారగ !!యే!!1!! పాహిపాహియని కరిమొరలిడినను- పరుగున వోచ్చియు కరుణించినయటు !!యే!!2!! తండ్రిబాధలకు తగప్రహ్లాదుడు - తలచిన స్తంభములో వెడలితివట !!యే!!3!! తరుగనివలువలు తగద్రౌపతికిని - తలచినసభలో మరియొచ్చితివట !!యే!!4!! బిరబిరవచ్చియు కరుణవహించియు - కరమరదుగనను కడతేర్చుటకును !!యే!!5!! సరసిజవందిత సురముని పూజిత - ధరవెలివెర్తిల దాసునికడకును !!యేమయ్య!!6!!

90. ఆటతాళం: రాగము:

శ్రీరామచంద్రూనిరమ్మానె - శీఘ్రామెననుబ్రోచిపోమ్మనే - మారామచంద్రూనిమన్నించు మనిచెప్పీ- వారిజాక్షిరోయిందూ త్యాగదే- నీవూకోరిన వీచ్చేదపోగదే !!శ్రీ!!1!! నీవెసర్వంబాని పల్కవే నీరాజాక్షుని కనులాజూపవే - భావమందునమహభయభక్తి తోడూత - శేవానుమది బాయకున్ననే క్షేమామెరుగజాలకున్ననే !!శ్రీ!!2!! ప్రాణాపాదంబాను కున్ననే సర్వప్రాణాసఖుండాని విన్ననే - పామా రత్వముచేతా పాలించునిఖిలాము - వేణూగోపాలుడుకాడటే - వీణాదారివినుతూడాయనే !!శ్రీ!!3!! భామానావశముగాదాయెనే మనుసూభ్రాంతూలన్నియు బెట్టూచుండునే - కామితార్థము లెన్నో కల్పానజేయును - ధామూడురాముడనుకొన్ననే- ప్రేమావుంచియుయిటకు రమ్మానె !!శ్రీ!!4!! మనసూ పదముకులగ్నామాయెనూ- నాహింసలన్నియు బోవానాయెనూ అనిశామునినుబాయా నాచారమును తెల్పూ - అనుచూ నిముషమ్మూను అతనీస్మారింపూచు !!శ్రీ!!5!! భారమంతయు

నీదేఆనవే - సర్వాభారాకుడయ్యేవున్నాడదే - సారాములేనీవిచారా నివ్వకు - నేరములెన్నాకుమానవే సారాసాక్షిరొసరగూననెగవే ॥శ్రీ॥6॥ ధరలోనవెలివెర్తి ధాముడె ధన్యులజేసెటి దీరుడే - కరుణా సాగరుడైన కమలాసవినుతుని - వరరామదాసుడు వేడెనే సరసీజాక్షిరో పోయిరాగదే ॥శ్రీ॥7॥

91. ఆటతాళం: రాగము:

గోవిందరాంరాం గోపాలహరెరాం- గోవిందరామకృష్ణ గోపీజనోల్లాభ - గోవర్థనోద్దార దేవేంద్ర నన్నూత ॥గో॥1॥ దేవాకినందాన దేవజనబృందాన - భావాజకారూడ పరమాదయళూడ ॥గో॥2॥ రాధామనోహర నారాయణాచ్యుత - బోధాస్వారూపాక వెదాంతవెద్యూడ ॥గో॥3॥ కెశావమాధవ యీశాజనార్థన - వాసుదేవచ్యూత వైభావవైకుంఠ ॥గో॥4॥ సుందారకారూడ మందారొద్దారూడ యిందీవరవారనందా వెలివెర్తీల ॥గోవింద॥5॥

92. ఆటతాళం: రాగము:

కనికారమింతైన లేదుగా నన్ను కష్టాపెట్టుట నీకుమెలుగా - పనిబూని బ్రహ్మాండపాలాన జేయుచు వినకా కనకున్నావు విహితూడనేసుమ్మి- అనిషమూ నినుదలచెవరమిమ్మూ - యింద్రియ వృత్తులమనుసే తిరుగును తరలిమరలించూ - నీమనుసుగాని -వినుతి జేశెదవినదు నాకది విహితములు బోధించి నిల్పను - ప్రణుతిఆర్తిభంజనుండవు ప్రస్తుతించినగానివినవూ ॥క॥1॥ నా గూణములు యెంచావలదూ - లేనిమాయాల నన్నుంచావలదూ - రాగాదిగుణమూలు రంజిల్లు చున్నావి - భోగాభాగ్యంబూలు కోరీకలణగావు - బాగుజేయను నీవెప్రభువంటీ బల్విటుడ కుటిలుడ జాగుశేయకరమ్మురమ్మంటీ- నీకన్నఘనులు నిక్కమెవ్వరులేరులేరంటీ- నీయిష్టమిగనూ నిగమ ములు యెన్నైనచాలవు నిన్నువర్ణన చేయలేవవి - ఆగములు బోగడువజేయుము అప్రమెయ ముకుంద మురహర ॥క॥2॥ కొరగాని నరుడాను నిజమూ నీకూ కోపామొచ్చినగాని విడనూ - కరుణారానటువంటి కర్మాముజేశిన - తరుణోపాయము జేయమరినిన్ను వేడితి - దొరవు కలవని మురయుచునువుంటీ- వరవాసుదేవ మరుపుజెందియు దుడుకుజేశితినీ- తెలివేమిలేకా యెరుకా చాతకొన్ని జేశితినీ - పరమపురుషాభవ్యవేషా కరినిబ్రోచినశిరిసమేతా - వరములిచ్చియు రామ దాసును ప్రస్తుతంబులు మాన్పుటకుహరి ॥కని॥3॥

93. ఆటతాళం: రాగము:

హరెరామ రామరఘురామా శీతారామరామ శ్రీరామ ॥ప॥ పురాహరార్చితా పదా - సురా సురా నరాధిపా ॥హ॥1॥ నీవేదాపు అనుకున్నా - నిఖిలాదారూడనీవన్నా ॥హ॥2॥ యెవరైతె లేరు నీకన్నా - యెరుగావలశినాది యేమన్నా ॥హ॥3॥ బీరానామొరాలించూ - సరానయిందు యేతేంచు ॥హ॥4॥ ధరాయందూన వెలివెర్తీ - వరరామదాసు వర్ణించు ॥హరెరామ॥5॥

94. ఆదితాళం: రాగము:

సాంబరారాశివసుగుణాంబరారా ॥ప॥ అంబరరూప చిదంబరచిన్మయ కుంభిణి సన్నుత అంబమనోహర ॥సా॥1॥ పరమపురుషహర ప్రమధగణాస్తుత - ధరవరదాయక దైత్యకులాంతక ॥సా॥2॥ కంబుకంధర గౌరినాయకా - దంబరహిత సురబృందసురార్చిత ॥సా॥3॥ చంద్రశేఖరా సుందరాకారా -నందివాహనానందకృపాకర ॥సా॥4॥ పతితపావనా పాపభంజనా - పామెనాధిపా వర సుధామృతా ॥సాంబరారా॥5॥

95. ఏకతాళం: రాగము:

రామరాజ యిందురాగదే - నన్నేలుకోవె రాయభారమెము తెల్పవే - రామనాదున్నారమేమొ భేదముంచకానుతెల్పు - స్వామికయిన తరముగాదు నాదుఖర్మజాలమూలు ‼రా‼1‼ నిన్నెకాని అన్నమెరుగనే వోనిరజాక్ష మన్ననెంచవలయునీవలే - వున్నరెవరుతెల్పవయ్య పన్నగారిశయన యింత - కన్నడేలజేసెదావు సన్నుతించుచున్నవాడ ‼రా‼2‼ ముందుమధ్య అధికులేవ్వరూ యిఘ ముందరీకి వుందురయ్యసములు నీకునూ - అందరూ నావలెను నిన్ను అనుసరించినారుగాని మందబుద్ధులైన వారే చెందబోరు నిన్నుయెపుడు ‼రా‼3‼ వుడుతనీకు యేమియిచ్చెనే వున్నంతదెల్పు విపరియాసమేల జేశెవే - అడుకూవాతో గ్ణానయోగ ఖర్మయోగమనుసరించి - మిడుకుచుందు రెందరోమరి మీదుదయను గల్లకున్న ‼రా‼4‼ నీదుకృపకు సమమురావికా యెన్నైనవట్టీ సాధనాలె పనికిరావికా- పాదులేపుభవములాను పాలనాధికారివనుచు - సాదువయ్య రామదాసు సత్యమూగ నమ్మినాడు ‼రామరాజ‼5‼

96. ఆదితాళం: రాగము: మాల్‌కౌంస్

రామచంద్రా శ్రీరాఘావెంద్రా ‼ప‼ రామరామరణభీమపరాక్రమ - సోమరఘుకులా ధామ సురోత్తమ రామచంద్రా ‼రామ‼1‼ నారయణహరి నలినదళేక్షణ - పారావార మురారి దురాంతక ‼రామ‼2‼ కారుణికోత్తమ కలుషభంజనా - ధారుణిపాలిత ధర్మదేవతా ‼రామ‼3‼ కేశవాచ్యుతా శ్రీకరమాధవ - పాశభంజనా బహు నిరంజనా ‼రామ‼4‼ మధుసూధనశౌరి మౌనిగణస్తుత - విధిజనకావన విప్రపోషణా ‼రామ‼5‼ రాజరాజమహరాజపూజితా - రాజతేజమహరాజ విజైభవ ‼రామ‼6‼ ధారుణి లోపల తగవెలివెర్తిల - వరరామాహ్వాయ వర్ణ శుభాకర ‼రామ‼7‼

97. ఏకతాళం: రాగము:

శ్రీరామా శ్రీరామా శ్రీరామయనుడి -శ్రీరామమంత్రాము శీఘ్రామెగొనుడి ‼ప‼ జన్మాఖర్మము అనె జలప్రావహంబూ - జయము గీదగజేయు జన్మరాకుండా ‼శ్రీ‼1‼ శ్రీతారాకంబును భవవార కంబూ - ఘాతసంసారాది పాతకహరణం ‼శ్రీ‼2‼ ఆదిబ్రహ్మాదులు కోరీననామం - సాధూలకైనాను సాధకనామం ‼శ్రీ‼3‼ వాల్మీకులాదీగ వర్ణించెధీమం - వసుధపావనమూను విశదామగుధామం ‼శ్రీ‼4‼ యెంతపాపమునైనా వంతూబాపించూ - సుంతైన తలచీతె చింతాలొదిలించూ ‼శ్రీ‼5‼ పురుషులేకానీ శిశువూలెకానీ-చాలాగమదినిల్పిన జాలిమాన్పించూ ‼శ్రీ‼6‼ యేజాతివారైతె యెవ రైతె నేమీ - వోజాదాప్పకతల్వా వచ్చూముక్తరుదూ ‼శ్రీ‼7‼ తననాశ్రయించీనా తరియింపా జేయూ తగిలీజపించీనా తత్వశిద్ధగునూ ‼శ్రీ‼8‼ తనునమ్మూవారీని తగనిందజేయా - మనుజా సంఘము లాకు మార్గామివ్వాదూ ‼శ్రీ‼9‼ కాలక్షేపంబీది గావించవలెనూ - యేలావ్వర్ధముగా కలలాడు కొనియెదరూ ‼శ్రీ‼10‼ ధారుణి వెలివెర్తిధామూనిసాక్షీ - పారాయణముజేయు వారాలెసాక్షీ ‼శ్రీ‼11‼

98. అటతాళం: రాగము:

పట్టీవిడుచుటకన్నా ప్రాణామిడుచుటమేలె వట్టివారలకయ్యినా - వోరామయ్యా యెట్టివారల కయ్యినా ‼ప‼1‼ రామావతారాన రణరంగామున శత్రువరుణి తమ్ముడుదీనుడై - శరణని అన్నా కరుణాబిరుదెంచీతివి ‼ప‼2‼ కృష్ణావతారాన భీష్మభక్తునకయ్యి చక్రాముపూనితివీ - భక్తులబ్రోచె కీర్తి ప్రకటించీతివి ‼ప‼3‼ పుట్టుపూర్వముకన్నా మొట్టమొదలు పేరు పెట్టివున్నదినీకూనూ - యీ జగతీలో ధరణీపాలకుడంచునూ ‼ప‼4‼ పుండారీకునికయ్యి నుండావె యిటికేపై పండారినాథా

వరదా - అఖండాదిమండలాకారూడవై !!ప!!5!! చెప్పాశక్యముగాని శ్రేష్టాలనందారి- చేరికాపాడీతివీ తప్పైనాను వొప్పు భావించితివీ !!ప!!6!! శరణాగతత్రాణ బిరుదూనీకేచెల్లు - సరగూన వెలివెర్తీలా - పట్టినవ్రతము ప్రకటించుమిక చూచెదా !!పట్టి!!7!!

99. ఆదితాళం: రాగము:

శ్రీరామచంద్రా చింతాలన్నీయూ బాపరా !!ప!! పంతమానాతో నీకు యెంతనీవేడూదు అంతరంగమునా నిల్వరా !!శ్రీ!!1!! అన్యూలవేడాబోతే ధన్యులు నీకన్నా వున్నారెవ్వరు తెల్పరా !!శ్రీ!!2!! మొదలేమిలేనినన్నూ - ముదమునా గల్గాజేశీ - పదిలపరచాకపోదురా !!శ్రీ!!3!! మాయాకల్పాన జేశి కాయకర్మములావేశీ - పాయకుండాగాజేతురా !!శ్రీ!!4!! నేనెంతవేడీనా నీకింత దయగలుగాదు న్యాయమెందూనాబాయెరా !!శ్రీ!!5!! తెలశీ తెల్యానీవాడా నిలుపైతె లేనివాడా - తలచీనంతాలో తాళరా !!శ్రీ!!6!! ఘోరాత్ములైనా నిన్నూ కోరిస్మారించీనా - న్యారామెంచాకాబ్రోతువూ !!శ్రీ!!7!! వెలివెర్తీ వాసా వేదాంతభాషా - అలయజూడకు మ్రొక్కెదా !!శ్రీ!!8!! వరరామదాసా వర్ణీతవేషా - కరుణా జూడవే శరణికా !!శ్రీరామాచంద్రా!!9!!

100. ఆదితాళం: రాగము:

దయను యెందుకురాదయా నిర్దయను జేసుట తగదయా - నయము అయనేమయా రామభయము బాపావేమయా !!ప!! జగములో నావలెను హీనులుతగను గల్గాలేదయా - యిఘను గల్గాబోరయా - యిఘనైనబ్రోవావేమయా !!ద!!1!! తల్లిదండ్రుల పేరుముంచెటి తనయుడానై నానయా - కల్లనై కులవంశమాదిగ యెల్లజెరిపీనానయా !!ద!!2!! పుడమిలో నావలె దురాత్ములు పుట్టలేదిక యెవరయా - బిడియమూ లేకాను ధరలో తిరుగుచునున్నానయా !!ద!!3!! నిందలొందా బోకయా పదిమందిలో నగుబాటయా - నిందలోబడనియకయా రామవందనంబులు జేతయా !!ద!!4!! బిరుదుయెందున చనెనయా నీకరుణకరిగేనేమయా - అరమరెందుకు రావయ్యా రామ దయకు పాత్రుడ బ్రోవయా !!ద!!5!! జాగరూకుడవీవయా నేజాగ్రతేమియు లేనయా- బాగుగానను గన్నయా రామ జాగుశాయక కావయా !!ద!!6!! తప్పులెన్నకు దొరవయా నీగోప్యతనమును బోవయా వప్పుగానీమాయయా రామముప్పు జేశినాడయా !!ద!!7!! నీవెమెచ్చావలెనయా నన్నెవరు మెచ్చా లేరయా - సావధానముగానయా రామ చరణమందున జేర్పయా !!ద!!8!! నాకుదిక్కూ నీవయా రామ నీకుదిక్కూనేనయా - రాకపోకడ లేవయా రామప్రాకటంబుగ నీవయా !!ద!!9!! వసుధలో వెలివెర్తయా వరరామదాసుడు దలచయా- విశదముగ చేపట్టయా వచ్చునీకు పఖ్యాతయా !!ద!!

101.ఆటతాళం: రాగము:

వందనము శ్రీరామచంద్రా - సకలకళ్యాణసద్గుణాసాంద్రా - వందనంబిదె నీకు వనజాప్త కులతిలక- మందరోద్ధరధరా నందివాహనసఖా !!ప!! మీపాదములకు మ్రొక్కెదనూ రామ దాపు నీవనుచు సొక్కుదునూ - యెపాపమెంచకను చూపు నీకృపలోలుక - ఆపదొందిచకను యాపట్ల బ్రోవుమిక !!వ!!1!! దశదిశవిశద ప్రకాశా - రామా అసమానతేజ వికాశ - రశికజనపూజిత రాజ కూలోద్భవ - దశరథాసుకుమార దానవాంతకకోటి !!వ!!2!! శరణుచందన చేర్చితాంగానన్ను దరి జేర్చుపాహి ముకుందా - పరమభక్తాశ్రితా శరణుజేసెదవైలు - అరమరెంచక దయతొ కరుణించి కావుమిక !!వ!!3!! అండజేరితిదండమయ్యా - నీనిండుదయ యిటుజాపుమయ్యా - పండితా పాలక అండవాహణలక్ష - దండంబులిడెద కోదండచేకోనుమయ్య!!వ!!4!! పరమపావన భవ్యశీలా

భక్తపావనా సంత్రాణవాలా - సరసిజాసురబృంద నవమన్మధాకార - వరరామదాసుకును సిరులు నీవనివేడు !!వందనము!!5!!

102. ఏకతాళం: రాగము:

రామరామరామరామరామయానుడీ - రామనామస్మరణయెండె ప్రేమగోనుడీ !!ప!! కోటి ధనములాకునైనకొనగరానిదీ - సాటినామమున్నదనుట వినగరానిదీ !!రా!!1!! అష్టభోగమూలు కోరి అడుగబోకుడీ -అష్టకష్టమూలుబాసి హాయిబొందుడీ !!రా!!2!! అంతులేని జన్మకర్మలట్టెబాపునూ యెంతఘోరపాపమైన వంతుబాపునూ !!రా!!3!! కలియుగంబునందుస్మరణ సులభమాయెనూ నలినసంభవాదులకును నమ్మికాయనూ !!రా!!4!! మనసునిల్కడాతో నిముషమైనచాలునూ - మనసు నిల్కడానులేని మమతయేలనూ !!రా!!5!! యేదికోరినట్టివారి కదియు నిచ్చునూ - యేది కోరనట్టి వారికిచ్చు ముక్తీనీ !!రా!!6!! రామరసముగ్రోల సర్వరోగమొదలునూ - రామదాసుడన్న మాట రాశికెక్కూనూ !!రామరామ!!7!!

103. ఆదితాళం: రాగము:

యెందూకునను బ్రోవవయ్యా - రామ సందేహమేలా మాయయ్యా - యెందుకు ననుబ్రోవా విందీవరేక్షణా - మందూడనని నీకు ముందే తెలసుండీయు !!ప!! తప్పులెన్నకు దండామయ్యా- నాతిప్పలన్నియు బాపుమయ్యా - యెప్పుడయ్యునినీకె తప్పాదుతెల్యాద - యిప్పుడెననుకాచి గొప్పాగా పాడుకో !!యె!!1!! నీకన్నా ఘనులువున్నారా వుంటె నీకే నాయము తెల్పావయ్యా - నాకు గురూడు నీదు జాడజూపినాడు - చేకోనవయ్యా నీచేష్టాలెల్లనుతెలసె !!యె!!2!! భక్తావత్సలుడావుకావా సాధ్భక్తా రక్షణ బిరుదులేదా- శక్తిలేనివార్ని చేపట్టిరక్షింపా- యుక్తామయ్యినదీక్షా వెక్తాముచేయూమి !!యె!!3!! సర్వాసామత్వాముమానీ నీవుదుర్విచారము మదిలోపూని - ధర్మాముగనుమాయ ఖర్మా రహితుడవయ్యి - మర్మాముతో కాయ ఖర్మాములోవేసి !!యె!! దాసాదాసులదాసు నంటి రామదాసూడనైముందే వుంటీ - భాసూరా వెలివెర్తి యీశాపరాకేన్నా - బోకు మ్రొక్కెద భువిలో నీకాపవాదము !!యెందూకు!!5!!

104. ఆదితాళం: రాగము:

శ్రీరామభజనాశాయండి - మీరునోరునొస్తుందాని వూరుకోకండీ !!శ్రీ!! కాలాము గడుప బోకండీ - భగవన్నామస్మరణ యెందెగడుపావలెనండీ - కాలాము నిల్వబోదండీ - మీరుమేలు బొందుటకూను కీలుయీదండీ !!శ్రీ!!1!! యీజన్మమేదుర్లభంబూ వోరీ యెజన్మమున లేదు యీ జన్మసాటీ - రాజీవాక్షుని నమ్మావలెనూ - వోరి వోజాదప్పినడతా కూలిపోవలెనూ !!శ్రీ!!2!! యెమునీ చేతులజిక్కినపుడూ - మీరు యేమానుకున్నాను యేమీఫలమండీ - నోముఫాలంబానూ కున్నా మిమ్మూ పామరత్వములేకా బట్టికొట్టెదరూ !!శ్రీ!!3!! భక్తిచేముక్తి గల్గునురా వోరి భక్తీలేకను విరక్తి నిల్వదురా - భక్తవచ్చలు మంత్రామనరా - గ్నానశక్తిలేకనూ గ్నేయసుక్తిగల్గదురా !!శ్రీ!!4!! అస్థీరతనువూ నమ్మకురా - అంతస్థిరమూలేనివి అన్ని తెలువాగవలెరా - వాస్థావమును కానవలెరా యెపుడూ సుస్థిరమయ్యీన సూటిదప్పకురా !!శ్రీ!!5!! అంతరాముఖమూగావలెరా - అంతరంబైన మమతాలు అవి మరువవలెరా - అంతతానై వుండవలెరా - తానుయెంతలేకను అచలాకాంతుడన వలెరా !!శ్రీ!!6!! కరుణకలేబరమునురా - గురుణి కభిముఖమై మాయవిముఖా మొందుమురా వర్ణ వర్ణములూ గడుపుమిరా - యీ ధరలోనా వెలివెర్తి హరినీ జేరుమురా !!శ్రీరామ!!7!!

105. ఆటతాళం: రాగము:

రక్షించు శ్రీరామచంద్రా - వోరాక్షసాంతకా రాఘవేంద్రా - రక్షించు శ్రీరామ పక్షివాహన మెక్కి- వొచ్చిమోక్షంబిచ్చి దీక్షాతో నన్నిఘ !!ర!!1!! నిన్నువర్ణించ నాతరమా రామ మన్నించిబ్రోవ నీతరమా - అన్ననీశెషాశెయనూడు వ్యాసుడు - పన్నూగ బ్రహ్మాదులెన్న తరమూగాదు - యెన్నజాలవు వేదశాస్త్రములన్ని అయినను నిన్ను తెల్సవు - తిన్నగా నీదయను గానిక యెన్న నాతరమ్మైతెగాదు !!ర!!2!! నీవే పల్కించేవాడావూ - రామా నీవెఆలించెవాడావూ - నీకెనీవునుజూడ అంత్యాము తెలువావు - చేకొనవయ్యా నీశెషా చెక్రాముతోడ - భావభావాములకునైనను పట్టుబడదూ నీదు సూత్రము - కావగదరా యేలమురిశెవు కరిణిరక్షణ జేసినావటా !!ర!!3!! దీనాబంధూడవని విందూ రామాదిక్కు నీవనిచాటూచుందూ - లేనిచిత్రములన్ని జేసెటికాని మాయను దగులుకోని - మానుజేసి రామదాసును మన్ననతో బడద్రోయకను ననూ !!రక్షించు!!4!!

106. ఏకతాళం: రాగము:

కరుణయేలరాదు నాపై కమలనాభ మ్రొక్కెదా - తరుణోపాయమూను జేయు స్మరణతోను జిక్కెదా !!క!!1!! వంతుకైనబ్రోవకున్న వచ్చు నీకపకీర్తయా - పంతమేమీదలచినావూ చింతబాప కీర్త్యయా !!క!!2!! శేషభూతమైనవాడా చేతబట్టవేలయా - శేషశయన దోషమొచ్చు క్షేమమెంచ కున్నయా !!క!!3!! పక్షపాతమేలసర్వ రక్షభారముండగా - సాక్షివయ్యిదీక్షతో ప్రత్యక్షమేలకావురా !!క!!4!! వట్టుబెట్టిదానుచూడు వరములివ్వకున్నరా - ఘట్టిబోలో నీదుమహిమా కాని చూచెదానురా !!క!!5!! మొరనుబెట్టుచుండగాను తిరిగిచూడవదేమిరా - ధరలోరామదాసునిన్నె దలచుచూ నున్నాడురా !!కరుణ!!6!!

107. ఆదితాళం: రాగము:

దయజూడవయ్యా దశరథరామ దయజూడవయ్యా !!ప!! దయజూడవయ్య నీదాసకోటుల లోను - భయమొందియున్నాను భక్తపరాధీనా !!ద!!1!! దిగులొందినాడా మాయకు చాల బుగులొందినాడా - పగలు రాత్రి నిన్నే ప్రస్తుతింతామంటే - తలువానివ్వదు మనసూ తత్తరింపులు బాపి !!ద!!2!! పగయాలనయ్యా నాపై నీకు తగగల్గెనయ్యా - వగపుజెందియు నేను వదరూచు నుండాగ - యిఘనైనా తెల్యాద వుసురంత ముట్టాద !!ద!!3!! యేలుకోవయ్యా యెవ్వరు లేకా పాలబడితయ్యా - మేలుగందువు చూడు చాల సత్కృపవడసి - యేలూమునీకును భోగభాగ్యము గల్గు !!ద!!4!! ధరలోనయున్నా వెలివెర్తిలా దాసదాసుండూ - కరుణించుమనుచూను వరరామ దాసూడు - మొరబెట్టాసాగెను తగులజ్జవిడచీయు !!దయ!!5!!

108. ఆటతాళం: రాగము:

రామారామ రామరామ రామా రామా రామరామరామరామా !!ప!! నిన్నేనమ్మియున్నాడా కన్నెడ శాయబోకునాయేడ !!రా!!1!! కృష్ణా కృష్ణా కృష్ణా శ్రీకృష్ణా - విష్ణూకృష్ణకృష్ణ వూత్రూష్ణా !!రా!!2!! వన్నెకాడ నిన్నెమరులొందీ - వున్నవాడ నన్నెమదిపొందూ !!రా!!3!! హరీహరిహరిహరిహరీ హరీహరిహరిహరిహరీ !!రా!!4!! పరూలయ్యాతె యిఘ లేరు - పరాకేల జేసెవిక వేరు !!రా!!5!! హర వాసుదేవ శ్రీవాసావర రామదాస మృదుపోష !!రామారామ!!6!!

109. ఆదితాళం: రాగము:

రమణీరాములదేవి విమలాంగిపోవే - కరుణాసాగరుడైన కమలానాభుండే ॥ప॥ పరమా పావనశౌరి పరమేశుడమ్మా- మరణామందున తలువమరి మోక్షామమ్మా॥ర॥1॥ విషయా వృత్తుల మాని విమలాంగిరమ్మా - అసమానతేజూడు అగుపాడు కనుమూ ॥ర॥2॥ తోయజాక్షిరోమాయ తొలగా జేయమ్మా - పాయక అనిశాము పట్టివిడకమ్మా ॥ర॥3॥ మోహామూలాను నిర్మూలాముజేసూ ఆహంభావము లేక అణగీవుండమ్మా ॥ర॥4॥ పెట్టిపోతలపైనా ప్రేమాలుంచాకే వట్టీ మాటా వోచ్చి వోకటాడుమనవే ॥ర॥5॥ భక్తికి సులభూడు భ్రమలన్నీమానూ- శెక్తితో రక్షించి చేపట్టునమ్మా ॥ర॥6॥ నామానోనాధూడు భామారోవాడు - పామేనవాసూడు పరమాత్ముదెమ్మా ॥రమణి॥7॥

110. కీర్తన: ఆదితాళం: రాగము:

చక్కనయ్యరారా వొక్కా ముచ్చటించిపోరా - యెక్కువైన నీమక్కువ చూపియు గ్రక్కున వచ్చియు కౌగలించరా ॥చ॥1॥ దాసుడనుచు నాపై దయతో దోషమెన్నకాసూ-వాసుదేవా శ్రీ వాసుడవైనను - అశలద్రోయక యీ సమయంబున ॥చ॥2॥ ముందటివలెనీవూ లేకను ముసలి వయ్యినావా - అందుకెకద నిన్నెంతనుతించిన - విందువో వినవో అందుకె చెప్పను ॥చ॥3॥ రావదేలనయ్యా రాఘవతోవ జూపవయ్యా - భావమందునను భక్తితో పొందియు - శేవజేశెదను భావజజనకుడ ॥చ॥4॥ రామదాసుడయ్యా యీఘనూ ప్రేమజూపవయ్యా - ధాముడవనినిను దలచుచునున్నాను - తామసముంచక రావసమేతము ॥చక్కనయ్యా॥5॥

111. ఏకతాళం: రాగము:

రారేపోదామూ - రాములజేర రారేపోదామూ ॥ప॥ రారెపోదము నాదు చిత్తము రాజి జెందియు రభసమొదలియు-కార్యమెల్లనుమాని శ్రీకాంతునిశేవాకు నిత్యము॥రా॥1॥ లక్ష్మీనాధుండే రమ్యమైనా పక్షివాహనుడే - సాక్షిభూతుడు రాక్షసాంతకు అక్షరాత్మకుండఖిల రక్షకు మోక్షమార్గం బిచ్చె దీక్షితుపక్షమగు నిక్షేపధనమూ॥రా॥2॥ కోమలాంగుండే- హస్తమునందు కోదండ ధరుడే- కోటిమన్మధులైన గాని దీటుగాని మేటిరూపుడు- హాటకాంబరకుండలంబులు కిరీటమున్న మేటి జేరను॥రా॥3॥ సాధురక్షకుడే- సంసారాందఘోరబంధకుడే- వేదవేద్యుడువాదరహితుడు బోద మాన్యుడు శోధనీయుడు- ఆదిమద్యాఅంతములును లేనివాడుగదమ్మ కోమలి ॥రా॥4॥ అంతా టున్నాడే-కనుగొనలేకా భ్రాంతులైనామే- వింతగనువెలివెర్తియందున అంతరంబున ఆత్మ జూపియు వంతుగను వరరామదాసుడు చింతలొదిలె నిరంతరంబును ॥రారేపోదాము॥5॥

112. ఏకతాళం: రాగము:

రామరామయని నేమముదలచితె ప్రేమజూపరాదా-నామనసందున నమ్మిభజించితె నరశి బ్రోవరాదా ॥రా॥1॥ సనకసనందన మునివరులంతా ముఖ్యమయ్యినారా - మనుజరూపమున వారికి శేవయు దయనుజేయలేదా ॥రా॥2॥ పంచపాండవులు లంచము యేమియెంచియిచ్చినారు ప్రహ్లాదాది భక్తులుయిచ్చిన భాగ్యమంతయేది ॥రా॥3॥ వుడుతయేమియు వూడిగంబులు వరుస లిచ్చినాది - పటుతరంబుగ శెబరియెంగిలి యెక్కువయ్యినాద ॥రా॥4॥ దూస అటుకులు దోశెడునీకు గాసమయ్యినాదా- వాశిగదాశీపుత్రుని విందుకు మోసమెందినావు ॥రా॥5॥ కరినిమకరము పట్టి యీడ్వగను కడకునురికినావు- సరసముతోడుత రాతినినాతిని వరుస జేశినావు ॥రా॥6॥ గుహుడు తల్వనిదె యింటికిచనియు భయముబాపినావు- బహువంకలుగల కుబ్జనుచేకొని వంకబాపినావు

!!రా!!7!! అక్షయవలువలుద్రౌపదికిచ్చి రక్షించినావు-పాండుసుతులను లక్షాగృహమున బ్రతికించి నావు !!రా!!8!! సుగ్రీవాంగదవానరులందు అనుగ్రముంచినావు ప్రజ్ఞవాదియగు హనుమంతాదుల ఆగ్నలుంచినావు !!రా!!9!! ధ్రువవిభీషణ సుగుణోత్తముల భవముబాపినావు- సవినయంబుగ సజ్జన జనులను సమముజూచినావు !!రా!!10!! వీరుఅందరు యేమియిచ్చిరి వివరించియు పల్కు - చేరికొలచిన వారికందరికి ప్రేమజేసినావు !!రా!!11!! దాసదాసుల దాసుడనైతిని దరియు జేర్చవేలా- గాశిజెందితిని వెలివెర్తి రామదాసు నేలరాదా !!రామ!!12!!

113. ఆదితాళం: రాగము:

శ్రీతామనోహర శ్రీరామచంద్రా - దాతా లక్ష్మణభ్రాత దైవాసూసాంద్రా !!ప!! దశరధ సుకుమార విశదాప్రాకాశా - దశముఖిపరిహర దానావనాశా !!శ్రీ!!1!! కౌసల్యవరపుత్రా కాకుస్తతిలకా- కౌశిక యాగా సొరక్షాణమొలకా !!శ్రీ!!2!! ఆదీనారయణ ఆమితాప్రాకారా- భేదమెంచకజగము నేలేసర్వేశా !!శ్రీ!!3!! అవతారమూర్తీవీ అఖిలాంతరాళా- భవబంధహరుడావు భక్తావికాసా !!శ్రీ!!4!! నిర్మాల నిజగాత్ర నిఖిలామునిస్తొత్యా- ధర్మాసొరక్షాణ దైవాసూరాక్ష !!శ్రీ!!5!! కంజాతదళనేత్ర కరుణాయతాక్షా - రంజీత పరమా నీరంజానదేవా !!శ్రీ!!6!! వెలివెర్తి వరయీశా వైకుంతావాసా - నలినాక్ష వరరామ దాసారక్షితా !!శ్రీతా!!7!!

114. ఆటతాళం: రాగము:

రామ రామ నీనామము నామది నేమముంచవయ్యా- సామాన్యంబగు నేమఖర్మములు యేమి వుంచకను ప్రేమజూడుయిటు - నేమముతో భజనాజేసెద - నామంబెప్పుడునూ - నాయడ రామముమదినిల్పూ -మ్రొక్కెదధాముడవని నిన్నూదలచెద -కమలనయన ఆపన్న రక్ష సంపన్నసుర చిరా విమలదయాకర !!రా!!1!! కామఖర్మముల కేగెటి నామది కట్టుబెట్టవయ్యా- రామరమ్యగుణ ధామపరాత్పర తలచెదానునిన్నూ - నిరతమునామనసందుననూ- చరణమునమ్మి నుతించెదనూ నరహరిప్రేమవుంచుముందూ- నిన్నేపెక్కువిధంబులనూ- కొలచెద క్షేమకరుండనిశేవ జేయుచును నామరసంబును పానమొనార్చెద !!రా!!2!! పతితుడనీచుడ పామరుడను నేమతి హీనుడ సుమ్మీ- సతతముశీతాపతినీవే గతి అతిమతితోచూడునేడూ- క్షితిపతివని నమ్మీతలచెదహిత బాంధుడ వనుచూ- పిలచెద- అతిదయతోవచ్చీ- కలువుము సతతంబునుబ్రోవూ హితవుతో శ్రుతులుస్మృతులు బహుయితిహాసంబులు వర్నించవుగదవరసురనాయక !!రా!!3!! పరులుయెవ్వరిక నరుల బోచు టకు మరివున్నరు తెల్పూ - పరులవేడ నాతరముగాదుయని వర్నింతును నిన్నూ మురహరి- వర ధాతవునీవూ కావను- మరిలేరెవ్వరునూ- నీవని మురయుచుతలచెదనూ మరువక కరుణించు టకయ్యి- వేడితి- సరసుడవనుచును వర వెలివెర్తిల - నిరతము రామాదాసు తలంపిది !!రామ!!4!!

115. ఆదితాళం: రాగము:

రావేమి రాధాపతె నన్నురక్షీంచు శీతాపతే !!ప!! కావూముమ్రొక్కేద కమలాదళేక్షణ - భావాము లోపాల నీవానినమ్మీన !!రా!!1!! నిన్నూ సన్నుతిజేయ నేనెంతవాడాను - మన్నించినాగతి నిన్నాని తీర్పాను !!రా!!2!! దీనూడ నేనుండ దీక్కూనీవయ్యుండ - మానూగరమ్మాన మర్యాదగాదా !!రా!!3!! ప్రేమాపరిపూర్ణాము పెంపొందుచుండాగ - నామాధిపతివైన నారాయణచ్యూత !!రా!!4!! నేరాము లెన్నాకు యూవారదాకాను - పారాములేని వికారాములొందితీ !!రా!!5!! శేషాణీకైనాను చెప్పా తారముగాని - ఆశాలగూలీ నీవాసామెమరచీతి !!రా!!6!! పాదసేవకుడాను పాలించి రక్షించ - నీదాయ నేకాని నాదేమి వెలివెర్తి !!రావేమి!!7!!

116. ఆదితాళం: రాగము: మోహన

గంగాధారా గౌరీధరా - మంగళకరశివ సంగమేశ్వరా - అంగలింగ భవభంగకృపా !!ప!! నందివాహనా సుందరననా -నందనాందసానంద గజానన - భృంగసనక సానాందపాల !!గ!!1!! భృంగిఖేలనా అంగపావనా - లింగలింగశివలింగ భవాభయ - భంగభావ వీహంగదయా !!గ!!2!! త్రిపురాంతక అపదాంతకా - వో పరమేశ్వర చూపరసత్కృప -తాపదవానల రాపులెల !!గ!!3!! మృత్యుసంహరా భృత్యగంహరా - మృత్యుంజయహర భక్తగణాస్తుత - రక్తిరాక్తి పరశక్తియుతా !!గ!!4!! కైలాస గిరివాసా - పాలనేత్రహర ప్రళయసూత్రహర - కాలకాలయమ కాలకంతా !!గ!!5!! పాపనాశా పామేనెశా - కావుమనుచు నిను భావనజేసెటి - పావన రామా భక్తనుతా !!గంగా!!6!!

117. ఏకతాళం: రాగము: కళ్యాణి

రాములనమ్మినవారు - యమబాధలు నొందగబోరు - రాములమంత్రము నేమము తోడుత ప్రేమస్మరించెటి దీనజనములకు !!రా!!1!! కాలయముడు రాకుండూ అకాలమృత్యులేకుండూ- కాలపాశమును కఠిన శూలమును - కాలదండమును కడకును జారవు !!రా!!2!! సంచితములు దోలించూ బహువంచనలును దూలించూ- పంచమహాపాతకములనైనను - యెంచరాని భవ మొంచనబాపును !!రా!!3!! తత్కాలితకల్మషాము ఆపత్కాలమునెడబాపూ - మత్తమాయగల రిత్తెడ బాపియు - వుత్తమగతియును సత్తతొనొసగును !!రా!!4!! అష్టపాశమరికాట్టు ఆదిఅష్టమదాంబుల నేట్టూ - అష్టకష్టముల హమికలన్నియు - స్పష్టముగణచియు సౌఖ్యము లొసగును !!రా!!5!! రాగ గుణములాడంచూ- బహుభోగభాగ్యములనుంచూ- యోగవిఘ్నముల త్యాగముజేశియు యోగీంద్రులకును క్షేమమొసంగును !!రా!!6!! జన్మఖర్మములుధ్వంచు పునర్జన్మము రాకడ నొంచూ - వినయము తోడుత వెలివేర్తందున - అనయము రామాదాసుడు నమ్మెను !!రాము!!7!!

118. ఆటతాళం: రాగము: యమన్

వింటివో వినలేదో నామొరను బాగవింటివో వినలేదో !!ప!! వింటివో వినలేదొ నీదుజంటకైనా జెప్పవైతివి - కంటకంబును జేయకుము నేకొంటె ననుచును యింకదెల్కద !!వి!!1!! మగువతో కలసుంటివో మహభక్తులాకై త్వరగ నెక్కడపోతివో - పగలు రాత్రులలోన వకసరిప్రస్తుతించుచు నుండగాను- వగపుమాన్పవు యేలనోమరి పగనుయేమి జేశినాడని !!వి!!2!! బక్కబంటను కుంటివో నావిన్నపంబును యెక్కసంబున వింటివో- మక్కువానాపైననుంచి మరియుబీదా పాపడనుచును కక్కసంబులు నన్నిమానియు కరుణజూడు ముకుందమాధవ !!వి!!3!! తప్పలెన్నక వినగదే తప్పొప్పుజేశి తనయుడనుచూ నేలవే - చెప్పరాని తాపమొందియు దప్పిజెంది యున్నవాడను - యెప్పుడో నావ్రాత ఫలము గుప్పునీదయ యెప్పుడోకద !!వి!!4!! పలుకకుండిన మానెరా తలచీనకార్యము కలతలేకను చాయరా - తలచి తలచి తల్లడించగ అలుకజెంది పలుకకున్నవు - వులుకుజెందియు రామదాసుడు వుబ్బినిన్నె అనుసరించెను !!వింటివో!!5!!

119. ఆటతాళం: రాగము:

రఘుపాతీ తలచెదా యాఘనూ నేమురిశేదా !!ప!! పగలూ రాత్రూలు నిను ప్రస్తూతీజేసెదా !!ర!!1!! సరశిజాదిరూపా సాంబ్రాజ్యాలక్ష్మీశ- పరశూరామారామా ప్రబలమౌశ్రీరామ !!ర!!2!! కోదండా ధరరామా భవబాయాఖండానా - దండాదారాపాశ ఖండానోద్దండనా !!ర!!3!! అండపిండాండ బహ్మాండ మార్తాండ శ్రీ - నిండు సంపత్కారా ఖండామండల తేజా !!ర!!4!! తలచెదా వెలివెర్తీ దాతావు నీవానీ - కొలచెదా దాసునై పిలచెదా రమ్మానీ !!రఘుపాతీ!!5!!

120. ఏకతాళం: రాగము:

శ్రీరామా శీఘ్రామెరాగదే - శీతాలక్ష్మణ భరతశత్రఘ్నా - ఖ్యాతిగహనుమంతాది సమేతము ‖ప‖ గరుడవాహనము తురగమునెక్కియు-సరగునబ్రోవను బిరబిరపరువున ‖శ్రీ‖1‖ కోదండంబును చేధరించియు - యమదండాదియఘముఖండించను ‖శ్రీ‖2‖ దుష్టనిగ్రహము శిష్ట పాలనము - భ్రష్టత్వంబుల భంగముశాయను ‖శ్రీ‖3‖ సత్యసత్యముల కుత్తమమయ్యిన - సత్య వాక్యమును పరిపాలనముకు ‖శ్రీ‖4‖ కరుణామృతమును కలశము బూనియు - అరమరలెంచక అమృతం బోసగును ‖శ్రీ‖5‖ ధర్మదృష్టియును దయవహించియును - ఖర్మము లన్నియుకడకు దోలుటకు ‖శ్రీ‖6‖ బిరుదువహించియు ధరవెలివెర్తికి- వరరామదాసును పరములొగల్పను ‖శ్రీ‖7‖

121. ఆటతాళం: రాగము: హిందుస్తానితొడి

తారకమంత్రము తరచితెజాలు - దారిదొరకినట్టె - మీరరాని సంసార్ణవమందున యీదియు పోయినట్టె ‖తా‖1‖ మనసురాములా పాదములందు మగ్నంబైయుంటె - అనిశముజపతప మాచరించి నంతనుభవమైనట్టె ‖తా‖2‖ మంత్రార్థంబు మహిమ నెరిగితె తంత్రమూడినట్టె - మంత్రరూపుణీ మరి హృదయంబున నిల్పకయున్నట్టె ‖తా‖3‖ మానసపూజయు మరువక జేశితె జ్ఞానంబునట్టె పూనియు ధర్మము లెన్నిజేశినా పూజదొరుకనట్టె ‖తా‖4‖ మనసుతారకా బ్రహ్మసదనముకు గమనం బగుచుంటె - అన్నియాత్రలాతిర్గిన ఫలమూ చెందియువున్నట్టె ‖తా‖5‖ తప్పకదైవా స్మరణము నందూ జ్ఞప్తియుంచుకుంటే - తప్పుడు దేహకార్యకర్మముల ముప్పులణగినట్టె ‖తా‖6‖ వరధరలోపల వెలివెర్తిల యిదివప్పుకోనివుంటె - సిరుల కన్నిటికి పరమైయుండిన స్థిరము అబ్బినట్టే ‖తారక‖7‖

122. ఆటతాళం: రాగము:

నీవుబ్రహ్మంబైతె నేను బ్రాహ్మడనౌదు నిదిసత్యమయ్య శ్రీరామా - కేవలాత్మున్నపుడు నీవు గల్గియు నన్ను నిజము యేర్పరచితివి రమా ‖నీ‖1‖ మొదటి బాంధవ్యము యిపుడెందు బాయను మదినెంచవయ్యా వోరామా - యిది నిజంబని నీకు యిపుడుదెల్పుటాకు - యిచటెవ్వరున్నారూ రామా ‖నీ‖2‖ నీవు దేవుడవైతె మాయలో బింబించి జీవుడేలైతివీ రామా - కావావా నన్నిపుడు భావమందున దెలశీ - శేవకుణి భగవంతరామా ‖నీ‖3‖ గురుడవే నీవయ్యి గురుపుత్రుణీ జేసి మరినిన్ను జూపితివిరామా - కరుణేలరాదయా కఠినమెందుకు దోచె నిరహేతుకంబుననురామా ‖నీ‖4‖ నీనిజంబులోగుణము నిర్మూలమైయుండ నిజగుణానిధివి గదరామా - నాయందు అపరాద మేది లేదిక చూడ నాదియందున యిపుడు రామా ‖నీ‖5‖ వుండజాలక మాయమెండు నొక్కటి జేశి దండివాడైతివీ రామా - అండజేరియు అఖిల ఆత్మలనునాడించ వేడుకైయ్యుండీనా రామా ‖నీ‖6‖ ధరయందు వెలివెర్తి వరరామదాసుడూ మరినీకు తెల్పదా రామా - సరసిజాదీబృంద సామ్రాజ్యలక్ష్మీశ - సన్నుతించెద బ్రోవురామా ‖నీవుబ్రహ్మంబైతె‖7‖

123. ఆదితాళం: రాగము:

నమ్మినవాడరా నాధపారత్వరా - సొమ్మునీకైన నాసొత్తువు నీవెరా !!న!!1!! కేశావమాధవ కృష్ణదామోదర దాసజనార్చిత వాసుదేవాహరి !!న!!2!! నీవెదాతావురా నీవె దైవమురా - నీవేమాతా పిత్రు నిఖిలాము నీవని !!న!!3!! అప్రమేయా మాయా సర్వభయమూను బాపు - తీర్పు నా విషయమును వోర్పు లేదాయెను !!న!!4!! మానాము నీదె అభిమానాము నీవేరా - నేను మది మేనురా నీదె సర్వమురా !!న!!5!! యిమ్మహి వెలివెర్తి యీశుడనీవెరా - నమ్మితి రామదాసుకిమ్ము నీవేనురా !!నమ్మిన!!6!!

124. ఆటతాళం: రాగము:

రఘునందనయని పిలచితె రావదేలనో స్వామి !!ప!! యిఘయేల కరుణరాదు పగలులు గావలెను గాని !!ర!!1!! సరివారిని సగజూడుమి -సరి-వారిలో నగుబాటగును నాకు !!ర!!2!! హరిహర బ్రహ్మదీరూప - అంటక వెలిగప్రమేయ !!ర!!3!! అధముండను నరపశువును - అధరించ నీవెకానీ !!ర!!4!! వరరామదాసుండని - వరములీచ్చి కరుణజూడు !!రఘునందన!!5!!

125. ఆటతాళం: రాగము:

శ్రీపతిసాత్కృప నాపైజూపు దయతోను మానక !!ప!! తాపసోత్తమ తాల్మితోడుత - దీపను జూపు -మాపు !!శ్రీ!!1!! యెందుగందుఅందు నీవెపొందియున్నావూ - అందక -సందుగొందులాను మెండుగ నిండియున్నావూ -దండిగ !!శ్రీ!!2!! కానిచూచెదాను నీదు కపటవికటములూ -హటమూ మానుగా మర్యాదలన్నియు పూనినిల్పుకో-కల్పుకో !!శ్రీ!!3!! మేటిరావణుగీటడంచిన పాటువిలు కాడు పలుకడు- మాటకయ్యిన మానవంతులు వోటుబొయ్యేరు-అయ్యేరు !!శ్రీ!!4!! భాసురంబుగ యీశువెలివెర్తి దీశునీతోడు- నేడు- దాసుడగు రామదాసుడెప్పుడు దలచుచున్నాడు-విన్నవ !!శ్రీ!!5!!

126. ఏకతాళం: రాగము:

దండామొక్కటి నీకు ధశరథనందాన రామరామా - రొండూదండంబూలు నిండూ జనార్ధన రామరామా !!1!! మూడూదండాంబులు ముక్కంటిసన్నూత రామరామా- మాటాకైనానాల్గు మరి దండాములునిడుదు రామరామా !!2!! ఐదుదండములు అఖండమండలరూప రామరామా ఆరుదండంబూలు అమరాసురార్చిత రామరామా !!3!! యెడూదండంబూలు జోడుతో జేతును రామరామా - యెన్మీదిదండాముయెమారకను జేతు రామరామా !!4!! యిమ్మూగ తొమ్మీది విడెదా దండంబులు రామరామా- సమ్మాతిగనుపదియు నిమ్మాళంబుగ జేతు రామరామా !!5!! యిరువాది దండాము లిదుగొజెసెదచూడు రామరామా- మరువాక ముప్పాదిమది దండాములు జేతు రామరామా !!6!! నాల్గుపాదులునీకు నర్పింతుదండాము రామరామా- మేలాగుయెబాది మెపైన దండాలు రామరామా !!7!! ఆరుపాదులుమ్రొక్కి అర్పింతుదండాము రామరామా- సరగూనా డెబ్బాది యిరవూతొజెసెదారామరామా !!8!! యెణుబాదిదండాము లెత్తి మ్రొక్కుదునయ్యి రామరామా అణుకూవ తోడూత తొంబాది విడెదాను రామరామా !!9!! నూరుదండములెత్తి నోరూతొ ననెదాను రామరామా - నూర్లురొండును యెన్నొసార్లు జేసెదనయ్య రామరామా !!10!! మూడునూర్లు నీకు ముదమొప్ప దండాలు రామరామా - వేడూకతోడూత వెలయా నాలుగునూర్లు రామరామా !!11!! ఐదునూర్ల దండమర్పింతునీకును రామరామా - ఆరునూర్లు మంచి మానసంబుతో జేతు రామరామా !!12!! యేడువందలు నీకు యెంచి అర్పించెద రామరామా - యెన్మీదినూర్లయితె

యెడతేగాకను జేతు రామరామా !!13!! తొమ్మిదినూర్లను తొలుగాక పెట్టేద రామరామా - సమ్మాతితోడూత సాహస్రదండాలు రామరామా !!14!! పదివేలదండాలు పరగంగజేశేద రామ రామా - విదితాముగాలక్ష వినుతులోనర్చెద రామరామా !!15!! కోటి దండంబూలు మేటి దాతవు నీకు రామరామా - దీటూలేనటువంటి మేటి విల్కాడావు రామరామా !!16!! ఖండామహా ఖండా మండాల దండాము రామరామా - దండీగఅర్బుద నిర్బూదఖర్వము రామరామా !!17!! అంతాము లేని అనంతదండంబులు రామరామా - అంతయింతయనకా నంతనామధారి రామరామా !!18!! మనుసువాక్కునుకాయ మంతాటితోజేతు రామరామా - అనిశాము నీమంత్రస్మరణ యేమారాను రామరామా !!19!! వినుతూలతోడూత ప్రణుతింతురాఘవా రామరామా - గణుతిలేనటువంటి ఘనుడావుగదనయ్యా రామరామా !!20!! నిన్నూ స్మారించాను నేనెంత వాడను రామరామా - నన్నుకటాక్షించు నాథామహాప్రభో రామరామా !!21!! నీనామమొక్కాటీ నా నోముఫలమన్నా రామరామా- మానాభిమానాము మరినీవెకదనయ్యా రామరామా !!22!! యెంతో వేడినగాని యింతైన బ్రోవావ రామరామా - మంతానమునను రవ్వంతైన తెలియాద రామరామా !!23!! నీకుదోచకుంటె సీతాదేవికిజెప్పు రామరామా - ప్రాఖ్యాతివహించిన దాతానివింటీని రామ రామా !!24!! చరణాశెవకుడాను బిరబీరరావయ్య రామరామా - శరణాగాతత్రాణ బిరుదూ నీ కరుదయ్యా రామరామా !!25!! చెప్పారానటువంటి తెప్పాగప్పెనయ్యా రామరామా - యిప్పుడె తప్పించు యినతేజామును జూపు రామరామా !!26!! దైవామానుచునిన్ను దలచీభజింతును రామరామా - దాసునరశి రక్షించుట బిరుదుండు టాయెను రామరామా !!27!! సర్వేశకత్వాము సర్వీశాకత్వము రామరామా - సర్వాసర్వేశత్వ సర్వామైనాడావు రామరామా !!28!! అండాండ పిండాండ బ్రహ్మాండ మార్తాండుడ రామరామా - చండాప్రాచండ కోదండాధారుండావు రామరామా !!29!! శెక్తిలేనివాడా శెక్తుడానైనాడ రామరామా - యుక్తాయుక్తములాకు కర్తావునీవయ్యా రామ రామా!!30!! వాచామగోచార వైభావరూపాక రామరామా - వాచానువచియింతు తోపాజేశిన యెంతా రామరామా !!31!! నీవెకా నితరాము యెదివున్నదిచూపు రామరామా - భావాజకారుడా భక్తామందారుడా రామరామా !!32!! చాతగానివాడ ప్రీతి శేయవెనన్ను రామరామా - పాతక హరుడావూ పరమపావన చరిత రామరామా !!33!! మ్రొక్కెదచూడయ్య మోహంబులను బాపు రామరామా- చక్కానితండ్రివి నిక్కామునిజమయ్య రామరామా !!34!! యిందీవరమణా నీకొంద నంబులుజేతు రామరామా - వందనార్చనరక్షా వైభావసురవార రామరామా !!35!! కౌసల్యవరపుత్రా కాకుస్త కులదీపా రామరామా - హంసస్వరూపా మురారి సురావర రామరామా !!36!! పరమా పావిత్రుడా భవ్యాచారిత్రూడ రామరామా - సరశీజలోచాన సురలోకపూజ్యుడ రామరామా !!37!! రాక్షసాంతక రామ పక్షివాహనరూఢ రామరామా - లక్ష్మీశనీక్షేప అక్షాయసద్ధర్మ రామరామా !!38!! సాధురక్షణ శంకచెక్రాధరాయుదా రామరామా - వంకదీర్చుటకయ్యి వచ్చుటమాయను రామరామా !!39!! నీకెమి పనివుండె లోకంబునకురాను రామరామా - నాకోరకెకాదా సాకార రూపాము రామరామా !!40!! నారాయణా ఓన్నామోన్నామో నీకు రామరామా - పారాయణాచ్యుత పరమార్థరూపీవీ రామరామా !!41!! పొందాశఖ్యముగాని బాదలొందితినయ్యా రామరామా - అందుకోరకెనీవు యిందాకరావయ్యా రామరామా !!42!! పుండారీకాక్షా వో పురుషోత్తమోపేంద్ర రామరామా - అండాజవాహాన దండికృపాకార రామరామా !!43!! శృతులు స్మృతులు నీవు సకల విద్యలు నీవు రామరామా - గాత్రములన్నీట సూత్రమునీవయ్య రామరామా !!44!! లక్షాయేణుబది నాల్గుల సాక్షీగావుందువూ రామరామా - రక్షించుయిఘనన్ను శిక్షాలకోపేతి రామరామా !!45!!

అరువాది ఘడియాల కిరువాదివకవెయ్యి రామరామా - ఆరునూరులు నీకు నేమించిమ్రొక్కెద రామరామా !!46!! వర్థిలు వర్థిలు వరరక్షసురపక్ష రామరామా - అర్థిపొందితి సుమ్మి పార్థవసారాథి రామరామా !!47!! కర్తావుభోక్తావు కారాణాకారూడ రామరామా - భర్తావునీవుసమర్తాము నీవయ్య రామరామా !!48!! వేదావేదారూప వేదాంతవేద్యూడ రామరామా - నాదుమనోహర శూరదుర్జనహార రామరామా !!49!! యెందూకురావయ్య సందేహమేలాను రామరామా - ముందువేనుకలు వీచారించితివో లేదో రామరామా !!50!! నలువానుగన్నయ్య నగుమోగమిటుజూపు రామరామా చులుకాగ నీకృప లొలుకాగ శేయావే రామరామా !!51!! కాంచనమయచేల కమనీయ మృదుగాత్ర రామరామా -సంచీతహరణ విరించిపితామహా రామరామా !!52!! పండీతపావన కుండాల మయధార రామరామా - దండాధరాభయ ఖండానవీవయ్య రామరామా !!53!! వాదుజేయుచు నాపై భేదాములెంచాకు రామరామా - నీదయనేకాని కాదుయెవ్వరినుంచి రామరామా !!54!! కస్తూరితిలకాము కలకాలమునుండు రామరామా - ముశిమూశి నగవూల ముఖసుందరుండావు రామరామా !!55!! శంకుచక్రాంకిత కుంకుమాలంకార రామరామా - సంకటహరణ శ్రీవెంకట రమణూడ రామరామా !!56!! శ్యామాలవర్ణము ఛాయవర్ణుండావు రామరామా - కామూనికన్నాను కాంతిమించినవాడ రామరామా !!57!! వైజాయంతీవోన మాలకంతాధర రామరామా - భజియించ వలసిన విజయానామమువాడ రామరామా !!58!! కమల నాయననేత్ర కౌస్తూభ మణిధరా రామరామా - విమలవిద్యుత్కాంతి విశదనాసికాము రామరామా !!59!! పద్మారాగ చ్చాయ పదయుగళంబూలు రామరామా - పన్నగేంద్రుని సమము బాహుదండంబూలు రామ రామా !!60!! కాటిప్రదేశాము కడుశింహమధ్యాము రామరామా - దీటులేనటువంటి రూపాము గదవయ్యా రామరామా !!61!! లక్ష్మణ ఆగ్రజ లక్ష్మిసమేతుడ రామరామా - పక్షింద్రవాహనరక్షణో ధారణ రామరామా !!62!! కారుణ్య మృదుభాష కమలామన:ఖేల రామరామా - సాహస మిత్రావు వారినీరంజన రామరామా !!63!! రంజీత పరమా నీరంజాన నిర్మల రామరామా - రాజీవదళనేత్ర రమ్యగుణాస్తుత రామరామా !!64!! వానార వీరుల నారాయణా దేవ రామరామా - మానవసురనాధ మౌనిగణాస్తుత !!65!! అక్కారకొచ్చేటీ వక్కాడవీవయ్య రామరామా - గ్రక్కూనయిందాక వక్క సారియురమ్మి రామరామా !!66!! పరిపూర్ణభావుడ పరమాపాదభావ రామరామా - యిరవందగను రమ్మి సురవందానిందాక రామరామా !!67!! జనకాజవరపుత్ర జయముచేకొంటిరి రామరామా మనుజాది నాథ అనుమానరహిత ఘాన రామరామా !!68!! హరువిల్లు విరచీనా అట్టిమేటివిగాదా రామరామా - పరశురామభంగ వరకారుణాలామ రామరామా !!69!! కౌసీక యాగ సంరక్షణ సంభార రామరామా - ఖరదూషణాదుల ఖండనోద్దిపీత రామరామా !!70!! తాటాకిగర్వాము తేటాగబాపీనా రామరామా - సాటిలేని వక్కపాటు వున్నవాడ రామరామా !!71!! మారీచ మర్థన మంగళవరప్రద రామరామా - కారాణకార్య కర్తుత్వమహకార రామరామా !!72!! వాలివానర ఖండ సుగ్రీవస్నేహీత రామరామా - పాలించినాడావు పవమానతేజూని రామరామా !!73!! రావణ కుంభాకర్ణాదుల శీక్షీత రామరామా - పావనవరరామ ప్రత్యేక్షవరరామ రామరామా !!74!! దానా విభీషాణ పోషవేషకూడ రామరామా - వాసవ సనకాస భాసమానా శ్రీత రామరామా !!75!! దరిజేర్చు దరిజేర్చు ధన్యాచారిత్రూడ రామరామా - వరవైభవోన్నాత సిరులు గుల్కెటివాడ రామరామా !!76!! నాదుకార్య కారణాది సర్వాభార రామరామా - సాదుసజ్జనవినుత సత్యస్వభావూడ రామరామా !!77!! ధర్మాసంస్తాపాన నిర్మాలనిజతేజా రామరామా - మర్మాముంచక నన్ను మన్నించు మన్నించు రామరామా !!78!! వరవోశిష్టాశేవ వరుసాజేశినవాడ రామరామా - పరమాపద మార్గాము

పరిపూర్ణభావుడ రామరామా !!79!! పృథ్వీఆపస్‌తేజా వాయువాకాశాము రామరామా - అతులిత మయ్యిన హంకారతత్త్వాము రామరామా !!80!! త్రిగుణాస్వారూపుడ త్రిగుణాతీతుడవయ్య రామ రామా - సగుణాగుణాధార నిర్గుణనిరుపామ రామరామా !!81!! శుద్దసత్వమెముఖ్య ఆర్దమాయను నీకు రామరామా - శిద్దశిద్దులకు ప్రాశిద్దమయ్యినవాడ రామరామా !!82!! పరిశుద్దఆత్మవు ప్రకృతి రహితుండావు రామరామా - ధరశిద్దసాద్యులు దలచుచునున్నారు రామరామా !!83!! నీకెచెయి జాపినా నిఖిలాపాలకుడంచు రామరామా - నీచులావేడను నాచేతగాదయ్య రామరామా !!84!! నాదుబిందుకాళలయ్యినవాడావు రామరామా -నాదుబిందుకాళాలంటాని నిష్కాళ రామరామా !!85!! పంతామనాతోను స్వంతాము నీవయ్య రామరామా - యెంతో వీకారము వెరపుజెందించేను రామరామా !!86!! కరుణాసాగరదేవ తరుణోపాయముజెయ్య రామరామా - వరములిచ్చియు నన్ను వరుసాతోకాపాడు రామరామా !!87!! సత్తుచిత్తానంద వుత్తాముడావయ్య రామరామా - సత్తాచాతను సకలా మాడించువాడావు రామరామా !!88!! పలికించెవాడావు పల్కెవాడవునీవూ రామరామా -పలికించూవరకూను పల్కెవాడనునేను రామరామా !!89!! రక్షించు రక్షించూపేక్షించ వలదయ్య రామరామా - శిక్షించ నేనెంతా లక్ష్యాము నీకయ్య రామరామా !!90!! ఆత్మబంధుడవీవు ఆత్మాత్మావీవయ్య రామరామా - ఆత్మలకాంటాక అంతాటగలవయ్య రామరామా !!91!! బంధూమిత్రులు నీవు బహుబాలగము నీవు రామరామా - అంధూడానై జన్మా శింధులోజిక్కిన రామరామా !!92!! తల్లితండ్రియుదాత దైవాశిఖామాణి రామరామా - యెల్లాలోకములాకు తలితండ్రివైనావు రామరామా !!93!! లోకాలోకంబులు లోకస్తుడావయ్య రామరామా - ప్రాకాటంబుగ సర్వలోకేశుప్రభుడావు రామరామా !!94!! ధారాకషోషక భాగ్యమునీవయ్య రామరామా- భారామీక నీవాని ప్రస్తుతించెదనయ్య రామరామా !!95!! మీకాపవాదాము చేకూరువినవయ్య రామరామా నాకుదెలిశెనయ్య పాకారి ప్రముఖుడ రామరామా !!96!! అందూకెకదనయ్య అధికప్రార్ధనమూలు రామరామా - చెందెదవపకీర్తి ముందెన్నాడును లేంది రామరామా !!97!! కీర్తివంతులు యింతా పూర్తయినాతెల్యాద రామరామా - పూర్తీగశెక్తుండ పోయ్యెదినీదేమి రామరామా !!98!! యింక్కా జెప్పేదనీదు రంకులెల్లనునేడు రామరామా - శంకాలేకను నిన్ను యింక్కా మన్నింతూర రామరామా !!99!! నీకుదప్పదునన్ను చెకోనకున్నాను రామరామా - ఆకాలికోర్వాక కేకాలు బెట్టేద రామరామా !!100!! తల్లితండ్రులుయేపుడు తనయూలాతప్పులు రామరామా - తలపారు గదఅట్లు తలచునా తప్పూలు రామరామా !!101!! జెపతాపములుజెశె వుపమేమి యెరుగాను రామరామా - కుపితూడ కూృరూడ అతికర్మాలోలూడ రామరామా !!102!! యెగ్నాయాగాదు లేమి యెరుగనివాడ రామ రామా - ప్రగ్నాలేమియులేవు అగ్నమీరనివాడ రామరామా !!103!! వుపవాస వ్రతములు మతిలోన నెరుగాను రామరామా - వుపముచాతను నన్ను యిఘయెట్లు బ్రోతువో రామరామా !!104!! దానధర్మములైతే పూని చేయగ లేదు రామరామా - కానికార్యము లెన్నో మానూగజేశితి రామరామా !!105!! యిఘబ్రోవాకున్నాను యిడుములన్నియు నీకె రామరామా - సగపాడకున్నాను వగజెందెదవు చూడు రామరామా !!106!! భక్తీకి సులభాము వ్యక్తామయ్యినవాడ రామరామా - భక్తుడానైతినీ శెక్తి సమేతుడ రామరామా !!107!! వసుదాలో పామెన అసమానతేజుడ రామరామా - విశదాముతో రామదాసుడు వచియించె రామరామా !!108!!

క!! రామాయని నేబిలచితె - నామొరయును అలకించి - అక్షయమనుచున్ -ప్రేమయు చెలగగ రమ్మిటు స్వామీనను బ్రోవుమయ్య -సద్గురురామా !!

!!గీ!! శ్రీరామయన్నను చింతలన్నియు బాపి - శారాదవలెనాదు వా:క్కుననిల్పి - పలికించితివి నన్ను కాపాడిరక్షించు - భారమేనీదయా భద్రాద్రిరామా !!

!!వృ!! వోరామా భవఖండనా రఘురామా - ఓంకారపీఠా రామా సారామయ్యిన సద్గుణోత్తమ రామా -సజ్జన శేవితరామా చేరినిన్ను భజింతు నేనుర రామా - చేపట్టుమీ శ్రీరామా నీరాకారము తోడవోచ్చియు రామా నీవెందుబోకూ రామా !!

శ్రీసద్గురవేనమ:

!!శ్లోకం!! గురుబ్రహ్మ గురువిష్ణు గురుదేవో మహేశ్వరా -గురుసాక్షాత్ పరబ్రహ్మ - తస్మైశ్రీగుర వేన్నమ:

!!గీ!! గురువరా నన్నుగావుమి గరిమెతోడ - చెరణములు మదిలో ధ్యాన్నింతు చెప్పినటుల పరమ పావనకృప జూచి భవముబాపు -నిరతమును నిన్ను యెడబాయ నిఘను రామా!!

127. ఆదితాళం: రాగము:

గురుమహరాజగురుమహరాజ - గురురామచెంద్ర సాద్గురుమహరాజ !!ప!! కోరీనవారీకి కోర్కెలోసంగీన- కారాణకర్త సద్గురుమహరాజ !!గు!!1!! భారమెనీదంటి నేరమెంచకబ్రోవు - శూర దుర్జనదూర గురుమహరాజ !!గు!!2!! పాలించు పాలించు మేలంచునావన్ని - దూలించుదు:ఖముల గురుమహరాజ !!గు!!3!! నిదాసదాసూని ఆశపాశమూల - నిగవుంచవోద్దయ్య గురుమహరాజ !!గు!!4!! పంచాదాశివాఖ్యం వంచానలేకాను - నెంచిచూపించిన గురుమహరాజ !!గు!!5!! షోడ శాక్షరిజాడ తోడుజేశియు పరము - వేడుకందించేటి గురుమహరాజ !!గు!!6!! ద్వాదాశి భావాము బోధించితదుపరి - ఖేదమోదముబాపె గురుమహరాజ !!గు!!7!! సంశాయములబెట్టి హంస హంకారీని ద్వంసాము జేశీన గురుమహరాజ !!గు!!8!! స్త్రీహత్య శిశుహత్య బ్రహ్మత్య జీవత్య- గోహత్యలనుబాపె గురుమహరాజ !!గు!!9!! కర్తావు భోక్తావు మర్తులయ్యిన వార్ని - కీర్తికెక్కించేటి గురుమహరాజ !!గు!!10!! శరణూలనెల్లాను చరణమందుననిల్పి - స్మరణజేయించె సాద్గురు మహరాజ !!గు!!11!! పూర్ణ భావముదెల్పి నిర్వాణునిగజేశి - తరుణోపాయముజేశె గురుమహరాజ !!గు!!12!! కరుణాతో వరకేతిరెడ్డిపల్లెలనీవు - శిరులు సంపదలిచ్చె గురుమహరాజ !!గు!!13!! వెలివెర్తి దాసూలు వెరపొంది రేమయ్య - స్మరణె నమ్మినవారు గురుమహరాజ !!గు!!14!! మునిదేవునిపల్లె మన వెంకటాఖ్యాని - మరువాక రక్షించు గురుమహరాజ !!గు!!15!!

!!కం!! శ్రీరామా శ్రీరామా -శ్రీరామాయనినాదు -చింతలుదొలిగెన్ - శ్రీరామాయని మనసున శ్రీరాములదల్వ ముక్తి శీఘ్రమె గలుగున్ !!

!!శ్లోకం!! గురుమద్యే స్థితం విశ్వం - విశ్వమద్యే స్థితోగురు: గురువిశ్వ సమస్తంతు - తస్మైశ్రీ గురవేన్నమ: !!

128. ఏకతాళం: రాగము:

దండామొక్కటినీకు సాష్టాంగముగ జేతు రామరామా - రొండుదండంబూలు పుండలీక వరద రామరామా !!1!! మూడుదండంబూలు మురహార పురుషేంద్ర రామరామా - వుండుమీ నాలోన నాల్గుదండాల్ శేతు రామరామా !!2!! దండంబులైదూను తగనుజేశెద నీకు రామరామా దండీపండితుడావు పరగారుదండాలు రామరామా !!3!! యేడుదండంబూలు యెంచి శేతును

చూడు రామరామా - అండాకుయిటురమ్మి అష్టాదండాల్ శేతు రామరామా !!4!! తొమ్మిది దండాలు తోరంపులక్ష్మీశ రామరామా - సమ్మాతితో శేతు నిమ్మళంబుగ పదియు రామరామా !!5!! పదకొండు దండాముల్ భక్తితో జేశెద రామరామా - ముదముతో శేతూను ద్వాదశదండాలు రామరామా !!6!! మనసూన పూజించి మరి పదమూడును రామరామా - కనుసహిగచేస్తిరి కదనయ్య పదు నాల్గు రామరామా !!7!! పంచాదశీజేతు వంచానలేకాను రామరామా - యెంచుమీనీలోన మించీనషోడాశి రామరామా !!8!! స్వచ్ఛామౌభక్తిచే యిచ్ఛాతొపదిహేడు రామరామా - ఖచ్చీతముతో జేతు అష్టాదశియు నీకు రామరామా !!9!! వున్నీను దండాముల్ మన్నించి చేశేద రామరామా - కనిపెంచినావాని మరివింశతియుశేతు రామరామా !!10!! యిరువాదివకటీయు యిరవు జేశిన స్వామి రామరామా - కరమొప్ప బావీసు కళలెంచిచేశేద రామరామా !!11!! తప్పీదములు అన్ని తగయెన్నాకుండయ్యా రామరామా - వోప్పిచెప్పితినాని అప్పూలోవేస్తిరి రామరామా !!12!! యిరువాది మూడూను యిగశేతుచూడూమి రామరామా - కరముతో చతురువింశతి దండములు పెడుదు రామరామా !!13!! పేదాభక్తుండాని నీదయగల్గెను రామరామా - పోదోలుమయ్యాయిఘ నేజేయు యఘములు రామరామా !!14!! పంచావింశతినీకు పరగావెలివెర్తిల రామరామా - కించా నుడానయ్యి వంచానతోజేస్తి రామరామా !!15!! మనసాలోచనలన్ని మరియెవరికి జెపుదు రామరామా - ఘనులు వున్నారాని ఘడియఘడియకు మనవి రామరామా !!16!! సదాశివుని ప్యాటాల జరిపెకార్యములన్ని రామరామా - వసుధలొ జనులంత గుసగుస లాడ్తారు రామరామా !!17!! వేలలెక్కలన్ని త్వరగా తెలియకపాయ రామరామా - బైలులోవుంచితె నీవెతెలియావలెను రామరామా !!18!! వైశాఖ మాసముల ఓఘ పన్నెండొందాలు రామరామా - రశిగాను కుంటీమి అందాజ కమ్మీగా రామరామా !!19!! యిఘుచింతపండైతె యింకఅట్లనెవుండె రామరామా - సఘముబోయె ఆస్తి సార్లబోవునో తెలియ రామరామా !!20!! యింత యిట్లుండాగ హైదరబాదులో నన్ను రామరామా - సంతముద్రాక్షరాశాలాలో వుంచితిరి రామరామా !!21!! కటుకాము బుచ్చన్న కనులాకైతె యిపుడు రామరామా - కొంటేగాచేశ్తీరి బంటూగానేలూకో రామరామా !!22!! శిష్యాని గుణమూలు గురువుగుర్తెగును రామరామా - హాస్యాముశేతూరు అదరించావలెనయ్య రామరామా !!23!! సాక్షిబెట్టియు అపుడు ధీక్షాజేయిస్తివి రామరామా - రక్షించ వలెనాని సాక్షులకు తెల్పితివి రామరామా !!24!! వేడీనకార్యాము వెతలేకుండగ చేస్తివీ రామరామా - నూతీలొ బడినా వాని ఖ్యాతిచందంబౌనానీ రామరామా !!25!! పాతకూడ నన్ను పాలించుమేలంచు రామరామా దాతావనీవిని దరికిజేరితినయ్య రామరామా !!26!! ఖర్మకాలుషమూలు కందికుందగచెయ్యి రామరామా -దుర్మాతినై చేస్తి మర్మముంచక బ్రోవు రామరామా !!27!! మాతాపితాదుల మరి నామములు విను రామరామా - మాతమాణిక్యమ్మ పిత వీరయ్యగారు రామరామా !!28!! వీరికి ప్రియమూన వేగకల్గితినయ్య రామరామా - దొరికేను మీనామ సారామృతంబూనురామరామా !!29!! జనులంత పిలతూరు జయము వెంకన్నాని రామరామా - కనవేమి కులసతి కనకనాగవేణి రామరామా !!30!! పుత్రూలనామములు భువిలోవిన్నవింతు రామరామా - సత్యాముపలికించి సరెనాని అనరయ్య రామరామా !!31!! శీతారామయ్యాకు చిలుకరంగయ్యాకు రామరామా - ఖ్యాతిగా తనయూడైన జనార్ధనకూను రామరామా !!32!! అశీర్వచనములిచ్చి ఆధరించితిరయ్య రామరామా - పాశాములన్నియు పట్టిచేదించూడి రామరామా !!33!! కాంశెట్టివంశాము ఘను లందురుగదయ్య రామరామా - సంశాయములు అన్ని సమయింప జేస్తివి రామరామా !!34!! విక్ష్వాకుగోత్రూడ విధివ్రాతబాపీన రామరామా - మోక్షాముగోరీతె శీక్షించ్చిప్పుడు నన్ను రామరామా

!!35!! విరోధికృతు నామసంవత్సరంబులో రామరామా - సరవీతో కార్తీక శుక్ల చతూర్ధందు రామ రామా !!36!! బుధవారమందూన ఘడియ యిరువై వఘటి రామరామా - శ్రీధారుడైన వకసారి గురునామము రామరామా !!37!! నీవుపల్కించీతె నేనుపల్కితినయ్య రామరామా - అవునయ్య తలుపాకు తప్పులెన్నన్నాను రామరామా !!38!! తనయూని చేష్టాలు తలితండ్రెరుగుదురయ్య రామ రామా- కనివిన్నవించీతి ఆశీర్వచనములిమ్ము రామరామా !!39!! యిసామియ్యబజారు కే. రంగ స్వామినాయుడు రామరామా- ఆశించినామడిగెలహాల్ వాసమైవుంటి రామరామా !!40!! యిష్ట మొచ్చినయట్లు పరియించి నాడాని రామరామా - కష్టపెట్టక నన్ను కరినిబ్రోచిన రీతి రామరామా !!41!! భారలింగంబూకు భక్తుణిగదనయ్య రామరామా - చేరాదీస్తినేడు చరణాల సముఖముకు రామరామా !!42!! గురురామబ్రహ్మావై గురిదెల్పితీవయ్య రామరామా- పరిపూర్ణబోధాను పరగ దెల్పితివీవు రామరామా !!43!! వాసమెక్కడనంటె మునిదేవునీపల్లె రామరామా - దాసూనికాపాడి తగమన్నించరయ్య రామరామా !!44!!

129. ఆదితాళం: రాగము:

యిందాకరమ్మానవే - గోవిందూని మందాయానరో పోయిరావే !!ప!! నందనంద మూకుంద మాధవ బృందమోహన శౌరిశ్రీహరి - యిందిరారమణా జనార్ధను కొందనంబులు ముందు జేశియు !!యి!!1!! రానికారణమేమియో నెబిలచీతె రవ్వాలెందుకు జేసునో - కానికార్యములు జేశిన నరుడు వీడని కపట మొందియు - రాడుకావూన నేడు దెలసెను పూనిధ్యాన్నము నీవు జేశియు !!యి!!2!! తప్పేమిజేశితినే వోతరళాక్షి చెప్పాకున్నవు యేలనే - చెప్పిచెక్రధరు నొప్పించియు యిప్పుడె తేవలెనుగాని - తప్పూడుమార్గముల బోవుచు తిప్పలాబెట్టాకహరిని !!యి!!3!! మనశిచ్చి మాటాడడే మగువరోవాడు దుడుకూలు మానడమ్మా - అనిశమూ తననాశ్రయించిన ఆత్మవేత్తల కరథిజేయుచు - మాన్యతాలేనట్టివారిని కూడియుండుట మేరగాదని !!యి!!4!! కోరీకతోనుగాదె రమ్మను మనుటా కారాణధర్మాములే - సాహస్రాదళనేత్రిరో నిజదారి జూపియు నిఖిల ముడిపియు పారముపర్యాయమొందను రామదాసును జేయుటకునై !!యిందాక!!5!!

130. ఆదితాళం: రాగము:

రారాగోవిందా సుందారా- సందేహముమాన్పను !!రా!! రారరారరణ శూరమ్రొక్కెదను ధీర శత్రు సంహరదయాకర !!రా!!1!! మందాహాసముతోడనూ కడగంటీదృష్టియు సుందారత్వాము వేడనూ - నందనందమూకుంద సురార్చిత - మందరోద్ధరా నందశుభాకర !!రా!!2!! భాక్తసులాభవేషా ముక్తీప్రదాత భాక్తరక్షాణపోషా - భక్తపాలన భయబిరుదాంకిత - యుక్తమైన పరవస్తు కృపాకర !!రా!!3!! సంచీతాదూలూబాపియూ మించీన కృపగావించీ యఘమూల వంచియూ- మంచిగ మము రక్షించెదనని దీవించితుదకు గావించుబయలుహరి !!రా!!4!! న్యారామెంచాకరాగదే నన్నేలుకోమాయ సారామేమియూలేనిదే - ఘోరబంధముల కొట్టివేశియును - కోరినరామా దాసునుబ్రోవను !!రారాగోవిందా!!5!!

131. ఏకతాళం: రాగము:

నందానందన యింతపంతమా నిన్ను నమ్మినందుకు యింతచిత్రమా !!ప!! నందానందన నన్ను గన్నావునీవన్న - బృందామోహనశౌరి యిందీవరేక్షాణ !!న!!1!! బాలాకృష్ణుడవయ్యినావటా గోల్లాబాలూలతో నాడినావటా - లీలాలుయిటుజేయా మేలురానీకును - చాలించుమికలీలా జాలిమాన్పినదాక !!న!!2!! రేపల్లెవాడాలో నీవికా చూడగోప్యమ్మా సుతాడావైనావికా - రూపులేకా

వక్క రూపామైపూట్టుట - తాపాసులకునైన తరమాగుర్తెరుగాను !!న!!3!! భామలతో సంగామేలరా నీవు భ్రాంతూలపొందుట లీలగా - సామాన్య జనులాకు మహనీయ్యులకునైన - నీమాయగనలేరు నిర్మాలనిగమాంత !!న!!4!! వెన్నాలదొంగావుగాదరా నిన్నుమన్నించావలశీనాదేలరా - పొన్నాచెట్టు నెక్కి కన్నీయచీరాలు - అన్నియు దొంగీలినున్నావాడవుస్వామి !!న!!5!! దుడుకూలు బహుగాజేశితివీ యెవరికైనా ఝడుపును బొందావైతివీ - భిడియామేమియు లేకా బిరబిరాఅన్నియు - ఘడియా లోపలజేశె గారాడివైతివి !!న!!6!! తిట్టుటగాదీది వినుమురా నీరట్టూలకే వగచెదానురా -ఘట్టిగ వెలివెర్తి పట్టీవినీవయ్యి - పట్టూమిచ్చెద రామాదాసూను నీకెపుడు !!నందానందన!!7!!

132. ఆటతాళం: రాగము:

స్వామిరో నామీదా యేలాదయరాదూ - కామక్రోధములన్ని ఖండించు పోని !!ప!! నిలుపా వోశముగాదునీమీది తలపు - నలుపూలెన్నున్నాను దులిపిమన్నించు !!స్వా!!1!! మునుపాటిదీక్షాలు ముసలీవాయెనా - యెనుకాటిబంధుత్వ మెలామరచినవూ !!స్వా!!2!! నమ్మీనవాడాను నన్నూ విడువాకు - సొమ్మూనీదైయున్నా సమ్మాతించూమి !!స్వా!!3!! అందారివలెగాని ఆల్దామునుమ్మీ నిల్వూలేదికనాకు నీవెందుబోకూ !!స్వా!!4!! నలుగూరిలోపాల నగువాశాయకురా - ఫలమేమి నీకోచ్చుపాల్గూణశాఖా !!స్వా!!5!! మానాభిమానాము మరినీదెకాని - మానూగసర్వాభి రామూడ నీవూ !!స్వా!!6!! వెలివెర్తిలోపాల వెరపుజెందితిరా - నలినాక్ష నన్ను నీరాకరించకురా !!స్వామిరో!!7!!

133. జుల్వతాళం: రాగము:

ముచ్చటాడవేలరా ముద్దుగానాతోడరా - రద్దిబేట్టవలదుస్వామి రాజితోడబల్కరా !!ము!!1!! యెట్టకేలకైనగాని వట్టిముచ్చటాడరా - పేట్టిపోతలేమి అడుగప్రేమ ముచ్చటించరా !!ము!!2!! మొలక నవ్వులాతొబల్క నోటిఅమృత మొలుకునా - పలుకరించినంత అమృతమొలుకునా శిరిదొలగునా !!ము!!3!! చిటుకుమంటె కోపమైతె యెటులనిన్ను సైతురా - భటుడనయ్యినాను నీకు కుటిలముంటె తెల్పరా !!ము!!4!! వంటిగైనవచ్చినాదు తంటలన్నిబాపరా - యింటిలోనయెవరులేరు జంటనూ వున్నానురా !!ము!!5!! నీవెనేను నేనెనీవు భేదమెంచవలదురా - తానుఅయిన తత్వమీవు మేను బోయినంకరా !!ము!!6!! రామదాసుతోడనీకు రాయభారమేలరా - పామరత్వమూల నణచి ప్రేమ జూడవలెనురా !!ముచ్చటాడ!!7!!

134. ఆటతాళం: రాగము:

కాంతారో వినవే శ్రీకాంతుడైయ్యిన ముక్తి కాంతనీవె గాదవే - పంతములేకా వంతూకయ్యిన రమ్మనే !!ప!! సంతతంబును నిన్ను విడువని వింతయేదో కలుగజేశియు - మంతనంబున మరువ వలదని యింతిరోశాంతునకు దెల్పుమూ !!కా!!1!! మతిమరువాకను అతని సతాతాము హృదయ మునా -గతమైనవానిగానూ -యితరమూ మరచీ హితమైనపదమూనందూ - హితవుగల్గా జేశెపతియని అతిభయంబున ఆశ్రయించియూ - గతులు యేమియు లేక సద్గతి అతిశయంబుగ జేయునిజముగా !!కా!!2!! ధృవగాజేంద్రాదులా గుహవీభీషణులాను తగచేరి బ్రోచేనటా - ప్రహ్లోదాది భక్తులగాచేనటా- భువనబొంతరాళ్లమునకు భుజగరాజా శెయనుడేయని - అవిరళంబుగ దెలశి నీవు ఆత్మతత్వము తెలశినిలచియు !!కా!!3!! దాసూనిచిత్తాము కల్గూనుయెంతెంతో దైవాకటాక్షా మంతే - గుహుడుయెంత శేవాజేశేనుతెల్పుము - భూసురుండగు రామదాసుని ఆశలన్నియు తోలగద్రోయను - వాసుదేవుడెకలడు నాకని దొశిలొగ్గియుతెల్పిరావే !!కాంతరో!!4!!

135. ఆటతాళం: రాగము:

వాసుదేవా జెనార్థనదేవా -దాసవాస విలాసాదిభావా !!ప!! యందుబోయీతివో తెల్పదాయా సందియంబు గల్గియు నిల్వదాయా !!వా!!1!! శ్రీధారా చిన్మాయకారా - భూధారా భాక్తాప్రకారా !!వా!!2!! గోపబాలా గోవిందా సుందారా - చూపవేలారూపాము మందారా !!వా!!3!! ఆపాదాలు బాపాను పరులున్నారా - రాపుయేల జేశేవు గుణధీరా !!వా!!4!! బొంకులాయెనా నావంకజాడు రంకులాడీ నీబింకామణచూనేడూ !!వా!!5!! దీనబంధూడవైనావే ముందే - దిక్కెనీవైతె నాకాను కుందూ !!వా!!6!! వేదవేద్యా వెలివెర్తి మందీరా - సాధుడైనా రామదాసూ మందారా !!వాసుదేవా!!7!!

136. ఆదితాళం: రాగము:

వైకుంఠావాసా వరవాసూదేవా వైభవతేజ కిరీట కుండలా - శంఖచక్రధర కుంకుమలాంకృత !!వై!!1!! శ్రీవత్సాకౌస్తుభ కేయూరాధర - భావాజాబ్రహ్మ బిలపుత్రాఘన - శేవితచరణా చక్రధరాయుధ భావితా భరణాభక్తాంచిత ఘన !!వై!!2!! మణిమాయకంకణ మంజూరాంచిత - పణిపాతి శెయనా పరమకృపాకర- అణిమూత్యసర మాలికధారణ- వాణివినుతవర వరపారాయణ !!వై!!3!! లక్ష్మీసామేతా లక్ష్మణభ్రాత - పక్షీంద్రవాహన పరమా ప్రఖ్యాతా - అక్షయధర్మా నిక్షేపాకర- రక్షితదీక్షారాజ కళామయ !!వై!!4!! హరినారాయణ దురితా నీవారణా - సరససుఖాస్పద సర్వేశాహరి - పరతత్వాశ్రితపరకాంతా మణి - స్మరణభరణాసన్నుత చరితా !!వై!!5!! విష్వక్సెనాది విబుదాశెవితా దుష్కర్మాది దు:ఖవినాశా నిష్కర్మాచయ నిఖిలచరాచర - నిష్కళంకమయ నీరాజలోచన !!వై!!6!! దీనామానాస దివ్వాధామా మానీతజేనా మంగాళధీమా - సానురాగసుగ్నాన విధాన మానుగ రామాదాసనుతావన !!వై!!7!!

137. ఏకతాళం: రాగము:

యెన్నతరమె నీదుమహిమా శ్రీచిన్నికృష్ణా యెన్నతరమె !!ప!! విన్నవించవయ్య నాకు విధము యేదో తెల్పదాయ- యెన్నరానిభువనములను యెన్నియెన్నో జేశినావు !!యె!!1!! కమలజాది అండ మూలునూ బ్రహ్మాండములును కలుగజేశినావు త్రిజగము - భ్రమలుబెట్టిజాలమొకటి శ్రమలుఅనక నేర్చుకొని - క్రమముతోడగల్లజేశి విమలమయ్యి వేరుపడియు !!యె!!2!! యెంతవారికైన తెల్పదూ సర్వాంతరమున వింతలెల్ల జేయుచుందువూ - వంతుకొరకే బ్రహ్మరుద్రా యింద్రుడాది ఘనులు అంత - మంతుబొమ్మలయ్యినీదూ మహిమతోను ఆడుచుండూ !!యె!!3!! చిన్నెలేల జేశెదావురా - వోవన్నెకాడా- చిత్రమేలజూపెదావురా- గాత్రమైనజీవకోటి మాత్రములను జేశిలోన - సూత్రదారివయ్యి ఆడజేతువిష్టమున్నరీతి !!యె!!4!! నన్నునిన్నుగాను జేయరా -నేనేమిలేకా -వన్నె బాశెకుంచజూపరా అన్ననీదుమహిమ కాని అన్యమేమిలేదు అనుచు - అన్నఅన్నా రామదాసు ఆర్తుడయ్యె వున్నవాడు !!యెన్నతరమె!!5!!

138. ఏకతాళం: రాగము:

భజనాజేశేదా భగవంతూణీ -భక్తూలసదయుని భజ !!ప!! నారాయణుడె అఖిలామనుచూ నామాము పల్కుచు సారారాసామెగ్రోలూచూను- భారముకంతయు భర్తయుకర్తయు - న్యారా న్యారము దూరెటిశ్రీహరి !!భ!!1!! భూతాదాయాను గల్గావాలెను - సర్వాండామందు దాతావున్నాది తెల్పావలెనూ - చేతోముదంబున శేవజేశిగురు - ఖ్యాతియుపొందియు ప్రీతితొ రఘుపతి !!భ!!2!! నామాములన్ని దలచెదాను - నయమైనామంత్రా నామాజెపాముజేశెదాను - కామములను నిర్మూలము జేశియు- పామరమణీచెటి ప్రేమకృష్ణాయని !!భ!!3!! సారాములేనిదాని దూలీ- సంసారా

ర్ణావ ఘోరాబంధామూ బాపూమానీ - దారిజూపుమని దర్శనమిమ్మని - కోరిమ్రొక్కెదను కోర్కెలు బాయను ॥భ॥4॥ భాక్తీ దలచీయు భావనజేతూ రక్తూడానేను వీరక్తి గ్నానాము లివ్వగజూతూ - యుక్తమైన ఆవ్యక్తుడనీవై - భక్తితో రామాదాసును బ్రోవను ॥భజనా॥5॥

139. ఆదితాళం: రాగము:

పన్నాగశయనా ఆపన్నూడనైవున్న నన్నేల రాక్షించవూ - అన్నీయునీవయ్యి యున్నావాడవు కావ నన్నేలరక్షించవూ ॥ప॥ చెన్నకృష్ణసుప్రసన్నా నన్నుగన్నతండ్రివన్న- నిన్ననేను తెలియలేను నీరజాక్షా శరీరమాధవ ॥పన్నా॥1॥ యిందీవరేక్షాణ నందాకోమారాక యెందూకు దయరాదురా సుందారా కారాము యందూనదాచీయు సూన్శమైయున్నావురా - అందుకేగద నిందలొందుట పొందరాని పాట్లుబెట్టియు యెందువుందువో యేమొ తెలియదు ముందువెనుకను యెందునీవై ॥పన్నా॥2॥ నిన్నేనమ్మినవాడ అన్యూలవేడాను సమ్మాతింపనివాడరా- చిన్నికృష్ణానీకు శేషామైయుండాగ నన్నెట్లు బ్రోచేదవో - విన్నవోవినలేదొనాదు విన్నపంబును చెవులముట్టెనో - కన్నవోకనలేదొ వెన్నుడ సన్నుతింపుచు నున్నవాడను ॥పన్నా॥3॥ నమ్మీనవారీని నట్టేటముంచియు నిమ్మళంబుగనుండరా - సుమ్మా నివేమాను కున్నావోకాని నీనమ్మాకమునుదెలశెరా - యిమ్మునీవని యితరమెంచక నమ్ముచారిని కావకున్నావు - సున్నసున్నగు నీదుచరితము సమ్మతంబుగ సాటుచుందురు ॥పన్నా॥4॥ కేశావ గోవింద విష్ణువిశ్వంబార వాసుదేవాదీనాథా - యీశాలోకేశా సర్వేశూడ వనుచూను దాసూడనై మ్రొక్కీతి - భాసమాన విలాసశుభకర భక్తవత్సలరామదాసుని - మోసమెల్లను ద్రుంచికావను వేశితివిగద బిరుదుముందె ॥పన్నాగ॥5॥

140. ఆదితాళం: రాగము:

శివమంత్రాస్మరణామృతపానం - శిద్దులకూను శీద్దవుషదమూ ॥ప॥ శివపంచాక్షరి చింతన శేయనుభవసంసార్ణవ బంధనమూ ॥శివ॥1॥ దాతవికారము ఘాతము జేసును - పాతకమూకు పరమవుషదమూ ॥శివ॥2॥ పిత్తవికారా మత్తలుబాపును - పైత్యకులాంతక పావనమూ ॥శివ॥3॥ కాసములన్నియు గాశిలజేసును - పాశములన్నియు బాపుసుమీ ॥శివ॥4॥ రోగములెల్ల నిర్రోగము జేయును - బాగజపంబగు నవుషదమూ ॥శివ॥5॥ సర్వసూృష్టిత్వము రాక్షణభారము - సర్వసంహారక స్వారసమూ ॥శివ॥6॥ పావనమంత్రము పామెనలోపల - భావనజేశిన భక్తులకూ ॥శివ॥7॥

141. ఆటతాళం: రాగము:

ఆదిపారబ్రహ్మ మరినామం - ఆకారరహితాము హరినామం ॥ప॥ ఆదిబ్రహ్మాదులు కోరి స్మరించీనా - ఆనందపదమిచ్చె హరినామం - అంటాదుముట్టాదు హరినామం ॥ఆ॥1॥ భక్తి హెచ్చించూను హరినామం - బ్రాంతులన్నియుబాపు హరినామం- యుక్తాముతోడూత రక్తులన్నియు బాపి - భక్తారక్షణజేయు హరినామం - ముక్తూలోసంగూను హరినామం ॥ఆ॥2॥ రాగాదులను బాపు హరినామం - బాగావైరాగ్యమౌ హరినామం - రాగాదులెల్లావైరాగ్యాము గావించి- యోగాక్షేమముజేయు గురునామం - భోగాభాగ్యములిచ్చు హరినామం ॥ఆ॥3॥ గ్నానాశిద్ధియు నిచ్చుహరి నామం - అనుమానాము ఖండించు హరినామం - గ్నేయాము గనుపించ గ్నానాము విడుపించు మేనూమమతలు బాపు హరినామం - మానాభిమానమును హరినామం ॥ఆ॥4॥ తత్వావేత్తలజేయు హరినామం - వుత్తాములనుజేయు హరినామం - మత్తాలన్నియుబాపి రిత్తామాయననణచి మొత్తాము దెల్పూను హరినామం -మోదామొందించూను హరినామం ॥ఆ॥5॥ యెంతాపాపము

సైనా హరినామం - అంతామొందించూను హరినామం - పంతాముతోడూత అంతాతానైనట్టి చింతాలాణంచూను హరినామం - మంతానమున దల్వ హరినామం !!ఆ!!6!! యెదికోరినగాని హరినామం - అదియుగల్గించూను హరినామం- సాధించువారికీ సర్వాసౌఖ్యములిచ్చు - పోదోలు అన్నియు హరినామం - యాదుంచు తనమీద హరినామం !!ఆ!!7!! నరకా స్వర్గంబూల హరినామం సరగూ రానివ్వాదు హరినామం - ఘోరాఖర్మములైన మీరానివ్వక నణచి - పారామొందగజేయు హరినామం - పరములందగజేయు హరినామం !!ఆ!!8!! మీరానివ్వదు యెమునీ హరినామం పారనివ్వదు పాశమరినామం - సారాములేని సంసారసాగరమూను కోరియీాదగజేసు హరినామం దారిచ్చిదరిజేర్చు హరినామం !!ఆ!!9!! యిహముపరములనిచ్చు హరినామం - అహములన్నియు నణచూ గురునామం - మోహములన్నీయు మొదటీకి ఖండించి వూహా గల్గించూను హరినామం- ద్రోహములను బాపు హరినామం!!ఆ!!10!! ధనధాన్యములు నిచ్చు హరినామం - మునుదు:ఖాముసు బాపు హరినామం - వినుపుత్రాపౌత్రుకాళత్ర బాంధవులాను - ఘనమునోసంగూను హరినామం పెనుమాయలునుబాపు హరినామం !!ఆ!!11!! జననామారుణ తరుణా మరినామం- దన్యాత నొందించు హరినామం- మునికూలవాసాము కొనినీవశించియు పూనూకోనున్నాది హరినామం రానిపోనిదదియే హరినామం !!ఆ!!12!! ధారుణీ వెలివెర్తిలరినామం ధ్యాన్నామవుచున్నాది హరి నామం - సారాముగనిత్యా స్వానుభావముజేశీ - పరమూ లొసంగేదీ గురునామం - వరరామ దాసూకు హరినామం !!ఆ!!13!!

142. రూపకతాళం: రాగము:

ఆశీంచితి హరి నీపదమాశించితి హరినీపద - లేశమాయ దృశ్యమాయ !!ఆ!!1!! నరులైనను సురులైనను సరిలేరిక చరణంబుకు - సరిదాతలు మరిలేరని చేయిజాపితి శేవించుట !!ఆ!!2!! చరణాకమాలమృతమును - మరిగ్రోలెద మానసమున - సరశిజాదులాకునైన సంభవీంచనట్టి స్థితికి !!ఆ!!3!! పోషించనునీభారము శేషాత్మకుడనుచుమదిని - దోషాంబులుయెన్నకు నీదాసుండ ను దరిజేరుట !!ఆ!!4!! సత్వదమగు సారాంశము - సత్తుచీత్తులకును సాక్షి - వుత్తమపద మొందుట కును సత్తయైన నీదుపదము !!ఆ!!5!! పునరావృత్తికి రహితము పనిఆయను నీదువలన అనిశంబును నినుమరువని ఆధారమైనముఖ్యము !!ఆ!!6!! ధరణీశ్వర మనుజేశ్వర కరుణించుమి కరిరక్షణ - స్మరియించెద యెరుకరిగె పర్యేంతము పామెనలో !!ఆశీంచితి!!7!!

143. ఆదితాళం: రాగము:

గరుడగామాన హరి-గుణనిధిశ్రీహరి -కరుణసుధాహరి మురహరి నారహరి !!గ!!1!! వోపిక లేనీవగు తాపదు:ఖంబుల - రూపణగించెటి అపోజ్యోతివి !!గ!!2!! పరమపూరుషాహరి ప్రద్యుమ్నాహరి పాతకహరణ సంప్రతిహరోహరి !!గ!!3!! గురుబోధాశ్రిత గుణసారాక్షణి - అరలేనీ దయ ఆప్రమెయా హరి !!గ!!4!! యిలధరవెలివెర్తి యీాశహరెహరి - సలలీత రామదాసు సన్నుతాహరి !!గ!!5!!

144. ఏకతాళం: రాగము:

వాసుదేవా వాసుదేవా వాసుదేవా - వాసవాదిహృదినీవాసా వాసుదేవా !!ప!! శుద్దసత్వ ప్రకృతీఫలితా వాసుదేవా - శిద్దపురుషాశ్రీనీవాసా వాసుదేవా !!వా!!1!! హరిహరాబ్రహ్మాదిదేవా వాసుదేవా - అప్రమేయావర మూకుందా వాసుదేవా !!వా!!2!! పంచాభూతా పరమాకాశ వాసుదేవా పంచవిశంతి తత్వాధారా వాసుదేవా !!వా!!3!! చతురుదాశ భువనోద్దార వాసుదేవా - సతతమూ త్రిభువానమాయ వాసుదేవా !!వా!!4!! అష్టదిక్పాలాకదేవా వాసుదేవా- శ్రిష్టిమాయ చిదచిద్రూప

వాసుదేవా !!వా!!5!! చేతనాచేతానంతార వాసుదేవా - దాతదైవా ధరణీశ్వార వాసుదేవా !!వా!!6!! పరమపురుషా భవ్యావేషా వాసుదేవా - కరివరదా పరమాశూర వాసుదేవా !!వా!!7!! ఆదిమద్యాంతాక రూపా వాసుదేవా - భేదరహితానాదాతీతా వాసుదేవా !!వా!!8!! వసుధలో వెలివెర్తి వరదా వాసుదేవా వర్ణించేనిటు రామాదాసు వాసుదేవా !!వాసుదేవా!!9!!

145. ఆటతాళం: రాగము:

శ్రీ కృష్ణాచిన్మాయ శీఘ్రామె రావయ్య చిన్నికృష్ణా - అక్రూరవరదూడ చెక్రాయుధ చిన్నికృష్ణా !!శ్రీ!!1!! తప్పేమిజేశితి చెప్పార నాతోను చిన్నికృష్ణా - విప్పిచెప్పినదాని దొప్పున నడిచేద చిన్నికృష్ణా !!శ్రీ!!2!! కనికారమునులేక కష్టపెట్టుట మేలా చిన్నికృష్ణా - పనికిమాలినవాడ పగయాలనాతోను చిన్నికృష్ణా !!శ్రీ!!3!! బంటూకుబంటూనై బడగీమాలితి చిన్నికృష్ణా - తంటాలుతగవూలు గెంటూము నీతోడు చిన్నికృష్ణా !!శ్రీ!!4!! అగడుజెందితిమాయ బుగులుబాపవయ్య చిన్నికృష్ణా - పొగిడేదనెప్పూడు తెగబాడినిన్నీక చిన్నికృష్ణా !!శ్రీ!!5!! శత్యులెవ్వరైన చెప్పిరనాచెడ్డ చిన్నికృష్ణా - శెత్యులార్గురైతె దక్కానివ్వరు నన్ను చిన్నికృష్ణా !!శ్రీ!!6!! ప్యాదభక్తుండాని నీదాయజూపావ చిన్నికృష్ణా - నాధూడవని యేంతో నిదాయనమ్మీతి చిన్నికృష్ణా !!శ్రీ!!7!! శివసానకాసాదివ్యాసూలకైనాను చిన్నికృష్ణా - సన్నుతింపరాక వున్నావుగదనయ్య చిన్నికృష్ణా !!శ్రీ!!8!! యెన్నెనోజన్మాదులెత్తా జేశితివౌవురా చిన్నికృష్ణా - అన్నన్ని జన్మాలకాపాదకోపీతి చిన్నికృష్ణా !!శ్రీ!!9!! అవతారములుయెత్తా భవతాపహరమూకె చిన్నికృష్ణా అవనీలో నినునమ్మె అంతారంగులకొరకు చిన్నికృష్ణా !!శ్రీ!!10!! చిక్కూలబెట్టాకు చక్కనయ్యనన్ను చిన్నికృష్ణా - మ్రొక్కూదునెప్పూడు దిక్కునీవనుచూను చిన్నికృష్ణా !!శ్రీ!!11!! కంసారికావావె హింసా లన్నియుబాపి చిన్నికృష్ణా - ధ్వంసాముశేయూమి సంశాయములుఅన్ని చిన్నికృష్ణా !!శ్రీ!!12!! వన్నెకాడ నన్ను కన్నెడశాయాకు చిన్నికృష్ణా - పన్నూడనై యున్నామన్నానశాయావె చిన్నికృష్ణా !!శ్రీ!!13!! దేహ రోగంబులు బాదించుచున్నావి చిన్నికృష్ణా - ఆహంబులోపాల నధికామాయను చూడు చిన్నికృష్ణా !!శ్రీ!!14!! వయ్యారిరంగయ్య వరమన్మాధాకార చిన్నికృష్ణా - అయ్యాల్యాగలమూ పాలియ్యాక బ్రతుకాము చిన్నికృష్ణా !!శ్రీ!!15!! కోపామొచ్చినదేమొ కొరగానివానిపై చిన్నికృష్ణా - పాపాడువీడాని చేపట్టవలెనయ్యా చిన్నికృష్ణా !!శ్రీ!!16!! జాలయింద్రజాల మహీంద్రజాలూడ చిన్నికృషా లీలాలు గావించి పాలించుచున్నావు చిన్నికృష్ణా !!శ్రీ!!17!! ఆపాదవ్యాళ్ళాల చూపారా నీకృపా చిన్నికృాష్ణా - దాపుజేరితినీదు దయకుపాత్రుడసుమ్మీ చిన్నికృష్ణా !!శ్రీ!!18!! వేదవేదాంతూడ వెలివెర్తిలోపాల చిన్నికృష్ణా - పోదోలుమిగ రామదాసూని తాపాము చిన్నికృష్ణా !!శ్రీ!!19!!

గీ!! సత్యపుర మేలుదువు నీవు సాక్షివయ్యి- నిత్యనిత్యములను నీవు నుదుటవ్రాసి- నృత్యములు శేయువారలకె హొత్యలేకా -వ్యత్యహాసము లేకను వెతలుదీర్చూ !!

క!! కమలజుని గన్నతండ్రివి భ్రమలను తొలుగంగజేయు భయమేలనుచున్ - ప్రేమతో హరినీనామము కామములను గాల్చునయ్య గోవిందహరీ !!

గీ!! ఫణుల భూషణములు గలపార్వతీశా - రణములోభాణునికి నీవు సహాయమయ్యి - ఫణివలెనె చలిజ్వరమును బాగవిడచి రణముజాలించుషాకన్య నిచ్చినావూ !!

గీ!! ముగ్గురుమూర్తులుమీరికా సగుణగతుని - పగలురాత్రియులేనట్టి బయలునందు వేగనిల్పియు వరములు వేడకుండ తగనువుండిడి ద్వారంబుమధ్యమందూ !!

క!! అమ్మాశారదవాణీ యిమ్మానాకభయమిపుడు -యిష్టముతోడన్ -రమ్మానాసదనమునకు కోమ్మానన్నిఘను యేలు కమలజురాణీ !!

గీ!! లక్ష్మీరావమ్మ నన్నేలు విలక్షణముగ -పక్షివాహనునకు నీవు భార్యవయ్యి -సాక్షిగావమ్మ నాకిపుడు దీక్షజేశి - అక్షయంబనుచుండుమీ ఆదిమాతా !!

క!! పర్వతశ్రేష్టపుత్రిక సర్వమునీవనుచు మదిలో సాటుచునుందున్ - గురువైన నీదుప్రభువుకు మరువగ వలదనుచు చెప్పిమన్నింపగదే !!

గీ!! ముగ్గురుమూర్తుల సతులికా దిగులుబాపి -పగనువలదని బాగుగా పరమకాంత -నిగలోగల్పియు మీవింతనిల్పివుండి -సగుణగతునిగ జేశియు సర్వమిడుడీ !!

గీ!! చెప్పినటువంటి కందగీతములనెల్ల -తప్పుబెట్టేటి సజ్జనులు వోప్పిటట్టు -తప్పులెన్నియు వున్నను త్వరగదిద్ది -గుప్తమును జేశిననుగావు గురువరేణ్యా !!

146. ఏకతాళం: రాగము:

దరిశానమివ్వూమి దయతోను వేగామె బాలకృష్ణా - కరివరదాయాని ఘనమూగా వేడీతి బాలకృష్ణా !!ద!!1!! బృందావనంబూన బంధూడవైతివి బాలకృష్ణా - రందీలో వేస్తివి పొందుగాదని నన్ను బాలకృష్ణా !!ద!!2!! మురశినందుకు యింతమొరబెట్ట జేస్తివి బాలకృష్ణా - సరియెవ్వరున్నారు నీకు వేరెచూడ బాలకృష్ణా !!ద!!3!! పదిమందినగెటట్టు బాగజేశితివయ్యా బాలకృష్ణా - వదులాను నిన్నెపుడుసదమాల సర్వేశా బాలకృష్ణా !!ద!!4!! నాకోసమే నిన్ను నరులు యేమందూరో బాలకృష్ణా బాకిశానాయెనని భయమవుతున్నాది బాలకృష్ణా !!ద!!5!! వ్యవహారమూకోసం నీవు చెప్పినమాట బాలకృష్ణా - లవలేశమయ్యానక్రియలు జరుగకపాయ బాలకృష్ణా !!ద!!6!! తలితండ్రివనుచూను తలచుంటిది వరదాక బాలకృష్ణా - కలిమిలేములు యేవికలనైన యెంచావు బాలకృష్ణా !!ద!!7!! వకలీరుణములవుంటె పకపాకనవేరు బాలకృష్ణా - సకలాము నీవయ్యా క్షితిరుణముల వుంచ బాలకృష్ణా !!ద!!8!! ముందాటి రుణమైతె మదిలోతేరకపాయ బాలకృష్ణా - సందులేకపాయ సరగూన మరిఅడుగ బాలకృష్ణా !!ద!!9!! గరుడవాహననన్ను కరుణించికడతేర్చు బాలకృష్ణా - స్మరణయే మారాను గురుచరణంబులు నాలో బాలకృష్ణా !!ద!!10!! రుణము లేకుంటాను తరుణోపాయము జేయు బాలకృష్ణా - అణువూలోవెలుగయ్యి అంతఅలసటబాయు బాలకృష్ణా !!ద!!11!! మరియాద గాదయ్యి మరియిటుల వుంచూట బాలకృష్ణా - పరము యెట్లొందూదు త్వరగాయిటులుంటేను బాలకృష్ణా !!ద!!12!! పొట్టివాడు వీడాని జుట్టుమునిగేటట్టు బాలకృష్ణా - పట్టిముంచితిరయ్యి ప్రాణాలునిలచేను బాలకృష్ణా !!ద!!13!! ప్రాణాలుపోయితె నిన్నెవరుతలతూరో బాలకృష్ణా - త్రాణ గలిగించూమి ప్రాణిబోయెటప్పుడు బాలకృష్ణా !!ద!!14!! యేమాలోచన లేదు యిదియే నాప్రార్థాన బాలకృష్ణా - కామాంధుడానయ్యి ఘనమూగజేశీతి బాలకృష్ణా !!ద!!15!! కీర్తి అపకీర్తిని నీద్యాను కొన్నాను బాలకృష్ణా - హరుకాతుచేయవద్దు అంతనీదే సుమ్మి బాలకృష్ణా !!ద!!16!! అంతనాదై వుండ యిటుల మొరలిడెనాని బాలకృష్ణా - పంతాముశేయాకు పదివేలదండాలు బాలకృష్ణా !!ద!!17!! మరచివున్నావాని మరివిన్న వింతూను బాలకృష్ణా - తలచిచేరదియ్యి కరినిను జేరిన యటుల బాలకృష్ణా !!ద!!18!! అందారికిని జూడ అంతప్రేమున్నట్లె బాలకృష్ణా - కొందారికిని జూడ తొందారవున్నట్లె బాలకృష్ణా !!ద!!19!! మాసాహుకారైతె మరిలెక్కకును బిల్చె బాలకృష్ణా - మీ ఆశీర్వచనమె కాని అహహ భయమయ్యేను బాలకృష్ణా !!ద!!20!! తోచ దేమిశేతు చేసెటందుకు

పాని బాలకృష్ణా - దాచిపెట్టినదంత దయజేశి నాకివ్వు బాలకృష్ణా ॥ద॥21॥ యెవరెన్నన్ననుగాని పగజేయవలదయ్య బాలకృష్ణా - కవిజేశె వీడాని భవమూలుతెగనరుకు బాలకృష్ణా ॥ద॥22॥ శరణన్నవారీని కరుణింతుననె బిరుదు బాలకృష్ణా - మరణంబు జననంబు మరిలేదనంటీవి బాలకృష్ణా ॥ద॥23॥ సద్దిబువ్వాదిన్నా సుద్దియెక్కడబాయ బాలకృష్ణా - కొద్దిపానికి నన్ను రద్దిబెట్టెద రింతా బాలకృష్ణా ॥ద॥24॥ బాలుడువీడాని బాగాదయలుంచుండి బాలకృష్ణా - చాలానెజేశీతి ఘోరపాపములన్ని బాలకృష్ణా ॥25॥ కాలూనిసదనాము కనుపాడవద్దయ్య బాలకృష్ణా - లీలలన్నియు జేశిగాఫల్‌లో వేస్తార బాలకృష్ణా ॥ద॥26॥ స్త్రీలతోనీ వింత చిత్రాచిత్రము జేశి బాలకృష్ణా - కీలుదెలిపి వారి జోలిమానితివయ్యా బాలకృష్ణా ॥ద॥27॥ వుట్లమీదిపాలు రట్లతోపాడచియు బాలకృష్ణా - దోసిట్లబోసుక మీరు యెట్లాజుర్రితిరయ్య బాలకృష్ణా ॥ద॥28॥ నవనీతచోరూడ నను వీడనాడాకు బాలకృష్ణా - సవినయంబుగ నీకు శరణుజేశెదచూడు బాలకృష్ణా ॥ద॥29॥ గోపస్త్రీలతో నీవు కోలాటమాడీయు బాలకృష్ణా - తాపములను బాపి దరికి జేర్చితివయ్య బాలకృష్ణా ॥ద॥30॥ మీతల్లి నిన్నెతె రోలగట్టిన యెపుడూ బాలకృష్ణా - పాతాకమెంచాక పరగమద్దులగూల్చె బాలకృషా ణ॥ద॥31॥ యేశోద తనయూడ యదుకూలమునబుట్టి బాలకృష్ణా - రశికూలందారి రక్షించితీవయ్య బాలకృష్ణా ॥ద॥32॥ పసిబాలూడవయ్యి భయమింతాలేకాను బాలకృష్ణా - కశిగా రాక్షసులాను పాసగదున్మితివయ్య బాలకృష్ణా ॥ద॥33॥ తప్పులేమెరుగాను వోప్పుజెయ్యుమి స్వామి బాలకృష్ణా తిప్పాలబెడితేను వోప్పితమానీకు బాలకృష్ణా ॥ద॥34॥ వ్రేపల్లెవాడలో గోప్పమ్మాసుతుడావై బాలకృష్ణా పాలుపెర్గులు త్రాగి పసులగాచితివయ్యా బాలకృష్ణా ॥ద॥35॥ దేశికులెవరంటె తెలిపేద యిప్పూడు బాలకృష్ణా - రాశిజేశినవారు రఘురామచెంద్రూలు బాలకృష్ణా ॥ద॥36॥ మద్గూరునాథూడు మహిలోభారయ్యగారు బాలకృష్ణా - కోద్దివాడనుకాను సుద్దిదెల్పిరిఅంతా బాలకృష్ణా ॥ద॥37॥ వారీకిశిష్యూడ వరుసాతోతెల్పీతి బాలకృష్ణా - ధరలోవెంకటదాసును సరగూనబ్రోవూము బాలకృషా ॥ద॥38॥ మునిదేవునీపల్లె ముద్దూగ వినరయ్య బాలకృష్ణా - పనులెన్నివున్నాను పరికించి చూడూడి బాలకృష్ణా ॥ద॥39॥ తప్పులున్నవియాని తగపాలించియు మీరు బాలకృష్ణా - వోప్పేటట్టుగ మీకు వోప్పిదిద్దరయ్య బాలకృష్ణా ॥దరిశానమివ్వూమి ॥40॥

147. ఏకతాళం: రాగము:

మురసుట సరిగాదూ మురారిశౌరి ॥ప॥ మురసుట సరియట శిరితో కలశియు - పరమ సుఖంబులు జెందియుమరచుట ॥ము॥1॥ నిరుపేదనుసుమ్మీ నీచుడ దరిజేర్చుమునన్ను అరమరెందుకిక కరుణలోలుకుటకు - దురములన్నియును సరగున బాపుము ॥ము॥2॥ యెందుకు యేశినవూ బిరుదును ముందేననుజేశి - అందుకెకద నీకొందనంబులును - ముందువెనుకనే పొందిక అంతయు ॥ము॥3॥ కరుణాకారుడవూ దయాకర పరమోదారుడవూ - అరమరలెంచకు అతిథుడువీడని- అధరించుమీసాధురక్షకా ॥ము॥4॥ ఘనమహిమను యెంచూకించన గుణములు వంచించూ - మనమునయెంచుమి మరిఅధిపతినని - మక్కువజూపియు మాటనిల్పుకో ॥ము॥5॥

148. ఆటతాళం: రాగము:

నాతప్పు క్షమియించూ నారాయణ దేవా నీదాపుజేరీతయ్యా ॥ప॥ పాతకుడను సుమ్మి పరమా కృపానిధే దాతావునీవెసుమ్మీ ॥నా॥1॥ యెన్నెన్నో జన్మాల యెందూనే జేశినా - యెన్నాతారమె న్నారమా మన్నించు మన్నించు మరి తండ్రి తనయూలకన్నా పామరమురీతీ ॥నా॥2॥ కృూరాత్ముడగు

యెజామీళూడు మమతాచె నారాయణనుచూ సుతునీ - కోరీపీలచుచున్న న్యారాములెంచాక నరకామిడిపించీతివీ !!నా!!3!! భళిరే నీమహిమాను బ్రహ్మాదులకునైనా ప్రస్తుతింపగ వచ్చునా - నలినాక్షనీవైన కొనియాడలెవాని నారాదాదులు అందరూ !!నా!!4!! నెనెంతవాడాను నీచూడ జీవూడ - పామారధముడ మూఢుడా - మేనీంద్రియమూల మానులొ జిక్కియు నిన్నూ మరచితి సాత్యము !!నా!!5!! వుత్పత్తి స్థితిలాయ కర్తావైతివినాకు యెట్లుకాపాడీతివో - మత్తాలన్నియు బాపి వుత్తామగతిజేయా సత్తానీవైతివీ !!నా!!6!! నీదాసదాసూడ నిఖిలాంతరాళాము నీవయ్యినను బ్రోవుమా - సాధూడు వెలివెర్తి వరరామదాసుడు - నీదాపు జేరెనయ్యా !!నాతప్పు!!7!!

149. ఆదితాళం: రాగము: మాల్‌కోస్

నారాయణ నారాయణ నారాయణ యనవే - ఓన్నమొ నారాయణ నామాంబును నాలుకతో ననవె !!ప!! అష్టాక్షరిమంత్రంబును నిష్టతోజపియించూ - కష్టాత్మ్యుడవైచెడకను కరుణేశునిగొలువూ !!నా!!1!! విపరీతపుభావమునను విహితమటేనీకూ - కపటాంబులకల్మాషము కడతేర్పవు నిజమూ !!నా!!2!! దేహంబులుభోగంబులు మోహంబులుఅన్ని - సోహంబునుసోధించిన బాధింపవుయిన్ని !!నా!!3!! అవసానముకాలమునను హరిహరియనితలువా- అనిశాంబును తను చేకొని అందించునుముక్తీ !!నా!!4!! ధరయెందున వెలివేర్తిల స్మరియించవెలెస్సా - వరమీచ్చును స్థిరమాబ్బను పాలించును వినుమా !!నారాయణ!!5!!

150. జంపెతాళం: రాగము:

పాండురంగ పాండురంగ పాండురంగా - అంగలింగసంగభంగ పాండురంగా !!ప!! భజన జేతుభక్తితోను సుజనదాయకా- అజసురాదులైనలేరు ధొరవునీవయా !!పా!!1!! కరుణజూడు కరుణ జూడు స్మరణలోలుడా - భరణమయ్యనావు భక్తా విమలపాలుడా !!పా!!2!! ఫలములేదు సుమ్మి నీకు నరులబ్రోవకా - కలలనైనా మరువనట్టి బలముజూపికా !!పా!!3!! పారదోలుమయ్య దురిత జాలమూలనూ - కోరినావాడాను నిన్ను మీరజాలనూ !!పా!!4!! నాదుబ్రతుకు కొరకుగాని నిన్ను పొగడుటా - నీదునామ రచనతోడ నీచముడుగుటా !!పా!!5!! నీవుగాక యితరమంత నీచమేకదా భావాభావమూలు తొలుగా బయలువేకదా !!పా!!6!! రామదాసుడన్నమాట రాజియెకదా - నామ రసము గ్రోలుకొనుట వోజయెకదా !!పాండురంగ!!7!!

151. జుల్వతాళం: రాగము:

యింతకఠినమేలరా శ్రీకాంతవరద వీఠలా - చెంతజేరినానునాదు చింతమాన్పవేలరా !!ప!! పాయజాలనట్టిమాయ యేలజేశినావురా - వెయ్యివిధములయ్యినాను వేరుపరుచ నీవెరా !!యి!!1!! వెతనమివ్వని దాతకొలువు హితవుయెన్నగాదురా - సుతులుఅనుచు బ్రోతురెవరో హితులె దైవమాయరా !!యి!!2!! వరములివ్వనట్టి వేల్పు వనముగాచిన వెన్నెలా - కరువుదీర్పనట్టి యితర పరులనేలా గొలచెదా !!యి!!3!! యితరమెంచబోకురా - నాగతివినీవెకావరా - సతతమూను రామ దాసు స్తుతినిముట్టసాగెరా !!యింత!!4!!

152. ఆటతాళం: రాగము:

పాండురంగా బంగరికొండ పాండురంగా - పుండలీకవరద విఠలపూర్ణవర్ణా ప్రభుశుభా కర - ఖండఖండాఖండ మండల నిండుభక్తా నిజశుభాకర !!పా!!1!! నిన్నెతలతూ నిరహేతుకుడనై వున్ననేనూ - సన్నుతించెద సకలభువనము లన్ని వ్యాపకమయ్యి భూతము - యెన్నో రూపములాడ

జేయుచు నున్నవాడవు మన్ననెంచుమి !!పా!!2!! కోపమేలా నాపైయింతా తాపమెలా - పాపఖర్ముడ ననుచు యింకా పాతకంబుల పట్టుజేయను - చూపితివిగద మాయకును నను చూడుమిక్కడ నీదెలీలని !!పా!!3!! చూడుమయ్యా చూడ్కులతోను వేడుకయ్యా- ఆడవయ్య అనంతజెన్మములందు జేశిన ఖర్మములపై - కూడవయ్యా నాదుమాయను వీడజేయుమి వేడుకొనెదను !!పా!!4!! భాక్తా వరదా భవభయహరణా సాక్తాఫలదా - వ్యక్తమగునిక నీప్రభావము రక్తిబాపియు ముక్తులివ్వను శెక్తితోడుత రామదాసుకు యుక్తమయ్యిన వుపము జూపుము !!పాండురంగా!!5!!

153. ఆదితాళం: రాగము:

రంగరార రణభయ భంగరార - రంగరంగవిహంగ రుచికరా త్తుంగభృంగ పరాంగ నాంగనా !!ర!!1!! విఠలరార తటుకున యిటకురార - భటుడనైతినే శరము వీడుకొని కుటిలము లేకను పటుతరంబుగను !!ర!!2!! విష్ణురార హరిశ్రీకృష్ణరార - విష్ణువిష్ణుశ్రీవిష్ణుదేవయని - తృష్ణ తీర్చియును కష్టమరించను !!ర!!3!! రామరార రణజయ భీమరార - రామరామశ్రీరామ రఘుకులా ధీమ పరాత్వర నామప్రకాశక !!ర!!4!! దీనబంధో దీనుల దివ్వశింధో -దానవాంతకా మానరహిత అసమానతేజ ఘన పామెనాంతర !!రంగరార!!5!!

154. ఆదితాళం: రాగము:

శివశివయనరాదా చిత్తమచింతమానరాదా - శివశివయనినను భవభయమొదలియు అవయవరహిత అచలమొందుటకు !!శి!!1!! నమశివాయనవే మాయను నమ్మరాదుగదవే- నమో నమోయని నమస్కరించిన - నయంబుయైమన భయంబుబోవును !!శి!!2!! శంకరమూర్తిగదే హంకరి వంకదీర్చుపదవే - బింకములన్నియు సుంకణగించును- రంకుబాశి తనఅంకెకు లోబడి !!శి!!3!! ప్రస్తుతించన్వాలే సర్వా వస్తువుఅయ్యినాడె - వస్తువస్తుపర వోస్తువుతానై - నాస్తుతికందని నాశారహితమది !!శి!!4!! చింతింపగన్వాలె శంకరుడంత తానైనాడె - వంతుగపామెన వరరక్షకుడై స్వాంతము రామాసద్రక్షకుడగు !!శివశివ!!5!!

155.ఏకతాళం: రాగము:

హరతూలిత్తాము హరిశ్రీవాసుదేవునకూ - పారవారవిహర గుణగంభీరునకు శూరునకు ధీరునకు సారసాక్షు !!హ!!1!! జయము జయము జయము శీతారాములకు జయము - నయము నారదాదిభక్తా భయముబాపె బారకునకు భక్తితోనుముక్తిగోరీ !!హ!!2!! ఆశ్రీతా పరీపాలకా బిరుదాశ్రి తాంశునకూ - స్వాశ్రితాజన దాసహృదయ వాసచిద్విలాస హసభాసామాన యీశునాకు !!హ!!3!! మంగళము మంగళము మంగళమాయ రహితునకూ - అంగలింగ విహంగభంగా రంగనీకి పొంగుచూను అంగనాలుభక్తితోను !!హ!!4!! నందనందనా నందసనకసనందచేందానా - మంద హాస ముకుందమాధవ -మందరొద్ధరాదిధర సుందరాంగభక్తబృంద !!హ!!5!! శుభము శుభము శుభము శుద్దా సుందరాంగునకూ - అభయహస్త అనంతమూర్తికి - శుభములాని భవముబాశి విభవమొందె విష్ణునాకు !!హ!!6!! కార్పురారతికాంతిచే కందర్పజనకునకూ - వోర్పుతోడుత రామ దాసుకు దర్పమణచి దారిదెలపి తీర్పుజేశినట్టిహరికి !!హరతు!!7!!

156. ఆటతాళం: రాగము:

రామనీకుయిదుగో మంగళం - రాజాధిరాజ రమ్యగుణోద్ధామ మంగళం - రామరామనీదు నామ సారమెపుడు గ్రోలుచున్న ప్రేమభాక్తావరులయోగ క్షేమమూగా పాడుచున్న - స్వామినీకు సార్వమంగళం - సంపన్నసార్వ ధామనీకుశేతుమంగళం !!రా!!1!! నీదునామరూపమూలకూ నిత్యాత్మవైన పాదుకొన్న బ్రహ్మమూనకూ - నాదుబిందుకళలమీరి నమలమైన నచలమునకు నీదురూపమట్టిదాని బోధకొరకుగురునిగలశి- సాధువరద సతతమంగళం- సత్యాత్మవైన భేదరహిత నాధమంగళం !!రా!!2!! విశ్వగర్భమునకుమంగళం విశ్వాధిపతికి విశ్వమునకు శేతుమంగళం శాశ్వితా ఐశ్వెర్యనాకు సత్యవాఖ్యశీలునాకు - సకలసుగుణదాయునాకు సంకటాది హరివినీకు రశికజనోల్లాస మంగళం- రాజితోను విశ్వశించు విహితమంగళం !!రా!!3!! నామరూప రహిత మంగళం - నచలాత్మవైన ప్రేమవరదసోమ మంగళం - ధామనిర్వికార నిత్యరామ నిష్కామసత్య నిరుపమాన నిగమవేద్య సల్బుదూ నీభజనమెపుడు - పామరాంతనీకు మంగళం ప్రమదాదినాథ పరమపావనీయ మంగళం !!రా!!4!! వర్ణవర్ణరహితమంగళం - అఖిలాంతరాంత నీర్ణయాత్మ నిరత మంగళం - వర్ణవర్ణభూతరహితా వర్ణమాయ గగనరహిత - నిర్ణయాదినిఖిల నిరావర్ణ కరుణ హరరామ - వాసుదేవ దేవమంగళం- వసుదాద్రివాస వాసరామదాస మంగళం !!రామ!!5!!

157. జంపెతాళం: రాగము:

మంగళము శ్రీలక్ష్మి మంగళము మహలక్ష్మి మంగళము వరలక్ష్మి మహజెననికీ - మంగళం బనరె మీరంగనాలందరును - శృంగారవతి అయిన సురలక్ష్మికీ !! జయమంగళం లక్ష్మిశుభ మంగళం !!మ!!1!! పాలవారధిలోన ఫణిఆదిశేషుని చల్లచెశిరి దేవదానవులునూ - ముల్లోకరాణియై ఫణినోటవెల్లినా పల్లవాదరికినీ పణతులిపుడూ !!జయ!!మ!!2!! హెమపీతాంబరము ప్రెమదీరని రవికె సోమసూర్యులమించు పేంపుతళకూ - కోమలీరూపంబు కొనియాడరాదెంత ధాముడైవ్రాశేటి దాతకైనా !!జయ!!మ!!3!! పగిడిభూషణములు వజ్రవైఢూర్యములు పొదిగినాబహుచిత్ర వర్న ములునూ - పగుడాలు ముత్యాలు పచ్చలాహరములు మగువకంఠము నందు శిరివెలుగగా !!జయ!!మ!!4!! మరకతము మాణిక్యనీల గోమేధికము శిరమునందున రత్నసరులుమెరయా యురము నందునజేరి హరిరాణిఅయ్యున్న - పరమలక్ష్మిని మీరు వరములడగీ !!జయ!!మ!!5!! మూడులోకంబులకు ముఖ్యమైయుండిన -జోడుబాయనిఆత్మతోనుగలశీ వేడుకైవెలగుచును వెలివెర్తియందున పాడి మంగళహారతివ్వుడికను !!జయమంగళం లక్ష్మిశుభమంగళం!!మ!!6!!

ఆఖండ దైవస్తుతి ముగిశెను

ఇట్లు విగ్నాపించువారు

కాంశెట్టి వీరయ్యగారి పుత్రుడగు వెంకన్న

మొక్కాం!! మునిదేవునిపల్లె, మం!!కల్వగూరు జిల్లా!!మెదక్

శ్రీగురవేనమ:

# ద్విపదసాంఖ్య తత్వము ప్రథమ భాగము

శ్రీగురుపాదముల్ చిత్తంబులోన - బాగుగా దలచియు ప్రస్తుతించియును !!1!! పాదుగా గురువాఖ్య పద్ధతియుబూని - వేదాంతమార్గంబు వెతకిశోధించి !!2!! అనుభవవేద్యముగ ఆత్మ శోధించి - పన్నుగాఅంతయును పల్కితివినుడి !!3!! ఆదికాలమునందు అదియేమిలేక - అంతట నిండియు అచలమైవుండి !!4!! అందులోపల వంధ్య సూనునిపగిది - అంతటతనకుదా ఆత్మయును బుట్టె !!5!! ఆయాత్మలోపల ఆదిశెక్తపుడు - చంద్రచంద్రికవలె చెన్నొందికల్గె !!6!! రంగైనమాయెందు రాజితముగాను - పొంగుగాత్రిగుణములు పొసగంగగల్గె !!7!! ఆకాశమును వాయువగ్ని జలభూమి ప్రాకటంబుగ పంచభూతములు గల్గె !!8!!! అండపిండాండ బ్రహ్మాండంబులాయె మెండుగా దశదిశల నిండెనామాయ !!9!! అయిదుభూతంబులు అవిభిన్నమయ్యి - అయిదు అయిదులు యిరువదైదయ్యి వెలశె !!10!!

!! పంచవింశతి విభాగం. !!

అవివిన్నవించెదను ఆలకించండి - యువిధలందరు భక్తియుక్తి మతిచాత !!11!! ఆకాశమా కాశమది గ్నానమాయె - మక్కువసగమును మరిభూతములతో !!12!! ఆకాశమును వాయువమరి మనుసాయె - ఆకాశమును అగ్ని బుద్దయ్యివెలశె !!13!! ఆకాశమును జలము అదియు చిత్తంబు-ఆకాశభూమిలో హంకృతంబయ్యె !!14!! ఖ్యాతిగగనంబున గల్గెనీఅయిదు - అంతరేంద్రియములు అనిచెప్పబడును !!15!! వాయువులో సగము వ్యానుండునాయ - పాయకర్థమునాల్గు భూతముల కూడి !!16!! వాయుగగనము గలశి వరసమానుండు - వాయువగ్నిలో గలశి వరవుదానుండు !!17!! పరగజలమును గలశిప్రాణుండునాయె - ధరగలశ పానుండు తగగల్గెనమ్మా !!18!! యెంచగా గాలిచే జెన్మించినట్టి - పంచప్రాణంబుల పద్ధతియిదియు !!19!! అగ్నిలో సగమయ్యి అదికన్నులాయె మిగిలినర్థము భూతముల నన్నిగలశీ !!20!! అగ్నిగగనము గలశి గలిగెచెవులమ్మా - అగ్నివాయువు గలశినాయ చర్మంబు !!21!! అప్పుతో గలశియు నాయెనాలుకయు - వప్పుగా ధరగలశి నాయె నాశికము !!22!! గ్నానేంద్రియంబులు గలిగగ్నియెందూ - అనువుగా వివరించితది అంతమీకూ !!23!! జలముజలముతో గలశి చెలగిరసమయ్యె- నాల్గుభూతంబులూ నమరియుసగమూ !!24!! జలము గగనము గలగి శబ్ధంబు - జలము గాలియు గలసి గలిగె స్పర్శంబు !!25!! జలమగ్నితో గలశి గల్గెరూపంబు- జలభూమితోగలశి నాయెగందంబు !!26!! జలభూతమున వేగ తన్మాత్రలాయె అలసటలేకను అదివింటిరికను !!27!! పృధ్విఅర్ధంబయ్యి గుదముజన్మించె - అర్ధంబు భూతముల నన్నిటియు గలశి !!28!! పాయకాకశముతో పరగవా:క్కాయె - వాయువుతో గలశి వరకరంబాయె !!29!! పృధ్విఅగ్నితోగలశి పుట్టెపాదములు - అదెజలంబుతో గూడ నాయెగుహ్యంబు !!30!! భూ అంశమునైన భావంబుయిదియు - పాయకకర్మేంద్రియంబు లన్నియును !!31!! యివియింద్రి యంబులు యింక్కదెల్పెదను - ప్రవిమలవిషయముల్ పరగవీటికిని !!32!! ఆధిదేవతలనెల్ల నదియు వివరింతు - మతిగల్గివినుడికా మగువలందరును !!33!!

!! పంచవింశతి తత్వవిషయములు అధిదేవతలు !!

గ్నాతకు యెరుకయుమరుపె విషయంబు - ప్రత్యగాత్ముడు వేగపరగనభిమాని !!34!! మనుసుకు సంకల్పమదియె విషయంబు - పనిబూనిచంద్రుడుపరగదేవతయ !!35!! బుద్ధికి విషయంబు భువి నిశ్చయంబు - అధిదేవతయు గురువు అయ్యుండచలియ !!36!! చింతనే

విషయంబు చిత్తంబునకునూ - అధిదేవతయు జీవుడమరియూనుండు !!37!! అహంకారముకు రుద్రుడభిమానియగును - అహంభావంబనె నదియు విషయంబు !!38!! వ్యానముకు విజయుడు సమానముకు జయుడు - ప్రాణముకు విశ్వసృష్ట పరగదేవతయు !!39!! వినుడు దానమునకు విశ్వయోనియును - అనువుగాపానముకు ఆదివిశ్వకర్త !!40!! చవులకు విషయంబు శబ్ధమై యుండు - దేవతదిక్పతి తేటముగనుండు !!41!! చర్మంబునకు స్పర్శ చెప్పంగనేల - ధర్మంబుగను వాయుదేవుడధిపతియు !!42!! నేత్రంబులకు రూపునెలమి విషయంబు - ఆధిదేవతయు సూర్యు డయ్యుండు సఖియా !!43!! రసమె జిహ్వకు విషయ పతివర్ధనుడను - పొసగ ముక్కుకు గంధ మెనువిషయంబు !!44!! అశ్వినీదేవత అధిపతైయ్యుండు- పశువులైచెడిపోక పాటించుడన్ని !!45!! వా:క్కుకువిషయంబు వచనమైయుండు - అగ్నిదేవుడు అధిదేవతైయుండు !!46!! కరముకుదానమె కడువిషయమగును - దేవేంద్రుడధిపతి దేవుడైయుండు !!47!! నడుచుటే విషయంబు నరయ పాదముకు - ఆధిదేవతయ్యుండు అరయవిష్ణుండు !!48!! గుహ్యముకానంద గుణమె విషయంబు- బ్రహ్మఆధిదేవతై బరువడిగనుండు !!49!! గుదముకువిషయంబు మలవిసర్జనము - మృత్యువధి దేవతై ముదమొందియుండు !!50!! యింద్రియంబులు విషయములు దేవతలును - ఆధ్యాత్మఆధి భూత ఆధిదైవికములు !!51!! యింక్కదెల్పెదభూత సంచితంబంత- సంకోచపడకను చౌరంగవినుడి !!52!! పృధ్విభూతంబులో పుట్టినవివినుడి - ఆస్థిచర్మము మాంసనరము రోమములు !!53!!

!! పంచభూతాంశగుణములు !!

వుదకభూతంబులో నుదయించె శుక్లాశోణితము మీమెదడు సోధ్యంబుగాను !!54!! యింగలములో నిద్ర సంగమము మొదలు - ఆకలిదాహ మాలిశ్యములు కల్గె !!55!! ఆకాశమున కామక్రోధలోభములు - శోకమోహము మదమత్చరము గల్గె !!56!! శబ్ధస్వరిశము రూపరసము గంధంబు - వుధ్భవంబాయెను వూర్విలోపలను !!57!! రసమురూపస్వర్శ శబ్దముల్నాల్గు - పొసగ జలమందునా పొందుగానుండు !!58!! రూపస్వర్శము శబ్దరూఢగ్నియెందు - వప్పుగాగల్గెను వరుసతో మూడు !!59!! వాయువందున స్వరిశశబ్దముల్ రెండు- పాయకాకాశమన పరగశబ్దంబు !!60!! రక్తవర్ణము పృధ్విశ్వేతమును జలము - యుక్తవర్ణము నల్పువుండగ్నియెందు !!61!! వాయు భూతము ధూమ్రవర్ణమైయుండు - పాయకగగనంబు పరగనీలంబు !!62!! పృధ్విలంభీజంబు పుట్టెను వినుడీ - వుదక వంభీజంబు వరుస జనియించె !!63!! అగ్నిలో రంభీజ మమరియూకల్గె ఆవాయు యం భీజమాయ చూడగను !!64!! ఆకాశమునవేగ హం భీజమాయ - అమరిపంచా శెక్తు లందులో నుండు !!65!! పంచమూర్తులువేగ పరగదేవతలు - అంచితంబైయున్న హంశములు యిన్ని !!66!!

!! పంచప్రాణం ప్రాణాదులస్థాన కర్మనిర్ణయం !!

పంచప్రాణంబుల పరగస్థానంబు - యెంచగా వుపవాయులెలమి వివరింతు !!67!! ప్రాణా వాయువు హృదయస్థామందుండి - నాణెపుశ్వాసముల్ నడుపుచూనుండు !!68!! అపానమును గుదగుహ్య స్థానమందుండి - వుపాయముచె మలమూత్రముల విసర్జించు !!69!! వ్యాసపవనంబు సర్వాంగమందునను - సమానవాయువు నాభిస్థానమందుండి !!70!! అపాదమస్తకము వ్యాపించి యున్నా - ప్రాపునాళ్లన్నిటికి పంచన్నరసము !!71!! కంఠమందువుదాన మంటియుండియును - కలగనుచు కలలోన కలువరంబొందు !!72!! దగ్గుతుమ్ములు రుచులు తగబుట్టజేయు - తగఅన్న రసమును ఆత్మకుపంచిపెట్టు !!73!! నాగవాయువు రోమనాడులందుండి- వేగంబులేక గీతాదులను

జేయు !!74!! కూర్మవాయువు పాదమందునివశించి - మర్మముగ శుష్కదేహము పుష్టిజేయు !!75!! కన్నురెప్పలు నోరునిమ్మళంబుగను - తిన్నగమూయించి తెరిపించుచుండు !!76!! కృకుర వాయువు నాశికాగ్రమందుండి- గమనంబుతుమ్మును తగగల్గజేయు !!77!! నేత్రగుహ్యమునందు నెలమితోదేవ - దత్తుండుకూర్చున పరుండనిలచుండ !!78!! జేయువ్యక్తముగ మాట్లాడించజేయు పాయకధనుంజయ వాయువెప్పుడును!!79!! సహస్రారమగుబ్రహ్మస్థానమందుండి - శ్రవణ రంధ్రంబుల చెలువొందనిలచి !!80!! అబ్ధిగోషము భంగిఆనాదములను- అతివిచిత్రంబుగా అందు బుట్టించ్చు !!81!! మరణకాలంబున మరిఘోషబాపు - మరణించు తరితనవు సడలించిపోవు !!82!! దరనాళ్ల వివరముదగను వినుపింతు- విశదముగ వివరింతు వశమైనదంతా !!83!! యెడుమ నాశికమును యిడనాడియగును - చంద్రనాడియు అగును శివుడుఅధిపతియు !!84!! కుడి నాశికము నాడిసూర్యనాడగును - కడువేడ్కతో విష్ణుడధిపతైయ్యుండు !!85!! మధ్యనినాశికమున మరిసుషమ్నమును - అధిదేవతయుబ్రహ్మ అగ్నినాళమును !!86!! కుడినేత్రమునను గాంధారి నాడుండు - కడుయింద్రుడధిపతై కడువడిగనుండు !!87!! వరహస్తినినాడి కడుజిహ్వయందు వర్ణుడధిపతి వాయునేత్రమందుండు !!88!! దక్షణకర్ణమున దగపూషనాడి - సాక్షిదిగ్దేవతా దైవమై యుండు !!89!! వామకర్ణంబున వరపయశ్వనియ - మరియుండునూబ్రహ్మ అధిపతైనచట !!90!! అలంబసానాడి ఆది శిశ్నమందు - అగ్నిదేవుడు దైవమవునుదానికిని !!91!! వాయువందున కూహనాడిస్థానంబు - పాయకధిదేవతయు పరగభూమియును !!92!! శంఖినినాడిక చంద్రుడధి పతీయు - శంఖిలేకను నాభిస్థానమందుండు !!93!! అంతరేంద్రియస్థానములను దెల్పెదను - మంతనంబుతో వోపిమరివేగవినుడి !!94!! గ్నాతచక్షువులందు ఘనముగావుండు - బుద్దికిస్థానంబు భువిలోన ముఖము !!95!! మనుసుకు స్థానంబు మరియు కంఠంబు - మానుగహంకారి మరి హృదయమునను !!96!! చిత్తంబునకుస్థాన ముత్తముగ వినుడి - నెత్తముగ నాభిసంస్తానమన బడును !!97!! పంచాగ్నిస్థానములు పరగంగవినుడి - యెంచగాకాలాగ్ని పాదములయందు !!98!! నయముగా క్షుదాగ్ని నాభియెందుండు - నయనములకోపాగ్ని మరియందుండు !!99!! ఆత్మయెందుండును నమరిగ్నానాగ్ని - శీతాగ్నిహృదయమున చెలువొందివుండు !!100!!

గద్య !! యితి అన్నమరాజవంశోద్భవ - భరద్వాజసగోత్రుడును - అనంతకృష్ణయ్య ద్వితీయ పుత్రుండైన - రామచంద్రరాయప్రణితంబైన - ద్విపదవాఖ్యము సాంఖ్యతత్వము - ప్రథముభాగము

సంపూర్ణము.

శ్రీపరబ్రహ్మణేనమ:

# ద్విపదవాక్యము ద్వితీయ భాగము - ఘటశోధనం

షడచెక్రములజాడ చౌరంగ వినుడి - షటుపదవులును గనియె సర్వగ్నులైతె !!1!! ఆసనస్థాన మందాధారముండు - అందునాలుగు రేకులమరియూయుండు !!2!! నాల్గురేకులయందున మరి వసశషలు - నాలుగక్షరములు నక్షత్రకృతియు !!3!! యెలమిసద్యోజాత ముఖమందునైన వెలయభూతత్వంబు వేడ్కతోనుండు !!4!! న అనుబీజంబు నగుక్రియాశెక్తి పాయకహంసలు పరగనార్నూర్లు !!5!! యిదియుభూలోకంబు యిచటగణపతియు - యిచటసాయుజ్యంబు యిర వొందివుండు !!6!! ఆధారమునకు రొండంగుళములపైన - స్వాదిష్టచక్రమును ఆరుదళములతో !!7!! లింగస్థలంబందు రంగుగానుండు - అంగుగా బభమయరలవను నక్షరములు !!8!! వామదేవ ముఖంబు వరజలంబుండు - మ- యనుభీజంబు తగనిచ్ఛశెక్తి !!9!! యిది భువర్లోకంబు యిచట బ్రహ్మాయును - యితనికి నార్వేలు ఆజపమగుచుండు !!10!! సాన్నిధ్యపదవిటీ చదరకను కనుడీ సరగున మణీపూరచక్రమెట్లనిన !!11!! నాభిస్థానంబున నమరిదశదళము- నాడఢణతథద ధనపఫ యక్షరములు !!12!! అఘోరముఖమునా ఆవతరించున్న - అగ్నిభూతమునందు అటగ్నాన శెక్తి !!13!! అధిపతీవిష్ణువు అదిసువర్లోక - అదియెసారూప్యంబు అతడురక్షకుడు !!14!! శిం భీజమును యుండు రం బచటనుండు - షడుసహస్రంబులు జపమర్పణంబు !!15!! అనహత చక్రంబు నలయహృదయమున - పూనియుద్వాదశ దళములందుండు !!16!! కఖగఘఙచఛజఝ ఞటఠ వుండు - అకలంకముఖము తత్పురుషమందునను !!17!! వాయుభూతంబును వా భీజ ముండు - పాయకాదీశెక్తి యం బచటనుండు !!18!! మహర్లోకంబును మహదేవుడుండు- మహిమతో సామీప్యమజపమార్వేలు !!19!! కంఠస్థానంబునా కడువిశుద్ధంబు - అంటిపదహారు దళమమరంగ వుండు !!20!! అఆఇఈఉఊఋౠఌౡలు-ఎఏఐఒఔఅంఅ: యనునవియు !!21!! యీశాన్య ముఖము నందాకాశమూను - యా యనుబీజంబు నటపరాశెక్తి !!22!! జనర్లోకమును జీవుడధిపతైయ్యుండు - జయముగాసాష్టిత్వపదవి అందుండు !!23!! హం కారమను భీజమది యుండునచట - హంసలువకవెయ్యి ఆవర్ణణంబగును !!24!! రొండుదళములతోను నుండు భ్రూమధ్య- దండిగాజ్ఞేయ చక్రంబందునుండు !!25!! హంక్షంబులనియె రెండక్షరంబులను- ఓంకార బీజంబు వనరశివశెక్తి !!26!! మహగోప్యముఖమును మరిభూతములును - మహోతపోలోకమును మరియాదతోను !!27!! పరమాత్ముడుండునూ పాయకనందు - పరగహంసలు వెయ్యిపరగ నర్పితము !!28!! సహస్రారచక్రంబు సరవితోడుతను - సాహస్రదళములు స్థానంబువేగ !!29!! బ్రహ్మారంధ్రమునందు పరగంగ వినుడి - బ్రహ్మస్వరూపంబు బాధలేకుండు !!30!! పంచరంగులతోడ పంచముఖములచే పంచభూతంబులును పంచాక్షరములు !!31!! పంచకర్తలువేగ పంచ శెక్తులును పంచాకృతుల తోడ పరగనున్నట్టి !!32!! సగుణనిర్గుణమైన సాక్షిరూపునకు - సరసముగ సాహస్ర హంసలర్పితము !!33!! సత్యలోకంబంద్య వుత్తమోత్తములు - వుత్తమపదవిదియె వుచీత మొప్పగను !!34!! అతలలోకంబును అరికాళ్లయెందు - వితలలోకంబును మీగాళ్లయందు !!35!! మక్కువమడిమలో మరిసుతలముండు - పిక్కలందున తలాతల లోకముండు !!36!! మోకాళ్ల యెందున మొగిరసాతలము - వేడ్కతొడలా మహోతలలోకముండు !!37!! పాతాళలోకంబు పాయు వందుండు- సప్తద్వీపంబుల స్థానములువినుడి !!38!! తలయందు జంబుద్వీపము తానుయుండు వెలయ యెముకలయెందు ప్లక్షద్వీపంబు !!39!! శిఖయెందు నుండును శాఖద్వీపంబు - చర్మ

కుశద్వీపమొప్పగను ‼41‼ క్రౌంచద్వీపంబును మించివెంట్రుకలో - యెంచగానుండును యే మందుఅన్ని ‼42‼ సప్తసముద్రముల స్థానమివరింతు - సంపూర్తిగ వినుడి సంపూర్ణభక్తులును ‼43‼ వుప్పుసముద్రంబు వప్పుమూత్రంబు - మెప్పుగాఇక్షునది మరిచమటయగును ‼44‼ సుర సముద్రంబును శుక్లమింద్రియము - సర్పిసముద్రంబు సతిపతులద్రవము ‼45‼ దధి సముద్రం బును అదిశ్లెష్మమగును - క్షితిక్షీరసముద్రంబు నోటిజోల్లేను ‼46‼ శిద్దోదకము నదీ సుద్దిజెప్పెదను నిద్దకన్నీరికా శిద్దమైయ్యుండు ‼47‼ అష్టదిక్పాలకుల ఆధారమినుడి- యిష్టముతోడుత యింగితం బుగను ‼48‼ యింద్రునినగరంబు యిలలోభ్రూమధ్య - మందుఅగ్ని హొూత్రు పురమక్షియెందు ‼49‼ దక్షణకర్ణమున అంతకునిపురము - తగపార్శ్వమున నైరుతి దేవతుండు ‼50‼ పరగపృష్టము నందు వర్ణునిపురము - పవననగరంబుదా పార్శ్వమందుండు ‼51‼ వామకర్ణంబున వరకుబేరుండు - వామనేత్రంబున హరుడుండెగిరియు ‼52‼ దశనాదముల పేరు విశదమెరిగింతు - పొసగ మ్రోయును వేగజలది ఘోషంబు ‼53‼ భేరినాదము ఘంట వీణెనాదంబు - భ్రమరనాద మృదంగ విమలనాదంబు ‼54‼ కాహళమద్దెల ఘననాదములును - కింక్కిణినాద మోంకార నాదంబు ‼55‼

‼ పంచముద్రల లక్షణం ‼

పంచముద్రల లక్షణంబేర్పరింతు - సంచితాదులునెల్ల సమశిపోనగును ‼56‼ పద్మాసనస్తుడై పదిలముగనుండి - పరగఆర్దోన్మీలిత లోచనంబు ‼57‼ లోచూపునిల్పియు తోపుటజూచి - తొమ్మిది ద్వారముల తొలగెచిత్తంబు ‼58‼ నిమ్మళంబుగనిల్పి నిఖిలేంద్రియములు - సమ్మతంబుగ విషయ సౌఖ్యములనిల్పి ‼59‼ కుండలిశెక్తిని కుదురమేల్కోలిపి - దండిగప్రాణముల్ తగనిరోధించి ‼60‼ తాలుమధ్యంబున జిహ్వలగ్నంబు మేలుగగావించి బహిరంతరముల ‼61‼ యెందువూర్ధ్వా అధో భాగములయందు - పొందిభావాభావముల సమమునుంచి ‼62‼ దంతములచేతను దంత మంటకను- మంతనంబును వూర్ధ్వాముఖముగావించి ‼63‼ వృత్తిరహితముచేయు వుచితమైనట్టి యిదియు ఖేచరిముద్రయని చెప్పబడును ‼64‼ కన్నులురొండును కదలింపకాను పన్నుగాకొన ముక్కునందునను నిల్పి ‼65‼ నిల్పిచూచుటవేగ నిదియు భూచరియు - వేలుపల సగమును వేగరెప్పలును ‼66‼ సగముచూపును మధ్యసరళమందుంచి -సరిగజూచుట మధ్య లక్ష్యమైయుండు ‼67‼ నేత్రములురొండును శోత్రములురొండు - నాశికారంధ్రములు నమరంగమూశి ‼68‼ భ్రూమధ్యమున చూపుబుద్దితోనిల్పి - ప్రేమతోబిందునాదముకాళాలన్ని ‼69‼ దర్శించుటయు మనసు తగనుంచిఅందు - తగనుజూచుటవేగ తగను షణ్ముఖియు ‼70‼ వనర శాంభవిముద్ర వసుధలోమూడు - విధములజూచుట నదియుశాంభవియు ‼71‼ నేత్రములనుదెరచి నెలమితో మనుసు - వృత్తులన్నియునిల్పి వస్తువందునను ‼72‼ నిల్పుటవెలిచూపు నిదియు ప్రథమంబు సల్పబహిర్లక్ష్యభావమైవుండు ‼73‼ మనుసువృత్తులనన్ని మరలించినిల్పి- అనిశము నేత్రముల తెరచి భ్రూమధ్య ‼74‼ మందులక్ష్యమునుంచి మరిచూడచూడ- అందమగు మధ్యలక్ష్యం బందురిదియు ‼75‼ చతురువింశతి తత్వములను జెయమొంది - శబ్దగుణకంబాత్మ చెలగి దృష్టియును ‼76‼ ఆకాశమందున అమరంగవదలి - ప్రాకటంబుగ మనుసు అభిముఖముజేశి ‼77‼ భ్రూమధ్య మునను అంతరలక్ష్యముంచి -నేమముతోజూడ నెలమివింతలును ‼78‼ ద్రష్టయెందున లక్ష్య మును తగనువుంచి - యిష్టముతో జూడనిదియు శాంభవియు ‼79‼ యిదిరాజయోగముకు యికను ముఖ్యంబు - యిదియుశ్రేష్టంబంచు అందురు బుధులు ‼80‼

!! పంచభూత తత్వములు !!

గ్నానసమానముల్ వీనులశబ్ధమును - గ్రహించియు నోటముచ్చటవచించు !!81!! ఆకాశ పంచకామందురివ్వియును - ఆత్మవేత్తలు యెపుడు అనుభవముతోను !!82!! గ్నాతమనసునుబొంది వ్యానముగూడి - ప్రితిచె చర్మమున స్వర్శించితాకు !!83!! చేతితోదానఖర్మయు జేయుచుండు ఖ్యాతితో వాయుపంచకమయ్యియుండు !!84!! గ్నాతబుద్దిని జేరు దానమునుగూడి - నేత్రములచే సర్వరూపముల నెరిగి !!85!! పాదములతో నడచి పరుగెత్తుచుండు - పావకపంచకంబైయుండు యివియు !!86!! గ్నాతచిత్తముప్రాణమును గూడుకోని - గ్నానముజిహ్వచే షడ్రసములన్ని !!87!! గరిమతోడుత రుచులు గ్రాహ్యంబుజేశి - గుహ్యముతోడ ఆనందించుచుండు !!88!! జలభూత పంచకము జయముతోనగును - యిలపంచకంబును యిదుగోతెలియండి !!89!! గ్నాతహంకార మపాన ఘ్రాణమున - గందంబుగొని గుదముతో విసర్జించు !!90!! చతురుదేహవస్త చెతురు జీవులును - చతురభిమానులు చెలగికోశములు !!91!! యిరువదైదునుగూడి స్థూలతనువాయ అరుదుగా అన్నమయకోశమనబడును !!92!! యిదెజగత్కార్యముల నన్నిటినిజర్వు - యిదె మాను షత్వము యితడు విశ్వుండు !!93!! ఇతనికి అభిమాని యిల విరాటుండు - గతిజాగ్రతయు నేత్ర స్థానమైవుండు !!94!! పదిహేడుతత్వములు పరగసూక్ష్మంబు - యిదియె దేవత్వము యితడు తైజసుడు !!95!! యితనికిపతియు హిరణ్యగర్భుండు - యితడు కంఠస్థానమున స్వప్నమొంద్దు !!96!! ప్రాణకోశంబును గ్నానకోశంబు - పరగరొండునుసూక్ష్మ దేహంశమయ్యె !!97!! కారణదేహంబు క్రమము వినుపింతు - కానికార్యములన్ని కడకొత్తివినుడి !!98!! చిత్తంబు ప్రాణంబు జీవేశ్వరులును మత్తనొందియు హృదయ మార్గమందుండి !!99!! కూడి సుషుప్తితొ లీనమొందియును - వేడ్కతో ప్రాజ్ఞుడు విభుడవైయుండు !!100!! అండమయకోశ మిదెకారణంబు - అనువుగా మహకారణం బేర్వరింతు !!101!! స్వచ్ఛమైయున్నట్టి స్వప్రకాశంబు - మచ్చిక జ్యోతియె మహకారణంబు !!102!! యిదె తూర్యమనబడూ యితడు సర్వజ్ఞు - పతియు స్వరాట్టయి పరగనున్నాడు !!103!! మనుసును ఖర్మేంద్రియంబులును గూడి- వినుమనోకోశంబు వివరమిదియెను !!104!! ఓంకారమును వేగ వనరంగ వినుడి - ఆకారమును బ్రహ్మమచట నాదంబు !!105!! ఉకారమును విష్ణువుండు బిందువును - మకారమును రుద్రుడును కళానను !!106!! భూతలయమును వేగ భువిజలంబందు ఖ్యాతిగా జలమగ్నిలో నైక్యమగును !!107!! ఆఅగ్ని వాయువులో నందణగియుండు - ఆవాయు గగనమందగును మిశ్రంబు !!108!! ఆకాశమును మాయయందణగియుండు - ఆమాయఆత్మలో అణగియులయించు !!109!! ఆత్మ అచలంబయ్యిఅంతటనిండి - ఆకామును లేని అచ్చుతంబగును !!110!!

!!గద్య!! ఇతి అన్నమరాజ వంశోద్భవ - భరద్వాజసగోత్ర భాగవత సాంప్రదాయకుండు - ప్రథమశాఖా పవిత్రుండునగు - అనంతకృష్ణయ్య ద్వితీయ పుత్రుండునైన - రామచంద్రరావు ప్రణీతంబైన - ద్విపదవాక్యము ఘటశోధనము సర్వము సంపూర్ణము.

శ్రీగురువేనమ:

# ద్విపదవాక్యము తృతీయాశ్వాసము
# మహావాక్యములు

మహావాక్యములు వేగమరివిన్నవింతు - మమతసూన్యంబయ్యే మరుగునుగనుడి !!1!! అన్నియు నేనుగాననిలెస్సదెలశి - నేనునాదనుభ్రాంతి లేకుండజేశి !!2!! యెగ్జానమున నిన్ని యెరుగునాగ్జాన - ప్రగ్జానమని శృతుల్ పలుకుచూనుండు !!3!! రుగ్వేదవాక్యము యిట్టి ప్రగ్జాన లక్షార్తానుభవము - గుట్టెజీవాత్ముండు గురితోనుగన్నా !!4!! హరిహరాదులు అజుడు మొదలైన సురులు - నరమృగపశుపక్షి క్రిమికీటకములు !!5!! సర్వమందునయున్న సాక్షివక్కటియు- సద్బ్రహ్మ పదమనె లక్ష్యార్ధమగును !!6!! మశపిపీలిక బ్రహ్మమగు శెరీరములు - వాచ్యార్ధమని వాట్నివదలి చూడగను !!7!! పరబ్రహ్మమయ్యుండె పరగంగవినుడీ- ప్రగ్జానమన్ననూ బ్రహ్మమనిఅన్న !!8!! వార్త భేధమెకాని వస్తువక్కటియు- ఆర్తిలోగనిసర్వ వాసనొదులండీ !!9!! యిదిప్రథమ వాక్యంబు యాప్టి తంబుగను - యిఘద్వితీయంబును యిదివినుడి మీరు !!10!!

!! యజుర్వేదవాక్యము !!

అహంబ్రహ్మఅశ్మి ఆదియెట్టులనినా- మోహంబుదిగనాడి మోదమునవినుడి !!11!! దేహిం ద్రియప్రాణమంతరింద్రియము- లహమనబడకఅవి జడములైయుండు !!12!! మేలుగనుఅహముకు వాచ్యార్ధమగును-వాలాయముగఆత్మ దేహమంటకను !!13!! బుద్ధికిసాక్షియై పూర్ణముగనున్న - శుద్దప్రత్యాగాత్మ లక్ష్యార్ధమగును !!14!! బ్రహ్మపదముకును బ్రహ్మాండవాచ్యంబు - బ్రహ్మాండముకు ఆంతరబాహ్యముల యందు !!15!! తనకుతానైనిండి అన్యమునులేక - వున్నదేబ్రహ్మముకు లక్ష్యార్ధ మగును !!16!! అహముపదవాచ్యార్ధ బ్రహ్మవాచ్యార్ధ - ఊహతోవదుల లక్ష్యార్ధములురెండు !!17!! వెలయనైక్యము దెలియ నదియె నశ్మాను - సలలితంబుగ దీని సారమునుయిదియు !!18!!

!! సామవేదవాక్యము !!

తత్వమశ్యనువాక్య సరళివినిపింతు - వుత్తమ తత్వంబు వూహతోగనుడి !!19!! సర్వగ్జుడైనట్టి శుద్దజీవుండు- సరసముగ తత్వదవాచ్యార్ధమగును !!20!! సృష్టికిపూర్వంబు సృజనేమిలేకా - నష్ట నామమురూప మన్నదియులేకా !!21!! నిత్యమైయున్నట్టి నిర్గుణబ్రహ్మ - తత్వదలక్ష్యార్ధ తాత్వర్యమౌను !!22!! కించగ్జుడగువ్యెష్టి కొంచమైయుండి - యెంచత్వంపదముకు వాచ్యార్ధమగును !!23!! దేహత్రయంబులకు తేజమైయున్నా - ఆహమే త్వంపదా లక్ష్యార్ధమగును !!24!! తత్వద త్వంపదా వాచ్యార్ధమొదలి - వుత్తమలక్ష్యార్ధములు రెండుగలయు !!25!! అదియుఅశిపదముకు లక్ష్యార్ధ మగును - అయమాత్మబ్రహ్మవిధి అదియెట్టులనిన !!26!!

!! అధర్వణ వేదవాక్యము !!

స్వచ్ఛమైయున్నట్టి స్వప్రకాశంబు - యెంచగా అయమనుట కర్ధంబునగును !!27!! దేహింద్రి యాది ఆహంకారములకు - బ్రహ్మంబెప్రత్యగాత్మయనబడును !!28!! దృశ్యమగు బ్రహ్మండమును సర్వమొదలీ - నిశ్చయముగున్నదే నిజబ్రహ్మమగును !!29!! అనిత్యంబుయగు మాయనంతనుళ్లక్కి అప్రమేయంబైన నదియెబ్రహ్మంబు !!30!! యిదియెపో మహావాక్య మీప్సితంబుగను - యిదితెలియ బ్రహ్మంబు తానెయౌలలనా !!31!! యిదెబ్రహ్మ మిదెవిష్ణు విదెసాంబశివుడు - యిదెపార్వతిదేలక్ష్మి యిదియు భారతియు !!32!! ఆదిశెక్తె యిదియు ఆనందమిదియు - అఖిల దేవతయిదియు

నిఖిలమును యిదియు ‼33‼ యిదితాము అయ్యుండి యిలలోన నరులు - మతిబొందిమాయలో మరలుచున్నారు ‼34‼

‼ పరిపూర్ణ లక్షణము ‼

ఆత్మబ్రహ్మంబుకు ఆవలితత్వ - మదియెవ్వరెరుగరు మక్కువతోను ‼35‼ అతిపరమ రాహస్య మైయుండు నదియు - మతిభ్రాంతులకు యిదిమరి అందబోదు ‼36‼ సాధులకే దీని సౌఖ్యంబు యగును - వాదులకును యిది వర్ణింపతరమ ‼37‼ బ్రహ్మకల్పన అయిన బ్రహ్మాండములును - భ్రాంతులేమియు లేక భావమును మీరి ‼38‼ పంచభూతము గాదు పరమాత్మగాదు - యెంచగా వేదములు యెమియును గాదు ‼39‼ వేదవేదాంతముకు యెక్కువైయ్యుండు - సాధనముల కదీ సాధ్యంబుగాదు ‼40‼ పంచవర్ణంబులా పద్దతియుగాదు - పంచశెక్తులుగాదు పరమైనపదవి ‼41‼ పంచవింశతి తత్వభావమునుగాదు - యెంచిచూచిన మరియేదియునుగాదు ‼42‼ సగుణనిర్గుణములు సదసత్తుగాదు - సాకారమును నిరాకారములుగాదు ‼43‼ ఆత్మనాత్మలుగాదు ఆప్రమేయంబు - క్షేత్రక్షేత్రముగాదు క్షయమునుగాదు ‼44‼ క్షరమక్షరముగాదు చర్చించిచూడ- సరసముగ చైతన్యభావమునుగాదు ‼45‼ స్థూలసూక్ష్మముగాదు కారణముగాదు - మేలైనమహ కారణంబునుగాదు ‼46‼ బ్రహ్మవిష్ణు శివాత్మ భావమునుగాదు - బ్రహ్మాండముకు వేరుబరగుచూ నుండు ‼47‼ జాగ్రతస్వప్న సుషుప్తులుగాదు - జయమైనతూర్యంబు జర్గేదిగాదు ‼48‼ పరగ పొట్టియుగాదు సన్నమునుగాదు - సరగునహ్రస్వదీర్ఘంబుగాదు ‼49‼ ప్రకృతిపురుషులుగాదు వికృతమునుగాదు - సుకుర్త దుష్కృతములా సుద్దియుగాదు ‼50‼ నాదుబిందుకళా నభయమును గాదు - పాదుకొనియున్నట్టి పరబట్టబయలు ‼51‼ సకలదేశములందు సకలకాలముల - సకల వస్తువులందు చలనములేక ‼52‼ ప్రతియుగంబులుగాదు పర్వములుగాదు - గతవస్తువును గాక సతతమైవుండు ‼53‼ స్వతశిద్దమై చరాచరమువ్యాపించి - హితముగనున్నదే యీబట్ట బయలు ‼54‼ యెరుకైన వస్తువ యెదియునుగాక -యెరుకమరుపుల యెరుక యెన్నడుకనక ‼55‼ మితిమీరియున్నది గతమవుటలేక - మతికిఅందగరాదు మహిమేమిలేదు ‼56‼ పుట్టదు గిట్టదూ పుట్టించబోదు - యెట్టివింతలునైన యెరుగంగబోదు ‼57‼ అరుగదు తరుగదు విరుగంగ బోదు - పెరుగదు విరుగదు పెరేమిలేదు ‼58‼ శబ్ధశబ్ధంబులా చెల్మియునుగాక - శబ్ధరహితంబయ్యి చెలగుచునుండు ‼59‼ భక్తివిరక్తులా భావమునుగాక - ముక్తికాంతయుగాక శెక్తియునులేక ‼60‼ జోతిర్మయంబనే దీపంబునందును - ఖ్యాతిప్రఖ్యాతులా గమనించబోక ‼61‼ నేమనిష్టలకును నెళవునుగాక - నామరూపంబులానంటగారాక ‼62‼ పాపపుణ్యంబులా బందమోక్షముల- పాతక ములు లేని పావనబయలు ‼63‼ యింతఅంతనిచప్ప యెవరివశమనియు - అంతులేనటువంటి అట్టిఅచలంబు ‼64‼ బ్రహ్మదులకునైన బలుకంగరాక - బట్టబయలైనట్టి బయలుబ్రహ్మంబు ‼65‼ నాదిమధ్యాంతముల నమలమైవుండి - నామరూపాదిక్రియ లేమియును లేక ‼66‼ మనుసు వా:కులకును మరిఅందరాక - అనిశంబు వకవిధామయ్యుండు వినుడి ‼67‼ తారకసాంఖ్యంబు దారియుగాక - తత్వఅమనస్కముకు తగులగాబోక ‼68‼ లక్ష్యముద్రలకైన లాఘవపడక - సాక్షిగా దది యెరుకసాక్షికి సాక్షి ‼69‼ భక్తివైరాగ్యంబు పరగగ్జానంబు - యుక్తులన్నియు యేమివుపయోగ పడక ‼70‼ యోగసమాధుల యెరుగంగరాదు - యోగభోగులకైన యెరుగశక్యంబె ‼71‼ యెమియునెరుగక యెచటతానయ్యి- యచలమై వచియింప యెగుర్తులేక ‼72‼ అండపిండాండ బ్రహ్మాండంబునందు- ఖండఖండముగాక ఆఖండమైయుండు ‼73‼ పరిపూర్ణపద్దతి పరగ యీ

విధము - సరవితోవివరింతు సద్గురూక్తంబు !!74!! గురుశేవ స్థిరముగా గురితోనుజేశి - కరుణకు బాధ్యుడై కనుసొర్ణతోను !!75!! గురిలెస్సగాజూచి గుట్టంత తెలశి - మరుగేమిలేనట్టి మార్గమంతెరిగి !!76!! కలలోనవచ్చిన క్రమముయెలాగొ - అలాగెజగములూ అఖిలతనువులును !!77!! యిది పంచదశిఅర్ధ మింపుతోడుతను - పదపడితెలశినా ప్రస్తుతముమాను !!78!! యీమూలమును లేని గుర్తెరిగెతనువు - యేమిలెదనిగురుడు యెరిగించగాను !!79!! షోడశాక్షరియగును సొంపుగా యిదియు - వీడగావలెనది విధమెల్లదెలశి !!80!! యీవుత్తబట్టబయలేమి లేదనుచు - భావమందు జపింప భ్రమలన్నిదొలగు !!81!! ద్వాదశాక్షరివాక్య దారియీరీతి - సాధకంబున యిదియు సమశి పోవలెను !!82!! యీవాక్యములుమూడు కాలములయందు - యిక జపియించిన యిష్టశిద్దగును !!83!! ధ్వంసమగు లేనెరుక తగశూన్యమగును- హంససంచారంబు అన్నియునణగు !!84!! యెమిలే నటువంటి యెరుకనుదెలశి - యెరుకమరుపుల నెరిగె యెరుకనుబాశి !!85!! సచలంబులో మనుసు జారనివ్వకను - అచలంబులోదాన్ని అయిక్యంబుజేశి !!86!! అంటిఅంటకవుంటె అంటు సత్పదము - వంటివాడై మహాపోర్పుతోడుతను !!87!! వస్తుబ్రహ్మావిధ వరుసవున్నట్టి - స్వస్తమై తా నటుల అస్తమించగను !!88!! వున్నదేవుండెను వుచితంబుతోను - యెన్నశఖ్యముగాక యేమనరాక !!89!! సచరాచరంబుల జాడెరుకలేక - సకలవస్తువులందు చలనములేక !!90!! దండిగ దశదిశ లందుననిండి - వుండునేమియులేక వుత్తమగతిని !!91!! సకలజేజెలుదాన్ని సన్నుతిజేయ - సాగిలి పడి మ్రొక్కసరసంబుతోను !!92!! యెమియునెరుగక యెచటతానయ్యి - యచలమై వచియింప యేగుర్తులేక !!93!! తన్నుతానెరుగక తగనువ్యాపించి - యెన్నడైననుయెరుక యెప్పుడుకనక !!94!! వున్నదె పరిపూర్ణ పరమగోప్యంబు - సన్నుతింపగరాక సకలమందుండి !!95!! అకలంకమైనట్టి ఆబ్రహ్మపదము - యికలేదురొండోది సకలంబుసున్న !!96!! శూన్యశూన్యంబాయె సున్నాయె యెరుక జన్మమేమియు లేక జయమైనబయలు !!97!! నిండిసంపూర్ణమై వండేమిలేక - నిఖిలంబు జనగను నిజమేరుపడును !!98!! యిదిరాజయోగంబు యిదియుశ్రేష్టంబు - యిదిమహాగోప్యంబు యిది పరమ పదవి !!99!! యిదినమ్మువారల కేమియు బాధ - లేదుజన్మము మృత్యు జనిత తాపములు !!100!! వేదశాస్త్రపురాణ విద్యలన్నియును - శోధించవేదాంత సారమేయిదియు !!101!! జపతపం బునలేదు జాతిలోలేదు - వ్రతఫలంబునలేదు వర్ణించిచూడ !!102!! దానధర్మములందు తగు స్వర్గమందు - పూనియెగ్నాది క్రియసల్పినను లేదు !!103!! కాశియెందునలేదు గయకేగలేదు - వాశియగు ఘనయాత్ర లందుననులేదు !!104!! సంసారమునలేదు సారమింతయును - హింస గల సన్యానమున లేదులేదు !!105!! అడవియెందునలేదు గృహమందులేదు - నుడువఆకాశము గృహమందులేదు !!106!! యెన్నిజేశినగాని యేమియును లేదు - అన్నియుమాయనె అఖిలంబు జూడ !!107!! తనలోనెసర్వంబు తర్కింపనేల - తనలోనె బ్రహ్మంబుతర్వంగతాను !!108!! యోగ భోగములందు యాగములయెందూ - ఆగమెకానిమరి యెందుననులేదు !!109!! తత్తరంబులు మాని తర్కంబువదలి - వుత్తమగురుజేరి నూహించితెలశి !!110!! జన్మమరణంబులా జనితములు బాశి - పునర్భవములు కోశి పుట్టుటలురోశి !!111!! ఘనమైన మోక్షమునగలయంగ గలశి- మునుకేవలాత్మలో మణుగుటలు తెలశి !!112!! నిత్యమైయున్నట్టి నిజబ్రహ్మముండు - నిత్యంబు లేని యెరుకయు నంతమిధ్యవును !!113!! యిదిరాజమార్గంబు యిదియు సులభంబు - యిదిఅనాయాసంబు యిదియుముఖ్యంబు !!114!! యిదియు అసాంతంబు యిష్టంబుతోను- వదలకపలియించ వచ్చుముక్తరుదు !!115!! యిదివిన్నచదివినా యాడేరుజన్మ - మర్మంబుదెలశినా

మరిబ్రహ్మతాను ‼116‼ స్త్రీలుపురుషులెకాని శిశువులేకాని - మేలైన వైకుంఠమందు జేరుదురు ‼117‼ ఆయురారోగ్యంబు అర్థసంపదయు - పాయక పుత్రపౌత్రాది సౌఖ్యములు ‼118‼ వెయ్యేల సర్వంబు తానెయ్యైయుండు- నెయ్యముగయిదిజెప్పె నెలమిలోపలను ‼119‼ అన్నమరాజవంశంబు నునైన- ఆదిశాఖియు యాగ్ణవల్కిదైయుండు ‼120‼ భరద్వాజగోత్రంబు భాగవతమతము- పరగ త్రియారుషి పద్ధతియందు ‼121‼ అనంతకృష్ణయ్య అలసరస్వతికి-ఆవుత్తము గర్భమందుద్భవించి ‼122‼ కూర్మితొద్వయులముకూడి కల్గితిమి - ధర్మంబును హనుమద్దాసగ్రజుండు ‼123‼ ప్రేమ సోదరుడనై పెంపుతోడుతను - రామదాసుండనుచు రశికులనియెదరు ‼124‼ భారలింగము గురుణి బాగుశేవించి - వారిఅనుగ్రహమున వాశికెక్కితిని ‼125‼ అడవియెందుండిన పురమందు నున్నా - అయ్యోధ్యయగునని ఆశీర్వదించి ‼126‼ తప్పువప్పులు యెరుగ తర్కమేమెరుగ- యెప్పుడు గురునిష్టయేయెతిగణము ‼127‼ మెప్పుకొరకిది గాదు మేలులోకముకూ - వప్పుగను సర్వంబు సంపూర్ణమాయె ‼128‼

‼గద్య‼ ఇతి శ్రీమద్గురు భారలింగదేశికేంద్ర కరుణాకటాక్షలబ్ధుండును - అన్నమరాజ వంశోద్భవుండును భరద్వాజస గోత్రుండును -భాగవతసాంప్రదాయకుండును -ప్రథమశాఖా పవిత్రుండును నగు అనంతకృష్ణయ్య ద్వితీయపుత్రుండునైన -రామచంద్రరావు ప్రణీతంబైన -ద్విపదవాక్యము తృతీయ్యభాగం - మహవాఖ్యములు పరిపూర్ణ తత్త్వోపదేశం సర్వంబునూ

సంపూర్ణము.

శ్రీగురవేనమ:

# పరిపూర్ణ తత్వ కీర్తనలు

158. అచలానందతత్వ - రహస్యం - తాళం!! జుల్వా: రాగము!! తోడి

యేమిజెప్పుదు అచలసూత్రము యేమిగాకనువున్నదీ - యేమిలేకను యేమిగాకను యేకమై తానున్నదీ !!యే!!1!! అంతయింతని తెల్పరానిది ఆదిఅంత్యములేనిది - అనంతనామా రూపమూ దానికంటకనె చనుచున్నదీ !!యే!!2!! నిర్గుణంబై నిర్మలంబై నిర్విశేషంబైనదీ - నిర్వికారము నిరాకారము నిరాధారంబైనదీ !!యే!!3!! నిష్కళంబై నిష్క్రియంబై నిండియే మనకున్నదీ - నిష్కళాకళ యేమిలేకను నిరతమొకవిధమైనదీ !!యే!!4!! నేమనిష్టలకందరాకను సోహమనరాకున్నదీ- పామరా మొదులాని జనులకు ఆహమెగతి అయినదీ !!యే!!5!! నిర్భయంబై నిర్మయంబై నిర్వికల్పంబైనదీ నీవునేనూ తానుతానని ఆహమెమియులేనిదీ !!యే!!6!! నామరూపాసూన్యమైనది నరులకందగ రానిది - స్వామిసద్గురు కరుణచేతను ప్రేమబోధకమైనదీ !!యే!!7!! పుట్టిగిట్టుట లేకనిరతము బట్టబయలై వున్నదీ - పుట్టిగిట్టుచునున్న యెరుకను యెట్టకేలకు కననిదీ !!యే!!8!! సగుణగుణములు కానిదచలము నిర్గుణముమీరున్నదీ - సగుణనిర్గుణ ధ్యాన్నముకు అది సాధ్యమెన్నడుకానిదీ !!యే!!9!! వేదశాస్త్రావిధ్యలన్నియు యెరుక రూపమైనదీ - వేదసారాతీతమై నిర్భేధ్యమై నిలచున్నది !!యే!!10!! సత్తుచిత్తానందములకు వుత్తమంబైయున్నదీ - సాక్షిఅయినాఆత్మకెప్పుడు సాక్షిఅచలంబైనదీ !!యే!!11!! అండపిండ బ్రహ్మండములు అవిఅన్ని యెరుకైవున్నవీ - మెండుగా దశదిశల యందున దండిగను నిండున్నదీ !!యే!!12!! యెరుకదోచిన జగములన్నియు యచలముననే వున్నవీ- యెండ మావుల రీతినుండే యెరుకనెన్నడుకననిదీ !!యే!!13!! గురువుశిష్యులుకానిదీ ఆదిగురికి అందగ రానిదీ- గురువుశిష్యుల గురుతుబాశిన గూఢముగనే వున్నదీ !!యే!!14!! యేమిలేనిది యేమికానిది యేకమైతానున్నదీ - కామసంఘామూల కెప్పుడు కనుటశఖ్యముకానిదీ !!యే!!15!! క్షేత్రక్షేత్ర విక్షేప ములు ఆక్షేపమై క్షయమయ్యె - వీక్షయము అక్షయమెరుక కన్న విలక్షణంబై యున్నదీ !!యే!!16!! పగలురాత్రులుకానిదీ అదిపలుకు కందగరానిది - పరమభక్తావరులకెల్లను పరముబయలై వున్నదీ !!యే!!17!! అందరానిదిపొందబోనిది యెందుయేమిలేనిదీ- సందుగొందులానునిండి సమర సంబుగ నున్నదీ !!యే!!18!! యెరుకమరుపులు లేనిదీ ఆదియెంచశఖ్యము కానిదీ - యెరుక మరుపుల నెరిగెయెరుక యెరిగిచనిపోచున్నవీ !!యే!!19!! మూటికందగరానిదీ త్రికూట మేమియు లేనిదీ - మూలమేమియు లేనిదాని కమూల్యమయ్యెయున్నదీ !!యే!!20!! సార్వకాలమునందు అచలము చలనమెన్నడులేనిదీ- సకలకాలములన్ని యెరుకై చలనమైపోచున్నవీ !!యే!!21!! మాయ జేశిన యింద్రజాలము మాయకేబహు సొంపదీ - మాయలేనిది మాయగానిది మాయమహిమలు విననిది !!యే!!22!! దెహిదేహ విదేహ ముక్తులు దానికేమియులేవవీ - దెహిదేహముకన్న అచలము కేవలంబైయున్నదీ !!యే!!23!! అష్టఆత్మలు అష్టప్రకృతులు అష్టతనువులుకానిదీ- అష్టదిక్కులు కష్ట సుఖములు అన్నియెరుకైయున్నవీ !!యే!!24!! దేశకాలముకానిదీ వుపదేశమేమియు లేనిదీ- దాస దాసదాతభావము దానికేమియులేనివీ !!యే!!25!! షటుపురంబులు షడ్గుణంబులు షడు మతంబులు యెరుకవీ - షడువిదంబులన్ని మిద్యై సారమింతయు లేనిదీ !!యే!!26!! లక్ష్యలక్ష్యముగాక అంతర్లక్ష్యమేమియు లేనిదీ - లక్ష్యాలక్ష్యామూలకన్న విలక్షణంబై యున్నది !!యే!!27!! యీషణత్రయ వాసనాత్రయ దోషమేమియులేనిదీ - వాసవాదిసురలకును వర్ణింపశఖ్యము కానిదీ !!యే!!28!! కన్నదీ విన్నదిఅన్నది సున్నసున్నైయున్నదీ - కనుగొనశఖ్యంబుగాకను కాంతిమీరీ వున్నదీ !!యే!!29!!

క్షరము అక్షారంబు చక్షుర్గోచరంబును కానిదీ - క్షేత్రక్షేత్ర చడగు తంత్రమే మాత్రమును లేకున్నదీ !!యే!!30!! పంచవింశతి తత్వములకూ పరము ఆత్మంబైనదీ - పంచవింశాతీతా ఆత్మకుపరము పరమనతగినదీ !!యే!!31!! అదురులేనిది బెదురుబోనిది చెదరు టెన్నడు లేనిదీ - అరుగు తరుగులు కరుగుమొరుగులు యిరుగుపరుగులు కానిదీ !!యే!!32!! సకలదేశము సకలకాలము సకలవుస్తువు లున్నదీ - సకలమందున బయలుబయలై సన్నుతింపగ రానిదీ !!యే!!33!! వున్నఅచలమునందు నెప్పుడు వున్నదేతానున్నదీ - వున్నదానీయెందు నిరతము లేనిదేలేకున్నదీ !!యే!!34!! ఆత్మనాత్మలు కానిదీ పరమాత్మరూపములేనిదీ - ఆత్మనాత్మలు అన్నియెరుకై ఆస్థిరత్వములైనవీ !!యే!!35!! చిక్కి దక్కుట సొక్కిసోలుట సొంపుయింపులుకానిదీ - మక్కువతొ తనమాయచేతను మహిమ లేమియు లేనిదీ !!యే!!36!! గ్నానఖర్మాక్రియలులేనిది దానధర్మముకానిది- గ్నాతగ్నానాగ్నెయ ధర్మము దానికేమియు లేనివీ !!యే!!37!! పంచభూతమూలుగల ప్రాపంచమెన్నడులేనిదీ - పంచభూత ఆత్మకు ఆది మించిఅచలంబైనదీ !!యే!!38!! జగముయుగములు గానిదీ అదిజయము జయములు లేనిదీ - జగముయుగముల సందిబాశిన పరమయోగుల పదవదీ !!యే!!39!! వత్సరంబులు పక్షతిథి నక్షత్రదిశలులేనిదీ - వేడుకతొ రుతువారసంఖ్యా భేదలేమియు లేనిదీ !!యే!!40!! శివుడుజీవుడుకానిదీ అదిచితజడంబులు లేనిదీ - శిద్దిశిద్దా శిద్దులకు పరిశుద్ధమై తానున్నదీ !!యే!!41!! యోగభోగులకందరాకను ఆగమాతీతంబదీ - యోగభోగము వదలి నిలచిన పరమయోగుల పదవదీ !!యే!!41!! నాదుబిందుకళ సముహము వాదులేమియులేనిదీ - నాద ముకుదశ నాదములుగల భేదమేమియు లేనిదీ !!యే!!42!! చూపుకందగరానిదీ ఆదిరూప మేమియు లేనిదీ - చూపురూపును లేకనిరతము యేకరూపంబైనది !!యే!!43!! ప్రగ్నానబ్రహ్మాము గానిదీ అతిప్రగ్నలేమియులేనిదీ - ప్రగ్నాబ్రహ్మాశృతి ప్రమాణము ఆగ్నలేమియులేనిదీ !!యే!!44!! కర్తభోక్తాక్రియలు లేనిది కారణంబును కానిదీ - కర్త మహకారణము లేక ఘనము కించముకానిదీ !!యే!!45!! చతురవస్తులు లేనిదీ అది చెతురుదేహము కానిదీ - చతురుదశ విషయేంద్రియంబులు చలనమెన్నడు లేనిదీ !!యే!!46!! చలనమొందె యెరుకనెప్పుడుచలనమై పోచున్నదీ - చలనమొందె యెరుకలేకను అచలమయ్యెవున్నదీ !!యే!!47!! వాదభేదములేనిదీ నిర్వాతదీపము కానిదీ - వాదభేదముజేసెవారికి దూరభారంబైనదీ !!యే!!48!! పాపపుణ్యము బందమోక్షము పాపమన్నది లేనిదీ - రేపుమాపులు రాపుచూపులు రాపటంబులు లేనిదీ !!యే!!49!! వార్మనొక్రియ భావముల వర్ణింపశక్యము కానిదీ- వాశియై గోచరముగాకను మోసమేమియు లేనిదీ !!యే!!51!! శబ్దశూన్యం బైనదీ నిశ్శబ్దబ్రహ్మంబైనదీ - శబ్దబ్రహ్మంబనెటి దానిసుద్దియేమియు లేనిదీ !!యే!!52!! జపము తపములు వుపమునెప మపజయముఅన్నది లేనిదీ - కుపితులైనా కుటిల మతులకు కఠినమై కనరానిదీ !!యే!!53!! సాధకా విద్యలకునందని సరళియై మీరున్నదీ- సాధనేమియులేక సద్గురు బోధరూపకమైనదీ !!యే!!54!! మండలంబులు కానిదీ దశమండలంబులు లేనిదీ - దండిదాతాలైన వారికి మెండురూపకమైనదీ !!యే!!55!! చెట్టుగుట్టలు మిట్టపల్లము చట్లమేమియు లేనిదీ - చట్టుగుట్టల నట్టనడుమను బట్టబయలైవున్నదీ !!యే!!56!! రాకపోకలులేనిదీ అదియేకస్థిరమైవున్నదీ- రాకపోకలురాపటముగల రంగులస్థిరమైనవీ !!యే!!57!! కులము గోత్రంబనెటివట్టి గురుతు లేమియులేనిదీ - కలలొగన్నా గజముమేల్కొన కంటెసొఖ్యంబున్నదీ !!యే!!58!! బాహ్యామధ్యాంత్త ములయందున బాగుగను నిండున్నదీ - భావమున దుర్భావ మొదలిన భ్రాంతి రహితంబైనదీ !!యే!!59!! పట్టువిడుపులు పెట్టిపోతల ప్రేమలన్నదిలేనిదీ - నట్టులేకను సృష్టి కర్మవికారమేమియు

లేనిదీ ‼యే‼60‼ తారకా సాంఖ్యామనస్క దారికందగ రానిదీ - మీరిసద్గురు పూర్ణబోధకు దారిబాగైవున్నదీ ‼యే‼61‼ తెరకు నావల తెరకునీవల తేటతెలివైయున్నదీ - తెరుపు మరుపును జనినయెరుకకు తేటతెలివై యున్నదీ ‼యే‼62‼ ద్వైతద్వైతముకానిది వీశిష్టద్వైతము లేనిదీ - ద్వైతద్వైతమై లేక మహద్వైతభావుల కలవదీ ‼యే‼63‼ అహముబ్రహ్మంబనెటి వాక్యము అహమునకు మూలంబది- ఆహమేమియు లేక నిరతము అమలవిమలంబైనదీ ‼యే‼64‼ ధరలోముణిగియు నీటదేలియు దగ్ధమెప్పుడుకానిదీ - పరుగులిడెటివాయువుకు ఆదిపట్టుబడుటము లేనిదీ ‼యే‼65‼ యెండకెండియు నీడకుండక ఖండఖండముకానిదీ - మెండుగా దశదిశల యందున నిండి కదలకవున్నదీ ‼యే‼66‼ చలికి వణుకక భయముకులుకక వానకలయకవున్నదీ - వులికిపడుటము పలుకబడుటయు వుచ్ఛనీచములేనిదీ ‼యే‼67‼ యెరుకలేనిది మరుపులేనిది యెంచశఖ్యము కానిది - గురుతులేమియు లేకనిత్యము గురికిబయలై వున్నదీ ‼యే‼68‼ అంటుసోంటులులేనిదీ పదిరొంటినంటక వున్నదీ - అగమానిగమా రహశ్యయోగమును మీరున్నదీ ‼యే‼69‼ యిందు నందున యెందుజూచిన అందుతానెవున్నదీ - ముందువెనుకా అనగరాకను సుందరంబైయున్నదీ ‼యే‼70‼ ఆవలీవల యనగరాకను ఆవరించీవున్నదీ - భావమందున భ్రాంతులుండె భావముకు తగులానిదీ ‼యే‼71‼ పరమపదమై వున్నఅచలము పరమగురువుల కలవది - పరముబయలై పరముబయలనె పలుకుయెన్నడు లేనిదీ ‼యే‼72‼ యెరుకజేశిన స్వప్నజాలము యేమిలేకను వున్నది - యెరిగిమొరుగుట అరిగితరుగుట అన్నదేమియులేనిదీ ‼యే‼73‼ లోకలోకములోనబైటను ప్రాకటంబై యున్నది- లోకలోకములన్ని దానిలోనేకమై పోచున్నవి ‼యే‼74‼ ఆశపాశములేనిదీ నీరాశకంబై యున్నది - ఆశపాశబద్ధులైన అంధులకు కనరానిది ‼యే‼75‼ కలిమిలేములులేనిదీ అదికష్ట సుఖములు కానిది - కనులుతెరచిన కనులుమూశిన ఘనులకగుపడు చున్నదీ ‼యే‼76‼ ఘనముకించముకానిదీ అదిగణుతిపెట్టగరానిది- మనసుతో తపియించరానిది మమతలెమియు లేనిది ‼యే‼77‼ సృష్టిస్థితిలయ కార్యములు అనెసూచనెన్నడు లేనిది - స్వష్టముగ తానేమిగాకను సన్నుతింపగరానిది ‼యే‼78‼ ఆశ్రమాధర్మములు గల అతిఅశలేమియు లేనిది ఆదిమధ్యాంత ములయందున కేవలాత్మె వున్నది ‼యే‼79‼ ఆయము ఆత్మబ్రహ్మపలుకనె ఆహమేమియులేనిది ఆయముఆత్మ బ్రహ్మభావమ భావమైతానున్నది ‼యే‼80‼ వ్యష్టియూసామష్టి అనియెడి భెదవాదము లేనిది- దుష్టకర్మకు శిష్టకర్మకు దూరమైమిగిలున్నది ‼ యే‼81‼ వర్ణరూపముగానిదీ ఆవర్ణ మేమియులేనిది - వర్ణవర్ణంబేమిలేకను నిరావర్ణంబైనది ‼యే‼82‼ మతముమితమూ గతము గతమటు మాయలేమియులేనిది - వ్రతముశృతము ధృతము హతముల మాయలేమియు లేనిది ‼యే‼83‼ పంచకర్తలుపంచశక్తులు పంచభూతముకానిది - పంచముద్రలు పట్టిచూచిన ఫలము యేమియు లేనిది ‼యే‼84‼ చిక్కబోనిది దక్కరానిది యెక్కడేమియు లేనిది - టక్కుపిక్కులు యెచ్చుతగ్గులు చిక్కులన్నియు లేనిది ‼యే‼85‼ గ్జానపంచక కర్మపంచక ప్రాణపంచకమన్నియూ మానుగా తన్మాత్రపంచక మార్గమెన్నడుకానిది ‼యే‼86‼ త్రిగుణగుణముల త్రివిధవిధముల ద్వివిద మేమియులేనిది - త్రిగుణఆత్మబ్రహ్మకర్మము తిప్పలెమియు లేనిది ‼యే‼87‼ వుత్తమోత్తమమయ్యి వున్నది వూహపోహలులేనిది - హత్తుకొనిబ్రహ్మాండమంతా అవరించీవున్నది ‼యే‼88‼ అస్త్రశస్త్రము కతముగాకను శత్రువర్గములేనిది - వాస్తవంబుగ నాస్థిలెకను వన్నెలునుమీరున్నదీ ‼యే‼89‼ తత్వదముత్వంపదము అశిపదమందు నైక్యంబున్నవీ - సత్వదార్థము సర్వమునకు సమముసమమై యున్నదీ ‼యే‼90‼ అల్లమాప్రభురాయునకు అది అన్యమెన్నడు కానిది - ఆదియుఅనాది కెప్పుడు

మీరియుండినపదవదీ!!యే!!91!! సత్తుచిత్తానందములుగల సత్యమేమియులేనిది - సత్తజర్వె మత్త లెకను సహజముగ నిజమైనది !!యే!!92!! యెతిమునీంద్రుల రుషిగణంబుల కెంచశఖ్యముకానిది సతతమైసుర నరులకెప్పుడు సాధ్యమెన్నడుకానిదీ !!యే!!93!! తప్పువప్పులు తారతమ్యము తిప్పలెమియు లేనిది - అప్పుడిప్పుడు యెప్పుడొప్పక యెరుకయెన్నడుకానిదీ !!యే!!94!! జనకుడూ శుకయోగి వరునకు జెప్పివూరికెవున్నది-జానకీపతిరాముడైన జయముజందిన పదవిది !!యే!!95!! రాజబాటన తగినదీ నిజరాజమార్గంబైనది - రాకపోకడ లేకపోకడ జోకయేమియులేనిదీ !!యే!!96!! గురుతుగా సాందీపకృష్ణులగుణులకైనా పదవిది - గురుతులేకను వారికెప్పుడు గూడపదమైవున్నదీ !!యే!!97!! వేదవాఖ్యము బయలుకెప్పుడు వేరువేరైవున్నది - వాదభెదము ఖేదమోదము వేదలేమియు లేనిదీ !!యే!!98!! ఈధరందున శ్రీధరునకతి శేఖరంబైయున్నది - సాదరంబుగ సాధుజనులకు సత్వదంబై యున్నదీ !!యే!!99!! యుక్తయుక్తము కానిది అదిశెక్తి కందగరానిది - రక్తిశెక్తివిరక్తి ముక్తియు యుక్తులేమియు లేనిది !!యే!!100!! ప్రాపూగా శివరామదీక్షిద భావకరమైయున్నది - ప్రాపుదాపై రూపులేకను చూపుకందగరానిదీ !!యే!!101!! పతియుసతియును కానిదీ అదిరతిసుఖంబులు లేనిది - పతితపావనులైన వారికి ప్రాపుదాపై యున్నదీ !!యే!!102!! మొప్పుముప్పులు గొప్పకొదవలు చప్పుడేమియు లేనిది - వప్పగను అప్పయ్యమంత్రికి చెప్పకనె తానున్నదీ !!యే!!103!! సప్తకోటి మంత్రములసామర్థ్యమేమియు లేనిది- సచలమన్నది లేకద్వాదశి సారపదమై యున్నదీ !!యే!!104!! పరశురామశీతరామ గురునకదిస్థిరమైనది - పరమగురుశ్రీశేషమాంబకు పరముకరమైయున్నది !!యే!!105!! మూలమేమియులేనిది నిర్మూలమయ్యావున్నది - మూలమేమియులేని దానికి మూల మనరాకున్నది !!యే!!106!! భావభావతీతమైనది భ్రాంతిరహితంబైనది - భారలింగాగురువరేణ్యుల భావసూత్రంబైనది !!యే!!107!! ధరలోగల వెలివెర్తియందున దారిబాగై వున్నది - గురువరేణ్యుల కరుణచాతను గురికి బయలైయున్నది !!యేమి జెప్పుదు అచలసూత్రము!!108!!

159. ఆటతాళం: రాగము: మధ్యామావతి

వినరయ్యా వోజనులారా మీకువిన్నావించెద జాణాలారా - వినరయ్య నరజన్మ వివరమంత యు మీరు సవినాయంబుగవీని సరసూలైచెడిపోక !!వి!!1!! నరకాస్వర్గము లనుభావించీ తుదకు రవికిరణమందూ వశియించీ - సరగూనా మేఘామండల మధ్యామునజేరి - త్వరగావర్షముతోడ సస్యామందునజేరు !!వి!!2!! పతిఆరాగించెరసమందూ చేరిసతి గర్భామందూనాజేరీ అతికూపమల మూత్రమగు గోళామందుండి - వెతలొంది నవమాసమున వెడలిమతిమరచు !!వి!!3!! బాల్యమున పరవశమయ్యా బహు మాలిన్యమున బొర్లుచుండి - పిలువమాటలురాక కదులాశఖ్యములేక బలువీదమున దు:ఖపడుప్రాయాసముచేత !!వి!!4!! యెవ్వానమునమాదామెచ్చీ కండ్లాక్రొవ్వూ చాతను తన్నూమరచీ - ఆవ్వాలవెంబాడి అతిమోహమున దిరిగె - రవ్వేసుఖంబాని దవ్వాను మోక్షముకు !!వి!!5!! కౌమార్యమున కారాణముచే కర్మసంసారమున కష్టాములచే - ధర్మామనుచు దారాపుత్రాసంఘములాకై - నిర్మాలమతిలేక ద్రవ్యామార్జించును !!వి!!6!! వార్థక్యమున వణుకూ చుండీ పరులా గద్దారింపుకు మీడుకూచుండీ - ముందుజేశినవి మనసందుదలచుచు ప్రాణ మందు ద్రవ్యము దారాలందె భ్రమలొందును !!వి!!7!! కఫవాతాపైత్యాముల్‌గమ్మీ మిగుల విపరీతా స్మరణాచెన్నొందీ- తపతపవదరూచు తల్లాడించుచుతుదకూ-కపటూలౌ యెములాచె కష్టానరకము లొందు !!వి!!8!! తానుజేశిన పుణ్యపాపం ముందుమేనువదలగ దెలయులాభం - పూని అనుభవించి పుట్టానుద్యోగించు- తాననుభవించాగ తనవారులేరైరి !!వి!!9!! శతవర్షాములు అనుటెకానీ

అందుమితిలేదెప్పుడో గతమోకాని - అతిఆశచేకాలమంతా వెర్ధముబోవు - మతిలోన గురుజేరే మర్మామేరుగలెడు !!వి!!10!! జన్మాంతమావాలనైనా అరక్షణమైన సుఖములేదాయ - అనయాము హరినామ స్మరణెమొదటికి మరచే - గుణముచేత నిత్యాపదవిదూరంబాయె !!వి!!11!! వదలాక వెలివెర్తియందూ భక్తావరదూడై సద్గురుడుండూ - ముదమునశ్రీరామ వరదుడై రక్షించు పదిలాముతో వీనిహరిని స్మారించండి !!వినరయ్యా!!12!!

160. ఏకతాళం: రాగము:

అదుగో వైకుంఠం చూడుడి యిదుగోకైలాసం !!ప!! అదుగోచూడుడి అదరకమదిలో అంటక అదియెడింటికిఆవల !!అ!!1!! జోడుపాములకునూ పైనా నాడికాగ్రమునసూ - చూడగచూడగ చూపు లయించగ - యాడుజోడుగాని వేడుకనున్నది !!అ!!2!! గాలిమనసు దృష్టి కదలక మేడమీది కెక్కి - పాలమునందున పరిశోధించగ - లీలలుమించిన కీలుగురుపదము !!అ!!3!! అంటుబాపు కొండీ పదిరొండంటివిడువకండీ - వెంటనెవుండును వంటరికేగిన - జంటలేక మూడింటికి మీదుగ !!అ!!4!! బట్టబైలుగాను అంతట దట్టముగానుండూ - ఘట్టిగగురుపద పట్టువదలకను గుట్టుదెలియగను బట్టబయలునౌ !!అ!!5!! నామరూపులేక రామాదాసుదాపు విడకా - పామర మీడితె నేమములేకను - ధామమైవున్నది కరమున దృశ్యం !!అదుగో!!6!!

161. ఆటతాళం: రాగము: శుద్దకాంభోజి

వున్నాది చూడండీ సజ్జనులార కన్నాది విడువండీ - వున్నాదిచూడండి కన్నయెరుకనుబాశి అన్నాది విన్నాది సున్నా జేశినవారల కున్నాది !!వు!!1!! పుట్టుచావులు లేనిదీ ఆపరమాత్మ పుట్టింపగా బోనిదీ - పుట్టిపేర్లుబెట్టి పుట్టించెయెరుకానె - పట్టేమిలేకాను అట్టెమాయముజెందు !!వు!!2!! సత్యామగు బయలందునా యెప్పుడుగనినా సత్యామెఅయ్యుండునూ - సత్యామందుననూ ఆసత్యామెటుకల్గునూ - యిత్తారియెరుకందా నిత్యామెకల్గుచు !!వు!!3!! తత్వాదమునుగాకను త్వంపాదాము అశిపాదమును లేకనూ - తత్వాఆతీతమై తరుగాక నిరతాము - యెప్పుడు కనినాను చప్పుడేమియులేక !!వు!!4!! యిందుఅందనరాకనూ యెందెందైన అందేతానె వున్నాదీ - అంది పొందుదమన్న యెందేమిలేనిది-యెందుబోయిన మానకన్నాముందున్నాది !!వు!!5!! బ్రహ్మాండముకు చుట్టునూ పైకిందాను నిండారుగా నున్నాది - మెండూగ దశదీశలందు నిబిడంబయ్యి - దండిదాత లైనఖండ రశికులకెపుడు !!వు!!6!! యెంతాని తెల్పూదునూ యీమార్గాము యెమానివర్ణింతునూ అంతకంధమాని అహము తరలెమతి - మంతూలకెల్లాను అంతానిర్భయలయ్యి !!వు!!7!! భ్రమ యుక్తులకునెల్లాను దీనిభావంభావింపరాకున్నాది - భ్రమలేకయెప్పుడు బ్రహ్మాసత్యంబాని జగమా నిత్యమానె జయమొందె ఘనులాకు !!వు!!8!! పదిరొండు మరుగెరిగినా భక్తులకెల్ల పరమా మృతం బైనాది-భారామయ్యిన భక్తావరుణి కటాక్షమున- రామాదాసుడుగన్నా నేమకర్మము లెక !! వున్నా!!9!!

162. ఆదితాళం: రాగము: ధన్నాసరి

యెరుకను నమ్మకుడీ అచలము యెప్పుడు మరువకుడీ - యెరుకను నమ్మకుడెన్నటి కయ్యిన - యిమ్ములబెట్టును సుమ్మిదినిజముగ !!ప!! యెవ్వరుగారుసుమీ అందరు యెవరికి వారెసుమీ - యెవ్వరితనువులు వారికితనవలె - దవ్వైవుండును నవ్వులుగావిక !!యె!!1!! యేది తనదిగాదూ అన్నియువేరువేరువుండూ - వాదమువదలీ భేదముతెలయుడి - మీదయనుంచియు సాదరమినుడీ !!యె!!2!! తనదుక్షేత్రపాత్రం విత్తం ధనధాన్యము మొత్తం - తనయులుభార్యలు తగ

చుట్టంబులు - తనువులువేరె తనువెరాయను ‖యె‖3‖ తనువుతానుగాడూ తలచితె మనసు తానుగాడూ - తనువింద్రియములు తానెట్లయ్యని - మనమున దెలయుడి మరితను వేరని ‖యె‖4‖ దృశ్యమైనదంతా తనవలె నశ్యంబౌనంతా - అస్థిరమనికని వశ్యము నొందక - రహశ్యము దెలశియు దృశ్యము విడువుడీ ‖యె‖5‖ తానురాకముందూ తదుపరి మేనుగల్గినపుడు - పూని వున్నదియు పొందుగ వినుడీ - మేనుబోవుతరి మానుగనుండును ‖యె‖6‖ దాసదాసులందూ రామాదాసు బల్కెముందూ - మోసపొాక గురువాసముజేశియు - వాశగుమాయనె దోషము బాశియు ‖యెరుకను‖7‖

163. ఛాపుతాళం: రాగము: నవరోజు

వందానాము దేశీకేంద్రా వందానాము దేవాదేవ - వందనాము జేశీవేడెదా వో వో దేశీకేంద్రా సంథిగలదూ వఘటీవేడెదా ‖వ‖1‖ శిష్యాతిలకా ముద్దూగుల్కా చిత్తామందూ యెటులాతోచే శీఘ్రమూగా తెల్కాబల్కారా - వోవో శిష్యాతిలకా అదరబోకూ ఆశాదులిపెదా ‖వ‖2‖ నామారూపా క్రియలూ లేని నాదిమధ్యాంతములుగాని - నచలమందూ సచలామెటుదోచె వోవో దేశీకేంద్రా మర్మమెదో మరియూబల్కావె ‖వ‖3‖ నీదూజన్మారాకామునుపూ నీదూతండ్రీ లెకామునుపూ నీదుపుత్రాసంతూలెనపుడు - వోవోశిష్యాతిలకా లెనివారు లేకానె కల్గీరీ ‖వ‖4‖ జగమూయుగమూ యెటులాగల్గె జన్మామూలస్థానామేదీ - జగములోనా సకలామెటుగల్గె - వోవోసద్గూరుచంద్రా - జగముమూలా జెన్మామెయ్యాది ‖వ‖5‖ నిత్యాప్రళయామందూనీవూ సత్యాముగ సూషుప్తిజెందే మత్తయందూ యెటులాతోచోయీ - వోవో శిష్యాతిలకా సత్యమూగా అటులాకనవోయీ ‖వ‖6‖ రానీపోనీబయలూనందూ లెనీపోనీయెరుకానేనూ - పూనియెటులా గల్గెచెప్పావే - వోవో దినానాథ దీనిభావామేదో పల్కావే ‖వ‖7‖ లెనీస్వప్నామందూముందూ లెనివాడా వెటుగల్గితివీ - లెనిస్వప్నా జాలామదిజూడూ - వోవో శిష్యాతిలకా లెనియెరుకా అటులాకల్గెనూ ‖వ‖8‖ పంచాతత్వాములకూ మీరి మించీయున్నా ఆత్మాయెట్లు - పంచమయమూ మెంచీపొరూనూ - వోవోదేవాదేవా పంచ కర్తా పరమూ అదియేది ‖వ‖9‖ రజ్జూసర్పాభ్రాంతీవతుగా ముజ్జగములా ఆత్మాగల్గె - రజ్జుసర్పాభ్రాంతీ మిథ్యోయీ - వోవో శిష్యాతిలకా ప్రజ్వలాత్మ ఏకమటులోయీ ‖వ‖10‖ వాశీఅయినా అచలాబోధా యీసామాయమందూ భార - దేశికుండూ దెల్పెయిదియెందూ - వోవో నిజగూరుచెంద్ర దాసుబల్కె నిరాశపురమందూ ‖వందనాము ‖11‖

164. జంపెతాళం: రాగము: పున్నాగవరాళి

యిదుగోయాత్రల దేవుడింట్లనున్నాడు - యిది తెలియకను జనులు యిలలో వెతుకుదురూ ‖ప‖ పంచకోశంబులకు పరుడున విశ్వేశు - కాంచనేరక కాశికేగంగనేలా ‖యి‖1‖ నవద్వారములు మూశి నడిమికన్నటు తెరచి - అవలీలగనక రామేశ్వరంజనెరూ ‖యి‖2‖ నాశికాత్రివేణి వాసుడీ డుండగనూ - నాశికానది కేగి గాశిజెందెదరు ‖యి‖3‖ స్పష్టముగ భారతీపుట్టుకయు తెలియకను విష్ణుపాదంబనుచు మిడుకుచుండెదరూ ‖యి‖4‖ జోడుపక్షులనెక్కి మూడుయేర్లను దాటె - జాడదెలియక జగన్నాథ మరిగెదరూ ‖యి‖5‖ భద్రంబుగను రామభద్రుడంతటనుండ - భద్రాద్రి కేగుచును భాదలొందెదరూ ‖యి‖6‖ అంగలింగము ప్రాత్యాంగ వుపాంగములో - రంగైన శ్రీరంగ నాధుడుండగనూ ‖యి‖7‖ యిడపింగళామధ్య నాడికాగ్రముకేగి - హరిద్వారమనిలోని గురిదెలియ లెరూ ‖యి‖8‖ పశ్చిమాకుండలీ పైనప్రణవముబల్క- నిశ్చయంబుగ పండలీశుడున్నాడు ‖యి‖9‖ బ్రహ్మరంధ్రములోని బ్రహ్మమును గనలెక-బహ్మాకాపొళముని భ్రమశిపోయెదరూ ‖యి‖10‖ వాశి యగువెలివెర్తి యీశునెరుగక జనులు - మోసమొందియు యెముని దాసులయ్యెదరూ ‖యి‖11‖

165. ఆదితాళం: రాగము: కాంబోజి

పొట్టువీడూవరాదు పరవస్తువుకై నిజపొట్టువీడూవరాదు - అట్టెతాను తుదిముట్టె దానికోర కెట్టిసంకటం బొచ్చినఝుణకక ‖పొ‖ మట్టుమితములేనట్టిదేవతా - గుట్టుగురుణిచే మొట్టమొదలు విని- బట్టబైటతానట్టెముణిగె గురిబెట్టినిలచి కన్‌కాట్టుమానియూ ‖పొ‖1‖ ధరగగనంబులు తల కిందైపడి దారిదప్పిశశిభానులరిగి - తమమేరదప్పి నదులూరికెపారిన- ఆరడితో గిరులన్ని చెలించిన ‖పొ‖2‖ కాలకాలములు దప్పినడచికలి - కాలగుణంబులు హెచ్చినగాని - కష్టసుఖంబులు కల్గిన గాని- కానివారుకాదన్నను అదరక ‖పొ‖3‖ అంగగుణంబులు అణగజేశియును- దొంగగుణంబులు తొలగద్రోచియును - లింగదేహమునుభంగపరచి పరలింగమందు తాలీనమయ్యెగురు ‖పొ‖4‖ తెరుపుమరుపులకు తెలివొక్కటియని - తెలివికి బయలులో బ్రహ్మమొకటిగని - మరుపుజెందకను గురుభారేశుని కరుణతోడుతను పరములొగలశెటి ‖పొ‖5‖

166. ఆదితాళం: రాగము: నాట

శుద్ధాత్మాశృణు శృతిగురువాక్యం - శ్రద్ధాసాధన చతుష్టపటుత్వం ‖ప‖ నిత్యానిత్యావస్తువివేకం ప్రస్తుతమేకం పరమమనస్కం ‖శు‖1‖ యిహపరభోగ విరాగమవశ్యం - అహంబ్రహ్మపద లక్ష్యా తీతం ‖శు‖2‖ శమదమశ్రద్ధా శుద్ధవివేకం - ప్రవిమలగ్ఙ్ఞానాపరమమవశ్యం ‖శు‖3‖ మోక్షపేక్షా మోహ వినాశం - దీక్షాఆశిపద లక్ష్యాతీతం ‖శు‖4‖ సాధనరహిత విచారపరతత్వం - నాదాతీతా అనాదిసుఖిత్వం ‖శు‖5‖ శబ్దబ్రహ్మ లుబ్ధోరంన్యం - నిశ్శబ్ధ సనాతన నిజపరబ్రహ్మం ‖శు‖6‖ ఇతి రామాంహ్వాయ మతిసంసిద్ధం - సతతము బ్రహ్మనందసుసౌఖ్యం ‖శుద్ధాత్మ‖7‖

167. ఆటతాళం: రాగము: నాదనామక్రియ

వినరాసంసారి నామాట నీవువినకున్నా చెడుదూవు వింటేనుతేటా ‖ప‖ క్షేత్రపాత్రము గృహ విత్తం- సర్వం సాక్షిజగత్రాయ సర్వాముర్వ్యర్థం- మిత్రాబంధువులూ అనర్థం- చూడగాత్ర సంసారాము గాఢాదుస్తరమూ ‖వి‖1‖ మమకారమును బాయవలెనూ - తానూ -కామరాగాదూల ఖండించా వలెను - తామసాదులుతొలుగావలెనూ - తానుపామారములకెల్లా పైకుండావలెనూ ‖వి‖2‖ హంకారమును మానవలెనూ - తానుఆది బ్రహ్మమునందు కూడుండావలెనూ - రంకులెరుకను బాయవలెనూ - యెరుకాసుంకుబాశియు బయలు వంకగావలెను ‖వి‖3‖ భేదవాదముమాన వలెనూ - గూరుబోదందే నిష్టాడై గురియుంచావలెనూ - శోధాకత్వముశాయవలెనూ - గురుడు యెదారిజూపునొ అదినడువావలెనూ ‖వి‖4‖ దేహభ్రాంతులు వదులావలెనూ వీదేహమయ్యుండీనా విధమెరుగావలెనూ - దేహింద్రియములూడావలెనూతాను - మోహభ్రాంతులుగాల మాయోదుల వలెను ‖వి‖5‖ పంచాభూతంబులపట్నం ప్రాపంచామేలెటిరాజు పైనుండుస్వష్టం - పంచావింశతి కార్యమిష్టం తాను - మంచీగవదలితె మించీనాదృష్టం ‖వి‖6‖ ఆత్మనాత్మలతెల్యావలెను కేవలాత్మాను గనితాను నిజమానవలెను - ఆత్మాతానని తెల్యావలెను - కేవలాత్మందే ఐక్యామై ఆత్మాగనవలెనూ ‖వి‖7‖ యెరుకాద్వారము తీయావలెనూ - తీశి యెరుకానుగడచీయు మరుచుండావలెను యచలామె యెరుగుండావలెనూ- యెరుకయేగినతరి అచలామయ్యుండావలెనూ ‖వి‖8‖ పది యారు అనుచుండావలెనూ - బట్టాబయలాని పదిరొండు - పరికించావలెను బయలెబ్రహ్మంబన వలెను యీధరవేలివెర్తీలో విడిచుండావలెనూ ‖వి‖9‖

168.ఆదితాళం: రాగము: నాదనామక్రియ

కలాగంటినమ్మలార వినుడీ - కలయుగజగమనే మహాకలా ॥ప॥ మంటీపుట్టాలో గలిగీతమ్మా నాకంటెమొదలే అంటీవున్నాది త్రిభువనమమ్మా - అందూలోకిందా నిండీయున్నాది జలమో యమ్మా- అగ్నివాయువులు వెంటానెకలవూగగనామమ్మా - మింటచుక్కలును మిణుగుమిణుగు మను - అంటకరవిశశి ఆమేఘంబులు - గుట్టలుగుహాలను అష్టదిక్కులును - వంటివంటిగను వచ్చిరిలోకము - జంటతోను మొగలెంటనెమగువలు- తంటలుతగవులు తారతమ్యములు- బంట్లు బానిసలు బలమగుశూరులు ॥క॥1॥ జగాముయుగమూలుగల్గెనమ్మా - సంవత్సరములు మిగులా తిథివారా రుతువులమ్మా- నక్షత్రమాసలగ్నాకరుణాము యోగమమ్మా- పర్వాములన్నీ వేగాజన్మించె చూడరమ్మా- నగములుఖగములునానామృగములు - పగలరాత్రులును పక్షరాసులును - మిగుల పక్షులును మిన్ననకెగసును - అగుపడుచుందురు హరసురలందరు - బాగుగనున్నరు బలు రక్కసులును - వేగమె యెనుబదినాలుగులక్షలు- సగపడిజీవులు చచ్చుచుపుట్టుచు - జాగులేకబల్ బాగుగవత్తురు ॥క॥2॥ చెక్రాదిపతులు జేరిరమ్మా - చలరేగీమంత్రులు యెక్కాడినుండీ వచ్చీరమ్మా లెక్కాకురాని - పెక్కూజనులేగుదెంచీరమ్మా - సర్వాలోకంబులువక్కా పెట్టానకల్గేనమ్మా - చక్కని గురువులు సాధుజనంబులు - నిక్కపుజనులకు నీతిశాస్త్రములు - అక్రమనరులును అల్పశాస్త్రములు వక్కటెమతముల పెక్కుప్రకృతులు - ఘక్కున మతముల గల్పించెటి బల - విక్రమగురువులు వీర విద్యలును - సొక్కులు సొంపులు శోద్యపుమాయలు - యెక్కడచూచిన మిక్కిలి మహిమలు ॥క॥3॥ కలాగంటి కలలోవుంటినమ్మా - యిలలోనానేను కలాలోనగురునీగంటీనమ్మా- కంటీ మేల్కంటీ - కల్లా నిజమూలు వింటీనమ్మా - యిలలోనా జనులా యెల్లాచిత్రాములా వుంటీనమ్మా కల్లనిజంబులు కారణంబులును- యెల్లజగంబులు యెరుకమరుపులును - వుల్లాసంబులు యెల్ల చింతలును - కలిమిలేములును కాంతలుపురుషులు - కొల్లలేనిబహు యెల్లవృక్షములు - పల్లెలు వూళ్ళును పట్టణంబులును- మేలుకీడులును మెచ్చైజనంబులు - అల్లరిలోకములెల్లజూచితిని ॥క॥4॥ అంతామాయాని తెలియరమ్మా - యిందులోసారం యింతైనవున్నాదనబోకమ్మా - నేరావాడముతో అంతాజూడాగనాయెనమ్మా - మేల్కొంచినతోడా కొంతైనాలేదు గదనోయమ్మా - భాంతులుగల మాయవింతలు లేకను - సంతతమును బయలంతట నున్నది - అంత యింతయని గింతికిరాకను- రంతులయెరుక రవ్వంతయులేక - అనంతనామ రూపింతయు లేకను - యెంతో రహస్యంబంత రంగులకు - వంతుగవెలివెర్తందున బల్కిన- అంతనిజంబే వింతలులేవని ॥క॥5॥

169. ఆదితాళం రాగము: శంకరాభరణం

ఆనందమానందమాయనూ- బ్రహ్మానందమె వెలివెర్తిలాయెనూ ॥ప॥ ఆనందమానంద మపరి మీతానంద - సొనందతీతా పరమానందామాయను ॥ఆ॥1॥ ముగ్గురుమూర్తులు తానాయనూ మదికి ముక్కంటి దారిశానమాయనూ - అక్కరమూగతానా మక్కూవతోడుత - యెక్కాడజూచిన యేకామైయున్నాది ॥ఆ॥2॥ ఆరుగిరులు దాటానాయనూ - ఆపైమేరుశిఖరాము జూడాగల్గెనూ నిరతాముతారాక నిర్మాలరూపామై - అరమారలేకాను ఆదిస్వరూపామై ॥ఆ॥3॥ మూడునాదులు దాటానాయనూ- మనకూవోడా దాటించెఘనుడు గల్గెనూ- యీడుజోడూనులేక యింతాఅంతాన రాక - వాడవాడలూను వేడూకలాలరగా ॥ఆ॥4॥ శాంబావిముద్రజూడనాయను చంద్రబింబామె కన్నూలకాయనూ - అంబరశబ్దనీరంబారనిజపర -అంబుధియెందూన - కుంభించిచేరాగ ॥ఆ॥5॥ అన్నాలుతమ్ముాలు గూడిరీ - గురుణి ఆప్రణవనాదమందెచేరిరీ భారమే నీదనుచు బట్టాబయాలు గనుచు - తనువులోతానె తానై తాండవమాడగ ॥ఆ॥6॥

170. ఏకతాళం రాగము: ముఖారి

ఆనందంఆనందం- బ్రహ్మానందం ఆనందం- ఆనందంఅమితానందం స్థిమితానందం పరమానందం !!1!! దేశికోత్తముల జేరితరించియు - ఆశలన్ని తెగగోశినవారికి !!ఆ!!2!! యిహపర సుఖముల యిచ్ఛయుంచకను - ఆహములక్ష్యార్థము ఐక్యముజెందిన !!ఆ!!3!! యోగయోగముల బాగుగదేరిన భాగవతోత్తమ బ్రాహ్మణజనులకు !!ఆ!!4!! ఆత్మనాత్మవిచారము దెలశియు - ఆత్మయు బూని అనాత్మను వీడిన !!ఆ!!5!! మూడుకాలువలు ముదమునదాటియు - ముక్తికాంతతో ముదమున గలశియు !!ఆ!!6!! నిర్వికల్ప సామాదినిష్టయును - సల్పుచునుండిన సర్వజ్ఞలకును !!ఆ!!7!! అచల మందునను సచలముబాశియు- వచనము లేనిది విశదంబయ్యిన !!ఆ!!8!! యిమ్మహి వెలివెర్తీశుని కృపయును నమ్మిన రామాదాసుకు నిత్యము !!ఆ!!9!!

171. ఆటతాళం రాగము: జంఝూటి

కన్నూలోపాల ఘనబ్రహ్మమున్నాడు - కాంతలారా - వీనూలలోపాల వివిధానాదముంది - విమలూలారా !!ప!! పదునాల్గుభువనాలపైన నున్నాడమ్మ పణతులార - పదమూలునమ్మిన పరమా భక్తులాకు భక్తులారా !!క!!1!! నవద్వారపురమందు దశద్వారములోనుండు-నాతులార- నమలూడై ఓంకార నయశింహ్మాసనమందు నతివలారా !!క!!2!! పంచరంగులచిల్కా పైనాజూడారమ్మ -భామలారా - పరమాపావిత్రుడు భవ్యాచారిత్రుడు - మగువలారా !!క!!3!! నాదుబిందుకాళలోన నున్నడమ్మ నమలూలారా- నాశికాగ్రమందు నయమైనస్థలమందునమ్మలారా !!క!!4!! నీలాతోయదమధ్య నిలచీనావాడమ్మా-నీతులారా- నీవారశూకముననివ్వారిరూపుడు నిత్యులారా !!క!!5!! అదుగో చూడరె మీలోఆత్మస్వరూపుణి - అమలూలారా - పదపాడిగురినిల్పి ఫాలాభాగమునందు భవ్యులారా !!క!!6!! మనసూదృష్టియువేగామగ్నాత జేయుడి - మగువాలారా- మగ్నాతజేశిన మరిబ్రహ్మమెతాను మాన్యులారా !!క!!7!! యెక్కాడజూచిన వక్కాడెగురుడమ్మా-వనితలారా- చక్కాగాముక్తిదె చిక్కించు కొనరమ్మ సఖియాలారా !!క!!8!! ధరలోనవెలివెర్తి వరదూనినమ్మెను -ధన్యులారా - వరరామదాసుడు వర్ణించుసతతాము - వనితలారా !!క!!9!!

172. ఏకతాళం: రాగము: సురట

పంచముద్రలు పట్టేపద్ధతి ప్రస్తుతమెరుగరవోరన్నా - పంచభూతప్రాపంచములో మతి వుంచగ వలదురవోరన్నా !!ప!!1!! బాహ్యేంద్రియముల కనునది ఖేచరిమానుగ జూడరవోరన్నా- భద్రంబుగలో యింద్రియవృత్తులు తెలుసుట భూచరివోరన్నా !!ప!!2!! అంతరబాహ్యములన్నియు యెరుగుట మధ్యలక్షమురవోరన్నా - అంతరమానస షట్కములనుగన అదియుషణ్ముఖీ వోరన్నా !!ప!!3!! నాల్గుచూపులునమరగజూచిన నదియె శాంభవీవోరన్నా - చాలగసకలము లోపల నెక్కువ శాంభవి ముద్రయువోరన్నా !!ప!!4!! వెలిలోమధ్యను తిర్గిచూచుటా త్రివిధదృష్టులుర వోరన్నా- తలపకదృశ్యం బంతయునశ్యము దృక్కునుతెల్యర వోరన్నా !!ప!!5!! చూపునురూపును లయము జెశెటిసూటి తెల్యరావోరన్నా- పాపలలోపలదాపైవున్నా దీపముజూడరవోరన్నా !!ప!!6!! యిదియెతారకా యోగంబనియును జాడను తెల్యర వోరన్నా - మతిమారుతమును మగుడి చూపును మగ్నతచేయర వోరన్నా !!ప!!7!! జ్యోతిదర్శనము ప్రీతిగజేశిన పాతకమొదలుర వోరన్నా- పాతకమొదలిన పావనమయ్యిన ఖ్యాతికల్గురా వోరన్నా !!ప!!8!! యీధరలోపల యిలవెలివెర్తిల శ్రీధరు నెరుగర వోరన్నా - సాదరంబుగా రామదాసుడు సత్యము బల్కెర వోరన్నా !!ప!!9!!

173. ఆదితాళం: రాగము: గౌడ

దేశికోత్తమదాసవందిత దెల్పుసాంఖ్యము గురువరా - దాసమాన్య విలాసమానస తలపు నీదయ గురువరా !!దే!!1!! ఆదియందునయేది లేకను అచలముండెనుశిష్యుడా - ఆత్మగల్గెఆవాంత రంబున సూత్రమాయను శిష్యుడా !!దే!!2!! అంతమీదట యేమిగల్గెను అదియుదెల్పుము గురువరా వింతలెల్లను గల్గజేసెటి అంతుదెల్పుమి గురువరా !!దే!!3!! చంద్రచంద్రికవలెను మాయను చలగి కల్గెను శిష్యుడా- అందమయ్యెనసుందరీ త్రిగుణంబులాయనుశిష్యుడా !!దే!!4!! అండపిండ బ్రహ్మాండ మన్నియు ముందుగల్గెను గురువరా - ముందులేనివి అన్నియెట్లగు సంధిదెల్పుమి గురువరా !!దే!!5!! పంచభూతములైదు గల్గి ప్రపంచమాయను శిష్యుడా - యెంచగా యీఅయిదు యిరువై అయిదుఆయెను శిష్యుడా !!దే!!6!! యిరువదైదును యెట్టులాయను కరుణదెల్పుము గురువరా సరగునావిభాగమొందిన చక్కిదెల్పవెగురువరా !!దే!!7!! మనుసుబుద్ధియు చిత్తమాంకృతి మరియుగల్గెను శిష్యుడా - మానుగా సంకల్పనిశ్చయచిత్తమాంకృతి శిష్యుడా !!దే!!8!! ఆకసంబున అయిదు భాగములవియుగంటిని గురువరా - ప్రాకటంబునయింకగల్గిన రంకుయేమియు గురు వరా !!దే!!9!! ప్రాణపానమువ్యానదానసమానపవనము శిష్యుడా - ప్రాణధార్మకార్యమన్నియు పరగ జేయును శిష్యుడా !!దే!!10!! అన్నిదెల్పియుఆధరించుమి సన్నుతించెద గురువరా - యెన్నరానటు వంటి జన్మము యెన్నడొల్లనుగురువరా !!దే!!11!! శోత్రత్వాకులు నేత్రజిహ్వాయె సూత్రఘ్రాణము శిష్యుడా - పాత్రమాయను అగ్నిభూతము ప్రస్తుతించగ శిష్యుడా !!దే!!12!! శ్రద్ధచాతను ఆలకించెద సుద్దిగూప్పుమి గురువరా - రద్దులన్నియుపద్దుబాపను ముద్దుగున్నవు గురువరా !!దే!!13!! శబ్ధ స్వరిశము రూపగంధము రసము అయిదును శిష్యుడా - అబ్దిరూపంబైన నీరును ముద్దుగాయను శిష్యుడా !!దే!!14!! మీరెకానికనితరులెవ్వరు లేరుసాక్ష్యము గురువరా - మీరరానటువంటి సాగరమీద జేసినగురువరా !!దే!!15!! వా:క్కుపాణియు పాదహస్తయు పాయురేంద్రియ మైదునూ - మక్కువాతో మంటిభూతములందు గల్గెను శిష్యుడా !!దే!!16!! యిరువదైదిటి కార్యమెయ్యదో అరమరెందుకు గురువరా - పర్వమూగద మీరుగల్గుట నాదుభాగ్యము గురువరా !!దే!!17!! యివిటికార్యములన్ని విషయములదియె తాపముశిష్యుడా - ఆధియుదేవత లివిటికన్నిటి కవియెతాపము శిష్యుడా !!దే!!18!! త్రివిధతాపములన్ని నాకును తెల్పి బాపుమి గురువరా - యువిధమొప్పగ భవములన్నియు వూడిపోవను గురువరా !!దే!!19!! సవినయంబుగ వినర తెల్పెదసాక్షినీవిక శిష్యుడా - యివియు అన్నియు కార్యకారణకర్తలాయను శిష్యుడా !!దే!!20!! దృశ్యమన్నియు అంటకుండిన దృక్కునేనట గురువరా - దాస్యమూను జేసెవాడను దారిమాంచిది గురువరా !!దే!!21!! అన్నిటీని అంటనాట్టి వంటుదెల్పుట శిష్యుడా - అన్నివేరే తన్నువేరై యున్నవాడవు శిష్యుడా !!దే!!22!! వేరువేరై నామరూపము తోడనున్నవి గురువరా - మీరినేను యేదిగాని జాడదేలెను గురువరా !!తే!!23!! అందరాని సాక్షినీవై ఆడుచున్నవు శిష్యుడా- పొందరాని తాపదు:ఖము చెందబోకుముశిష్యుడా !!దే!!24!! నేనెబ్రహ్మం బనెటవాఖ్యము నీవెగాకద గురువరా - భావమందున నుంచెదానిక భక్తితోడుతగురువరా !!దే!!25!! వాసిఅయ్యెనపదముజెందియు దాసు గమ్మిక గురువరా - గాశిబాపియు రామదాసుకు గల్గజేసితి శిష్యుడా !!దే!!26!!

174. ఆదితాళం: రాగము: యెదుకులకాంబోజి

నిందాలొందించావలదే - గురుదైవములాకొందానంబులు జేయరె - మదమత్సారములాతో మందేమేళముజేయ - ముందెయెముడు బాట్టిబందుబందులుగోసు - విందువోవినలేదొ గురుని

నిందజేశినవారుయెన్నడు - పొందబోరని పరమపదమును అందరూగద నకలవిద్యల ‼ని‼1‼ పరులానిందించాపాపం -ప్రత్యేక్షాము పరులాపొందించాదోషం -గురువూదైవము భక్తావరులా దూషించితె - నరకామందున యెపుడు మిడుకూచునుందూరు - ఘోరజన్మము లెత్తుకొంచును క్రూరనరకములనుభవించుచు - దారిదొరుకకయెన్నటికినీ తీరనీ నరకములబడుదురు ‼ని‼2‼ మున్నూవిశ్వామిత్రుడూ వశిష్టాల యెన్ని జేశెను దుష్టుడూ- మన్నానజేయాక మహిలోనతనెంచారు యెన్నాదూర్వాసుడు యెన్నో యిడుములబొందె - వెన్నునీనిందించినట్టి వేగమె శిశుపాలుడాదిగ-యెన్నరానిబాదలొందిరి - విన్నకన్నను విరసమగునూ ‼ని‼3‼ భాగవాతపచారము మన్నించానని భగవంతుడే తెల్పెనూ - వేగామెతననన్నా గాని మన్నింతానె - జాగులేకనుదీన్ని బాగదెలసుకోని - ఆగమూలు వీడిభక్తుల కూడిమ్రొక్కిన కీడుదొలగియు - భోగభాగ్యామూలుగల్గి పొందుచుందురు సౌఖ్యములను ‼ని‼4‼ యెకామె యెకామనుచూ విశ్వంబంతా యేకాదేవుండానుచూ - లోకాలోకము సర్వాలోకేశులును చూడ - లోకస్తులంతాను శ్రీకాంతుడని తెలశి - వక్కడేసర్వేశుడనుచును నిక్కముగ నిజబోధదెలశీ - ఫ్రుక్కునామది మ్రొక్కులీడితె చొక్కమగు వెలివెర్తియందున ‼నిందా‼5‼

175. ఆదితాళం: రాగము: రేగుప్తి

నిద్రదెలియవలెరా యోగము భద్రపరుచవలెరా - నిద్రదెలియవలెభద్రము తోడుత సద్రూపం బగు సాక్షినికనుగొని ‼ని‼1‼ పంచవింశకుడురా జాగ్రతగాంచిగడుపుగదరా- పంచభూతప్రాపంచ వికారము - భ్రాంతులొందకను మించినవాడై ‼ని‼2‼ కలనుగాంచుగదరా తైజసు యిలనుమరుచు గదరా - కలలకార్యములు తగనుజేయుమిక - యిలనుమరచితె కలకల్లయి చను ‼ని‼3‼ ప్రాజ్ఞభావమయ్యా సుషప్తిక పరగ జెందుగదరా - సొజ్ఞయెరిగియును సారంబైనది - కారణ మనుచును కనుగొని దూరియు ‼ని‼4‼ మహకారణతనురా తూర్యము మరిపొందును గదరా సహకారియుగద సకలఆవస్తల సంకటపెట్టుచు సాక్షైవుండును ‼ని‼5‼ నాలుగవస్తలురా నణగిన నమలమొందుగదరా - మేలగుఅచలము లోలతగల్గిన చాలును రామదాసుకు సౌఖ్యము ‼నిద్ర‼6‼

176. ఆదితాళం: రాగము: సురట

మనుసూనిల్వగరానిదమ్మా యెంతామనుజాలకైనానుకొమ్మా - మనసునిల్వగరాదు మరి యెందుబోకుండ - మరలించి నిల్పూటా మహదుస్తొరంబాది ‼మ‼1‼ కులముశ్రేష్టంబయ్యియున్నా మనుసు కుదురూట దుర్లాభమన్నా - కాలాముగడచీనా కడువృద్ధులైనాను - కలిమీ వున్నగాని మదిచెదురూటణగాదు ‼మ‼2‼ సంసారమందూనాయున్నా లేకా సంసారములు వీడచీయున్నా హింసాజేశియువిషయా వీధిచెరించాకా- హంసోహమనుచున్నా అదిచేరించుచునుండూ ‼మ‼3‼ చదువూలన్నియు చదవీయున్నా సకలాశాస్త్రాసంపన్నూలైయున్నా - విదితాముగా యెంతా విబుదూల కైనాను - మదియూ నిల్వకయెన్నో విధముకల్పన జేయు ‼మ‼4‼ యోగములెన్ని జేశి నమా అన్నిత్యాగమై వీడూకొన్నాను - భోగాభోగములన్ని భోగించుమదిలోన - యేగూతప్పుడు మనసూ యెప్పూడొ మరిపించి ‼మ‼5‼ అనేకా జెన్మాసంశిద్దీ లేకా అచ్చుతునీ పాదాభాక్తీ- వినుడీ నిరహేతుకా యీశ్వారాసాత్కృప- పన్నూగాగురుక్రూపా కెన్నాసాధ్యంబాది ‼మ‼6‼ తపమూలెన్నియు జేశినానూ మంత్రాజపమూలన్నియు జేశినానూ - కపటామయ్యిన మనుసూ ప్రకటామై నిల్వాక వుపమూలెన్నియు జేయుతపమూ శిద్దియుగాక ‼మ‼7‼ మరణాసూషప్తులాయెందూ మూర్చా మరుపూ సామాధూలయెందూ - స్థిరమయ్యా అప్పుడు తిరుగాకయుండూను- మరికొంతా వర కూను కరువాలివలెనేగు ‼మ‼8‼ గురుదైవామలటీ సత్కరుణా యీధరలోనా కోరూచున్నాడూ తరమూ గాదనిగూరు కరుణాకుపాత్రుడై - వరరామాదాసూడు వర్ణించుదైవాన్ని ‼మనుసూ‼9‼

177. ఏకతాళం: రాగము: కల్యాణి

వుపదేశం వుపదేశం - వుపము దెలసుకా అపదేశంబిడ !!ప!! రాగద్వేషను రాగంబులుమది త్యాగముజేశిన యోగులకెల్లను !!వు!!1!! యీలోకంబున యిహపరసౌఖ్యము - జోలియుమానిన మానితజనులకు !!!!వు!!2!! యిలజగమన్నియు కలకార్యములని- వెలిలోమేల్కొని ఫలమునుబోందితె !!వు!!3!! పూర్వలోకమున వునికైనిలచియు - అధోకార్యముల నన్నియుమరచిన !!వు!!4!! సదా చారమును సల్పుచు మదిలో - దురాచారమును దూరినవారికి !!వు!!5!! వుపవాసంబనె వుత్తమ వ్రతమును- నెపములుబాశిన వుపకారులకును !!వు!!6!! అంటిఅంటకను ఆర్జనుమీరక - వంటరియై మాయగెంటిన వారికి !!వు!!7!! దాసభావమున ధన్యతనొందిన - దాసుడైన రామదాసుడు పొందిన !!వుపదేశం!!8!!

178. త్రిపుటతాళం: రాగము: ధన్నాసరి

అన్నిబోధలవలెను గాదన్నా - పరిపూర్ణబోధా - యెన్నతరము గాదుగదరన్నా - అన్నిబోధలకన్న మిన్నై సన్నుతింపారాకయున్నది - వున్నవస్తువజాడ తెలియను పన్నుగాయీ బోధకొరకూ - మున్ను గురువుల వెతుకవలెనన్నా - ఆపన్నుడయ్యి సన్నుతింపుచు నుండవలెనన్నా - నిన్నగాక మొన్నగాక పన్నగారి ప్రముఖులాదిగ - కన్నతత్వము కరుణజేయను - సున్నసున్నగు వన్నెలెరుకయు !!అ!!1!! అందరాని అచలపదమన్నా-హరిహరబ్రహ్మసురలకైనను సాధ్యపడదన్నా - బిందునాదాకళలు గాక మందమతులకుఅందబోకా-యెందరెన్నివిధంబు జేశినయెన్నడైననుయెరుకలేకను- నిందెనిందెలు బొందకున్నాదీ - యెందెందునైనా అందుతాను నిమిడియున్నాది - అందుయిందు యెందుననకా ముందువెనుకను సందిదెలియక - రందిలోబడి రాకపోకడ చెందదెవరికి కుందకనుఅది !!అ!!2!! లేనిస్వప్నాజగములోమనమూ - లేకానెగల్గియు లేనివస్తువ జాలియిది వినుము - రానిపోనిదాని యెందున లేనిదొచ్చిహెచ్చిచచ్చూ- కానిఅధిపతి యెవరులేకను కష్టపడి కడతేరకనుచను- వున్న దెరిగితెమల్లిరామన్నా - యికయెన్నడైనను అన్యమెరుగని నిజమువుండన్నా కానికలలో కార్యములు కడుయింద్రజాలంబనుచు యెరుకయు- పూనిఅచలము మేల్కజెందియు కానకను కల కార్యములుమది !!అ!!3!! చేసుటమువిడుచుటము లేదన్నా- చేయించెటందుకు చెప్పటానికి యేమి లేదన్నా - వాసవాదిదైవభ్రాంతియు వసుధపైతీర్థాల భ్రాంతియు - వాశితంబుగ ఖర్మభ్రాంతియు గ్జానభ్రాంతియు లోకభ్రాంతుల - మోసమన్నది లేకవున్నాది యీలేనియెరుకా గాశియెన్నడు జెందకున్నాది - ఆశపాశబంధములనూ ఆశ్తిరా వీషయాది భోగము - శాశ్వితామై వుండబోనివి లేశ మాత్రము లేవుదీనికి !!అ!!4!! సగుణనిర్గుణధ్యాన్నములుగాదూ - సదసత్తుచిత్తును ద్విగుణ రూపము లేమిమరిలేదూ - సుగుణధర్మాఖర్మములునూ సుమ్మిధానామానములునూ ఆగణితము ప్రతిమార్చనంబును అమితజపములు తపములన్నియు - సగనుజేశిన సంగతెరుకన్నా యివియేమి లేకను వగపునగపులు యేమిలేదన్నా - పగలురాత్రూలైన తెల్యక ప్రస్తుతంబుల పలుకులేకను - వేగమెవెలివెర్తియందున ఆగమానిగమములకందని !!అన్నిబోధల!!5!!

179. ఆదితాళం: రాగము: రేగుప్తి

కోపమెందుకువచ్చెరా పాపంబుకొరకై కోపమెందుకు వచ్చెరా !!ప!! కోపమేకద కొట్టితిట్టియు తాపమొందును ద్వేషముంచును- ఆపదొందును ఆత్మహత్యలు అన్యమది నొప్పించుచుండును !!కో!!1!! తామసాగుణమూనురా అగ్జానమోహము పామరత్వము మెండురా- కామ్యముల కొరకాంకరించును కష్టపెట్టును కపటమొందును - అమితభోజన మధికనిద్రయు స్థిమితమును

లేకుండ తిర్గును !!కో!!2!! పరులనూ దూషించురా పరవస్తువులపై పంతమాడుచు నుండురా - పరులనేరములెంచుకొంచును పరులనిందలు చెవులవినుచును - విరసమునను అదురు బెదరును సరసమొదలియు పెట్టుచుండును !!కో!!3!! నిత్యప్రళయము దెచ్చురా నిద్రాధ్యవస్త నిఖిల జీవులకోచ్చురా- నిద్రమూర్ఛయు మరుపుమరణము రౌద్రకర్మములన్ని లయమును - వుత్తదగు బ్రహ్మండ ప్రళయము మహప్రళయములన్ని జేసెటి !!కో!!4!! యిన్నిగుణములు కల్గురా యీరుద్ర గుణముతో యెన్నోనరకము లొచ్చురా - యెన్నియెన్నోక్రూరజన్మము లెత్తుకొంచును భాదలొందును- సన్నుతించెను రామదాసుడు సమయ జేయుమటంచు గురునీ !!కోపమెందు!!5!!

180. ఆదితాళం: రాగము: శోకవరాళి

యెయెఘాటను భావమేరీతి వున్నాదో ఆదిఆదిగుడువావాలెన్ - యేయేదేశంబున యేయే కాలంబూన యేదేది సంప్రాప్తమో !!యె!!1!! యెంతెంతవారాలు వంతూలనున్నాది అంతాఅనుభవించిరీ - వంతూకయ్యినచూడ వరఅవతారూలు యెంతా తప్పించుకొనిరీ !!యె!!2!! యెవరెవరి ప్రాలుబ్ధమొంతూలనున్నాదో యెవరూతప్పించాలేరూ - యెవరీనివేడినా భువనాములోపాల సవరించె వారెవ్వరూ !!యె!!3!! గర్భాగోళమునుందు ఘనబాల్యమునందు దుర్భాయెవ్వనమందునా నిర్భాయమునులేదు నిరువృద్దదశయైనా నీల్గిచచ్చియుపోయినా !!యె!!4!! చెక్రాధిపతులూ పారాక్రామ సురులైనా అక్రామ అసురూలైనా - యెక్రామనరులైనా యెంతాటి రుషులైనా చెక్రాములో బాడిరీ !!యె!!5!! వకరీది వకరీకి వరుసాజర్గగబోదు యికయెన్ని జేశినానూ - వకగూణమైనాను పరులాది రమ్మన్న రాదూ తానదిపోదుగా !!యె!!6!! దాతాకయ్యిన జెగన్మాతాకయ్యినగాని వ్రాతా దప్పక పాయనూ- మాతాపిత్రాదులు మరిబాంధవులనెంతా ప్రీతీతోనమ్మీవున్నా !!యె!!7!! దైవాధీనమె కాని దగసూఖదు:ఖములు తగిలనుభావించావలెనూ - యేవ్వాళ్ల కేకర్మా మేదీఘూటించినా ఆది సామమయ్యుండునూ !!యె!!8!! శిరిగాల వెలివెర్తి వరవాసుదేవూని కరుణానెకావాలెనూ - వరరామదాసుడు శిరినీవెలనుచూను మరినమ్మివున్నావాడూ !!యెయెఘాటను!!9!!

181. ఆదితాళం: రాగము: కల్యాణి

అనుభావించక తీరునా అనుభవమూలు అనుభావించకతీరునా - అనుభవించక తీర దెవరికి ఆత్మవేత్తలకైనాగాని - హరిహరాబ్రహ్మాది దేవాసురనరాది బుధులకైనను !!అ!!1!! ముందే బ్రహ్మదేవుడు యక్షులబాధ చెందియుండాలేదా - నిందెలొందెను భారతీకై కుందిపాయను శిరము శివునిచె - రందిలోబడి యెన్ని మారులు పొందనాయను దు:ఖములు మరి !!అ!!2!! హత్యాదోషము చాతనూ పురహరుడైతె అతికష్టాములునొందెనూ - హత్తుగను రుషిపత్నులాపై ఆశచాతను శాప మొందెను- హితవుదప్పిన అసురులకు వరమిచ్చియెంతో యిడుములొందెను !!అ!!3!! పదివేషముల స్వామియూ పాడినపాట్లు పరగాయెవ్వరి తారమూ - విధియుదప్పియు యిందృుడాదిగ యిడుము లొందియు అడవికేగిరి - వదలకను రవిశెశికి నిడుములు వచ్చెరాహుకేతువులతో !!అ!!4!! యెవరూ దప్పించాలేరూ హానివృద్ధి యెవరూదప్పించూకొనిరీ - భవములన్నియు అణచివేశియు భక్తులను దరిజేర్చుటకుగురు - నవతరించును కానికారణ మనుభవించక తీరదెవరికి !!అ!!5!! గ్నానూలకైనా గాని అగ్నానాంధ కారూలకైనా గాని - మానుగను వెలివెర్తి లోపల మనుజుడగు వరరామదాసుడు మేనుమరచియు బ్రహ్మమందున పూనిఅయిక్యము జెందకున్నను !!అను!!6!!

182. ఆటతాళం: రాగము: భైరవి

నాదంబువినవే దశవిధ ప్రణవానాదంబు వినవే !!ప!! నాదమూలు వీనులందున మోద మయ్యిన బోదరీతిగ - పాదుకొన్నా బ్రహ్మముండె పద్మమగు సహస్రారమందున !!నా!!1!! మొదట చిణినాదం చిణిచిణినాదంబును ఘంటానాదం - పిదపశంకము వీణెనాదము తాళనాదము వేణునాదము - నాదమగు మృదంగ భేరి మేఘనాదము మొదలుగాగల !!నా!!2!! ఓంకారమనవే ఓంయనుచును ఝుంకారించూనె - అంకెకును ఆవంకమనసును పొంకమొందగ లయము జేశియు - మంకువదలియు సర్వవిషయము బింకములుడుగు భీజమణగును !!నా!!3!! నాదా బ్రహ్మంబే సర్వంబుకు ఆత్మారాముండే - నాదమెకద సకలమందును నాట్యమాడగ జేయుచున్నది వాదభేదములణచి చూచితె భేదమేమియు లేకవినబడు !!నా!!4!! సాకారమదియే సర్వాకారా ఆధారమదియె - ప్రాకటంబుగ ప్రణవమంత్రము ప్రస్తుతించిన పరము జేర్చును - యీకలందున రామదాసుడు యిలలో వెలివెర్తిలను పలికెను !!నాదంబు!!5!!

183. ఆటతాళం: రాగము: కాంబోజి

మనుసేమొసైసాదు మరియెమొకాని - మునుపాటివలెనాతో మురయుచుండాదు !!ప!! అనిశమూ వకచోటనిల్వక అప్రయోజన విషయముల - అన్ని ముఖములను మరువజాల దదియు యెమొమానుకున్నది !!మ!!1!! యిహపార సౌఖ్యాముల యిచ్చాయుంచాదు ఆహంభావము లేక అణగీ వుంటాది- వూహపోహలువేగజేయుచు యెమిలేనివి అనుచుమళ్లుచు - సోహంభావమూల కంటియు అహంమూలమూను బాశియు !!మ!!2!! యింద్రియవృత్తూల చెందాదుపూనీ - పొందీ పొందానట్టి సందూదోస్తాది -యెందుకో మరి యెరుగజాలను ముందుయిటువలె నుండకుండెను కుందిపాయను అందరీలో యెందరూయెమన్నరోమరి !!మ!!3!! చెయ్యాదు చేయించాదూ రాకుండాదు -సయ్యాసయ్యన అచలామందూనిమిడుండూ - యెయ్యేడాతానేమి లేని యెరుక మరుపులు జెందకుండను - అయ్యేడావ్యాపించి నిండిన అప్రమేయము నందుగలశీ !!మ!!4!! ధారూణి వెలివెర్తి ధామూనిసాక్షీ - గురుణీ సత్కృపయూ సంపూర్తిదెసాక్షీ - పలిపలీ విధములను తిరుగుట మరచిపాయను తరచినిల్చియు - సరగునను వరరామదాసుకు పరమపదమె స్థిరము ఆయను !!మనుసేమొ!!5!!

184. ఆదితాళం: రాగము: బిలహరి

వ్యాపారాము జేశెదాను అపాదాలుబాయానూ - ఆపారమాత్మూని లేక్కావోపీకాతోవ్రాశేనూ !!ప!! ప్రథమామైనా రాజాఅనుమతి అధికారాముచెందెదా - ద్వితీయామైనారాణిగారి దీవెనాలు పొందేదా !!వ్యా!!1!! ముగ్గూరి మంత్రూలనిల్పీ మూలామె సాధించెదా - మగ్గీపొయ్యెవారూయనుచూ వద్దీకాతో దెలశెదా !!వ్యా!!2!! నల్గూరికరుణాలు దప్పినడిచినాను అణచెదా - వెల్గూలోవెలుగూను జూచి మల్గెమాయా అనియేదా !!వ్యా!!3!! అయిదుగూరి సర్దార్లాను నలయాకా భాగించెదా - యిరువాదైదు అధికారూలా విధమూ దెలశీ నిలచెదా !!వ్యా!!4!! అర్గూరిదొంగాలబట్టి అధికాశిక్షా జేశెదా - యెడూప్రహరీలున్నా పురిలో మేడాలోనదలచెదా !!వ్యా!!5!! యెన్మీదిగాజాధి పతులా వున్మాదాముబాపెదా - సన్మార్గాముతోడా నాదూచక్కీ జూచుకొనియెదా !!వ్యా!!6!! తొమ్మీదిపారాల వాండ్ల తొలుగాకుండూ మనియెదా - దిమ్మారయ్యి వచ్చిపొయ్యె యిమ్ములా పోగరడచెదా !!వ్యా!!7!! దుష్టాఅశ్వామూలా పదియూ నిష్టాతో నడిపించెదా - శృష్టిఅయినా తొంబాదార్గురి సూటీదప్పా నివ్వాకా !!వ్యా!!8!! దీపామున్నాయంతాలోనా వ్యాపారీనైసదిరేదా - అపత్కాలాబాంధావూని త్యాపా

త్యాపకు తలచెదా !!వ్యా!!9!! లెక్కాలెక్కా చొప్పునాను లెక్కజేశితెరెదా - చిక్కులాలెక్కాలనెల్ల గ్రక్కునాను బాశెదా !!వ్యా!!10!! వాశీఅయినా వెలివెర్తిలో వాసాముూను జేశెదా - యీశుడైనా సర్వేశుని దాసూనయ్యి కలశెదా !!వ్యా!!11!!

185. ఆదితాళం: రాగము: జంఝాటి

వుత్తాదెకదరా మనమందరమూ వుత్తాదెకదరా !!ప!! వుత్తదేకద రిత్తతనువుల మత్తయాలను వదలకున్నరు - నత్తుచిత్తుల సామ్యవస్తువ వుత్తదేకద సత్యమునుగన !!వు!!1!! మొదలూలేనివిరా స్వప్నాజగమూ తుదనూముట్టదురా - వదలకను స్వప్నంబుతనువులు వచ్చెయెన్నో యెవరు పంపక - పదరపోదము మనవలెను అవిపంచదశి తాత్పర్యమెరిగిన !!వు!!2!! వెర్థామెకదరా గుర్తెరిగేటీ నర్థాముకనరా - గుర్తుయెరిగె దేహమూలు షర్తుజేశిపోవసాగెను - గుర్తుయెరుగా వేలరా ఛీధూర్తమైనా మొండిజీవా !!వు!!3!! వున్నాదికనరా గురుసొగ్గాచె కన్నాదివిడరా - కన్నది విన్నాదిఅన్నది సున్నసున్నెచూపురూపుల- మన్ననోదలియు యెన్నరానిది సన్నుతింపగ రానిదాయను !!వు!!4!! చిత్తాగించుమిరా చిన్నది అనక వుత్తారించుమిరా - సత్యసత్యము మీరియుండిన సత్యమగు నిర్భయలు ఘట్టని - చిత్తమున శ్రీరామదాసుడు స్థిరముకై తనమదికి చెప్పెను !!వుత్తాదె!!5!!

186. ఆదితాళం: రాగము: ఆనందభైరవి

యేమిదెల్పుదును యెంచాగారానిది- యేమిదెల్పుదునూ - యేమిదెల్పుదూ సోమసూర్యులా తేజంబులకును ధామమాహత్మము !!యే!!1!! నాశికాగ్రమున భాశిలుచున్నా - వాసమైన పరంజ్యోతీర్మయమును !!యే!!2!! ఆరుపురంబుల ఆవలనుండే - మేరుశిఖరమున వెలగెమాహత్మము !!యే!!3!! పంచరంగులా పైన వెలగుచు - పంచశక్తులకు మించినాత్మఅది !!యే!!4!! బిందునాద కళలందున నెప్పుడు - చందకఅందులో వుండునిష్కళై !!యే!!5!! వేణిత్రయములు కూడినస్థలమున - నాణ్యము తోడుత నాటకధారిని !!యే!!6!! సత్తుచిత్తుఆనందంబులకూ - వుత్తమమైనా సత్వదార్థమును !!యే!!7!! ధరవెలివెర్తిల వరరామదాసుడు - స్మరణజేయు సత్కరుణకొరకునై !!యేమి!!8!!

187. ఆదితాళం: రాగము: ఆనందభైరవి

యీదారితెల్పరోయన్నా - దీనికేదారిసాటిగాదన్నా - యీదారితో సమము యిఘలేదు రొండోది రాదారిఅయ్యుంది రాజమార్గంబును !!ప!! అచలాగూరుడు అధికూడన్నా అష్టాగురువూల కలవిగాదన్నా - అణిమాదిశిద్ధూలకావాలి మార్గాము - అచలాపరిపూర్ణము అందారికబ్బాదు !!యీ!!1!! యెరుకాగురువులు యెందారున్నా ఆయెరుకానె బోధింతురన్నా - యెరుకాబోధలువింటె యెన్నాడుదరిలేదు - యెరుకావుండుదాక మరుపెందుపోవును !!యీ!!2!! ముద్రాలందున లేదో యన్నా లక్ష్యాముద్రాలు చిద్రూపుకన్నా - సద్రూపమయ్యున్న సాక్షికినావాల - భద్రామగు బయలుకే ముద్రాసాధన లేదు !!యీ!!3!! సాధువేషములొట్టివన్నా సంసారివేషము లుత్తావన్నా - పాదులేని మోక్షాబంధాములకుతల్లి - నాదుబిందుకాళ నామరూపములాయె !!యీ!!4!! తారాకసాంఖ్యాము కన్నా తత్వకారమమనస్కాముమిన్నా - సారాసముగ ఆత్మసారాముకెయిన్ని దూరావాలెను యిన్ని మీరీనపదవీకి !!యీ!!5!! ఆరుపదవులకానరన్నా సాహస్రారపాదము వారకన్నా - వేరయ్యివున్నాది వేదాంత రహశ్యాము - గురుడూచూపించిన క్షణమూలో అగుపాడు !!యీ!!6!! వెలివెర్తి లోపాలనన్నా ఆది వెగామెబయలైనాదన్నా - కలలోదోచిన రామాకృష్ణూలవలెగాదు సలలీతముగ యెపుడు సాన్నిధ్యమయ్యుండు !!యీదారి!!7!!

188. ఆదితాళం: రాగము: రేగుప్తి

యెరుకయెరుకయు మరుపు యెరుకాయేననితెలశి - యెరుక మర్మముగన్న దెరుకా యెరుకలేనని తెలశి యచలమును మేల్కాంచి యెరుకలేకుండుటా యెరుకా !!యె!!1!! నిల్ప వలిశిన వేవో నిల్పగూడనివేవో - నిక్కంబు దెలశినా దెరుకా - సల్పవలశిన వన్ని నిల్పినిజమైయుండి కల్పనలు లేనిదే యెరుకా !!యె!!2!! మనసు అచలమునందు మరియు సూన్యము జేశి -ధ్వంసమై యుండేది యెరుకా - అనిశమును మరువకను అమలమై యుండియును - ఆదిబ్రహ్మంబైన దెరుకా !!యె!!3!! గురువుశిష్యుల గుట్టుగురుతు లెస్సగ దెలశి గురిదప్పకున్నదె యెరుకా - మరువకను పరిపూర్ణ మంత్రంబు స్మరియించి వరశిద్దిబొందినాదెరుకా !!యె!!4!! మూలమేమియు లేని గుర్తెరిగె దాననని - కీలుతెలశిన మేలుయెరుకా - జాలతంత్రంబులా జాలిబొందక యెపుడు - చాలించు కున్నాదే యెరుకా !!యె!!5!! యీవుత్తబట్టబయలేమి లేదనుచునూ - యిదిదలచుచున్నాదే యెరుకా యీలోకముల జోలికే ప్రొద్దుబోకనూ యిహపరము లీడినాదెరుకా !!యె!!6!! లేనెరుక లేకొచ్చి లేనానీ తెలశియూ లేకనే వుండినాదెరుకా - రానిపోనిబయలు రామదాసుండొంద రాకపోకలు బాపెదెరుకా !!యెరుక యెరుకయు!!7!!

189. ఆదితాళం: రాగము: పున్నాగవరాళి

పూజకుపూజా పుట్టినవన్ని పూజాకు పూజా !!ప!! పూజపుట్టిన వన్నిగిట్టును పూజకర్థము బిందువాయెను - తేజమొందియు వోజదప్పియు తెల్విమ్రగ్గను యెగ్గులేకను !!పూ!!1!! శూన్య శూన్యాము జన్మంపుమాయ లేనిదాయెనూ - సూన్యసూన్యము సర్వసూన్యము లేనివాయెను నామరూపము - మాన్యతొందెను వున్నవస్తువు తిన్నగాతానయ్యినప్పుడె !!పూ!!2!! సున్నాకుసున్నె వున్నదిగాద సన్నాపుఆత్మె - యెన్నరాని అచలమందున యెన్నడూ లేనట్టి యెరుకా - వన్నెబాశిన రామదాసుకు యెన్నడెడ తెగకున్న బయలులో !!పూజకుపూజా!!3!!

190. జంపెతాళం: రాగము: కన్నడ

అంటిఅంటకవుంటె అంటుసత్తదమూ -అంటుగెంటని శుంఠకదియు దుస్తరమూ !!ప!! అంత:కరుణా వృతికాశపడకను తాను- ఆత్మతానై కేవలాత్మ గనవలెనూ !!అ!!1!! మదియు దుస్సంకల్ప ములును సత్సంకల్ప - అదితాను జేయకను ఐక్యమైయుంటే !!అ!!2!! బుద్ధిచలనంబుకు నిశ్చయంబు లకును సుద్దిమీరినవాని రద్దిమానిననూ !!అ!!3!! చిత్తచలనంబునకు చింతలోబడకానూ అంతులె నచలమున అట్టెకలశిననూ !!అ!!4!! అహంకారవిషయమును అహంకారమమకార- అధిదేవతయు గాక ఆవలొదిలిననూ !!అ!!5!! గ్నానేంద్రియములైదు దగుఅగ్ని ధర్మలకు - పూనిఅంటక బయలుతానె అయ్యిననూ !!అ!!6!! కర్మేంద్రియములైదు కడుభూమిపంచక - కారణంబైన మహకారణం బుడుగన్ !!అ!!7!! ప్రాణంబులైదును పవనాంశ గుణములని - పవనాత్మయైతాను పరగ నెరుగకనూ !!అ!!8!! తన్మాత్రలైదును తగజలాంశంబని - తానుఅంటక తత్వశిలుడయ్యిననూ !!అ!!9!! పంచవింశతిభూత పంచకంబును మీరి - యేంచరానట్టి యేరుకేగిపోయిననూ !!అ!!10!! యీధరలో వెలివెర్తి శ్రీధరుండనుచున్న భేదమెరిగెటి మాయలీనమయ్యితెను !!అంటిఅంటక!!11!!

191. ఆటతాళం: రాగము: పంతువరాళి

అచలాము అందాదొయన్నా - ఆదివిశదామైవున్నాదోయన్నా - సచలాము నెప్పూడు చయ్యాన గల్వాక - సచరాచేరములందు సంపూర్ణమైనాది !!అ!!1!! యెంతావారికి తెల్యాతరమా -బ్రహ్మవిష్ణు

రుద్రాదూలకైనా - అంతాము లేకాను అంతాటనిండీయు -చింతలయెరుకాకు కాంతూడైవున్నాది ‼అ‼2‼ అచలాగూరుణి సొగ్గలేకా - ఆదివశమూను యేన్నాడుగాక - అసమానరహితాము అప్రా మెయంబయ్యి రశికూలకైనాను రాజియేన్నడుగాక ‼అ‼3‼ గ్నానఖర్మలకూను తరమా - అగ్నాన ధర్మలకీది వశమా - గ్నానవంతులాత్మ గంటీమిఅందూరు - లేనిదినిజమాని పూనూకొనియున్నారు ‼అ‼4‼ యెరుకా మరుపుల నెరిగెదాన్ని - యెపుడు సల్పునిష్టను సల్పుకోని - పరమూ గాదదియాని పల్కేను శృతిగూరు - అనుభావమొందీయు అనెరామదాసూడు ‼అచలాము‼5‼

192. రూపకతాళం: రాగము: హిందుస్తాని

అచలమె అచలం సచలిత రహితం - వచనములేక నిర్వచనమైయున్నది ‼ప‼ నామము రూపము నటనములేనిది- రామముపైన నిరామయమైనది ‼అ‼1‼ ఆదియుమధ్యా అంతములేనిది పాదుగ బట్టబయలైవూన్నది ‼అ‼2‼ వింతలులేకను స్వాంతమయ్యున్నది - పంతములేనిది యెంచగ రానిది ‼అ‼3‼ సాధనకెల్లను సాధ్యముకానిది - సాధనలేకా గురుబోధకమైనది ‼అ‼4‼ అంతట వ్యాపకమై కనరానిది - రంతులమాయ వక్కింతయులేనిది ‼అ‼5‼ యెర్రదితెల్లది కర్రెదిగానిది చొర్రదువేళ్లదు చోద్యముగానిది ‼అ‼6‼ చూపుకురూపుకు చూచెఅత్మకు- చూడగరాక సంపూర్ణము గున్నది ‼అ‼7‼ యెరుకకు మరుపుకు యెరుకై యుండిన - యరుకకసాధ్యము యెరిగితె సాధ్యము ‼అ‼8‼ ధరవెలివెర్తిల దరిశనమున్నది - వరరామదాసుకు వర్నితమైనది ‼అ‼9‼

193. ఆదితాళం రాగము: శంకరాభరణం

యిదుగోర మహావాక్యమూ చూడరజీవ అదుగో పారమమార్గమూ- యిదుగోర మహావాక్య మదుగోపారమమార్గ - మదిలోన మదియించి పదిలామైచూచితె ‼ప‼ ప్రజ్ఞానబ్రహ్మామై ప్రబలీన దిదిరా - యెజ్ఞానమునుగాని దేకామె ఆదిరా - అజ్ఞానమీజ్ఞాన మమరి తెలసిన యెట్టి - సుజ్ఞాన విదుడౌను శోధించికనరా ‼యి‼1‼ అహంబ్రహ్మా ఆశ్మిఆకారమిదిరా - అహంబుకావలి అమలా పదమదిరా - అదియిది మరుగెరిగి అంటుబాశిన యెపుడె - వూహెవిద్వరుడౌను వుపమీది గనరా ‼యి‼2‼ తత్వాదత్వంపాద ఆశిపాదమిదిరా- తత్వాఅతీతమై తరుగానిదదిరా- అత్తుగ అది యిది మొత్తాముమరుగెరుగా - వుత్తాముడై విద్వారీయుడౌ వినరా ‼యి‼3‼ ఆయమాత్మ బ్రహ్మాను ఆత్మపదమిదిరా - ఆయమాత్మకావాలి అచలామె ఆదిరా - పాయక అదియాది పరికించి చూచె వీదేయుడె పరిపూర్ణ భావుడౌగదరా ‼యి‼4‼ గురుమూఖమున యీవి గురుతెరుగావలెరా గురుతెరిగినంతాలో మదినిల్పావలెరా - మరుగెరిగి శ్రీరామాంహ్వాయుడు బల్కినపల్కు- గురితోను గని వట్టి గురుతులీడగ వలెరా ‼యి‼5‼

194. ఆటతాళం రాగము: ఆనందభైరవి

వెయ్యరామోడి వెయ్యరా మహమంత్రములచే వెయ్యరా మోడివెయ్యారా - వెయ్యరాగురు మంత్రములచే సయ్యనసయ్యనజెననమొందె - కొయ్యపురుషుని చందమున యిదినెయ్యమున గల్గేటియెరుకకు ‼వె‼1‼ పంచవింశకుడైన విశ్వడు మించిజాగ్రతజాల మొందియు - సంచితంబు లనుభవించె వంచకుని పదహారువాటుచె ‼వె‼2‼ పదియు అయిదూ రొండుగూడి పరగస్వప్నజాల మొందియు - పదిలముగ తన నిజముదెలియని విదునిముంచె పంచదశితో ‼వె‼3‼ వంధ్యపుత్రా వతు సుషుప్తి జెందియుండి రెండు గలశీ - పొందుచుండీ రొండు తెల్యని మాంధ్యుని పదిరొంటితో పో ‼వె‼4‼ మూటికనుభవకర్తతానై - మూటికంటనిమేటితానై - చేటులొందేజాలకుని మటుమాయ ముగ యిటురాని సూటిచె ‼వె‼5‼ సత్తుచిత్తు అసత్తులకు తానుత్తముడనని సత్తజర్వే - మత్తగల

యీా యెరుకజాలము వుత్తదేనని మొత్తముగదీని ‼వె‼6‼ రానిపోని బ్రహ్మమందు లేనిపోనియెరుక గల్గీ - కానికార్యములాచరించే కల్పకుని కనుపించకుండను ‼వె‼7‼ వాశియగు వెలివెర్తి యందున యీాశుడగు భారేశురామ - దాసునకు నిజరాశిజూపియు మోసమగు జెనితంబు లేదనె ‼వె‼8‼

195. జుల్వాతాళం రాగము: మిత్ర

యెన్నడోకద తన్నుతాను కన్నమాటలు సున్నలూ - అన్నడేకద అచలపదమై యెన్నరాని మన్ననల్ ‼యె‼1‼ నాల్గుమేనులు నాల్గవస్తలు నాల్గునాల్గులు బాసుటా - ఫాలమందున వున్న భీజము లీలలన్నియు దొలగుటా ‼యె‼2‼ పంచదశి మర్మంబు దెలశీ పంచవింశకు నోదలుటా కాంచరానిది కాంచికలశియు కలజగము మేలుకొందుటా ‼యె‼3‼ షోడశాక్షరి మంత్రశిద్ధియు జాడదెలశియు వీడుటా - జోడులేనిదాన్నికూడి జాడలేకుండెన్నడో ‼యె‼4‼ ద్వాదశాక్షరి సారమును గని ద్వారమొదలుట యెన్నడో - వాధభేదము లేనిబయలున కూడివుండుట యెన్నడో ‼యె‼5‼ దేహిదేహము రొండులేని దేవుడైనే పోవుటా - ఆహముమూలము సోహమణగియు అంతచలం బుండుటా ‼యె‼6‼ అచలగురుణీ బోధదెలశీ అంటిఅంటక వుండుటా - సచలమగు వరరామ దాసుడు సత్వదంబై యుండుటా ‼యెన్నడోకద‼7‼

195. ఆదితాళం రాగము: మారువడి

కూడాదు గురువార్గ యివనీదె గురువయ్యి మగుడి శిష్యులజేసుటా - పడరానిపాటెల్ల పడియూ నరకంబూన ప్రస్తుతించగజేసొటా ‼కూ‼1‼ యిపుడేమి లేనట్టు వుపకారమైనట్టు విపరీత మొందుసుమీ- కపటానాటకుడైతె కనిపెట్టి యున్నాడు కల్లానిజములు రెండునూ ‼కూ‼2‼ గురుడు నారుడుగాడు హరుడాని శృతిస్మృతులు మొరలుబెట్టుచు నుండగా - నరులుకొందరు తమకు తామె గురువులమనుచు మురయూచునుండేదరూ ‼కూ‼3‼ గురువార్గ్నఅయ్యితె గురు చిహ్నములు అన్ని గురుతూలుండుటయూ సాక్షీ - ధరకల్లాగురువూలు దారిదప్పియు నడచిచేరారు పర మందునా ‼కూ‼4‼ బాధాగురువులెకాని భోదాగురువులుగారు వాదులాడెటివారెల్లా - తుది ముట్టాకను పరులా దరిజేర్తుమందురు ముదమొంది నరులాతోను ‼కూ‼5‼ గ్నానానుష్టాన్నము ధ్యాన్నపరులకెచూడ మానుగనధికారము - పూనియీాష్టశిద్ధి పొందాకగురువార్గ చెందాకయెటు గల్గునూ ‼కూ‼6‼ ఆశకోరకెకాని వెషాములన్నీయు మొసాము కొనకిచ్చునూ - శేషమ్మాజెప్పిన ఆగ్నాకు లోబాడి క్షేమామెరుగనైతినీ ‼కూడాదు‼7‼

196. ఆటతాళం రాగము: మేఘరంజీ

యెరుకామరుపుల నెరిగె దేగీనతదుపారి - గురుతులుడిగిన వెనుక యెరుకాయెన్నడు లేకా - పోనెపాయా - మరుపును యెపుడురాకపాయా ‼యె‼1‼ సత్తుచిత్తానంద సంప్రాప్తిగలిగీనా చిత్తూడుసత్తాని చిన్మాయమిడ- మత్తబాయగదరా - మరచినవుత్తాదాయగదరా ‼యె‼2‼ నాదు బిందుకాళ నాటాకమావాల -పాదూనుదెలశేటి పద్దాతిగలిగీతె -లేదుగదరా-కంటేయేరుకా రాద్దువిడరా ‼యె‼3‼ అంతారబాహ్యము లన్నీయు మరచీనా - తంత్రాములన్నుడిగీ ఆశిపాదమవురా అయితె అంతాఅంతమగురా ‼యె‼4‼ సంకల్పసవికల్ప నిర్వీకల్పంబూల సంకూలమొదలీనా సౌఖ్యాముఅయెను - బొంకులాయె అన్నియుయెరుకా రంకులాయె ‼యె‼5‼ గురువూశిష్యులు కలశే గురివక్కాటెరిగీతె గురువూశిష్యులు అనెగురుతూను వుండాక - గూఢమగురా -గురుకృప గల్గెజాడ గనరా ‼యె‼6‼ జాలిమాలిబాశి జాలాములోబడక - కీలుసద్గురుణీచె మెలాట్టె పొందీయు మూలమెరుగూ - వెలివెర్తిలా మేలుబొందూ ‼యెరుకా‼7‼

197. త్రిపుటతాళం రాగము: ధన్నాసరి

యెంతచక్కని రాజమార్గమూ - పరిపూర్ణ రహశ్శంబంత నిశ్చల సాంతనిర్గుణమూ ‼ప‼ యెంతచక్కని మార్గమును దీని కేదిసరియగు మార్గమును గల - దంతకంతకు సాంఖ్యతారక మొంతుకొరకె కానిముక్తి - కాంతపొందు మానవచ్చునా - అమనస్కయోగం బంతలేదని ఆత్మ జచ్చునా - అంతబోయి రవ్వంతనిలచిన భ్రాంతిమూలంబయ్యె జగయుగ - వింతలెల్లను అనుభవించియు అంత్యమౌనో యేమొఆవలి ‼యె‼1‼ పదియునైదులు నాల్గుమదినెరగీ పదియార్లు నాలుగు పద్దతేదో మొదలెగుర్తెరిగీ - పదియురెండూ పరగనాలుగు వదలకను తుదిమర్గునెరగీ కదలుచున్న చలనవస్తువు వదులుటకు సూత్రంబుదెలశీ - అదరకను స్థూలంబుబాశినను సూక్ష్మంబుగని దాని చెదరకనుసంపూర్తి రోశిననూ - బెదరుయేమిట లేకకారణ వ్యధనులేదని వధనుజేశియు - కదలకను మహకారణాతను -చనినవస్తువు కనినమీదట ‼యె‼2‼ కలలోకరి మేల్కొన్న దొకటాయ తిలకింపయేనుగ కలలో శిహ్మముగన్నదొకటాయ - కలలో దోచినమేనుకైవడి కారణంబు ఆభావమాయను- పలుకుగలిగిన గగనచిద్భ్రమ పలుకులుడిగీ శూన్యమయ్యెన వులుకులేదిక మిణుకుబాశిననూ - మహకారణంబనె పలుకులేదని అలక దీర్చిననూ - తొలుకులేని బట్టబయలులో పలుకరించని బ్రహ్మమునుగని - కలనుపొందక మేలుకు వందితె చుల్కదనమగు పలుకులేనిది ‼యె‼3‼ మూలమేమిలేని క్షేత్రాము క్షేత్రజ్ఞమైతె పాదులేని జాలసూత్రాము - మూలమేమి లేనితనువు చాలగా గుర్తెరిగెయెరుకా- మూలాభావ మిదంగ్నాతను మోదమున లేదనుచు దెలశి మేలులేనిది యనుచు తెలశిననూ -కలకాలమన్నియు కల్లయనిమది నాల్గుయెరిగిననూ మేలుగను గురుసౌర్గ్నచేతను మేలుకొని పరిపూర్ణ మిదియని - వీలులేనిది బయలులోకని కీలు దెలశియు లీలబాశిన ‼యె‼4‼ బట్టబైటా భ్రమలు లేవనుచూ బ్రహ్మంబు గనుచూ దిట్టమైతానేమి లేదనుచూ- స్వష్టముగ వెలివెర్తియందున గుట్టుమేల్కొని ఘట్టియిదియని- యెట్టకేలాకైన యీ బట్టబయలే నిజమునిజమీ - వట్టిబట్టాబయలులోపాల మరియేమి లేదని యెట్టకేలాకైన విడువాక యిట్టిబట్టాబయలుబయలనె రట్టుజేశెటి మెట్టులేచిన - పట్టువిడువని రామదాసుకు దిట్టమగు యెరుకేమి లేనిది ‼యెంతచక్కని‼5‼

198. ఆదితాళం రాగము: మధ్యమావతి

ఆచారామూనూ తెల్యారయ్యా - ఆమనస్సుఅనియె - ఆచారమూను జేయారయ్యా ‼ప‼ అచారంబును వాచాక్రియలతో- చేశినఫలముకు మోసమువిడువదు ‼ఆ‼1‼ కాయాశుద్దీకె బహిరాచారం- కనుపించూగాని మాయారహితాముగాని విచారం- పాయకశుద్దా ఆత్మాచారము చేయగ ఆత్మాక్షేమము దొరుకును ‼ఆ‼2‼ మూడూనాదూలు యీదారయ్యా- ఆమీదానున్నా మూడు మండలముల మీరారయ్యా- ముక్తిద్వారమును ముదమునదీశియు- ముక్తికాంతనటు ముదమున కలశియు ‼ఆ‼3‼ మనుసూ ఆత్మాలో నైక్యముజేశి - మగ్నాతానొంది అనిశాము ఆత్మాబ్రహ్మమయ్యె ఘనసమాధిలో ఘ్రుక్కున మణిగియు - దినదినమును మది అణుగుచునుండె ‼ఆ‼4‼ వట్టీఆచారా కష్టామేలా - బట్టాలతోను పట్టువిడుపూలా నిష్టాలేలా - దిట్టములేకను తిరుగుచుచిత్తము- ముట్టరానివి ముట్టుచుతిర్గును ‼ఆ‼5‼ ఆత్మాశుద్దీయె సాదాచారం - అచలంబునందు ఆత్మాఐక్యామె శుద్దాచారం- మతిజారత్వము మరువాగజేశితె - అతినిశ్చలముగ అంతటబ్రహ్మము ‼ఆ‼6‼ వేదా వేదాంతామూలాయెందూ - వెతకీశోధించి వాదాములాను మానుడీందూ - బోధజేశెనిటు భార లింగమును -వేధలేని వెలివెర్తి యందునను ‼ఆచారామూను‼7‼

199. ఏకతాళం రాగము: యిందుస్తాని

సోహం సోహం సోహం -దాసోహం సోహం సోహం - సోహము నడుమును ఓయని కూయగ - ఆహంబణగగ ఆత్మారామం ॥ప॥ ఆరుమూడు బంధించీ -అదిఆరుటిపై నడిపించీ మేరువయందున మేటిలో కల్పియు - నీరముజేశిన నిలుకడ నొందును ॥సో॥1॥ ఆధారమునను లేపీ దాని మణిపూరకమున నిల్పీ - ఆగ్నేయంబున కరగగ జేశియు - హంసను ఆత్మలో నైక్యము జేశిన ॥సో॥2॥ కుడినాడిచెపూరించి - అదియెడమచేత రేచించి - నాడినాళముపై నటకుంబించి యు - కడపటహంస చలనము నిల్పిన ॥సో॥3॥ హంసతూలికము నందూ - మదిఆగ్నేయంబున పొందు - సంశయించకను సరగున నెక్కియు - శయనము జేశిన సౌఖ్యములొసగెటి ॥సో॥4॥ యీధర వెలివెర్తందూ అది వేదలు బాపుచునుండూ - సాదుడుయగు రామదాసుడు దలచితె బేదము లణచిన సాధకమంత్రము ॥సోహం సోహం॥5॥

200. ఆదితాళం రాగము: యిందుస్తాని

ఆత్మాబంధువులారా ఐక్యామొందెదనూ- ఆత్మానాత్మలుబాశి అచలామొందెదనూ ॥ప॥ ఆత్మ బందువులారా మీదయపూర్తివుంచుడి పూర్ణమతితో - ఆత్మతత్వము అణగికేవలాత్మలో లయమయ్యె దానిక ॥ఆ॥1॥ గురువులారామంచి గురుపుత్రులార- కరుణించుడికమీరు తిరిగిరానండీ గురుణికృప సంపూర్తివడశియు గుట్టుదెలశియు గురియునిల్పియు - కరువుతీరగ కలశిబయలులో యెరుక మరుపులు యెగినాతరి ॥ఆ॥2॥ సాధులారమంచి సత్పురుషలారా సారమగుబయలందు చేరుండె దాను - సాధనాలన్నియు గోశి నాదుబిందు కళలరోశి - సాదరంబుగ అచలమందే మోదమొందెద ఖేదముడిగియు ॥ఆ॥3॥ స్నానసంధ్యాజపము చాలాయనండీ - మానభిమానములు మరుపాయ నండీ - గ్జానగ్జానము యెరుకమేనితో మానిపాయను పూనబోకను - లేనిపోనియెరుక నెప్పుడు మానిపోయ్యిక శూన్యమాయను ॥ఆ॥4॥ నిందానిందలకెల్లా అందాబోదాయా సందేహములు అన్ని ముందేపోనాయె - అందుయిందుయెందు జూచిన సందులేనిదచలమాయను - అందిపోందీ కుందిచెందీ సన్నుతింపారానిదాయను ॥ఆ॥5॥ కులగోత్రసూత్రములు కూలీపోనాయె కలిమీ లేములుబోయి కలమేలుకాయ - సలలితంబుగ రామదాసుకు సర్వసంకట మొదలిపాయను యిలలోగల వెలివెర్తియందున యిష్టములు సమకూడెనేటికి ॥ఆత్మా॥6॥

201. ఏకతాళం రాగము: మిశ్రా

సమాధిజెందె విధానమున్నది సహజమనస్కంబైయుంటె - సుమారుగురిగని సరానకలవిడి బిరానఅచలంమేల్కంటె ॥ప॥ అనేక దేవతలాశ్రయించకను ఆపరిపూర్ణుని కీలుగంటె - ఆనాది మాయను బిరానబాశియు ఆత్మబ్రహ్మమును తాగంటె ॥స॥1॥ పంచభూతమనె పట్నముబాశియు ఆశిపదార్థమున అణగుంటె - యెంచగ అశిపదమన్నది లేకను నిజమచలంబై నిండుంటె ॥స॥2॥ అయిదు అయిదులు యిరువై అయిదును అంటుబాశియు తానుంటె - యిరువదైదు తత్వముల కావలిది యిసుమంతయ్యిన లేకుంటె ॥స॥3॥ జీవుణి దేవుణి భావమొదలుకొని త్రిగుణాతీతంబై యుంటె - త్రివిధాత్మా అనేదేమిలేక తా తిన్నగ పనితీర్చైయుంటె ॥స॥4॥ షోడశాక్షరి సారముగ్రోలియు సాక్కిసోడశిని వదలుంటె - వేడుక ద్వాదశి మేలుగనియుతా నేననేదేమియు లేకుంటె ॥స॥5॥ లేనిస్వప్నమున నేను నేనుఅనె లేనిపదార్థము లేకుంటె - తానుతానుఅని భేదము జేశె తత్వజ్ఞుడు యెమిలేకుంటె ॥స॥6॥ భావభావమా భావమైనపర బ్రహ్మమందు తానణగుంటె - భావమె బయలనె భ్రాంతులొదులుకొని బాగుగ నిర్భయలైయుంటె ॥స॥7॥ దేహిదేహద్వయ దేబెలుమానీ దేహమందు

వుండి లేకుంటె - విదేహమయ్యి తానిజపదార్థమున లీనమయ్యె మేలుదెలశుంటె !!స!!8!! ధరలో వెలివెర్తీ పురమందున దబ్బరనిజములు దెలశుంటె - వరరామదాసుడనె దేమిలేక నిజరాజ మార్గమున నిముడుంటె !!సమాధి!!9!!

202. జుల్వతాళం: రాగము: యదుకులకాంబోజి

వుదయమాయను గ్నానసూర్యుడు - వూర్ధ్వగిరి ఆగ్నేయమందున- కదశిచిత్కళలంట గమ్మెను వదిలెచీకటియు- బెదిరిపాయను మాయజాలము- కదలితిమిరములెల్లబారెను - చెదరు టెన్నడులేక అచలపదవి మేలుకొనరాజీవా - మేలుకొనరా !!వు!!1!! కమలములు వికశించె ఆరును కాంతికాంతులప్రజ్వలించెను- విమలపదవికి మార్గమాయను భ్రమలుమేలుకొనరా - శ్రమలబాశెటి మార్గమదియని - క్రమముదప్పక పరముజెందియు - అమితమగు నిజదేవునందున స్థిమితమును గనరా - జీవా మేలుకొనరా !!వు!!2!! అరువైఘడియల కిరువదోక్కవెయ్యారునూరుల హంస తరుగగ - వురువడిగ జగయుగములోచ్చియు బరువడిగచనగా - తిరిగిచూడవదేమిచిత్రము పరుగులిడిగురు వరుని కలశియు - కరుణవడశియు పరముకన్గొని త్వరగామేలుకొనరా జీవా !!వు!!3!! హస్తమయములో ఆశగలిగిన - రస్తదెలియక రానుపోనగు సుస్తువదలియు సూటిదప్పక వస్తువనుకనరా - అస్తమించును ఆదిగిరిపై స్వస్తమించు అనాదిగిరీపతి - ఆస్థిరములగు ఆశలో దలియు సుస్థిరుడగమ్మా జీవా మేలుకొనరా !!వు!!4!! సారెసారెకు చలన మొందక - మీరియుండిన బ్రహ్మపదమున - జేరిఐక్యము నొందినిరతము ధీరమేల్కొనరా - ధరలో వెలివెర్తి పురవరుండగు శిరులొసంగియు రామదాసుకు - దురములన్నియు దులిపియెరుకను - దృంచివేశెనట - జీవా మేలుకొనవే !!వుదయమాయెను!!5!!

203. జంపెతాళం రాగము: యదుకులకాంబోజి

మేలుకోయెరుకాత్మ మేలుకోజీవాత్మ - ఫాలభాగమునందులీలాతోను - చాలాగావెలగెటి తేజా మందుననిత్యము మేలుగందువుగాని మేలుకో !!మే!!1!! తెల్లాబారెనుగురుని నిర్మాలాం జనమూచె కల్లలాయను జన్మాఖర్మాములును - అల్లానల్లనమాయచెల్లయ్యి పాయను మెల్లంగ మాయానూ మేలుకో !!మే!!2!! మంటిలోనబుట్టి మంటీలోనపెరగి మన్నయ్యెదెరగీయు మరచి యుండీ - కంటగానకపరమునంటె వారినిజూచి- అంటేరుమాయనుటా మేలుకో !!మే!!3!! నాది నాదియాని వాదుజేశెదవేల - కాదువక్కటితుదకు పోదూవికా - నీదుగ్నాతఖర్మ నిన్నంటివచ్చును ఆదిపర్వమునందూ మేలుకో !!మే!!4!! కల్పాకల్పములెన్నో గడచేనునీవచ్చి - అల్పాగుణంబుచే ఆశ దగిలీ - నల్పులోనయెన్నో కల్పానజేయుచు - నిల్పుమరచితివేరా మేలుకో !!మే!!5!! తొమ్మిదిరంధ్రాల తోలుతిత్తిలమలము - కమ్మియుండిన కర్మామర్మాకొంపా - కమ్మాసూత్రపు బొమ్మకైవాడి ఆత్ముడు బొమ్మాలాడించును మేలుకో !!మే!!6!! పెద్దాలాదూషించె గద్దారిమాటలా - బద్దాలెన్నైనాను ముద్దు గినుచూ - బుద్దిస్థీరములేక రద్దిబెట్టుచుతుదకు - మొద్దయ్యియమునీచె మోసామొందూ !!మే!!7!! జాలాముపగిదీగ జర్గేక్రియలుయింద్రజాలాము యీజగముప్రాణీకోట్లు - జాలామాహింద్రా జాలాకుడును యెంతో - జాలీనొందగ జేయూ మేలుకో !!మే!!8!! గురుకాటక్షంబానె గుద్దాలిచేతాను యెరుకవృక్షమానె యేరూనరకీ - మరువాక వెలివెర్తి మందిరేశుని గొలచీ పరిపూర్ణముననిత్యా మేలుకో !!మే!!9!!

204. తా!!కురుజంపె: రాగము: యదుకులకాంబోజి

సుదతులారసువ్వియానరే సూన్యంపుమాయ - సుదతులారసువ్వియానరే !!ప!! సుదతులార సువ్విఅనరె సుగుణుడైన గురుణిజేరి- అందిపొందిఅచల ఆనందరాశియెందునిల్చి !!సు!!1!! దేహ గుంటరోలుజేశియు గ్నానంబుపూని మోహపాశమెల్ల వూడ్చియు - సోహమనెరోకలిని మానసంబు తోనుబట్టి - ఆహమేమిలేక ఆగ్నేయస్థానమందు నిల్చి !!సు!!2!! పంచభూతమూల వడ్లనూ ప్రాణంబు వడ్లు పంచకోశమూల వడ్లును - సంచితంబులనెటివడ్లు సర్వసంఘమైన వడ్లు ముంచిపోశి దంచిదంచి మంచిగురుణినెంచిచేరి !!సు!!3!! మోసవడ్లు దోసవడ్లునూ మోహంపువడ్లు వాస నొడ్లు దూషనొడ్లునూ - యీషణంబులనెటి వడ్లు యింద్రియంబులనెటివడ్లు - రాశిలోననెరిగెలేక చూచిచూచి దంచుడికను !!సు!!4!! అష్టపాశమూలవడ్లునూ - హంకారమొడ్లు హరి షడ్వర్గమూల వడ్లునూ - అష్టమాదమూలవడ్లు అంతరేంద్రియముల వడ్లు - యిష్టమేమి లేకదంచి శృష్టిక్రియల నెల్లబాశి !!సు!!5!! జన్మఖర్మమనెటివడ్లునూ - జనసంఘమొడ్లు జగమువడ్లు యుగమువడ్లునూ మేనునేను అనెటివడ్లు నాదెసర్వమనెటివడ్లు - రానిపోని కేవలమున శూన్యమయ్యే వున్నదనుచు !!సు!!6!! గ్నానఖర్మమూలవడ్లును - అగ్నానమొడ్లుదాన ధర్మమూలవడ్లునూ - లేనిపోని యెరుకవడ్లు నేనునీవుఅనెటి వడ్లు - తానుఅనెటితత్వమెపుడు లేనెలేదుయనుచు తెలశి !!సు!!7!! సువ్విసువ్వి యిహముపరమునూ సూన్యంపుమాయ సువ్విసువ్వి యెరుకభీజమూ- సువ్విసుదతులార యెరుక రవ్వలేకదంచుడికను సవ్యమైన గురుడుభార దైవమేసత్యంబు యనుచు !!సు!!8!! ఆశలన్నిబాశిద్వాదశీ - మరుగెరగినిలచి నాశరహితస్థానమెరిగియూ - దాసవరదుడైన వెలివర్తీశు పదమునమ్మిరామ - దాసుడన్నమాటనమ్మి ఖ్యాతిగావర్తించుడికను !!సు!!9!!

205. తలుపులు తీశెపాట: రాగము: శ్రీ

కాంతరొవినవే కాంతము కేగను - శాంతితోడతెరువివ్వావె ముక్తి కాంతకవాటము దివ్వావె !!కా!!1!! వింతలుగలమాయ బ్రాంతిలొబడి మనొకాంతకడకె పోవోయీ - ముక్తికాంతను యిటు రాకోయి !!కా!!2!! పంతములేలనె అంతయు నీవని - చెంతకుజేరితి చెలీయాగురు - కాంతివినీలో గలీయా !!కా!!3!! పంచభూతప్రాపంచములో బడ్డ - సంచితుడవు నీవెకావా మాయవంచితుడవు అటుబోరా !!కా!!4!! పంచతాత్వములు మించినగుణములు - అంచయాన నీవుగావా భామవంచన వలదిక లేమా !!కా!!5!! ఖర్మజనిత ఆధర్మప్రవర్తన - సర్వమొదులబోవోయి గురుధర్మము అదిబూనోయీ !!కా!!6!! నిర్మలగురు నిజమర్మము దెలిపెను - సర్వకర్మమార్జించి భామ పరమధర్మమార్జించి !!కా!!7!! విద్యావిద్యల ప్రతిబింబించిన -సోద్యముగల మాయకాడ - నావద్దికి రాకడకీడా !!కా!!8!! విద్యవునీవు అవిద్యల నేనిక - ప్రతిఫలితుడవననేలా - పరిశుద్దునిలో నీవెకావా !!కా!!9!! ఆరుటికంటక మూడుటి మీదుగ - వేరుగవుందుననెరా అంతా నెనని పలకెవుపోరా !!కా!!10!! ఆరుకమల కళ కావలయీవల అంతయునీవె సొరాణి పరకాంతవు పల్లవపాణీ !!కా!!11!! కుండలాగ్రమున మెండుగ వెలగెటి- పండును నేవన్నెకాడ - నాఅండకు రాకడవీలా !!కా!!12!! రేచకపూరక కుంభ కములచే - సూచనహంసచె దాటీ నీవాసమునకు రానుసూటి !!కా!!13!! యోగులకందుదు భోగులదూరుదు - యోగనీష్టదెలియోయీ మాయ భోగనిష్టమానోయీ !!కా!!14!! యోగ భోగములు ఆగమనుచుగురు త్యాగముజేశలవేణి - పరమచలము తెల్పె పువుబోణీ !!కా!!15!! సచలములో వెలి అచలమైయుండిన విశదముగను చలికాడ - నీవశమవుదును స్నేహకాడా !!కా!!16!! ఆవల యీవల యేవల జూచిన -అవరించు కిరవాణి-నీవునేను జనగ సత్యవేణీ !!కా!!17!! వాశియైన గురువాసము జేశియు-మోసమొదలు చెలికాడా -పరవానమొందుగురికాడా !!కా!!18!!

భూసురుడగు రామదాసుడు వెలివెర్తి - యీశుని నమ్మినవాడె - భారదేశికునొదులనివాడె !!కాంతరో!!19!!

206. జోలపాట. ఏకతాళం: రాగము:

జోజోయని జోకొట్టరయా - యీజోలెరిగియు తుదముట్టరయా !!ప!! జోజోయని మాయ జోకలొదులుకొని - జాగులేక గురు జోగినికనుగొని !!జో!!1!! పృధ్విజలంబులో జోయనుడీ యీక్షితి జలమగ్నిలో జోయనుడీ - అతిమతులగ్నిని ఆమారుతములో - గతమని గాలిని గగనములోనిడి !!జో!!2!! మాయలాకాశము జోయనుడీ - ఆమాయనాత్మలో జోయనుడీ - పాయక అంతయు పరములో గలశిన - యేయెడ బయలే యేకమైవుండెను !!జో!!3!! త్రిగుణగుణంబులు జోయనుడీ ఆసుగుణ సుందరిని కాదనుడీ - సగుణ గుణంబులు సమయించియుమహా - సుగుణపదంబున సొంపు వహిపుడి !!జో!!4!! హంసాక్షరములు జోయనుడీ అవి ధ్వంసమయ్యే స్థలమును గనుడీ సంశయమేల సకారముషోడశి - హింసబాపు ఆకారమెద్వాదశి !!జో!!5!! శబ్ధసహితమును జోయనుడీ - నిశ్శబ్ధపదంబెడ బాయకుడీ - శబ్దాశబ్ధము లుబ్ధమయ్యిఘన - అబ్ధిలో మునిగియు అంతయు జోయని !!జో!!6!! జోజోగురునకు జోయనుడీ - రామయోగిబల్కినది జోయనుడీ- జోజోసర్వము జోయని పాడియు జొజొశబ్ధము జోయని మానుడి !!జోజోయని!!7!!

207. ఆదితాళం: మంగళహరతి. రాగము:

మంగళంశుభ మంగళంగురుపుంగవం జయమంగళం !!ప!! అంగలింగా సంగరహిత అచలనిర్గుణ పుంగవం !!మ!!1!! దేహిదేహవిలక్షణం వీదేహమజమచ లక్షణం- ఆహమాస్మిం బ్రహ్మ మనెటి ఆత్మకావలి కీలకం !!మ!!2!! ఆశపాశవినాశకం వుపదేశఘన సర్వేశకం- దోషద్వందాతీత అశిపద దోషరహిత విదూరకం !!మ!!3!! వర్ణ వర్ణ వివర్జితం ఆవర్ణమాకశ మస్థిరం - నిరావర్ణ నిరుపమ దాయకం నిజమచలమేకద సుస్థిరం !!మ!!4!! వాదభెద నివారకం దశనాదమూలమ భావకం - వేదసారతీత రహశ్యము ద్వాదశార్ధసునాయకం !!మ!!5!! భారలింగప్రభువరం బ్రాంతి సర్వ వినాశకం - భారమెరుకని వేదకం వరరామదాస సురక్షితం !!మంగళం!!6!!

208. గుర్వష్టకములు

శ్రీకరాగురుశేఖరా శివ సనకసాది గణస్తుతా -ప్రాకటామహరాజ యోగభవ్యదివ్య సుశీలకా లోకలోకాతీతాసర్వ లోకవందిత పూజితా - రాకపోకలు లేని బయలుల రాజలింగ దయానిధే !!శ్రీ!!1!! తొమ్మిదీ ద్వారముల పట్నము తోలుతిత్తిలో గల్గెరా - సమ్మతంబుగ తండ్రిలేకనె తనయు డొకడు జనించెరా - కమ్మిజాలము జేశిసర్వము కల్పనంతయు జెశెరా - నిమ్మళంబుగ నిజము గాదిది నిత్యలింగ దయానిధే !!శ్రీ!!2!! తనకుమూలము తానె యనుచును తత్వవేత్తలు అందరూ తనకుమూలము తండ్రిఅనియెరు తత్వహీనులు యెప్పుడు - తాతతండ్రియు తనయుడొక్కడె తానె అయనుచూడగా - లేనితాను పూనికెట్లగు రానిబయలు దయానిధే !!శ్రీ!!3!! తండ్రికిని నీవు సుతుడవైతివి తండ్రికేతండ్రైతివీ - తల్లికిని నీవు సుతుడవై వఘతల్లికిని మొగడైతివీ - తల్లితండ్రులు లేక వాంతర తత్వమైకలిగుంటివీ - పుల్లమందునజూడ పుత్తమ పూర్ణలింగ దయానిధే !!శ్రీ!!4!! విత్తులేనిచెట్టు వక్కటి వింతవింతలు కల్గెనూ - వింతగాశాకోపశాఖలు వీధివీధి వహించెనూ - వంతుగాకులు పుష్పఫలములు వసుధలో వ్యాపించెనూ - సంతతంబును నీదు శేవకు సమసుసత్య దయానిధే !!శ్రీ!!5!! మూడుమూలల పెట్టెతాళము మూలమెరిగియు తీశితే - ముఖ్యమైనా నాతి

వున్నది ముద్దుగను పెండ్లాడితె - ముద్దులాడితో కేళిదేలితె ముఖ్యబాలుడు కల్గునూ - ముక్తిమార్గము కల్గజేసును మూర్తిలింగ దయానిధే !!శ్రీ!!6!! కాళ్లులేనీవాడు అంతట గమనమును గావించెనూ కరము లేమియు లేనివాడు కార్యములు గావించెనూ - కండ్లుచెవులూ లేనివాడు కనుటవినుట ఆయనూ - కల్లగాదిది ఆర్యులకును తెల్లమవును కృపానిధే !!శ్రీ!!7!! వుత్తబట్టాబయలు లోపల వుత్తపామొకటాయనూ - అత్తుకొని వకచీమమ్రింగెను అతివిచిత్రము చూడగా - వుత్తమంబగు పంచపక్షులు వునికి బయలటుజెశెనూ - మత్తగలమనుజులకు దుర్లభమాయ మహిమ దయానిధే !!శ్రీ!!8!! పుట్టలోపల రొండుపాములు భుస్సుభుస్సును చుండును - పట్టబోయితె అయిదు పాములు పడిగె లెత్తుచునాడునూ - ముట్టడేసుక పక్షివక్కటి అట్టహసము జేసునూ - పట్టువదలక నున్న దచలము భారలింగ దయానిధే !!శ్రీకరా!!9!!

గద్య!! ఇతిశ్రీమద్వేదాంత సారుండును - సచ్చిదానందతీతుండును -క్షేత్రక్షేత్రగ్న రహితుండును క్షరక్షరోపాది విలక్షణుండును - ప్రకృతి పురుష ద్వయదోష రహితుండును - పరమపవిత్రుండును అశేరీరుండును - అప్రమేయుండును - అచలుండనైన - శ్రీమత్ భారలింగదేశికేంద్ర నిజగురు చరణకమల కురువిందారువింద మరంద పానతుందిలతా - మందమందానంద మిళింద బృందంబున - అన్నమరాజవంశోద్భవ భరద్వాజసగోత్ర పవిత్రకుండగు వెలివెర్తిరామబ్రహ్మ ప్రణీతం బైన నిర్గుణగురుస్తవము శ్లోకములు మానసపూజ పద్యములు కీర్తనలు గురుభజన కీర్తనలు ద్విపదవాఖ్యము ప్రార్ధన హరిభజనకీర్తనలు ద్విపదమూడుభాగములు పరిపూర్ణ తత్వకీర్తనలు సర్వంబును సంపూర్ణము

శ్రీఅచలగురు చరణారవిందార్పణమస్తు

శ్రీస్వగురు పరమగురు పరమేష్టిగురు-నిజగురు చరణారవిందాభ్యోనమ:

# శ్రీగురుపూజ విధానం ప్రారంభ:

శ్రీమత్ భారలింగదేశికేంద్ర స్వగురు పరమగురు పరమేష్టిగురు సద్గురు జగద్గురు మద్గురు నిజగురు దేవతాభ్యోనమ:

హృదయాచలమధ్యస్తం-సర్వాంతర్యామినంశుభం-ధ్యాయామి సర్వలోకేశం-భక్తాభీష్ట ఫలప్రదం!!1!!

శ్రీమ:ఇతి ధాన్యం సమర్పయామి:

అవాహయేజ్జగన్నాథం శంకరం లోకశంకరం - యద్విజ్ఞానాన్భవేద్దివ్యం చక్షుర్భాణాం మహత్మనాం !!2!!

శ్రీమ:ఇతి అవాహనం సమర్పయామి:

వజ్రవైఢూర్యముక్తాభి - స్థగితం కాంచనం మహత్తు శింహ్మాసనం మయాదత్తం గృహాణ సురపూజిత !!3!!

శ్రీమ:ఇతి రత్నసింహ్మాసనం సమర్పయామి:

పాదోదకం మహదేవ-నానాసింధు సమాహృతం-గృహాణదేవదేవేశ భవబంద విమోచక !!4!!

శ్రీమ:ఇతి పాదయో పాద్యం సమర్పయామి:

అర్ఘ్యం తేహ్యం ప్రదాస్వామి - సుగందంచ మనోహరం గృహ్యాతాం శ్రీగురోతుభ్య-త్వయా నిర్మలచేతసా !!5!!

శ్రీమ:ఇతి హస్తయో ఆర్ఘ్యం సమర్పయామి:

భాగీరతీచ యమునా భారతీచోత్తమా భువీ-సద్యస్నాభ్యస్యమానీతం జలమాచమనం కురు !!6!!

శ్రీమ: ఇతి ముఖాచమనియ్యం సమర్పయామి:

దదిక్షీరఘృతోపేతం-శర్కరామధుసంయుతం పంచామృతం స్నాపయామి గృహ్ణాతా భక్తవత్సల !!7!!

శ్రీమ: ఇతి పంచామృతస్నానం సమర్పయామి:

పార్ధత్రికోటి తీర్థేభ్యసమానీతం జగత్పతే స్నానార్థం తవయేత్నేన స్వీకురుష్వ శివంజలం !!8!!

శ్రీమ: ఇతి శిద్దోదకస్నానం సమర్పయామి:

దివ్యపీతాంబరం తుభ్యమమూల్యథీయ తేధునా - గృహిత్వాధార్యతాం క్షిప్రం-భక్తకల్ప ధృమా నఘ !!9!!

శ్రీమ: ఇతి అభివస్త్రంసమర్పయామి:

జగన్నాటకసూత్రస్య తవదాస్యామియత్నత:-బ్రహ్మ సూత్రం సువర్ణేన నిర్మితం గృంహ్యతాం త్వయా !!10!!

శ్రీమ: ఇతి సువర్ణ యోజ్ఞోపవీతం సమర్పయామి:

కాంచనం మకుటం దివ్యం-కుండలంచాంగదేశుభే-ముక్తాహరాణ్య నేకాని-నానా రత్నమయానితె ‼11‼

శ్రీమ: ఇతి సర్వాభర్ణం సమర్పయామి:

మలయాచలసంభూతం-ఘనసారేణ సంయుతం-కస్తూరి మిశ్రితం దివ్యం-చందనంతే దదామ్యహం ‼12‼

శ్రీమ: ఇతి సుగంధచంధనం సమర్పయామి:

అక్షతాన్ ధవళాన్ దివ్యాన్ - శాలీతండులమిశ్రితాన్ - హరిద్రాచూర్ణ సంయుక్తాన్ ధదామిసుమనోహరాన్ ‼13‼

శ్రీమ: ఇతి అక్షతాన్ సమర్పయామి:

కరవీరైర్జాజికుసుమై శ్చంపకై కేతకీసుమై - పున్నాగమల్లికాజారై రర్చయామి సుగంధభి: ‼14‼

శ్రీమ: ఇతి నానావిధ పరిమెళపత్రపుష్పాణీం సమర్పయామి:

శ్రీమ:అథఅష్టోత్తర శతనామానిలిఖ్యంతే

| | | | |
|---|---|---|---|
| 1 | ఓం నిజగురు పరబ్రహ్మణేనమ: | 21 | ఓం నిరాభ్యాసాయనమ: |
| 2 | ఓం నిరాకారాయనమ: | 22 | ఓం నిరుపద్రవాయనమ: |
| 3 | ఓం నిర్వికారాయనమ: | 23 | ఓం నిర్మోహాయనమ: |
| 4 | ఓం నిర్వికల్పాయనమ: | 24 | ఓం నిర్వచనాయనమ: |
| 5 | ఓం నిరంజనాయనమ: | 25 | ఓం నిర్దేక్షాయనమ: |
| 6 | ఓం నిర్వ్యయాయనమ: | 26 | ఓం నిరపేక్షాయనమ: |
| 7 | ఓం నిర్వ్యాజ్యాయనమ: | 27 | ఓం నిర్మోక్షాయనమ: |
| 8 | ఓం నిరాలంబాయనమ: | 28 | ఓం నిరాభ్యాయనమ: |
| 9 | ఓం నిరాధారాయనమ: | 29 | ఓం నిరామయాయనమ: |
| 10 | ఓం నిర్వ్యాపకాయనమ: | 30 | ఓం నిరాత్మనేనమ: |
| 11 | ఓం నిరావర్ణాయనమ: | 31 | ఓం నిర్మాతాయనమ: |
| 12 | ఓం నిర్విశేషాయనమ: | 32 | ఓం నిర్మలాఖండాయనమ: |
| 13 | ఓం నిర్దోషాయనమ: | 33 | ఓం నిరాభాసాయనమ: |
| 14 | ఓం నిర్భేదాయనమ: | 34 | ఓం నిర్గమాయనమ: |
| 15 | ఓం నిర్బాదాయనమ: | 35 | ఓం నిజధర్మాయనమ: |
| 16 | ఓం నిర్వేద్యాయనమ: | 36 | ఓం నిరహంకారాయనమ: |
| 17 | ఓం నిర్వాదాయనమ: | 37 | ఓం నిర్రసాయనమ: |
| 18 | ఓం నిర్వేదాయనమ: | 38 | ఓం నిరంతరాయనమ: |
| 19 | ఓం నిర్వాసనాయనమ: | 39 | ఓం నిర్భోగాయనమ: |
| 20 | ఓం నిర్మాలాయనమ: | 40 | ఓం నిర్యోగాయనమ: |

41 ఓం నిర్ధరాయనమ:
42 ఓం నిర్జలాయనమ:
43 ఓం నిశ్తేజాయనమ:
44 ఓం నిర్మారుతాయనమ:
45 ఓం నిర్గగనాయనమ:
46 ఓం నిర్బరాయనమ:
47 ఓం నిర్భయాయనమ:
48 ఓం నిర్గందాయనమ:
49 ఓం నిరేంద్రియాయనమ:
50 ఓం నిర్భూతాయనమ:
51 ఓం నిర్ద్వంద్వాయనమ:
52 ఓం నిరుపమాయనమ:
53 ఓం నిర్విషయాయనమ:
54 ఓం నిర్వాసాయనమ:
55 ఓం నిర్మాయాయనమ:
56 ఓం నిష్కామ్యాయనమ:
57 ఓం నిష్క్రియాయనమ:
58 ఓం నిష్కర్మాయనమ:
59 ఓం నిష్కళాయనమ:
60 ఓం నిష్కళాంకాయనమ:
61 ఓం నిష్ప్రపంచాయనమ:
62 ఓం నిష్కరాయనమ:
63 ఓం నిస్సంగాయనమ:
64 ఓం నిర్జీవాయనమ:
65 ఓం నిజనాథాయనమ:
66 ఓం నిజపరాయనమ:
67 ఓం నిజతేజాయనమ:
68 ఓం నజాయనమ:
69 ఓం నిశ్శేషాయనమ:
70 ఓం నిశ్చింతాయనమ:
71 ఓం నిజకేవలాయనమ:
72 ఓం నిర్లక్షాయనమ:
73 ఓం నిర్లేపాయనమ:
74 ఓం నిత్యతృప్తాయనమ:
75 ఓం నిత్యకల్యాణాయనమ:
76 ఓం నిత్యాయనమ:
77 ఓం నిత్యశుద్దాయనమ:
78 ఓం నిత్యబుద్దాయనమ:
79 ఓం నిత్యముక్తేశ్వరాయనమ:
80 ఓం నిత్యసత్యాయనమ:
81 ఓం నిర్వాచాయానమ:
82 ఓం నచలాయనమ:
83 ఓం నమలాయనమ:
84 ఓం నప్రమేయాయనమ:
85 ఓంనాదిమధ్యాంతసూన్యాయనమ:
86 ఓం నిర్వేదాయనమ:
87 ఓం నిగమాగమస్తుతాయనమ:
88 ఓం సర్వాధారాయనమ:
89 ఓం నిర్మదమాత్సర్యాయనమ:
90 ఓం సనాతనాయనమ:
91 ఓం నిష్కల్మషాయనమ:
92 ఓం నిర్వేషాయనమ:
93 ఓం సచ్చిదానందవర్జితాయనమ:
94 ఓం నిర్ముక్తాయనమ:
95 ఓం నిర్ధ్యేయాయనమ:
96 ఓం నిష్కపటాయనమ:
97 ఓం నిర్వాశితాయనమ:
98 ఓం నిత్యానందాయనమ:
99 ఓం నిర్భావాయనమ:
100 ఓం నిర్జగాయనమ:
101 ఓం సదసదృశాయనమ:
102 ఓం సర్వాతీతాయనమ:
103 ఓం సాక్షాత్పరాయనమ:
104 ఓం నిర్లోకాయనమ:
105 ఓం నిర్దశాయనమ:
106 ఓం నిర్జనితాయనమ:
107 ఓం నిరామృతాయనమ:
108 ఓం సద్గురవేనమ:

## శ్రీమ: సర్వాంగపూజా

| | | |
|---|---|---|
| 1 | తీర్థపాదాయనమ: ఓం | అంఘ్రిం పూజయామి |
| 2 | నిగమమంజీరాయనమ: | ఘటికా: పూజయామి |
| 3 | స్మరతూరుణీరజంఘాయనమ: | జంగం పూజయామి |
| 4 | ముక్తికాంతసేవితాయనమ: | జానునీం పూజయామి |
| 5 | రత్నస్తంభోరుయుగళాయనమ: | ఊరుం పూజయామి |
| 6 | పులినతలజఘనాయనమ: | శ్రోణిం పూజయామి |
| 7 | మణికాంచిత కలాపశోభితాయనమ: | జఘనం పూజయామి |
| 8 | విశ్వోధరాయనమ: | కుక్షిం పూజయామి |
| 9 | దయార్ద్ర హృదయాయనమ: | హృదయం పూజయామి |
| 10 | ప్రశస్తవక్షాయనమ: | ఊరూస్థలం పూజయామి |
| 11 | త్రిరేఖాసాయనమ: | గళౌ పూజయామి |
| 12 | వరదారదురీణాయనమ: | పాణిం పూజయామి |
| 13 | ఊన్నతస్కందాయనమ: | భుజౌ పూజయామి |
| 14 | ప్రసన్న వదనాయనమ: | వచనం పూజయామి |
| 15 | చంపకనాసాయనమ: | గందవాహనం పూజయామి |
| 16 | పల్లవాధరాయనమ: | ఓష్టం పూజయామి |
| 17 | పుండ్రైక్షకార్ముకభృవేనమ: | భ్రూవోర్మధ్యం పూజయామి |
| 18 | కృపాకటాక్షవీక్షాణాయనమ: | లోచనం పూజయామి |
| 19 | కృష్ణ కర్ణాయనమ: | శోత్రం పూజయామి |
| 20 | రాకాసుదాంశు ముఖాయనమ: | ముఖం పూజయామి |
| 21 | సులలాటాయనమ: | అలికం పూజయామి |
| 22 | సుహృత్తచిత్తమూర్ధిజాయనమ: | మస్తకం పూజయామి |
| 23 | నీలకుంచిత మస్తకాయనమ: | కుంతలం పూజయామి |
| 24 | సర్వాత్మనేనమ: | సర్వాంగ పూజయామి |

## అధపత్రపుష్పం సమర్పయామి:

| | | |
|---|---|---|
| 1 | శ్రీమస్సచ్చిదానందతీతాయనమ: | బిల్వపత్రం సమర్పయామి |
| 2 | నిగమాగమవందితాయనమ: | తులశీపత్రం సమర్పయామి |
| 3 | క్షరాక్షరవిలక్షణాయనమ: | చామంతికా పుష్పంసమర్పయామి |
| 4 | హరిహరాదిసురశేవితాయనమ: | అతశీపుష్పం సమర్పయామి |
| 5 | ప్రకృర్తిపురుష రహితాయనమ: | పారిజాతపుష్పం సమర్పయామి |
| 6 | మణికాంచిత ప్రకాశాయనమ: | మాలతీపుష్పం సమర్పయామి |
| 7 | అవాంగ్మానస గోచరాయనమ: | అశోకపుష్పం సమర్పయామి |
| 8 | విమలాయనమ: | మలయపుష్పం సమర్పయామి |
| 9 | కరుణాకటాక్ష విక్షణాయనమ: | కరవీరపుష్పం సమర్పయామి |

| | | |
|---|---|---|
| 10 | లింగాంగభంగాయనమ: | మల్లికాపుష్పం సమర్పయామి |
| 11 | ప్రణవాతీతాయనమ: | పాటలీపుష్పం సమర్పయామి |
| 12 | పరమపవిత్రాయనమ: | పున్నాగపుష్పం సమర్పయామి |
| 13 | అనంతకల్యాణ శోభితాయనమ: | బహుళపుష్పం సమర్పయామి |
| 14 | అప్రమేయాయనమ: | కేసరిపుష్పం సమర్పయామి |
| 15 | క్షేత్రక్షేత్రయోరం న్యాయనమ: | చంపకపుష్పం సమర్పయామి |
| 16 | నిత్యానిత్యసత్యాయనమ: | నీలోత్పలపుష్పం సమర్పయామి |
| 17 | వుత్తమోత్తమాయనమ: | వకుళపుష్పం సమర్పయామి |
| 18 | ఖండాఖండవర్జితమండలాయనమ: | కుముదపుష్పం సమర్పయామి |
| 19 | పరాత్పరాయనమ: | జాజిపుష్పం సమర్పయామి |
| 20 | ఆదిమధ్యాంతశూన్యాయనమ: | కేతకీపుష్పం సమర్పయామి |
| 21 | భక్తవత్సలాయనమ: | కుసుంబాపుష్పం సమర్పయామి |
| 22 | భావాభావగమ్యాయనమ: | కలహరపుష్పం సమర్పయామి |
| 23 | నిజాయనమ: | శతపత్రపుష్పం సమర్పయామి |
| 24 | నిజకేవలాత్మాయనమ: | సువర్ణపుష్పం సమర్పయామి |

ఇతినానావిధపరిమెళ పత్రపుష్పం సమర్పయామి

దివ్యపాదపసంభూతై-సుగంధస్సహితశ్శుబై అఘ్రాతుంధీయతే ధూపం గురోశ్శీకురుతం ముదా !!15!!

శ్రీమ:ఇతిధూపమాగ్రాపయామి:

గొఘృతేనసమాయుక్తం-వత్తిత్రయసంయ్యుతం దర్శయామిహితే దీపం ప్రశీదకృపయా గురో !!16!!

శ్రీమ:ఇతిదీపం సమర్పయామి

ఖర్జూరంనారికేళంచ-పనసామ్రఫలాధికం-సుపక్వ కదళీద్రాక్ష మర్పమామిఫలానితే !!17!!

శ్రీమ: ఇతిఫలోపహరనైవేద్యం సమర్పయామి

సితయారచితైర్థివైభక్షైశ్చఘృతపాచితై-షడ్రసైస్సహితంభోగ్యం నైవేద్యంతే ర్పయాంమ్యహం !!18!!

శ్రీమ: ఇతిమహానైవేద్యం సమర్పయామి

సుగంధం సుఖదం శీతం-దేవశింధుసమాహృతం-పానీయం గురువేతుభ్యం మద్యేమద్యే నమాంమ్యహం !!19!!

శ్రీమ: ఇతిమద్యేమద్యేపానీయం సమర్పయామి

కటాక్షజనితాశేషం-గ్నానకల్పద్రుమాయచ-నీరాంజనం ప్రదాస్వామి నిత్యకల్యాణదాయినే !!20!!

శ్రీమ: ఇతి మంగళనీరాజన దీపం సమర్పయామి

ఏలాశలాటికాయుక్తం-లవంగక్రముకైర్యుతం-లవలీపత్ర సంయుక్తం తాంబూలం శ్వీకురు ప్రభో !!21!!

శ్రీమ: ఇతి తాంబూలం సమర్పయామి

యస్యసందర్శనశ్వరిర్శం-భాషణాశ్రయణాదరం-సంజాతగ్నాన చక్షుస్సన్-నభవాయోపకల్పతే !!22!!

శ్రీమ: ఇతి సువర్ణపుష్ప దక్షణాం సమర్పయామి

తస్మైభక్తహృదంభోజ-వాసనేగురువేపున:-సువర్ణ నిర్మితం మంత్రపుష్పం భక్తార్పయామ్యహం !!23!!

శ్రీమ: ఇతి సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి

అనేకజన్మ సంపాద్యం-యేత్పాపం శ్రీగురోతవ-కృపయొన్మూలితం చాద్య-భవాబ్ది:ప్లావితో మయా !!24!! తస్మాతేడ్యకరిష్యామి-ప్రదక్షణశతంమహు: యదస్తిహ్యపరాదమ్మే క్షంత్తుంతత్వ మిహ హన్సి !!25!! రామదాస మిదం రచిత గురుపూజ విదాయకం-దేశికాచార్య సిద్యేర్థం-తస్మై గురు నమోనమ: !!26!!

శ్రీమ: ఇతి ఆత్మప్రదక్షణ నమస్కారం సమర్పయామి

గద్య!! అన్నమరాజవంశోద్భవుండును భరద్వాస గోత్ర పవిత్రుండును నైన అనంతకృష్ణయ్య తత్పత్ని సరస్వతమ్మ పతివ్రతామణి పుత్రుండును భారలింగ దేశికేంద్ర అచలగురు చరణ కమల సేవితులలో నోకండైన వెలివెర్తి రామదాస విరచిత సంస్కృత గురుపూజ విధానము సర్వము సమాప్తం

స్వగురు చరణారవిందార్పణమస్తు

# ప్రకృతి పురుష రహిత కందార్థదర్వులు

శ్రీఅచలభోద గురుపరంపర

కృతాయుగ గురుపరంపరాభీ వర్ణనం

క!! శ్రీఅచలగురు పరంపర - సృష్టికి పీఠంబు ఆది సిద్ధము బయలై - అద్దంబువలెనువుండగ శుద్ధబ్రహ్మంబుతోచే !!దర్వు!! సుమ్మందులోనూ తోచెనుచూడా సిద్ధాముతోనూ - సద్దుసేయకనుండె సంపూర్ణా బయలూలో - శ్రద్ధాలేకనె శబ్దాముద్భావమాయెను - సుమ్మ !!1!!

హరునకు నిర్గుణబ్రహ్మము- వరమొసగిఅనుగ్రహంబు వరుసతొనిచ్చెన్-కరుణను బొందియు శివుడై- సురలకు అసురులకుచూడా !!దర్వు!! ధీరుడాయెనూ- లయమునుజేయా శూరుడాయెను సరసాముతో సర్వాశక్తి మోహించియూ మురయూచు వామాంకమునజేరి మ్రొక్కాగా !!ధీరు!!2!!

ఆనిర్మలగురుబోధను- వినివిష్ణువు అమితమైన గుణుడైనిలచీ - మాన్యతనొందియు సృష్టీని పూనియు పోషింపుచుండే !!దర్వు!! మానుగావినుడీ- మరిఅందరిలో ఘనుడూగాగనుడీ- పని బాడి వరలక్ష్మి పరకాంత యనబడియు - వినుతిశేయుచుతానూ విడువాక యున్నాది !!మాను!!3!!

నారాయణమూర్తియు తను - రారాయని బ్రహ్మకిచ్చె మరి అధికారం - చేరియుచేకొని నిల్వక నేరుపుతో కల్పనంతా !!దర్వు!! పూరాజేయుచునూ సృష్టినియెంతో మీరాజేయుచునూ - దారాయై శారదదాసత్వమును జేయా - మెరూవగిరియెందూ చేకోని సృష్టినీ !!పూరా!!4!!

చతురువిధంబుల సృష్టిని - చెశెటి బ్రహ్మభయమిచ్చె చెందెవశిష్టా ఖ్యాతియుగాంచియు గురువని - ప్రీతితో రవిశిష్యుడాయె !!దర్వు!! చేతోమోదమునా పొందెనుబోధా యెంతోమోదమునా -మాతంగునీ పుత్రి మరియూనారుంధతిని - సతిగా వరించీయు హితబోధలును జేశె !!చేతో!!5!!

భానుడు బ్రహ్మాండమునకు బాగుగ తేజంబునిచ్చి ప్రబలుచు నుండన్ - మానుగచీకటి బాపును మానితముగ యార్ఞవల్క్ !!దర్వు!! మరిఆశ్రాయించే మక్కువతోడ మరియూ బోదించే వరముకుపాత్రుడై సరసాముపొందీయు- మరియు జనకాదులకు మార్గాము దెలుపూచు !!మరి!!6!!

వరయాజ్ఞవల్కికరుణను- ధరియించియుజనకరాజు ధన్యతనొందెన్ - గురువధికార మొన ర్చగ - మరిపొందియు మాయయెరుకా !!దర్వు!! మంటాకయుండెన్- అచలమునొందీ జంటా లేకుండెన్- వింటిరాఅన్నియు అంటిఅంటాకచేశి- వంటిగాడయ్యెయెదంటాని మహిమూడై !!మ!!7!!

త్రేతాయుగగురు పరంపర

జనకమహరాజునుమరి- అనిశంబునుఅచలుడయ్యి అణిగుండగనూ జనములుపొగడుచు నుండగ - వినుతించియు శ్రీశుకుండూ !!దర్వు!! వినుతూలోనార్చె - సద్గురువాని ప్రణుతూలోనార్చె ఘనబొధా నొందీయు ఘనుడయ్యినిలచియు - వినుడిఅధికారాము విశ్వాసించియు వేగా !!విను!!8!!

శ్రీశుకుని శరణమొందియు -శిద్ధుడునిర్వాసనుండు శిష్యుండయ్యెన్ - వాశగుపరి పూర్ణంబును- ఆశించెనుఆదిరీతి !!దర్వు!! అతిదాయాతోడన్ బోదించెను సాధనాలీడన్ -నాధా తీతంబైన నచలాభావంబూనూ - బోధాజేశియు మాయావెధాలన్నియు బాపె !!అతిదాయ!!9!!

ఆనిర్వాసనమౌనికి - మానితముగ అచల ఋషియు మరివినుతియించీ మేనేమిలేనిదాని మానుగ బోధించుమనుచూ !!దర్వు!! మరియూ వేడగనూ వుపదేశాము కరుణాతోడుతనూ అరమారలేకాను అచలాసొర్ణయుజేశి - సరగూనాశీర్వాదమును యిచ్చెమురయూచు !!మరి!!10!!

నిత్యనిరంజనరుషియును- అత్యుత్తము వోర్పుతోను ఆఅచలునకున్ హితమతితో శేవించగా మతిమంతుడు అనుచుబోధా !!దర్పు!! యెన్నాగనీచ్చె - సన్నుతిజేయా మన్నానహెచ్చే - వున్నాది పరిపూర్ణమూహాతో కనుపరచి - యెన్నాశెక్యముగాని అచలామందుననిల్పి !!యెన్నాగా!!11!!

రంజనలేకనువుండె - నిరంజనబుషి నిశ్చలమున నిరుపమఘనుడై - సంజీవనమను బోధను - ఆంజనముగ జేసుకోని !!దర్పు!! అమలామైవుండే - అంతానంతా అధికామైవుండే సమయాము తోడూత సాందీపబుషిజేరి - విమలాకాటక్షంబు వీడ్కోని క్రమమూతో !!అ!!12!!

ద్వాపరగురుపరంపర

తారక సాంఖ్యమనస్కము - సారంబగు సర్వవిద్య సకలధికారం - బారయ పరిపూర్ణంబును నేరుపుతోనెరిగియుండే !!దర్పు!! నెలమితోడుతనూ - సాందీపుడు బల్మితోడుతనూ - కలిమిలేముల నుండె కనుపించెయెరుకాను - కలనైనాయెరుగాక - కాంతికాంతులమీరి !!నెలమీతో!!13!!

అచలుండగు సాందీపుణి - విశదంబుగ జేరికొలచి వినుతులొనర్చి కుశలుండగు కృష్ణం డును - అసమానపు విద్యలన్ని !!దర్పు!! అన్యభ్యాసించే హరితానయ్యి కొన్యభ్యాసించే- వున్నాద చలంబాని వుత్తామును దెలశి- అన్నీవీడియుతాను -అచలూడై యుండియూ !!అన్యభ్యాసించే!!14!!

శ్రీకృష్ణమూర్తి వరసతి శ్రీరుక్మిణిఅమ్మవారు -శిరులలరంగా -శ్రీపతికరుణకుపాత్రై -శీఘ్రమె పరిపూర్ణభావా !!దర్పు!! శిద్దీయునొందే - శిరితానయ్యి -బుద్ధిచేన్నొందె - వద్దీకతోడూత వరుణీకి వాశియై -దిద్దీతీర్చిన బోధాదివ్యాశుద్దాత్మాయై !!శిద్దీయునొందే!!15!!

శ్రీకృష్ణమూర్తిబోధను చేకోనెనాయుద్దవుండు చలగర్జనుడూ - సాకార రహితమయ్యిన యేకత్వము -స్వామికృపతో !!దర్పు!! అచలాముదెలశీ - ఐక్యంబయ్యి సచలాముగెలచీ - వచనాము లేనీది వైకుంఠపదమాని - సూచానాయను కృష్ణాశుద్దాపురుషుని తోడ !!అచలాముదెలశీ!!16!!

యుద్దవప్రియుడగు శిష్యుడు - శిద్దుడు అచలావధూత చిన్మయగతుడై - ముద్దుగను భక్తిజేశియు- రద్దియుగల యెరుకబాశే !!దర్పు!! రాజీతోడుతనూ -సద్గురుమూర్తి రాజైయుండగనూ పూజజేశియు అన్ని మేలూసామార్పింపా-రాజీజెందియు గురుడూ అభయమోసంగెను !!రాజీ!!17!!

కలియుగమునకును ఆదియు -సలలిత అచలావధూత స్వాములగొలచీ -కలమేలుకొనెను యెరుక - ఫలమేమియు గోరనట్టి !!దర్పు!! నమలాతేజుండూ -బ్రహ్మానందవిమలానాభుండూ బ్రమలాయెరుకను బాశిశ్రమలేని బాటెరిగీ-క్రమమూతో వెల్లాడి గావించెబోధాను !!నమలా!!18!!

కలియుగ గురుపరంపర.

బ్రహ్మానందస్వామియు- బ్రహ్మాంబైయుండగాను బాగుగ అమలా -నందుడు భ్రమ లుడుగుటకై బ్రహ్మానందులను జేరి !!దర్పు!! బాగానూతించే- ఆస్వామీయూ భయమొందా కనియె వేగామె పిలచీయు వేదాంతరహస్యాము - బాగాభోధించీయు భారాము వుంచేను !!బాగానూ!!19!!

అమలానందస్వామికి- క్రమముతో శుశ్రూషజేశి కరుణవడశియున్- భ్రమలన్నిబాశి నిలచెను బాగుగసంపూర్ణభావా !!దర్పు!! నందూలావారూ - పరిపూర్ణచలా నందామువారూ - యిందు అందనకాను యెందునిండినదాని - పొందీరందియు లేకానందామయ్యిన పూర్ణ !!నందూ!!20!!

దత్తానందస్వామియు -వుత్తముడగు పూర్ణానంద వుచితుని జేరీ -మత్తను బాపనివేడిన సత్తతో సంపూర్ణభోధా !!దర్పు!! సరగూనానీచ్చె- సంకటమూలు తొలుగా తానీచ్చె- పరమ దయామృత

వరుసాము గురిపించి-విరసాములేనెరుకా విడిపించి అభయాము !!సరగూనా!!21!!

శ్రీదత్తానందుండును-శిరియగు సద్బోదపూని స్థిరమైవుండెన్- సదనంబుకు వకఘనుడును యిదెవచ్చెను చూడుమదుగో !!దర్వు!! వసుదాలోపలనూ- రామానందావర స్వాములిలనూ విశదా ముతో అచలవిధమంతా దెలపీయు- రశికూడావనిగురుడూ రాజాకంకణమిడియె !!వసు!!22!!

రామానందస్వామియు - రాజిగబ్రహ్మైక్యమందురాజైయుండే - నేమంబుగ గ్నానేశ్వర స్వామియు మరిఆశ్రయించే !!దర్వు!! సద్గూరుడనుచూ కబీరుదాసు మద్గూరుడనుచూ - చెలీ లిరువురు వార్ని చేలీసేవించియు - సద్గూరు కరుణాసంపూర్తి గభయమునొందీ !!సద్గూరు!!23!!

గ్నానానందస్వామియు-మానుగ గురువాఖ్యమమరి మరిబోధించెన్- దీనుడు వీసో బార్యులు మానితముగ చేరివేడే !!దర్వు!! మరిదయగలుగన్ - మక్కువతోడ మరి భ్రమదొలుగన్ శిరమూనందున కరము శీఘ్రామెనుంచీయు- మరువాకబోధించె పరిపూర్ణసాగ్నాయు !!మరి!!24!!

పరిపూర్ణభావమొందియు - పరమరహస్యంబు బయలు ప్రకటించుటకై - అరమరలేకను వుండగ- సరగున సహజనంద !!దర్వు!! వారాటకొచ్చెన్ - శరణనిమ్రొక్కె మరిభక్తిహెచ్చం - కరుణా కటాక్షాము కడగంటితో జూచి- స్థిరపాదమును యిచ్చీ- వరఆభయామొసగెను !!వారాట!!25!!

సహజానందులవారును - ఆహమెరుకను అణచివేశి అచలుండయ్యా -సోహంభావము లేకను మోహములనుతెంపివేశి !!దర్వు!! నిక్కాముగుండెన్-రామావదూత గ్రక్కూనవచ్చెన్ చొక్కా మగు బోధాను సొంపూగనెరిగీయూ - మక్కువగురుకరుణ మరివడశి నిలచీయు !!నిక్కా!!26!!

అచలమువిశదంబెరిగియు - సచలముకడద్రోచి నిత్యసంపూర్ణుండై - వచనము లేకను వుండెను- విశదము రామావధూతా !!దర్వు!! విగ్రాహముండే- సుబ్రహ్మణ్యానుగ్రాహమొందే ఆగ్రహ మైయున్నా నట్టిచీదాగ్నినీ - ఆగ్రాహమణచియు అభయాదానంబిచ్చే !!విగ్రాహ!!27!!

బంగారువంటిబోధయు - సంగ్రహమును జేశి యెపుడు - భంగములేకన్ మంగళకరముతో నుండెను - రంగుగవేమన్న జేరె !!దర్వు!! యింగీతముగనూ - రంగగుబోధా సంగాతిగనెనూ - శృంగారమగు పదవీ సూటీనెరిగించీయు- అంగాలింగములేని సంగాతినెరిగించె !!యింగిత!!28!!

వేమన్నగురువరుండును -కామంబులనెల్ల బట్టి ధూమముజేశీ - ప్రేమలుబాశియునుండిన నేమముతోమారూనూరు !!దర్వు!! నంబీగారొచ్చెన్-సద్భక్తియు కుంభీణీయేచ్చన్-సంభావభావమూల సంకాట మొదలీయూ - సంబ్రాముతో గూరుసాన్నిధ్యమును జేయా !!నంబీగారోచ్చెన్!!29!!

ఆమారునూరునంబియు - నామమురూపంబులేని నచలంబయ్యా - ధాముండైయుండ కడకును - బ్రామికలను బాయవచ్చె !!దర్వు!! బాగూతోడుతనూ -తిరువెంకాట -యోగీవోరుడునూ సాగీలిపడి మ్రొక్కెసంపూర్ణ భాక్తితో - జాగులేకను పాలీపూర్ణ బోధయునిచ్చె !బాగూతోడుతనూ!!30!!

తిరువెంకట ఆచార్యులు -బరువడిలేనెరుక బాశి భ్రాంతులవదలీ - తెరదీశి తేటనిజములో మరిఅయిక్యము జెందియుండే !!దర్వు!! ఖ్యాతీతోడుతనూ -ఆతీతావాదూతతోడుతనూ - హితవుతో బోధించి యిమిడించె సద్భోధ - అతిఆధారణజేశీ అధికారమొసగెను !!ఖ్యాతీతోడుతనూ!!31!!

అతీత అవదూతయుమరి - సతతంబుసమాధి నుండి సంపూర్ణుండై హితముసుబోధము జేయుచు హితమతితోనుండగానూ !!దర్వు!! యాళ్వారువచ్చెన్ తిరుప్పాళి యాళ్వరువోచ్చెన్ బలువీధా మయ్యున్నా -భ్రాంతులెరుకనుబాశి వెలీలోనానిండినా అచలాముమేల్కయ్యి !!యాళ్వ!!32!!

యెరుకను విడచినవాడై - మరుపును కలలోననైన మరువనివాడై - మరుపెరుకల తెలి వణచియు - మరియును శ్రీధరుల స్వప్నా !!దర్వు!! మందూనావొచ్చే వచ్చియు అచలాసింధూవు నిచ్చే - మందేమేళము యెరుకామార్గాము నొదిలించి - రంధీబాపియు రాజాయోగీని జేసెను !!మందూనా!!33!!

శ్రీధరస్వాముల మహిమను - యీ ధరలో ప్రకటమాయ అచలుండనుచూ - బోధను వెల్లడిజేసియు - సాధుడు శివరామదీక్షి !!దర్వు!! తులనూరావించీ - దీవించీయుచలనాము వోంచీ-కాలకాలములందు కదులాకుండెటిదాన్ని- మేలూసౌజ్జియుజేసి చాలాదీవించెను !!తుల!!34!!

శివరామదీక్షితులు యీ - భువిలో సద్గురుడటంచు సజ్జనులనగన్ శివుడై అప్పారావుకు భవములుతా బారదోలీ !!దర్వు!! భక్తూణీజేసి - రజ్జూసర్పాశెక్తినిబాపీ - యుక్తామయ్యున బయలు వ్యక్తాముజేసియు - ముక్తీకరమున జూపీ ముద్దూగభయమునొసగె !!భక్తూణీ!!35!!

ధరకంబాలపురంబున - వరఅప్పారావు మంత్రి కరుణానిధియై - పరిపూర్ణ భావమొందియు అరమరలేకానుబయలూ !!దర్వు!! యీదాగనేర్చెన్ - లేనేరుకాను -పోదోలానేర్చెన్ - పాదుగా పరుశురాముల సీతారాములకు - బోధించె పరిపూర్ణా భావాము దెల్పియు !!యీదాగ!!36!!

సీతారామస్వామియు - ఖ్యాతగు గురువాఖ్యమందు ప్రీతితొనుండీ - రీతిగతను బోధించెను పాతకహరమైనకీలు !!దర్వు!! అదికాటాక్షించే - శెషమ్మాకు పదమూ వీక్షించె - బోదాలానియె యెరుక బొంకూలు విడుమాని - సాధనలేనీ సంపూర్ణాధికారాము !!అదికటాక్షించే!!37!!

సీతారామబ్రహ్మాము - సోదరి శ్రీశేషమాంబ సొంపగు భక్తిం - చేతోముదమున జేసియు ఖ్యాతియుగాంచెను జీవా !!దర్వు!! పాపానియనుచూ - సద్భక్తులాజీవానియనుచూ - భావాము గనియూ శ్రీ భారాలింగంబూకు - శేవాకుడనిపూర్ణాభావాదికుని జేశె !!పావాని!!38!!

భారేశులు త్మగురుణిదె - భారంబనినమ్మిఆర్గ్జ భక్తితొనుండే - మీరకగురువులవాక్యము పరిపాలన జేసినట్టి !!దర్వు!! పద్ధాతియిదియే - మునుపేద్దాల వద్దీకయిదియే - మిధ్యాలేని యెరుకా పద్దూవదులగజేసి - రద్దీలేని ఆచల సౌజ్ఞరాములకైనా పద్ధాతి యిదియె !!పద్ధాతి!!39!!

శ్రీరామచంద్రరమ్మని-గారాబముతోడనన్ను గ్రక్కునబిలచీ కరమును శిరమున వుంచియు పరిపూర్ణము బోధజేసె !!దర్వు!! ప్రబలీతముగనూ -బాల్యమునందే ప్రభుడైతాతగనూ అబలూడవని దాయా ఆశీర్వచనములిచ్చె - ప్రబలించి గురువాఖ్యపాలాన జేయుమానె !!ప్రబలీ!!40!!

కరుణించిన బోధస్థితి - యెరీతియొ వర్ణనంబు - వర్ణించుము నే - సరిచూచెద సచ్ఛిష్యక మరినే తెల్పిన విధంబూ !!దర్వు!! పరిపూర్ణా బోధాపద్ధతి అంతా - సరిపోనుబాగా - శరణన్నవారికి కరుణించి తెల్పూము బిరబీరా దురమూలు సరగూనా బోవానూ !!పరిపూర్ణా!!41!!

మా గురుణి కాటాక్షంబున - నా కందిన అంతమనవినయముగ జేతున్ వో కరుణానిధే శుభకర - ప్రాకట గురురాజయోగా !!దర్వు!! భవ్యా మ్రొక్కెదానూ - సద్భక్తులా సవ్యా మ్రొక్కెదనూ ఆవ్యాయసద్బ్రహ్మా ఆప్రమేయావర - భావాభావాతీతాభక్తితొ సేవించి !!భవ్యా మ్రొక్కెదనూ!!42!!

అచల లక్షణం

అచలము మొదలెరిగించియు - సచలంబును లేనిదనుచు చెయ్యనదెల్పి - విశదము చేశెను రొంటిని-వచనంబిడెలేనియెరుకా !!దర్వు!! వదలింతూననుచూ పరిపూర్ణాము పొందింతూ

ననుచూ సదనామందునయెపుడు సన్నూతిజేయాగ- ముదమూతో ఆనందమును జెంది యెరుకాను !!వదిలింతూ!!43!!

జన్మముమరణము లేనిది - జన్మించగబోనిదెపుడు జయమపజయముల్ వినులేవుదాని కనుచును - కనుమనికను సొర్గతోడా !!దర్వు!! కనుగోనాజేశే కనుపడనీది - కనుపించాజేశే - ఆనయామానంతా బ్రహ్మాండబాండంబులు కనుగోనుజలజంతూ విధమూ దానితోను !!కను!!44!!

ఆకాశాదికభూతము - ఆకారముయేదిలేక - అచలంబయ్యా - లోకాలోకములెరుగక - యేకస్థితినుండుబయలూ !!దర్వు!! యేదెరుగాకుండూ - యెప్పుడుకనినా - భ్రామీగాకుండూ - నామారూపాక్రియా నాటాకమావాల - యేమానుటానీకి యెరుకేమిలేకాను !!యేమా!!45!!

గ్నానేంద్రియములు అయిదును - మానుగ కర్మేంద్రియములు మరిప్రాణాదుల్ - తన్మాత్రలైదు ఆంతర - మున ఐదును యింద్రియములూ !!దర్వు!! మూలాములేకా మేనెరుకాల- మూలాము గాకా-జాలాముపగిదీగా జగమూలుగల్గాగ- యేలీలాతెలియాక-యేకామైవున్నాది !!మూలాము!!46!!

ఆత్మానాత్మలజాడను - సూత్రముతాతెల్యకుండు సుమ్మచలముకున్ - పూర్తిగ యెరుకయు లేనిది- స్వార్తుకమైయున్న బయలూ !!దర్వు!! పాత్రామెరిగిననూ - గురుకీలెరిగీ- సూత్రామెరిగిననూ చిత్రాములునుగాల చిన్మాయ యెరుకా యేమాత్రమంటక దానీసూత్రామెతానయ్యి !!పాత్రా!!47!!

వర్ణావర్ణముగానిది - నిర్ణయమొందించుటకును నిఖిలోత్తములున్ - వర్ణింపలేరు అంతట వరులగుబ్రహ్మాదిసురులూ !!దర్వు!! సుమ్మీదినిజమూ -తెల్యగలేరు నమ్మూము నిజమూ -నిమ్మా ళంబుగ బట్టాబయలయ్యా కనుపడకా నెమ్మాదిగున్నాది నెవరీవోశంబాది !!సుమ్మీ!!48!!

యెప్పటికున్నది అచలము -చప్పుడు జేశెటి నాదచలనముగాకన్ - తిప్పలు యేమియులేకను వోప్పుగ నున్నాది బయలు !!దర్వు!! వోర్పుతోడుతనూ -లేనియెరుకా తీర్పుతోడుతనూ దర్పామేమియు లేకా దవళమై అంతాట నేర్పూలేకనునిండి నేదియెరుగక నుండు !!వోర్పుతోడుతనూ!!49!!

తనజాడ తనకుతెల్యక - తానెతానయ్యినిండి తగులకదేనిం - పూనకపురుషోత్తమమై మేనేమియు లేకనుండీ !!దర్వు!! మెప్పైనబయలూ- మహిములకన్నా గొప్పైనబయలూ - యిప్పూడు అప్పూడు యెప్పూడు అయినాను - చప్పూడన్నదిలేకా చప్పాశబ్ధముగాక !!మెప్పైనబయలూ!!50!!

నాలుగుమేనులులేకను - నాలుగవస్తలును లేక నమలపదంబై -మేలునుకీడును తెల్యక వాలాయము తనకుతానె !!దర్వు!! వుండూనోయయ్యా -అన్నిటజేరి వండంటాదయ్యా -ఖండాఖండ ములయ్యా -నుండెయెరుకయుగాక -దండీగాబయలయ్యా -దశదీశాలందూనా !!వుండునో!!51!!

పతిలేనిబట్టబయలై -సతతమువక రీతినుండు సాగరరీతిన్ -మతిమంతులు మరి పొగడిన హితమతియై యెక్కుతక్కూ !!దర్వు!! యెపుడూగాకుండూ -బిన్నంబగుటా యెపుడూలేకుండూ యెపుడూలేనిదొచ్చి యెన్నోవైభవమూలు -విపరీతాములు జేశెవిధమేమి లేకాను!!యెపుడూ!!52!!

ఆకాశంబేరీతిని - అన్నిటిలోవ్యాపకంబు అమితముగయ్యా -వకటియనంటక నుండిన సకలంబున బయలునట్లూ!!దర్వు!! సమకూడీయుండూ-సన్నుతిజేయా యెమీలేకుండూ- నేమించావలెనన్నా నామామూలేనీది - స్వామంచు తలచీతె ప్రేమించాబోకాను !!సమకూడి!!53!!

ధరయేవిధమును తెల్యక- వరుసగ తనయందునున్న వరలోకంబుల్- సరసముగ సురనరా దులు-విరళముగా జంతుజాల !!దర్వు!! విధమూలెన్నియునూ కల్గియుమలగు-సదనామందుననూ

విధముయేమిటనైనా వివరించి తెల్యాని-విధిగానుండును అచలాపదమూరూపములేకా!!విధ!!54!!

చిత్రములేమియు జేయ చరిత్రములను చదువబోక చిత్రముగాకన్ - గోత్రము సూత్రము లేకను - పాత్రంబునులేక !!దర్వు!! బట్టాబయలయ్యావుండూ - పలుకగరాక లయమయ్యాయుండూ సయ్యాసయ్యనబుట్టె దయ్యాము నెరుగాక - యెయ్యెడజూచినా యేక్రియాలునులేనీ !!బట్టా!!55!!

గోడలవిధమున అచలము గోడలసున్నంబువ్రాత జాడలరీతిన్ - యీడునుజోడును లేకను కూడక నున్నట్టిదానీ !!దర్వు!! యెందూనఅన్నీ యేతెంచూను అందూలాయెన్నీ - ముందెన్నాడును లేనీ అందమయ్యినవన్ని సుందారంబుతో కల్గే స్పృక్కూనేమియులేకా !!యెందూన!!56!!

తెల్లనికాయిదమును యెటు నల్లని గీతలును లేక నిర్మలమయ్యా - సల్లలితంబుగనుండగ యేలాగున వ్రాశినట్టి !!దర్వు!! యేర్పాటువిధమూ ముందునులేనీ యేర్పాటువిధమూ - సర్వామయ్యిన రజ్జు సంకాటంబును ముద్దు - నేర్పులేనిదిబయలూ నందూదర్పముగల్గే !!యేర్పాటువిధమూ!!57!!

యింతంతని చెప్పుటకును -అంతేమియు లేకయుండు -అమితముబయలై -గింతియు లేనిది అచలము వింతలు యేమియును లేకా !!దర్వు!! అంతాతానయ్యా అగుపడకా నిజమంతా తానయ్యా - వంతూకయ్యిన యెరుకావశమూ యెప్పుడుగాకా -యెంతాచింతలులేని దేమాని యెంతూను !!అంతాతానయ్యి!!58!!

యేసాధనతోనైనను-ఆసాదించుటకు అమలమందక యుండున్ -యీసాధనములు అన్నియు అసాంతము యెరుకకేనూ !!దర్వు!! అన్నీసాధనముల్ యెరుకావాలా -వున్నాదినిజమున్ యెన్నీటి కైనాను వున్నాది జీక్కాక -వన్నెలన్నియు బాశీ సన్నూతింపనురాకా !!అన్నీసాధనముల్!!59!!

యెరుకయుమరుపును లేకను - యెరుకాత్మప్రపంచమందు యేదియుగాకా - యెరుగుట మొరుగుట విరుగుట అరుగుట తరుగుట లేని !!దర్వు!! ఆకేవలాత్మా ఆజమచలాము- ఆకేవలాత్మా పోకాడ రాకాడ జోకాలులేనీది -యెకామయ్యున్నాది యెపుడూ చేలింపాక !!ఆకేవలాత్మా!!60!!

కర్తయు భోక్తయు గాకను -కర్తుత్వము శాయబోక కారణకార్యా -కీర్తపకీర్తులు చెందక ఆర్తించినగాని వినక !!దర్వు!! అమితమయ్యుందీ -మొరలినకాను స్థిమితమయ్యుందీ భర్తభార్యయు గాకే వర్తానలేకాను పూర్తి పరిపూర్ణమై -మూర్తికాకున్నది !!అమితమయ్యుందీ!!61!!

యెకాలంబుచలించక -లోకాలోకముల యెందు లోపలబైటా -యేకాకారంబైనది రాకడ పోకడలు లేకా !!దర్వు!! రాజయ్యానాదీ ఆత్మకుమించీ సాజామైనాదీ -వోజదప్పియువచ్చి హెచ్చీ పొయ్యేటి యెరుకా - తేజామునేప్పూడు తెల్యకనేప్రొద్దూ !!రాజయ్యానాదీ!!62!!

పేరేమి లేనిబయలుకూ పేర్లెన్నియు పెట్టియెరుక నోరుతొబల్కుం -పేరునువూరును లేనిది నోరెరుగని నిజముకెన్నో !!దర్వు!! పేర్లూకల్పించీ పెంపొందెన్నో సార్లూ విలపించీ -ఆర్లుతోడా యెన్నొ అమితాము భ్రమలొంది - తెర్లయ్యిపొయినాను తెల్యానిదీ బయలు !!పేర్లకల్పించీ!!63!!

రాగద్వేషములొందక -భోగాభోగములయొక్క పోలిక కనకన్ -యోగములన్నది చూడక-త్యాగముజెందినది ముఖ్యా !!దర్వు!! మిదితెల్యావలెనూ అందులో గలశే విధమెరుగావలెనూ అదరూ బేదరుఅనె చెదరూటెన్నడు లేక -వదరూటన్నది లేకా వైభావమైనాది !!యిదితెల్యా!!64!!

స్థాణువు యెటువలె కదలదొ- మానులుగిరులున్నరీతి మరిరాళ్లవలెన్ -మేనులువుండి చలించవు -మెనేమియు లేనిబయలూ !!దర్వు!! మెదలాకవుండూ -అన్నిటనిండీ కదలాకనుండూ

బదులూయేమియులేకా భావభావములాకు-మదికైనాదగులాకా తుదిమొదాలునులేకా !!మెద!!65!!

జ్యోతిర్మయమునుగాకనుఖ్యాతియుకీర్తియునుబొందకాంక్షలులేకన్ యేతీరుగైన యెప్పుడు ప్రీతేమియు తెల్పకుండూ !!దర్వు!! యిలయెందూబయలూ జాగ్రతలందు- కలలందూ బయలూ జాలామగుకలమేల్కాలొనాబైటనువుండి- లీలాలుజేయాక ఫాలామందున లేకా !!యిల!!66!!

గురుడుచూపించకనుఆది -గుర్తెన్నడుగాకయుండుగుణనిధులైనన్ -హరిహరబ్రహ్మాదులకును సురలకునరులకునైనా !!దర్వు!! సూటగునాతెల్పా - సత్యపలేకామెటౌనా కల్పా -గుట్టుచే గురుసౌర్గ గురికిఅందగానే - బట్టాబయలయ్యుండు - అట్టిట్టీదనరాకా !!సూట!!67!!

చూపించరానిదచలము - చూడ్కులతో జూడరాదు చులకన అదియున్ - యేపగిదిరూపు లేకను - తేపకుతేపకునుకనినా !!దర్వు!! యెపగిదీలేదూ - యెరుకందులో - ఆపగిదీ లేదూ - యెపగిదీ లేనీది యెవ్వారికగుపాడు - చూపూలొగలయెరుకా దీపామన్నది లేకా !!యెప!!68!!

అష్టాంగయోగములుబహు - నిష్టలుయెన్నైనగలవు నిన్నియు జేయం స్పష్టంబుగాను తెల్పదు యిష్టంబులుజెప్పుకొనినా!!దర్వు!! అదివీనాదయ్యా - చెయిమనియెపుడు వదురా లేదయ్యా- ముదమందియెరుకానె మోక్షాదిపదవులా- పదపాడికల్పించీప్రార్థానాలను గోను !!అది!!69!!

మర్మంబుయేమిలేకను - ధర్మాధర్మములనైన దగులక యెపుడున్- నిర్మలమునొంది తనలో ఖర్మాఖర్మములుబెట్టే !!దర్వు!! చిన్మాయామేది - అందులోనా వున్మాయామేదీ అనుమానించక చూస్తే అనుమానమును లేంది - వినుటాముక్తై అనుటా మధికమాయనుచూడ !!చిన్మాయా!!70!!

క్షేత్రాక్షేత్రంబులకును - గాత్రము గనుపించుచుండు సూత్రము వుండూ - పాత్రాపాత్రము గలవే మాత్రము యివి అన్నిలేకా !!దర్వు!! ఆచలామైనాదీ- నిజమనియేటి విశాదామైనాది - సచరా చెరములాకు సకలాక్షేత్రంబయ్యా - వచనాముకందాక రచనాలు లేకాను !!అచలా!!71!!

సప్తావర్ణములోపల - సప్తావర్ణంబుబైట గుప్తము బయలై సప్తావర్ణముగాకను - సర్వనిరావర్ణమయ్యా !!దర్వు!! వర్ణిపారాకా వాసవులైనా వర్ణింపరాకా - నిర్ణాయమెరుగాక నిఖిలా వేదములన్ని - ఘూర్ణిల్లుచున్నావీ వర్ణింపావాలెనాని !!వర్ణింపారాకా!!72!!

సాకారనిరాకారము - అకారముజెందబోక అమలపదంబై - పోకడరాకడగాకను - యేకస్థితి నుండుబయలూ !!దర్వు!! యెరూపులేకా - సత్తూచిత్తూలారూపుగాకా - పరులూనేనని యేటి పద్దాతి యెరుగాక - ఆరమారలేకాను అంతానిర్బయలయ్యా !!యెరూపులేకా!!73!!

నాదముబిందువు కళయని - మోదంబున మూడువకటె భేదంబాయె - భేదంబు లేమి యెరుగదు - వాదంబుల తెరువుబోదూ !!దర్వు!! వరబాయలప్పా - వర్ణింపానుతరమూ గాదప్పా పరమారహస్యామై పావనమైనాది - పరమపాదంబయ్యె పరగాతన్నెరుగాదూ !!వర!!74!!

యెరుకలక్షణం

యెరుకయుకల్గు విధంబును - సరసముగసుషుప్తి యెందు చెయ్యనమెల్కా - విరళముగ యెటులకల్గునో - మరుపందున తెరుపుగల్గే !!దర్వు!! వట్టీదాయెనూ - తానేవచ్చి దిట్టామాయెనూ అట్టిట్టు జేశియు - మిట్టిపడియు తుదకు - పట్టేమి లేకాను - వట్టీదాయెను చూడు !!వట్టీదా!!75!!

దారువయందునగల్గిన - దహనాగ్ని కణంబురీతిగారడిమాయల్ - యేరీతిగల్గికనుపడు ఆరీతిగ యెరుకపుట్టా !!దర్వు!! వయ్యుండూవినుమీ మరియెట్లన్నా చయ్యానకనుమీ - సయ్యా

సయ్యనగల్గె సకలాకాలములెట్టు - యెయ్యెడమునులే కాయే తెంచు తెరగూనా !!వ!!76!!

మాటలుయెటువలెకల్గునో - పాటలు యేవంకబుట్టిపరుగు నెచటికో తేటగు యెరుకయు తెంపరి- పూటకుజన్మించియెరుకా!!దర్పు!! పోవూనెక్కడికో- క్షణములోలేకాపోవూ నెచ్చటికో కావా నెవ్వరు లేకా ఖర్మామానుభవించి -భావామందునయెపుడూబయలూగుర్తెరుగాకా !!పోవూ!!77!!

తనమూలము తనుతెల్యక - చనుదెంచుటనారికేళ - కాయలయందున్ - వినుకొబ్బరున్న విధమున- చనుదెంచును యెరుకనటులా!!దర్పు!! చెప్పాకయెవరుం- రమ్మనియురప్పింపాక యెవరుం-యెప్పూడయ్యిన ఆచలమొప్పీరప్పింపాక- వప్పూగతెలశీయువనరూగతారక!!చెప్పాక !!78!!

కనుపించికనగరానిది వినిపించియు వినగరాదు వీరముయెరుకా - అనుపించిఅనుట లేనిది - తినిపించియుతినగ లేదూ !!దర్పు!! తీపూలమెండూ - చేయుచుఅన్నీ - తేపాకునుండూ వోపికాతో అన్నివరుసాతొజేశీయు - చేపట్టాకనుతాను చెలగీగాతంబవునూ !!తీపూల!!79!!

పిలువని పేరంటంబున - తులువతనంబునను తనకుతానె వచ్చీ- పలువతనంబున ప్రకృతై పురుషుండని పేరువడశీ !!దర్పు!! పుట్టించుయెన్నో చెప్పగరాదు గిట్టించుయెన్నో - రట్టూ తానమెకాని చావునావులముండ - గట్టీదిగాకానుమట్టయ్యా పోవూను !!పుట్టించు!!80!!

ప్రకృతిద్వయములురొండును - వికృతంబుగదాల్చెచూడు మీరొండొకటే - సుకృతంబు యనుచుసృష్టిని - ప్రకటంబుగగల్గజేయూ !!దర్పు!! యికమోహమునసూ- నిల్పుటలేకా యిచందా మునసూ - ప్రకటించియెన్నో అవస్తాలతా బొంది- యికయెన్నోఅపాదాలివిటీకి కల్గించు !!యిక!!81!!

త్రిగుణములతోడుజేసుక- సుగుణంబుల దుర్గుణముల సగబుట్టించీ - సగుణాత్మల పరిమిత మును - యికజేశియు గుణములన్ని !!దర్పు!! యిమిడించీనాదీ - కూడదుయివియూ భ్రమలూ అన్నాదీ - నమరీకొన్నియు మళ్ళినడువొచ్చూనన్నాది - నమరాకసగమూను నరకాముగలదాని !!యి!!82!!

పుట్టును పుట్టించును తనపుట్టుకతా నెరుగకుండు దిట్టము గుండేటట్టును లేకను శ్రమపడి తుట్టతుదన్ వట్టిదయ్యా !!దర్పు!! యెందూనేగూనో పుట్టినవన్నీ అందూతేమగునో ముందూ లేకనెకల్గి- కలగించి కాల్చుచు బొంది లోపటబిందూ -బొందాలోపండించు !!యెందూ!!83!!

పంచభూతముల జేశియు -మంచిగతాప్రతిఫలించి -పంచాత్మనై సంచితకర్మేర్పరచియు వంచనలొనరించ జేశే !!దర్పు!! పంచామహపాపీ యీప్రాపంచ మెంచేదుష్టాపీ -అంచీతంబుగ పేల్వామంచేమి వచ్చేనూ - మించీనా నాడన్ని ముంచీమాయంబవునూ !!పంచామహపాపీ!!84!!

మొదలేమిలేని యెరుకను -వదులక నడుమంత్రమునను వచ్చుటమాయం - తుదియేమి లేకపోవును -పదపడి కర్తయును లేకా !!దర్పు!! పాడయ్యాపోవూ తుది మూట్టాక వీడీయుపోవూ తడవాడి బ్రహ్మండమంతా మాయముజేశి -సుడిబాడి సూన్యమై సుంతైనా లేకను !!పాడయ్యా!!85!!

ఆకాశము సూన్యంబై ఆకారముగాక చూపుకది నీలంబై - ప్రకటించి యెటులకనుపడు ప్రాకటముగ లేని యెరుకా !!దర్పు!! అటులాకనుపించూ ప్రస్తుతిజేశీ నటులాకనుపించూ -యెటు యేమిలేకాను తుటుకూనా మాయామై- తటుకూన కనుపడదు తగయింద్రాజాలామూ !!అటు!!86!!

విద్యలయెన్ని విధంబుల వద్దికతో యేర్పరించి వసుదలొచల్లీ - బుద్దులు పుట్టించియు యిఘ ముద్దుగ చదివించజేయూ !!దర్పు!! ముదమొందగానూ ముఖ్యాముఖ్య పదమందులోనూ

వద్దీకావీ కొన్ని రద్దిబెట్టివి కొన్ని - బద్దత్వామొనరించి దిద్దీతీర్చుచునుండు !!ముదమొంద!!87!!

నేనని నీవని తానని మానసమున కల్పనలును మరిచేశితగం -గ్నానాగ్నానములనుకొని పూనియు బేదంబులెన్నో!!దర్పు!! పొందుగా జేశీ అన్నియుతానె ముందుగాజేశీ పొందించేవాదాము మందీదినాదాని -మందేమేళము లెన్నో చెందించుచుండూను !!పొందూగాజేశీ!!88!!

నేనీవు లేనిబయలున -నేననెహంకారమొకటి లేనిదెకల్గీ -నేనని నీవని పరులని -మానుగ యెర్పాటు జేశి !!దర్పు!! నెనానిఅనునూ నావస్తూవ -మేనానిఅనునూ -పోనీది నాదాని పొయ్యేది నీదాని -మందేమేళములెన్నో చెందించుచుండూను !!పొందూగాజేశీ!!89!!

దీపము మల్గినరీతిని తేపకుగాలేగినట్లు తేపకులేకన్ -చెప్పకపోవును యెచటికొ-వప్పుగకన్ కట్టువిద్యా !!దర్పు!! రీతీదిసుమ్మీ కనుపడి మళ్లీ పోతాదిసుమ్మీ -పోతాది సూన్యాము యేతీరుననైనా ఖ్యాతిగా లేనీదై కనుపాడీ కనుపడదు !!రీతీదిసుమ్మీ!!90!!

యెరుకనె సూన్యంబాయను అచలముసూన్యంబుగాదు అంతటమయమై -జన్మావస్తలు లేకను -సున్నకుసున్నయ్యి యెరుకా !!దర్పు!! సూన్యామయ్యుంటీ పుట్టిచచ్చీ జన్యామవుచుంటీ వున్నాది యెప్పుడు తిన్నాగ గురుకృపా-కొన్నావారల కెపుడు కన్నప్పుడెల్లాను !!సూన్యామయ్యు!!91!!

యేమరుగు లేకనెప్పుడు స్వాములకును స్వామిఅయిన స్వామికిస్వామీ-నేమంబులేక చూచినదామంబై సందుసందూ !!దర్పు!! దట్టామైనాదీ బట్టాబయలై వట్టీదైనాదీ -యెట్టాకేలకైనా యేమీయు గాకానూ -దిట్టామయ్యున్నాది ముట్టూటంటులు లేకా !!దట్టామైనాదీ!!92!!

పరిపూర్ణంబేవున్నది యెరుకను యెన్నంగలేదు యెప్పుడుకనినన్ -గురుతెరుగవలెను రొండును యెరిగెరుకను విడువవలెనూ !!దర్పు!! యేమీలేదనియూ -వున్నదిపూనీ స్వామీయిది యనియూ ప్రేమాలన్నిజెందే బ్రామీకావీడీతె-ధామామయ్యినబయలూ దర్శనమున్నాది !!యేమీ!!93!!

యెన్నిసుబోధలు బొందిన-అన్నెరుకయె కాని అమితఅచలము కనవూ-అన్నిటికి మిన్న యున్నది వన్నెలుచిన్నెలునులేనీ!!దర్పు!! వరఅచలాబోధా- సన్నుతికెక్కెధరయందూమెధా దురితా జాలంబెంత్త భరితామయ్యినయెరుకా- మరియేమి లేకుండా తగజేయుచుండూను !!వరఅచల94!!

గురుభక్తి లక్షణం.

అచలము విశదం బెరిగియు -వచనము లేకుండదెల్పె వరగురుమూర్తి -సచరాచరంబు లెవ్వరు-వచియింపనిదాని కొరకూ!!దర్పు!! వార్నీశేవించీ సర్వస్వాము వారికర్పించి-కోరిక అన్నీయు మీరీన దారీయు -చేరీకొలచినంతా చేపట్టిరక్షించూ !!వార్నీశేవించీ!!95!!

త్రివిధము లైక్యముజేశియు- సవినయముగదేశికేంద్ర చరణమునందే-భువనముల యితర మెంచక-భవబంధము బాయుకొరకూ !!దర్పు!! భక్తుంచవలెనూ బ్రాంతిలేని ముంక్తెంచా వలెనూ యుక్తాయుక్తంబయినా-వుపమూచె శేవింపా-ముక్యానందంబూనా భక్తూల కరుణించు!!భక్తు!!96!!

తల్లియుతండ్రియు దైవము -దాతయు బ్రాతయును యనుచు దప్పకతలచీ యెల్లయుతానె అనియును -వుల్లంబున వుంచవలెనూ !!దర్పు!! వుత్తామములైతె కడతేరే సార్వోత్తాములైతే - రిత్తా మాయను బాపే సత్తావారిదె కాని - వుత్తావారందారూ -మత్తాని తెలశీనా !!వుత్తాములైతె!!97!!

గురుపద శేవనోనర్చక-దొరుకదు వైరాగ్యమహిమ సురులకునైనన్- గురుతీర్థమందకుండిన స్థిరగ్నానముబొందబోరూ !!దర్పు!! శూరూలయ్యిననూఅన్నిటియందూ ధీరూలయ్యిననూ గురుసుప్రా

సాదామూ మరియూ లాభించాకా - సరగూనా చిత్తోపారతి సూఖామొందారు !!శూరూల!!98!!

గురుతత్వమెరుగకున్నను పరిపూర్ణానంద సుఖము ప్రాప్తియునగునా-గురుడే విశ్వేశు ండని గురువాసమె వారణాశీ !!దర్పు!! గురితోనుగన్నా రామేశుడు మరిలెస్సావిన్నా - సర్వా క్షేత్రంబూలు సర్వతీర్థంబులు -గురుసన్నిధానామె సరిగావు సర్వాము !!గురితోనుగన్నా!!99!!

హృదయాలయమున యెప్పుడు వదలక గురుమూర్తిరూప మందులోనిల్పి -సదనంబున పదయుగములు - మదితో పూజించవలెనూ !!దర్పు!! భక్తుౖడైనపుడూ భ్రాంతిరహితా ముక్తుడై నపుడూ శక్తితో శేవించీ తన విన్నాపంబూలు-వ్యెక్తాము జేయూచు వేడుకోనగవాలె !!భక్తుడై!!100!!

గురుడానందము నోందిన అరుదుగ త్రిభువనము తృప్తి నాడెచందున్- మరిసందేహము నుంచక-యిరవుగశుశ్రూషలన్నీ!!దర్పు!! యింపూతోడుతనూ కీలెరిగీయూసొంపూతోడుతను తెంపారియెరుకాయూ తెగిపొయ్యేవరకూను-పెంపొందావలయూనుపేర్చినాభక్తిచే!!యింపూ !!101!

గురుమంత్ర ప్రభావము

పంచదశాక్షరివాఖ్యము అంచితముగ నాల్గుగురుడు యెంచగనిచ్చుం వంచించు జగము యెరుకను - అంచితస్వప్నంబురీతి !!దర్పు!! యెరుగాగవలెనూ - మిధ్యాయాని మరువాగవలెనూ బిరబిరతనువూలు పరుగూనవచ్చీయూ-సరగూనాపోవూను మరికానరాకుండ !!యెరుగా!!102!!

షోడశిమంత్రార్థంబును - వీడకజపియించిదానివిధమును తెలియం జాడను లేనిది యెరుకని వేడుకతో తెల్పుచుండూ !!దర్పు!! మూలాములేకా- గుర్తెరిగేటి జాలాములేకా - మేలూగా యెరిగేది యేమీయులేదాని - కీలూదేలశినంతా జాలీమాన్పించూను !!మూలాము!!103!!

యీ వుత్తబట్టబయలును - యేవిధిగను లేకయుండు యెప్పుడుకనినన్ యీ విధిద్వాదశి వాఖ్యము - భావములో తెలశియుండా !!దర్పు!! భ్రమలూతా తొలగున్ - భ్రాంతులుగాల శ్రమలన్ని తొలగున్- విమలామంత్రంబూను విడువాకజపియించా- అమలత్వామునుజెందీ అంతా నిర్భయలవునూ !!భ్రమలూ!!104!!

యెకాలంబునైనను- యేదేశమునందుయైన యెకార్యమునన్ - యీకలజోలిని విడచియు చేకొని మంత్రద్వయంబూ !!దర్పు!! చేపట్టావలెనూ - మంత్రారూపు చూపట్టావలెనూ యెప్పాటి కున్నాది యెమీయులేనీది - తప్పాక జపియింపాముప్పణగీ ముఖ్యామౌ !!చేపట్టా!!105!!

యిరువది అయిదైవెలశిన - యెరుకాత్మయు అచలమందు యేకంబయ్యా దురితంబగు తనువీంద్రియ - వరకార్య కార్యములనూ !!దర్పు!! వర్తానలుడిగీ - వుండీలేని వర్తానాపూనీ - కర్తా భోక్తయుగాక గుర్తెమి యెరుగాక శక్తిద్వాయంబాను యుక్తిరహితంబయ్యా !!వర్తాన!!106!!

సమాధి లక్షణం

సగుణసమాధులు నిర్గుణ- సుగుణసమాధులును కొన్ని సుఖపదమనుచున్-తగిలా నందమునొందెరు- యిఘగడియకుదినముకెన్నో !!దర్పు!!యిటుమరలూచుండూ - యుగముల కైనా యిటుమరలూచుండూ- పట్టీచూచినయివ్విపట్టీవి ఆయెను- అట్టీదికాదాది అచలాపాదం బాది !!యిటుమరలూ !!107!!

యెప్పటికచలసమాధియు - వప్పుగకలలోని జగమువరమేల్కచలం మెప్పుగబొందియు కలవిడి చప్పుడుయేమియునులేకా!!దర్పు!! సతతామొకవిధమున్-కలలోనైనానిత్యామొక విధమున్

ప్రతికల్పాములకైనా మతికల్పానలులేకా - హితవాచాలంబయ్యాయిచ్చానిచ్చలు లేకా !!సతతా !!108!!

యేకస్థితియైయ్యుండును - రాకడపోకడలులేక రహితానందం - యెక్కువతక్కువ గాకను మక్కువమరుపెరుక లేకా !!దర్వు!! మరిబాయలవునూ - మర్మములేకా మరిబాయలవునూ- అరమారలేకాను అంతానిర్బయలయ్యా-నిరతాము వకవిధమూ నిజమూనిజమయ్యుండూ !!మరి!!109!!

యెరుకాత్మ నాత్మక్రియలును -యిరువుగ బ్రహ్మాండమందు భానుని తేజం -బరయగ సర్వమునందున సరవిగవ్యాపించి సకలా !!దర్వు!! మంటాకయుండూ-అదిలేకుంటే జంటా లేకుండూ మింటాసూర్యుడు నుండామంటీ కార్యముజరుగు-మింటాసూర్యుడు చనినా మంటికార్యముమాను !!మంటాకయుండూ!!110!!

అంటిఅంటని లక్షణం.

యింటిలో దీపము వెలుగగ యింటిలోవారెల్ల పనులు యిష్టముతోడన్ -అంటకచేయుచు నుందురు - అంటదు తేజంబు యేదీ !!దర్వు!! అన్నీటిలోనూ వ్యాపకమయ్యా మన్నానతోను-వున్నంతా వరకూను యెన్నైనజరుగూను - తిన్నాగా మలిగీనా అన్నీటిపని బందూ !!అన్నీటిలోనూ!!111!!

అటువలె ఆత్మాకాశము - ఘటములలో ప్రతిఫలించి ఘటకార్యములన్ - పటుతరముగ జరిపించును మటుమాయము నంటకుండా !!దర్వు!! మరివెలగూచుండూ మాయకుబల్మై తిరమూగానుండూ - కారాణమున్నంతా కార్యాముజరుగూను - కారాణముడిగీతె కార్యాము జరుగాదు !!మరి!!112!!

ద్వయదోషమనుచు దెలశియు - మయమైనవి ప్రకృతి పురుష మార్గములనియున్ - వ్యయమయ్యేవి లేనెరుకలు - నయమయ్యిన అచలమందే !!దర్వు!! నణగుండావలెనూ యెప్పుడు మనసు మణిగుండావలెనూ - అణువూలో అణువైనా ఆత్మామారచివుంటె - మిణుగూరుళ్లక్కయ్యి మీలీనచలమునందూ !!నణగుండావలెనూ!!113!!

వాయువులేని సముద్రము-పాయకనుండే తరంగభంగములేకన్-వేగమె కదలక నుండును వాలాయము మనుసు ఆత్మా !!దర్వు!! నందూఅణగితెనూ - మారుతమూను - అందుఅణగితెనూ యెందూచేలించాని వుండూతేజంబొకటి - పొందీఅచలమునందూ అందామయ్యినఆత్మా !!నందూ!!114!!

బానుడు వుదయము నోందిన - మానుగ కిరణములు యెన్నో మరియు జనించున్ - భానుండస్తుండైనను - పోనాయను కిరణములునూ !!దర్వు!! పొందూగాఅన్నీ యెరుకటువాలె జేందూను అన్నీ - ముందూగ పరిపూర్ణా మొందీయు యెరుకాను - కుందిపోయిన తారిఅన్నీ వుళ్లక్కవును !!పొందూగ అన్నీ!!115!!

గురువరు శిష్యుని యెరుకను - తెరదీశియు బయలునందు తెటముగల్పీ - యెరుకను కలజోలిడిచియు- యిరువురు వుళ్లక్కిఅయిరీ!!దర్వు!! యిష్టాముతోనూ- నిజబయలందు స్వష్టాముతోనూ- భ్రష్టుదానితో బొందేభ్రమలన్నీ విడచీయు - కష్టాకర్మములానె కలమేలుకయ్యారి !!యిష్టాముతోనూ !! 116!!

యెరుక విడచిన వివరం.

యెరుకను విడచిన వారలు - మరియెట్టుల వుందురనిన మర్మములేకా - పరనింద వినక చేయక - సరిగావర్తించెదారూ !!దర్పు!! పాటించాకానూ - పరులూతానని సాటించాకానూ మాటీకి మమతావైరాగ్యాములుంచాక-మెటిగ సమవర్తి మాటాకామోదించి !!పాటించా!!117!!

యీస్థితి కల్గినవారలు - యేస్థితియును జేయబోక యేదియు వినకన్ - వాస్తవ పరి పూర్ణంబై సుస్తిరులై వుండెదారూ !!దర్పు!! సూటీదప్పకనూ - యెరుకాజోలీ బాటాదప్పియునూ నూటీకొక్కరికైనా దీటూపాడదు యిటులా - కోటీకొక్కరెకాని సాటీలేనిబయలూ !!సూటీ!!118!!

చిత్తముజారత్వంబున-రిత్తగు తనువింద్రియముల విషయావిషయం- మొత్తమగు యెరుక పనులును చిత్తమునను యెరుగరెపుడూ !!దర్పు!! చిన్మాయాగతులూ - అంతరమూనా సన్మార్గహితులూ- అన్మానముంచాక అంతారబాహ్యము -అన్నికార్యములందు అంటాక యుందూరు !!-చిన్మాయా!!119!!

యేసాధకములు వున్నను - వాచాలక బ్రహ్మమనుట వర్తనలుండున్ - యేసాధనలేకున్నను ఆసాంతము బ్రహ్మపదము !!దర్పు!! అంతాటానుండూ నిర్భయలయ్యా యెంతాలేకుండూ - మంతా నంబున యెన్నో మరికల్పానలు జేశి - యెంతోవర్లును నోటా కొంతైనా తెల్యాక !!అంతాటా!!120!!

తనువే తామైయుండిన మనుశింద్రియ గ్నానములును మరియేదైనన్ - వినుభూతాత్మల యెందున - పనిబడి అభిమానులైనా !!దర్పు!! హంకారులకునూ -అచలమాని బొంకెవారలకూ రంకూల యెరుకావక్కింతాయు విడువాక - పొంకామయ్యిన బయలూ పొందూటా కష్టాము !!హంకారులకునూ!!121!!

గ్రంధసమాప్తి లక్షణం.

కొంచములో సరిపాయను - మించినఅర్థంబు దెలశె మిణుకునుబాశే- మంచిది కొంచమె చాలును- చంచలముకె చెప్పతరమూ !!దర్పు!! కానీబోధలునూ నిల్పును లేకా పోనీ బోధలునూ మానూగ నిక్కాము మరివక్కాటేచాలు- పూనీచిక్కులు యెన్నో లేనీదానికి వుండు !!కాని!!122!!

యీకవనమెందుకనుచును - లోకులు బల్కెదరు దీని లోతుదెలియకన్ - నాకును గురువచనంబిడ చేకొనియిది చెప్పినాడా !!దర్పు!! తప్పూగాదనుచూ - సద్గురుకరుణా వప్పుగాగొనుచూ తప్పూడు నరులైతె వప్పారు నిజమూగ - మెప్పైనా బుధులాకు తప్పులేదిందులో !!తప్పూగాదనుచూ!!123!!

యతిగణప్రాసంబెరుగను - మతిలోపల గురుణిశేవ మానకచేతున్ - హితవుగ యతిగణ మదియె -మతిమంతుల వలెనుచెప్పా !!దర్పు!! మరివోశామగునా-యేనుగుచీమా సరిసామ మగునా అతీరుగనె వుండా అదియె వుప్పాంగేనూ - దాతావ్రాతనె కానీ చేతీవ్రాతలు కావూ !!మరివోశామగునా!!124!!

పిలువనిదొచ్చి దురాత్ములు పలువాదములాడు ప్రకృతి కల్పితమంతం - బలు నిందెలు వడిగట్టుక యిలలోపల తిరిగెదారూ !!దర్పు!! అంతుదెలియకనూ - ఆత్మయును రవ్వంతా తెల్యకనూ కొంతాజేశినగానీ అంతైనా నిల్పాక-భ్రాంతూలొందియు తుదకూ బద్ధాలై చెడుదూరూ !!అంతుదెలియకనూ!!125!!

గొప్పైన వారికెప్పుడు తప్పుడు బుద్ధియును లేక వప్పులు గొనుచున్ - మెప్పైన అర్థములుమరి యెప్పుడు జేయుదురు సుమ్మీ !!దర్వు!! యెకాముతోనూ -సర్వాసములు లోకాములోనూ -చేకోనా కుందూరు శ్రేష్టాములేవాని - కాకూలకొడుకూలు యేకాలామొప్పారూ !!యెకాముతోనూ!!126!!

గురుబోధ గొన్నవారిక - గురుతత్వము గన్నవారు గుణనిధులైతే - పరమోక్షమొందెవారును పరులకు మోక్షంబుదారీ !!దర్వు!! పలికేటివారూ నొరులకు మంచీనొలికించేవారూ - పరులామేలు నోర్చె పండితోత్తమూలు - విరివీగా యిందూలో విధమున్నా దెలిగేరు !!పలికేటివారూ!!127!!

అన్నమరాజోంశోద్భవు డెన్నగ అనంతకృష్ణ వరజనకునకున్ - కనెను సరస్వతిజననియు జననంబైనాను ముక్తీ!!దర్వు!! జెందేటికొరకూ పరులకు మోక్షమందేటికొరకూ- అందించా నాయెను అతికృతిరచియించి - పొందూగా దూరార్థమిందు దెలశియు పరమూ !!జెందేటి!!128!!

నిత్యము యీకందార్థము - లుత్తమముగ పూజశేయ రిత్తగుమాయన్ - చిత్తమునిల్పియు చదివిన - యెత్తరియెరుకుండబోదూ !!దర్వు!! యిదియూ నిశ్చయమూ - విన్ననుకన్నా - మదియూ నిశ్చయమూ - సదనామందున గూరుసాన్నిధ్యామైయుండూ- వదలాకారోగ్యాము వచ్చు సౌఖ్యములన్ని !!యిదియూ నిశ్చయమూ!!129!!

గ్రంథకర్త ఆశీర్వచనము

యీఅచలగురు పరంపర - యోగులకును భోగులకును - వనరపలించన్ - జాగును లేకను మోక్షము - వేగంబున జెందెదారు !!దర్వు!! వెతలెల్లాబాశీ - జన్మామరణాగతులెల్లాద్రోశీ సతిసూతహితబంధు సౌఖ్యాములునుగల్గి- హితమాతులై అచలాస్థితిజెంది ముక్తూలై !!వెత!!130!!

ఇతి!! శ్రీమద్వేదాంతసారుండును - సచ్చిదానందతీతుండును - క్షరాక్షరోపాధిరహితుండును ప్రకృతి ద్వయదోషసూన్యుండును - అశేరీరుండును అచలుండునునైన - శ్రీభారలింగ నిజగురు చరణకమల కురువిందారువింద మరంద పానతుందిలతా - మందమందానంద మిళింద బృందంబులలో నొకండైన-అన్నమరాజవంశజ భరద్వాజస గోత్ర భాగవతసాంప్రదాయకుండగు రామదాసు ప్రణీతంబైన కందార్థ దర్వులు సంపూర్ణం

సద్గురు చెరణారవిందార్పణమస్తు.

శ్రీగురు పరబ్రహ్మణేనమ:

# సర్వార్థనిర్గుణ సీసార్థ దర్వులు ప్రారంభ:

శ్రీమత్సదానంద చిన్మయాతీతుని భావమందున మహాభక్తితోను - శేవించీ పూజించిచలగి ధ్యాన్నించియు భావించిమ్రొక్కియూ వూహతోను- చెప్పబూనితి లోకక్షేమంబు కొరకయ్యి వప్పగా వినుడీ మనుసొప్పినరులు-పరిపూర్ణ గురుకృపా పరమామృతంబైన !!దర్వు!! సారామకరందా పానమూ నామదిభృంగామూ -కోరీచేశినబ్యారమూ - సారావంతాములా విచారపరులాకెదీని సారామందూనె కాని వేరెవారలకూ గాదూ !!సారామకరందాపానమూ!!1!!

త్రిమూర్త్యాత్మక గురుస్థవం.

జగదేకసద్గురు జేయదేవునెప్పుడు- భావమందున మహాభక్తిజేశి- గురుదేశికేంద్రుల గురి యందునిల్పియు-పరమయోగుల కెల్లప్రణుతిజేశి- శ్రీపతిపాదముల్ చిత్తంబులో జేర్చి పార్వతీ రమణుని ప్రస్తుతించి - శ్రీభారతీశుని శేవించి వినుతించి !!దర్వు!! పరమాగురునాకూ మ్రొక్కుదూ పరమేష్టి గురునకు స్థిరామూగా మ్రొక్కిదక్కుదూ - గురూపారంపారులైన గుణాభూషాణూలాకెల్లా పరమాభక్తీతొ వారికి ప్రణామిల్లీ కరుణావడశి !!పరమాగురునాకూ !!2!!

వరవశిష్టాదులా వాల్మీకవ్యాసుల సనకాదిమౌనుల సర్వబుధుల- జనకాది యోగుల జయ శుకాచార్యుల అలయసాందీపరుషి అచ్చుతాది - యుద్ధవఅర్జున సద్ధర్మపరులను ప్రహ్లాద నారద భాగవతుల- గ్నానవైరాగ్యుల ఘనభక్తిముక్తులా!!దర్వు!! శీద్దూలకెల్లా మ్రొక్కెదా నాఅంతరంగ సూద్దూ లెల్లాను గుప్పెదా- ముద్దూగగ్రందార్తాము సూద్దూలెల్లానుచూచి- శ్రేద్దాగలవారాలెల్లా శూద్దా పరమా పదమొందా !!శీద్దూలకెల్లా!!3!!

అచలగురుపీఠ పరంపర

శ్రీధరస్వాముల శిష్యోత్తముండైన శివరామదీక్షిత వరుడుఘనుడు - వారిశిష్యుండప్పరావు మంత్రి హితుండు- అతిపూర్ణునకు భక్తుడైన పరశురామ శీతారామస్వామి సద్వరునకు శ్రీశేషమాంబ సచ్ఛిష్యురాలు -శేషాచలేంద్రునకు చెలగిశిష్యుండైన !!దర్వు!! భారలింగామె గురూడూ తద్భకూడాను భారమంతాయు ప్రభూడూ-వారీకరుణాచె యిట్టివాగ్రంధమాయెగాని- కోరీచదువులవల్లా సారామిదిగాదు కనినా !!భారలింగామె!!4!!

పరమభక్తి లక్షణం

దాసానదాస తద్దాసదాసులకెల్ల దాసుండనై దాసభావముననూ - భృత్యానభృత్య తద్భృత్యుల కెల్లను భృత్యుండననుకొనే బుద్ధితోను - భక్తానభక్త తద్భక్తుండనేనిక దీనదీనులకెల్ల దీనుడేను నాథనాథల కెల్ల అనాథనయ్యినవాడ !!దర్వు!! విశ్వామంతాయుగురుడికా - శాశ్వీతామైనా ఐశ్వర్యా మైనా ప్రభుడికా - విశ్వామంతానువక్కా విభూడైనా దేవూడనుచూ - లేస్సాగా మ్రొక్కూలిడుదూ పేక్కూరూపములా తోడా !!విశ్వామంతాయు!!5!!

గ్రంధకర్త అభిప్రాయం

సకలశాస్త్రంబుల సకలార్ధములు నెల్లచదివి చేయగలేదు సవినయముగ విద్వజ్జనుల తోటి వినిపింపు కొనలేదు - వీతరాగులనోట వినుటలేదు - సజ్జనమైత్రియు సల్పుటేమియులేదు సత్క్రియాపనులైతె సల్పలేదు - శ్రవణమననానిధి ధ్యాసలు మరిలేవు !!దర్వు!! శిద్దూలేమీయు తెల్యానూ- సద్గురు ధ్యాన్నంబు శ్రద్దాతోడుతాజెశెనూ - కోద్దీగాజేశీనాను మూద్దూలయ్యానె దయతో

చీద్దీనారద్దీబాపీ సూద్దీ జెప్పించెవాచా !!శిద్దూలేమీయూ తెల్యానూ!!6!!

కేవలగురుకృపా సోమరసంబుచే కల్గినపలికికా కవియుగాదు - కావ్యచందస్సులు ఘనమైన విద్యలు అవియుజూడగ లేదు అంచితముగ - ప్రజ్ఞకొరకిదిగాదు ప్రజలుమెచ్చనుగాదు కామినై చేయుట కాదెయిదియు-తప్పువప్పులుఅన్ని తరచిచెప్పగలేను !!దర్పు!! జనూలు మెచ్చేదా రంచూనూ కాదూగ్రంధామూ ఘనూలూ మేచ్చేదారంచూనూ - అనూమానమూను లేకపనిబూనీ శేయనాయ మనామూన గురుణీశేవా యిదీయంచు చేయనాయె !!జనూలు!!7!!

సుజన లక్షణం

తలిదండ్రులెవరైన తనయులతప్పులు తలచని విధమునా తత్వవిదులు - తప్పులుయెంచరు తమలోనలేవవి వప్పైనఅర్ధముల్ జేతురిలను- అనుభవంబునుగొందు రతిసంతసంబున బోధింతు రిల భక్తవరులకెంతో మెప్పించిచెప్పేరు మేదినిలోపల !!దర్పు!! చప్పూడయ్యేటిస్థలమూలా- చదు వారు యివియూ- మేప్పూలయ్యేటిస్థలమూలా- మేప్పించూదురు తామగొప్పా గ్నానాముచేత తీప్పాల పడియూనైనా తప్పూలు వెతుకకగ్నాని !!చప్పూ!!8!!

దుర్జన లక్షణం

తత్వహీనులు గ్రంధసారంబు దెలియక తర్కించుచుందురు తప్పువెతకి- తమకర్మముల చాత తగుగ్నానములేక తమలోనయున్నట్టి తక్వబుద్ధి-యెక్కువేననుకొని యెగబడితిరుగుచు పెక్కునిందలుజేశి పేర్లబెట్టు- పిలువనిదె తాను ప్రియముతోడుతవచ్చి !!దర్పు!! పేరాసతోడా గూడియూ-పెద్దలకూ గలదని- మారూలెస్సాగబల్కియూ-సారెసారెకు పరులాదూరు చుండేటి వాని - నోరుముయ్యూము అనుచు దీరూలుజెప్పినాను !!పేరాస!!9!!

పెద్దలందరుగూడి బుద్దిగాదిదియని వద్దికతోజెప్ప వదరుచుండు - ప్రాకృత మతిచేత బహు నిందెలనుజేయు - బుద్ధిలో వున్నంత సుద్దివెడలు - మనసులోసంకల్ప మరియేదిగల్గునో అదియె పూర్వావాస ననిరిబుధులు- పాపపుణ్యంబులవలన సంకల్పంబు !!దర్పు!! తోచినాపల్కూ పల్కూనూ సంకల్పా గుణఫల - వాచాక్రియతోడా చిల్కూనూ - తోచానిదెటులాబల్కు తోచింది పల్కూగాని సూచనదెలశెవారితో తోఛీతోచానిమాట !!తోచినా!!10!!

విగ్నాపన లక్షణం

వినరయ్య జనులార విధమచలంబుది కరుణించి యీబోధనయము వినుడీ- పురుష శ్రేష్టులార పుణ్యఆంగనలారచిన్న పెద్దాలార శిష్యులార- సకలజాతులార సజ్జనోత్తములారా మత భేదములుగల మనుజులార - సతులారసుతులార హితులార మతులార !!దర్పు!! బంధుమిత్రూలు అందారు - భవహరణామునకూ - ముందూగాయిదియుఅందరూ - సందేహమూనులేక చదివేది వినుడిమీకూ - అందీతె చదివీ దీని అర్థామెల్లాను కనుడీ !!బంధూ!!11!!

గురు అభయ లక్షణం

యేకాంతమునను తదేకధ్యాన్నంబునా - నుండగాయీ గ్రంధరూఢితోచె- గురుశిష్యు లిరు వురు గూఢపదంబుకై ప్రతివాదులైనటుల కథనుగల్గె - మతిమంతులార యీ మర్మంబు దెలశియు నిర్మలులై మీరు నిజముగనుడీ- వుపకారస్మృతి యిది వుత్తమగురుశేవ !!దర్పు!! అభాయమాయెను యిటువలె-నిజగురునినోట-శుభముబొందినయటువలె-వుభాయూల మున్నాయపుడు అభయామయ్యూనవార్త- సభావారుచూడ యిదియే ఘనామొకించామొ కాని !!అభాయా!!12!!

లేనికలలోముందు లేకనెవచ్చియు గురుణిసత్కృపవడశి గుట్టుదెలశి - కలలోననావలె గల్గినజనులార పలువరించితిగ్రంధపలుకు వినుడి- యిందులోనున్నట్టి చందంబుగని మేలు కొందురు మీరునిస్సందియముగ- ననుమేల్కజేయుడి విని సమ్మతించియు !!దర్వు!! కలాలో ముచ్చాటలనకుడీ యీజగమెకలయని - తలాపోశి మదిలోగాంచుడీ - కలాలోని ముచ్చాటంత తగ మాటలాడుకోని కలావీడిమేలుకొనిన యిఘూరాము కలలోమళ్లీ !!కలా!!13!!

సంసారసాగర లక్షణం

సాధనసంపత్తి సద్విచారుండొకడు పూర్వపుణ్యంబున భూతలమున - జననమరణంబను జల ప్రవాహంబున సంసార సాగరంబందుమునిగి - మాయజాలంబనె మోహసుళ్లలోబడి క్రిందు మీదొచును అందులోన - ఆశపాశంబను అరికట్లచాతను !!దర్వు!! ధారాపుత్రాది సంఘామూ - జలజంతూవులచే పారాములేని దు:ఖామూ-ఘోరావారాధిలోన దారీచూచిన-ఆ - పారావారాంభు దాకారామానంతాము !!ధారాపుత్రాది!!14!!

వూపిరి ఆడక వోపికలేకను తాపదు:ఖంబుతో తల్లడించి - యేమిశేయుదు నేను యెవ్వరు దిక్కిక నన్ను దాటించెటి ధన్యుడేడి- యెక్కడనున్నాడొ చిక్కులోపలజిక్కి- మునుగుచు తేలుచు ముందుగాన - అనిఅపర్మితముగ ఆలాపనము జేశి !!దర్వు!! ఆక్కారతోను జూడాగా అనంన్యా గతికుడు- వోక్కాడె దేవుండనగా- మిక్కీలి పూర్ణులైనాచాక్కాని సద్గురుమూర్తి ఫ్రూక్కూన చనూ దెంచె దైవావోశంబునాను !!అక్కారతోను!!15!!

సముద్ర లక్షణం

శింధువులోపల చిక్కిన నరుడందుమిణిగి తేలుచు నందు ముందుగనక - దైన్యంబు జెందగా దైవవశంబున పెక్కుదినములనాడు పెద్దగాలి వచ్చిసూత్రములన్ని వదలజేశిననౌక జాడలేకుండను పోయినట్టి - నౌకవచ్చెను మిణిగెవాని సమీపమున !!దర్వు!! వాడూబట్టూక దానీతో దరిజేరినటులా - కూడావచ్చెనూ గురుడటూ - గాఢాపెదాకుద్రవ్యా లాభామబ్బీనాయటులా చూడా అంధనికీకండ్లు తానేవచ్చీనాయటులా !!వాడూ!!16!!

గురుదర్శన లక్షణం

కమలాప్తుడరుదెంచ కమలంబులకు తెల్వి కుముదాప్తుడొచ్చినా కుముదములకు - కామినీ గనుగొన్న కాముణిభంగిని - జారిణిపర వరుని జేరువిధము - చాతకంబుకు మేఘజలము దొరికినయటుల అతిలోభికిని ద్రవ్యమబ్బినటుల - పతివ్రతా స్త్రీలెపుడు పతినిగనుగొన్నటుల !!దర్వు!! మీత్రూడగుపడ్డాజూడాగా - మతిపొంగీ వేగమె మైత్రీ ఆనందమొందాగా - నేత్రామూతోడా గురుణి చూచీనా మాత్రామూన - ధాత్రీలో శిష్యూడటులా దోశీలొగ్గీయునిలచీ !!మీత్రూడగుపడ్డా!!17!!

శిష్యుడు గురువును ఆశ్రయించు లక్షణం

దేశికస్వామినీదాసుండనని నాల్గువిధముల శిశ్రూషలమరజేశి- హేగురునాయక వో భక్త పాలక అని దర్శనమున ఆనందమొంది - ద్వాదశసాష్టాంగ దండములర్పించి నీతుడై వినుతించి భీతితోడ- మీదర్శనస్పర్శనంబులచేతను!!దర్వు!! మేలూగల్గేనుభూవరా- అజ్ఞానాంధునికి మేలూ గల్గేనూ ధీవరా - చాలాచీకటినీ సూర్యుడు జ్వాలాలచేద్ర్యంచీన - కీలూరీతీన నిన్ను చూడ గల్గీనాతోడా !!మేలూగల్గేను!!18!!

మీరావడముతోడ నేకృతార్థుండైతి నాజన్మమీడేరె నవనివినుత - ఆగ్జాన ఘోరాంధఅతిపాపు లైనను ఆధరించెటి వారు మీరె అనుచు - వినిచాలనూహించి మనమున హర్షించి నన్ను రక్షించను నయముతోడ - వచ్చినట్టాయను వరుసయెటువలెనన్న ‼దర్వు‼ కరాపాదమూలు లేకనూ నున్నట్టి వానికి సరాగూన గంగాస్థానమూ - గరిమెట్లుగల్గూననుచూ గాఢాముగానూ గోరగ అరూదూగా గంగావచ్చీ అతానీపై బాలీనటులా ‼కరాపాదమూలు‼19‼

ఆలీతి గంగయు అతిదయారసమున అతిపావనము జేశినటులమీరు-అగ్జానసంసార మరు కాంతముననేను ముణుగుచు తేలుచునుండగాను - యెన్నికచేశియు మన్నించివస్తిరి యెన్నడో చేశిన పుణ్యమిదియు -మీరువచ్చుట కార్యమిచ్చటెమియులేదు ‼దర్వు‼ నన్నూపావనమూ శాయానూ వచ్చితిరి వేగానిన్ను విడువాను నిత్యమూ - మన్నించూడనచూ మహసన్నూతి జేయుచూను - యెన్నీవిధమూలా వారికిమన్నాన జేయూచూను ‼నన్నూ‼20‼

గురువుతనలో ఆలోచించు లక్షణం

తనలోనయిట్లనె తత్వవేత్తలుముందు - శరణనువారిని కరుణతోడ - మదివానిదెరగియు మరిదెల్పిరనుచును మనసులో యోచించిమరిగురుండు - శాంతిసజ్జనమైత్రి చదువరిసుగ్జాని భ్రాంతి రహితునకెరుక బడును పరము - అనుకొని గురువరుండతని పరిక్షింప ‼దర్వు‼ కనూగోని తెల్పావాలేనూ -అధికారియైన ఘనామైనా బ్రహ్మపదమనూ - వినాయామూతోడ వానికి యెలీగింప వలెనుగాని - అనుమానమూనా భ్రాంతి ఆశావదులాని వారికి ‼కనూగోనితెల్పావాలేనూ‼21‼

అవునోయి అటువంటి ఆర్యులు వున్నారు అనియునే విన్నాను అవనిలోన నీకుకావలెనన్న నిజముగాదెత్తును వారు యెచ్చటనున్న కూర్మితోడ - అనినవ్వుచునువార్ని ఆశ్రయించితి వేని మేలౌను నీకిక వాలయముగ - యెవరికి భవరోగ మెవరు శమింతురో ‼దర్వు‼ వాలీనెప్పూడు విడువాకా అందారాదారితో చెరీలీ పరమూ వారికా - వారూవీరనగా నేనుబాగావిన్నాను వినుమూ వాలీని వదులాబోకూ చేరావత్తూరు వారి ‼వాలీనెప్పూడు విడువాకా ‼22‼

శిష్య విగ్జాపనము

మీకంటె పెద్దలు మించియున్నారని వారినిదెచ్చెద వసుధలోన - అనిపల్కెదరు నన్ను అడవిలో గలపియు దాటిపోవుదమనుచు ధన్యచరిత - పెద్దలుమీరని వద్దికివస్తిని మిమ్ము విడువను మీదమిన్నుబడ్డ- సన్నుతించెదమీకు సరియెవరు లేరని ‼దర్వు‼ కన్నావారాలు పరమునూ భవమేమీ లేక నున్నావారాలు నిజమునూ- పన్నూగాపరులూనాకూ యెన్నీ జెప్పీనగాని- నిన్నైతె విడువాలేను నన్నూ కావూమిదేవ ‼కన్నావారాలు పరమునూ‼23‼

లోకంబులోపల మీకంటెయెక్కువ లేరనినామదికి లెస్సదెలశె - వున్నారుఅనిమీకు తిన్నగా తెలశితెమీకె ధృడంబది నాకులేదు - యెవరితో సౌఖ్యంబు యెవరికికల్గునో -వారికివారలె వాశియ గును - కానిగురుదైవంబు వెరెవ్వరును లేరు ‼దర్వు‼ ఆధారించూమీ గురువరా -ఆజ్ఞానావారధి బాధాబాపూమీ ప్రభువరా - భెదాములేదూ చదువులేది చదువాగలేదు - మీదాయాతోడా మూఢుని వేదాబాపీయు నన్ను ‼ఆధారించూమీ గురువరా ‼24‼

గురువాఖ్యము

యేమిదెలియదటంచు యెక్కువ బల్కేవు మాటలుచూచితె కోటలెగురు - తెలియని వాడెట్లు తేటమాటలుబల్కు తెలియకయుక్తులు తేటపడవు - చదువులలో నోకటిచదువలేదంటవు

చదువరి క్రియతోను సన్నుతించి - భళినీదు వాఖ్యముల్ బాగున్నవనుచును !!దర్వు!! యేమీకోరీకా నీకునూ వున్నాది చెపుమూ నేమామ జెపుదు నీకునూ- నామారూపాముగాల నేమామ అనుచు మదిలో తామాసాయెరుకాజోలీ వీనీకిబాపెననుచూ !! యేమీకోరీకా!!25!!

శిష్య విగ్జాపనము

యేమికోరికలేదు యెయాశయును లేదు అన్నికోరికెలన్ని అణుగ జేశి యేకోరికలు గలుగ కుండనుజేశెదిఅదియుకావలెనాకుఅవనివినుత యేసాధనముగాని తగుసాధనంబును యేయో గమును గానిదదిసుయోగ- మునుదెల్పుమనుచును ఘనముగ వినుతించి !!దర్వు!! జపాతాపా మూలు లేనీదీ-జన్మాదు:ఖాది కుపీతామార్గములుకానిదీ- వుపామూచెవ్రతనేమాది క్రతూమాత మూనుగాల -కపాటావీచారామూల గాధాలుగల్గెవట్టి !!జపాతాపామూలు లేనీదీ!!26!!

గురువాఖ్యము

ఆయోగమబ్బుట అతిదుర్లభంబది కాదు నీ చేతనుకష్టతరము - అతిసూక్ష్మ సుగ్జానికదిపదీ రొండును - సప్మూత్ఛరములకు సాధ్యపడును - అంతకు యెక్కువ ఆగ్జానికిరువది నాల్గుయేండ్లకు నమరునయముతోను-అతిమూఢునకుముప్పదారుటికబ్బను యిన్నిటికన్ననుయింకతక్కు వయ్యున్న నరునకు అంతులేదిక విను !!దర్వు!! యెన్నీకాలేదూవేగమె యెదివరకొ కాని మన్నానలేదూ వేగమె అన్నీయోగాదూలు ఆభ్యాశించితెగాని- యెన్నాపరలోకములకూ యేగా వచ్చాను వినుమూ !!యెన్నీ!!27!!

శిష్య విగ్జాపన

యిన్నిదినంబులు యీ యోగమును జేయుచున్నందుకును ఫలంబొందెదేదో - యెయోగ మైనను చేయబూనినవారు తాపద:ఖంబులుబాయుకొరకు - యీ యోగములు యిన్నిదినముల కంటిరి దానికి ఫలమేదివారిజాక్ష - దాచక అంతయు దయతోనుజెప్పుడి !!దర్వు!! మీదూసేవాకూ పాత్రూడ యిఘయింతాకన్నా లేరూ యెక్కాడామిత్రూడా - పోదోలుమయ్యా మాయపాదూలేకుండా జేసి భేదామెంచాకుడీ మీవాడనైతీని నేడూ !!మీదూసేవాకూ!!28!!

గురువాఖ్యము - చతుర్విధ శుశ్రూషల వివరము
స్థానశుశ్రూష వివరము

స్థానశుశ్రూషయు సరగునవినవోయి సద్గురుడున్నట్టి స్థలమునందు - మలినములేకుండ మరిశుద్ధమునుజేసి ఆసనశయనాదులన్నిజర్పి - జపతపానుష్టాన్నజయతతులొనరించి పుష్పఫలాదులు పూనితెచ్చి - గృహరామక్షేత్రముల్ గురుణి సంగంబగు !!దర్వు!! ధనాధాంన్యదారా పుత్రులూ- పశువర్గామాది - వినూమీ కాపాడుమిత్రులూ - వినాయామూతోడాను యేవిధామైనా నష్టామూను - ఆనయాము గల్గకుండ అభీమానముంచీ వారికి !!ధనాధాంన్య!!29!!

అంగశుశ్రూష వివరము

అంగశుశ్రూషయు అతిశయంబునువిను ఆగురుణిదేహసర్వాంగమునను - మలినము లేకుండ మరిస్థానఆభ్యంజనాదులు జేయించిమంచివస్త్ర-భూషణంబులు అన్నిబుద్ధీతో నుంచియు పాదపూజాదులూ భక్తితోడ- సేవించిదర్శించి చెలగివినుతించి!!దర్వు!! కృపాకూ పాత్రూడుకావలె గురిలెస్సా వుంచీ - వుపాచారామూలు చేయవలె - ఆపాకారమూలు మాని వుపాకారివయ్యినీవూ ఆపావర్గామార్గామెల్లాగురూనానందాముజేసి !!కృపాకూపాత్రూడు!!30!!

భావశుశ్రూష వివరము

భావశుశ్రూషయు భక్తిశ్రద్ధలతోడ బాగుగ వినవోయి భావమందు - తనతల్లితండ్రియూ దారపుత్రాదులు ధనము సహోదరుల్ తనవుమనుసు - గురుణిసొమ్మని తెలశిగురుడె దైవంబని దాతయు భ్రాతయు ధనమటంచు తనతల్లితండ్రులు తగబంధుమిత్రులూ !!దర్వు!! గురూడేసర్వాము అనవలే- తనలోనానిరతము- మరూవాకమదిలో ఆనవలే- గురూడేఅనాదిఆది గురూడె ప్రియమైనా వస్తువు - మరుగూ తెల్పిన గురుణీమహిమా తెలసీనతోడా !!గురూడేసర్వాము!!31!!

ఆత్మశుశ్రూష వివరము

ఆత్మశుశ్రూషయు అతిశయంబును వినూ అంతరంగముతోడ ఆదియుజేయు - గురుడె దైవంబనుచు గురితోను తెలసియుతెచ్చి సమర్పించితెలివితోను - యిష్టములను దీర్చికష్టముల్ రాకుండ కాపాడవలయును కరుణబొంద - గురుడుకోరినదైన కొనివచ్చియిచ్చుచు !!దర్వు!! సంతోష మొందాగావలె- సద్గూరుమూర్తి చింతాలన్నీయూ పోవలె - పంతాములేకాయిన్ని పద్ధాతు లన్నిజేయా వింతాగా బయలూబయలౌ సొంతాము గురుణీవలనా !!సంతోషమొందాగావలె!!32!!

సాధన చతుష్టయ వివరము నిత్యానిత్యవస్తువివేకం

సత్యంబుబ్రహ్మమసత్యంబు జగమని నిత్యంబు మదిలో భావించవలెను - తనశరీరము భార్య తనయులు చుట్టముల్ యిల్లువాకిలి ధనము యీ ధరంత - భూనభోంతరములు బుధదేవదానవుల్ బ్రహ్మవిష్ణీశ బ్రహ్మాండమంత నామరూపంబుగల నఖిలదృశ్యంబంత !!దర్వు!! నాశ్యామయ్యేది చూడుమీ -ఆస్తిరమూ మిధ్యని -ఆశాలన్నీయూవీడుమీ -నామారూపాములేకా నంతామానందామైనా శాశ్వితా బ్రహ్మమొకటీ సాత్యాముయనుచూనమ్మూ!!నాశ్యామయ్యేది!!33!!

యిహాముహూర్థార్థఫలభోగ విరాగ వివరము

యిహాముహూర్థార్థ ఫలభొగవిరాగంబు యిది రొండోసాధనా యికను వినుము - మిద్దెలు మేడలు మిగులసుందరమగు వస్త్రభూషణములు వనితభోగ- పుష్పచందనములు పునుగు జవ్వాజియు అత్తరుపన్నీరుఆదిగాగ - పరలోకములయందుగల భోగములయందు !!దర్వు!! రంభా సంభోగామందునూ- రమణీయామైనా- కుంభిణీభోగామందూనూ- సంభ్రామమైన స్వర్గా సాత్య వైకుంతామాది - సంభావమయ్యే విన్ని చాలించుకోరాకుండు !!రంభా!!34!!

శమాదిషట్క సంపత్తి వివరము

శమదమముపరతి శ్రద్ధతితీక్షలు సమాధానమనియెటి షట్కములును - మనుసుబుద్ధియు చిత్త మరియు నహంకారమంతరేంద్రియములా నణచ శమము -బాంహ్యేంద్రియములను బంధించదమమగు సకలపాపంబులా సడలజేసి- సకలపుణ్యంబులా సల్పగావుపరతి!!దర్వు!! సుఖా దు:ఖాములకూ నోర్చూటా- తితీక్షాయగునూ-యికా శ్రెద్ధాగల్గీవుండుటా- సకలావేదాంతా శాస్త్రా సాద్గూరూ వూలయెందూ- ప్రకటూరాహశ్యాములనూ పొందా సమాధానామగును !!సుఖా!!35!!

ముముక్షత్వ వివరం

తనగృహంబగ్నిచే దగ్దంబుగాగను తాపరుగెత్తి విధమునాను - ఘోరసంసారణ్యకూపంబు లోపల తాపత్రయాగ్నియుతగిలికాల - అగ్నిజ్వాలలకును అలశినపురుషుడూ మోక్షంబుమీదనాపేక్ష గలగి - అత్యాదరతతోడ అతి తీవ్రమునుగల్గి !!దర్వు!! సంతాపమొందూచుండునూ - సద్గూరువూ లెవరని - యెంతోవెతుకూచునుండునూ - యింతా పరితాపామొందీ యిఘూ దిక్కూయెవ్వారాని

సంతాతమెతెకూటిదియె వింతా మూముక్షూవగునూ !!సంతాపమెొందూచుండునూ!!36!!

అభ్యాసయోగంబు అదినీకుయెరిగింతు అష్టాంగయోగాదినిష్టలెల్ల- చిత్తంబు పరిపక్వ మును లేనివారికి కర్తవ్యమైయిదీ కల్గియుండూ - వుత్తమగురుజేరి వూహించిచేశినా - సత్తతో అన్నీయూ సరవికలుగు - మత్తలన్నియుబాయు మరిబ్రహ్మగ్జానంబు !!దర్వు!! సొత్తాతోడూత కల్గునూ సర్వాయోగములూ - మొత్తామవ్వూను వెల్గునూ - అత్తారిఅన్నీనీవు చిత్తాములోనాతెల్యా - మత్తాల న్నీయూ బాశి మార్గాము మంచీదవునూ !!సొత్తాతోడూత!!37!!

అష్టాంగయోగములు

యమనియమాసనా యోగప్రాణాయామ పరగప్రత్యాహరధారణంబు - ధ్యాన్న యోగంబును తగు సమాధంచును అష్టాంగముల యోగమమరుచుండు - యోగంబునకు యెన్మిదంగంబు లుండును అంగంబులకును ప్రత్యాంగములును- కలిగుండుకావున కష్టతరమును వినూ !!దర్వు!!యోగాయోగాములానికా - సాక్రమమూగానూ - బాగూగదెల్పెదానికా వేగామూ తోడా యివియూ నేమాముతోడాజేయూ - జాగూలేకాను యిన్నీ బాగూగా జేయవలెనూ !!యోగా!!38!!

యమ లక్షణం

యమము దెల్పెదహింస సత్యమాస్తేయంబు బ్రహ్మచర్యము క్షమాధైర్యములును- దయ అర్జవంబును తగుమితాహరమును - శౌచంబుతోడను చలగిగూడి - యెమదశకంబని యెర్పాటు లాయెను -యెరిగింతుమవి అన్ని వేరువేరు -వేదోక్తముగ మనోవా:కాయములతోడ !!దర్వు!! హింసా చేయాకయుండుటా - యెయాత్మనైనా - ధ్వంసామెొందిచా కుండుటా - హింసాజేశినా ఆహింసాన బడదూ అని- అంశాయెరిగీనా హింసా అవునూ సంశాయమేలా !!హింసాచేయాక!!39!!

విన్నదికన్నదివున్నది వున్నంత దాచకచెప్పుట సత్యమగును- బ్రహ్మమెసత్యము బ్రహ్మాండ మంతయు మిగిలిన వశ్తిరం మిధ్యయనుచు- బుద్దియెందుండుటే భువిసత్యమనబడూ పరుల ద్రవ్యముపైన పరగకాక్ష యుండక యుండుటే ఆశ్తేయమనబడూ !!దర్వు!! ఆత్మాయెందూనా యెప్పుడూ - ఆనాత్మక్రియగల - ఆశ్తీరాక్రియలానెప్పుడూ - ఆత్మాలో లేకా యుంటె ఆశ్తేయామనగా నోప్పూ - సూస్తీరా మతితోయిన్ని సుమ్మీసాధీంచావలెనూ !!ఆత్మాయెందూనాయెప్పుడూ!!40!!

తనపత్నితోడను రుతుకాలములయందు కలయుచునుండుచు కాంక్షలేక మైదున క్రియలును మాని వర్తింపక వుండుటెల్లను బ్రహ్మచర్యమగును - జన్మంబుమొదలును జననితో వనితను సమముజూచుట వఘాచర్యమగును - తనమనసు బ్రహ్మభావన యెందునిల్పుట !!దర్వు!! నిదేబ్రహ్మేచర్య మందూరూ - ఆనాదిఅయినా - నదేబ్రహ్మేతత్వామందూరూ - పదిలామతోడా ఆత్మాముదీతోడా గలశీనపుడే - వదులాక బ్రహ్మేమందూ నదీబ్రహ్మేచర్యామగునూ !!నదేబ్రహ్మే!!41!!

తనశత్రువులతోడ తగదు:ఖములు కల్గినప్పుడు మనుసులో నొప్పుగాను - చెలనమెంతయు లేక చంచలంబుడుగుటే క్షమయనబడునికా చెల్వుమీర-తనయెందు వుండేటి తగుకామ క్రోధంబు లోభమోహము మదమత్చరములు - షడ్వర్గములయందు తగులక మదినెపుడు !!దర్వు!! ఆధాగించాకవాలెనూ - మదినదిమీ పట్టీ - జీడ్డూతీయాగవాలెనూ - దీడ్డీలోయీగా జేశి దివ్యాపద మెొందాజేశి - అడ్డీగాక్షమయూనవును ఆబ్బాయా వినుమీ వేగా !!ఆధాగించాకవాలెనూ!!42!!

వేదవేదాంతశిద్దాంత వాఖ్యంబులే భవవార్ధి దాటించుననుచు తెలశి - యితరముచేతనూ యిది నివర్తించదు అని తెలివినొందుటే ధైర్యమగును - నేనాత్మలేరనీ నేర్పులేకుండుటే - స్థిరబుది

నుండుటే ధృతియునగును- సకలజీవాత్మలు తనఆత్మవలెనని!!దర్పు!! వకాటె విధమూను జూచుటా దయతోడాఅన్ని- యికామోక్షామొందాజూచుటా- సకలాము తనవలెగ్గానం యికా కల్గావలెనూ అనుచూ-ప్రకటించూటిదియెదాయ- యికా దేల్పుమింకాగలవూ !!వకాటెవిధమూ!!43!!

పుత్రమిత్రకళత్ర శతృవులందునా తనయందుసమబుద్ది గల్గుటయును - అర్జవమునబడు అలగురువులందున -శిష్యులందునచిత్తమొక్కబుద్ది యుంచుట ఆర్జవంబయ్యి యుండును యోగమునకును ననుకూలమైన మంచి -భోజనంబును జేశివకపాలుజలమును !!దర్పు!! గ్రోలు చుండాగవాలెనూ -వకపాలూవాయువు పీల్చూచుండాగావాలెనూ - కాలాదేశాము నుంచీ కల్గేది యేదీఅయినా- మేలూగా శ్వీకారించామితాహారమిదియెవత్చా !!గ్రోలుచుండాగవాలెనూ!!44!!

తనశెరీరమునందు తగుమలంబులనెల్ల-మృత్తికాదులచేత కడిగిజలము స్నానంబు జేయుటే బాంహ్యాశౌచంబును పరిశుద్దుడను నేను అనుచు దెలశి -గ్నానమొందుటె అంతరంబైన శౌచంబు అయ్యుండు అంతరంబమలమైన-శౌచమయ్యుండును చెలగిచెప్పినవన్ని !!దర్పు!! మొదాటీది బాంహ్యామందూరూ - తదుపరివీరంతర సాదానమూలుఅందురూ ముదామోప్పా యిటులా జేయా యెమాయోగమవునువినుమూ - యిదీగాక వున్నావాటి వివారాము తెల్పెదాను !!మొదాటీది!!45!!

నియమలక్షణం

నియమదశకంబును నీకెరింగించెద వేదోక్తముల చేత వెలయుతనువు -శోషణజేయుటే సుమ్మితపమును యిదిబందమోక్షముల సంసారములను-కూర్చిజెపించుటా కూర్మితో జపమవును తనకు లభించినాదానియెందు - తృప్తినోందుట బహుసంతోషమయ్యుండు !!దర్పు!! ఆత్మాగ్నానాము కోరుటా ఆశెమిలేకా -స్వాత్మారామామునందుటా -ఆతీరుయిహమూ పనమూ లోకావస్తూవు లందూ అశెమిలేకా యుండుట అదియే సంతోషామగునూ !! ఆత్మాగ్నానాము కోరుటా!!46!!

శృతులును సృతులును సూత్రముల్ దెలశియు - విశ్వశించుటయు ఆస్తిక్యమవును గురువాక్యమును సమ్మికూడి వర్తించుటే - ఆస్తిక్యమందురూ అవనిబుధులు -న్యాయమార్గంబున ద్రవ్యము ఆర్జించి భక్తులకొసంగుటంబగును దాన - తనకులభించినా పరతత్వమార్గంబు !!దర్పు!! తాత్వామరశేటీ వారికీ తగుశిష్యూలాకూ ఆత్యంతాదయతోవారికీ - నీత్యామయ్యాన వసూ నిజామూగాతెల్పాగాను - సాత్యామయ్యానా దానము వుత్తామమయ్యుండూ !!తాత్వామరశేటీ!!47!!

శెక్యానుసారము చెలగిబ్రహ్మాదుల అర్చించుటయు యీశ్వరార్చనంబు - రాగాదిగుణదోష రహితుడై యెప్పుడు సత్యవాక్యంబులు సరవిబల్కి - హింసలుజేయక యిలకర్మజేయుచు నుండుటే యీశ్వరపూజనంబు - సత్యముగ్నానమనంత బ్రహ్మానంద !!దర్పు!! అయినాది అంతారాత్మనూ అనితెలయుట శ్రవణం బయినాది యనుచూ తెల్పనూ - అయ్యాగురువా:కూనుండీ అదీపార వస్తువాయె సయ్యాన ఐక్యామగుటా చెయ్యాన శ్రవణామగునూ !!అయినాది అంతారాత్మనూ!!48!!

వైదీకలౌకీక వరుసమార్గములకు వరుసదప్పిన ఖర్మవదలుకొనియు-వర్తించుటయు లజ్జ వసుమతి లోపల వరుసదప్పిన వారివద్దజనక- సంభాషణంబును చాలించుటే లజ్జ సకలవైదీక కర్మములయందు - పరగవర్తించుటే పరమైన మతియగు !!దర్పు!! గ్నానసంపన్నా మెప్పుడు- కావలయూనవెదీ ధ్యాన్నామె మనియూయెప్పుడూ-మానూగావేదాక్రమము మంత్రాము పరియించూట ధ్యాన్నామె జపమూఆయె తగాకల్పానాసూత్రామూ !!గ్నానసంపన్నా!!49!!

వేదాశాస్త్రపురాణ వేదాంతశిద్ధాంత యితిహాసములు భవ్యచరితములును - అభ్యశించుట జపము ఆజపలక్షణం -మానసమనియు వాచీకమనియు రొండుతేరుంగులు వుండు వాచీకము ఉపాంశువువుచ్చము వుచితముగను- మానసంబును ధ్యాన్నమననంబులును రొండు !!దర్వు!! విధాములుండూను వీనూమూ-మననాధ్యాన్నంబులె అధీకాఫలమిచ్చూకానుమూ యిదీ గాక వకటీవినుమీ ఆజాపామంత్రాముజాడ- అదిమంత్రాజపమూ అవునూ విదీతజ్ఞా వినుమీవేగా !!విధాములుండూను!!50!!

వేదోక్తవిధి నిషేదంబులనెల్లను విధినిత్యకర్మముచేయువినుము - గురువాక్యవిధమునూ గూడివర్తించుటే వుత్తమవ్రతమనీ వుచితులండ్యు - యెమనియమంబులూ యెలమిచెప్పిన వన్ని దశవిధంబులలోన విశదముగను - రొండోవిధంబును అండజెప్పినభంగి !!దర్వు!! సల్పూచుందూరు జనులికా మొదటీవీ వోదలీ నిల్పూచుందూరు మునులికా - అల్పాముఅవియూ అనుచూ కల్పామె మనుసూఅనుచూ- అల్పామునేప్పూడు నిల్పాదోషంబు యనుచూ !!సల్పూచుందూరుజనులికా!!51!!

దేహింద్రియంబులా తెంపును గల్గుటే యమయోగమదియగు వేడ్కతోను-పరతత్వమందు నా పరగబుద్ధ్యుండుటే నియమయోగంబిదె నిజముగాను- సకలవస్తులమది సంచారమును లేక మెలగుటేఆసనంబవును భువిని-విధ్యాప్రపంచంబు మద్యగాదోచుట!!దర్వు!! ప్రాణయామామూ ఆయేనూ మదినీలోగొనుటా- ప్రాత్సాహరామునాయెనూ- అనూవూగా బుద్దిస్థిరమేఅదీ ధారాణాము యగునూ-వినులోనానెనెయనుచూ వినీచింతా ధ్యాన్నామగునూ !!ప్రాణ!!52!!

అసనలక్షణం

ధ్యాన్నంబు మరచుటా తగుసమాదనబడు తప్పకయెణుబది నాల్గులక్షల జీవరాసులుగలవొ ఆసనంబులు జూడయెణుబది నాలుగూయెన్నికాయె- అందుముఖ్యము నాల్గ అసనంబులునాయె శిద్దాసనము పద్మశిహ్మభద్ర- అసనంబులుఅన్ని శిద్దులొసంగును !!దర్వు!! కాయాశిద్దూలునిచ్చునూ వుపాధీగల్గె మాయామలమూలా బాపునూ - పాయాకవినుమూవీటీ పాద్దాతి సూక్ష్మామూగ న్యాయా ముగాను జేయ -నౌనూశిద్దూలుఅన్ని !!కాయాశిద్దూలునిచ్చునూ!!53!!

సిద్దాసనం

వామపాదంబును వరలింగస్థానంబు పైమడిమనుంచియూ పదిలపరచి - దక్షణపాదంబు దగుదానిపైనుంచి మనుసు భ్రూమద్యమున మరులజేశి - చక్కగా కూర్చుండి కదలనిచూపును రూపుయెందునజేర్చిరూఢిగాను - వుండుశిద్దాసనంబందురు దీనినే !!దర్వు!! మూక్తాసనాము యందురూ గుప్తాసానామూ రక్తీబాపెటీదండురూ - యుక్తాముగాను వజ్రాఅసానామౌనూ సుమ్మీ భాక్తీతో అచారించా మూక్తీకి మార్గామవునూ !!మూక్తాసనాము యందురూ!!54!!

పద్మాసనం

యెడుమతొడ మీదను కుడిపాదమునువుంచి కుడితొడపై యెడుమపాదముంచి - వెనుకా ప్రక్కానుంచి యడుమతొడపైవుండు -కుడిపాదమునను కుడిహస్తమునను -కుడితొడపైనుండు యెడ్మపాదంబును యెడ్మహస్తముచేత వేగబట్టి గడ్డంబు హృదయంబునకు వేగనాల్గను !!దర్వు!! అంగూళమూలు అంటకా అనాశికముపై అగ్రామందూనాఅంటికా - పొంగూగామనుసూ వుండ బిందూవీక్షించూటె-సంగాతిపద్మాసనమె మంగాళ అసనమవును !!అంగూళమూలు అంటకా!!55!!

శిహ్మాసనం.

రొండుఅండంబులా క్రింది నరములయందు తొడలవెనుకకు సోకునట్లుజేశి - కుడికాలుమడిమను యెడుమప్రక్కనుజేర్చి- యెడుమపాదము అట్లెకుడినజేర్చి రొండుమోకాళ్లపై రొండు హస్తంబులా సవ్యంబుగను వేళ్లుసంపుటముగ-జేశినోరునుదెరచి నాలుకవెలిజాచి!!దర్వు!! నీక్కీకూర్చుండా వాలెనూ ఏకాగ్రముగనూ -ద్రూక్కూనిల్పూకోవాలెనూ- చక్కాగ మనసూనిల్పీ ఘ్రూక్కూన జూచూటిదియె- వక్కాటెసింహ్మాసనము పేక్కు బంధములాబాపు !!నీక్కీ !!56!!

భద్రాసనం.

భీజనరములక్రింది బిగువుగా కుడియెడ్మ మడిమలుజేర్చియు మంచిగాను - యెభాగముకు వుంచేదాభాగముకు వుంచి వుండుటే భద్రాసనంబు వినుము - రొండుప్రక్కలనుండి రొండు పాదంబులు రొండుహస్తంబులావ్రేళ్లచాత- బిగువుగాబట్టిన యిదియెగోరక్షుల!!దర్వు!! ఆసానా మయ్యినాదికా సకలా వ్యాధూలనాశాము జేసుబాగికా - ఆశాపాశంబూలా అంటూబాశినా వారిని దోషాములన్ని బాపు ఆసానమూలుఅన్ని !! ఆసానామయ్యినాదికా!!57!!

నాడీశోధన ప్రాణాయామలక్షణం.

పద్మాసనస్తుడై బరగినయోగియు ప్రాణవాయువు నెపుడు పదిలముగను- యిడనాడిచేతను యీవాయు పూరించి కుంభకంబునుజేశి కుదురుపరచి- పింగళనాడిచే పిదపరేచించియు రేచించునాడిచే పూరకంబు - జేశిపూరించియు మున్నుపూరించినా !!దర్వు!! నాడీచేతానువేగమే రేచింపావలెను - కూడికాతోడావేగమే - యెడుమాచేపూరాకంబు కుడిచేతారేచాకాము - కుడీచే పూరించిమళ్లీ యెడుమారేచింపావలయును !! నాడీచేతానువేగమే!!58!!

అతినిరోధము వాయువదికుంభకముజేయ- చెముటయు వణుకును చెలగికలుగు- పూరించునాడిచే రేచింపగూడదు - రేచించుదానితో పూరకంబు చేయవలయును దానిచేపట్టి ప్రతిదినముగురువాఖ్యపద్ధతి గురుతుగాను- రేచించువాయువు వేగంబుగూడదు !!దర్వు!! మెల్లాగ రేచానంబునూ చేయాగవలెను - కల్లాలన్నీయూబాయనూ - సలాలీతమూగయిటులా దినాదీనా మూనుజేయా - ఫలామౌనువాయువునిల్చె చెలానామూబాయూ వినుమూ !!మెల్లాగ!!59!!

ప్రాణాయామము

వినుము ప్రాణాయామవిధమంత వివరింతువుత్తమ మధ్యకానిష్టమనియు ఉచితప్రాణా యామమును బొందగల్గును బ్రహ్మరంధ్రస్థానబిందు ఫలముమధ్యంబుననువణుకుమరి కనిష్టము నందు చమటగల్గునుగాన వాయువెపుడు - బందించవలయును బహు శాంతమతిచేత !!దర్వు!! మొదాటాచెముటాయూ కల్గునూ - పిదపావణుకూను తదూపారిధుముకూటాయునూ-ముదా మూనా గల్గూచుండూ మూడుయోగాములందూ-పదీలాముతోడా దీన్ని పరీకించావలెనూ బాగా !!మొదాటా!!60!!

పన్నెండు మాత్రల పరగకాలంబును మొదటివుద్ఘాతము మోదమునను - యిరువదినాలుగు మాత్రలకాలంబు రొండొవుద్ఘాతము దండిగాను- మూడొవుద్ఘాతము ముప్పదిఆరును మాత్రలకాలంబు మరియునగును -చెముటవణుకెగురుటా చెలగియెటు కలుగునో !!దర్వు!! దీనీయెందూనాఅటువలేఆనందానిద్రా -పూనీకల్గూనూ అటువలె - వినూచీత్తాచెంచాలాము విపారీతామూగా కల్గూ - కనుమీ గగ్గూరుపాటు కడూ ధ్వానిగ్గానమూనూ !!దీనీయెందూనా!!61!!

వేదనగల్గును వేగదేహంబునా వణుకు ఆయాసమూ చెమటగల్గు -బుద్ధిభ్రంశంబును భువి ప్రలాపంబును -వద్దిక తోడుత వరుసతోను -కల్గుచునుండును కడపటవీటిచే జేయమెపుడు బొందునో అపుడుఅదియు- వుత్తమంబైయున్న వుచితప్రాణాయామ !!దర్వు!! మయ్యావున్నాదిఅవలా అతి ముఖ్యామయ్యా చెయ్యానవ్వానుఆవలా - యుక్తామునాని యోగామదీరూగ్మాతాలపాలు-సయ్యాన పొందూచుండూ సకలాఆవస్తాలాను !!అయ్యావున్నాదిఅవలా!!62!!

మాత్రకాలంబును మరివక్కశ్వాసంబు కాలంబుఅగుచుండు క్రమముగాను- నిద్రించువాని శ్వాసము యావలికిపోయివచ్చు కాలంబును వరుసనగును - మూడుచిటికెలు వేయుకాలంబు అవుచుంది-వకచిటికెకాలంబు వనరనగును-పదిరొండు అర్థంబులైన శ్వాసంబులు !!దర్వు!! ప్రాణాయామాదికాలమూ- అవుచుందివినుమూ ప్రాణాయామాదికాలమూ-నానేమానూష్టామున పూనుకానీష్టాము-మానూగారొండోచిటికెలవూను మధ్యామునాకూ !!ప్రాణాయామాది!!63!!

మూడుచిటికెలువేశినంతకాలంబును వుత్తమంబగు ప్రాణయామమగును- ప్రాణయామంబులు పదిరొండునయ్యినా పరగప్రత్యాహారమగును భువిని - ప్రత్యహారంబులు పదిరొండునగుచున్నధారణమగుచుంది ధారణంబు - పదిరొండుజరిగినా అగును ధ్యాన్నంబునూ !!దర్వు!! ధ్యాన్నామువీనూమునువలె -పదిరొండూ అయినా ధ్యాన్నాసామాధి అనవలె - పన్నూగా గురుణీ వలనా పద్దాతూలన్నితెలశీ - తిన్నగాజేయాగాను మన్నానాతోడా గలుగూ !!ధ్యాన్నామువీనూ!!64!!

రేచకపూరక కుంభకంబులుమూడు మూడువిధంబులు ముదముతోను- ఆకారమూర్తియు అదియు గాయిత్రియు ఉకారమూర్తి సావిత్రియగును - మకారమూర్తియు మరియు సరస్వతి మూటిధ్యాన్నమె ముఖ్యప్రణవమగును - యిడనాడిచేతను యాబాంహ్యావాయువూ !!దర్వు!! చేతాపదహారు మాత్రలూ -పూరించాలటువలె మాత్రాకుంభించావాలెనూ - ఆతీరూరేచాకంబూ అగునూముప్పాదిరొండూ - ప్రీతీగామూడక్షరముల మూటాధ్యాన్నించవలెనూ !!చేతాపదహారు!!65!!

ప్రణవాక్షరంబును పదిరొండుపూరించి పదహారుకుంభించి పదియురేచకంబును జేయు ప్రాణాయామమగుచుండు-పరగగృహస్తులకు పాపహరము-యోగీంద్రులకునెల్ల యోగసిద్ది నోసంగుసంసారులైననూ సందిదెలశి - యేకాంతమున నుండి యిదిఅభ్యశించియు !!దర్వు!! జనాసంగామందూజేరియూ-వ్యవహరామూలు జరిపించగానూ వచ్చునూ-వినుమూ నిమిత్తామూనా విధికర్మామూలుఅన్ని-పనూలుజనమూలా యెందుప్రియామున్నా వానిరీతి !!జనా!!66!!

ప్రత్యాహరము

వినుముప్రత్యాహరవిధమెట్టులన్ననూ నాల్గువిధంబులా నమరియుండూ యింద్రియార్థంబులా యెందువిషయంబులా వర్తింపజేయకానుండు నోకటి -యింద్రియంబులు అన్ని వినుము చలించియు కార్యకార్యములన్ని గడుపుచుండు- ఆత్మయేననియెంచి మదిభావమున వుంచి !!దర్వు!! నదీప్రత్యాహరామాయెనూ -నిత్యాకర్మములానాత్మాలో చేయానాయెనూ- వదూలాక దేహమందూ పదూనెన్మిదిస్థానామూలా- వదులాకావాయువుంచీ పదిలాపరచాగవలెను !!నదీ!!67!!

ధారణవివరము

ధారణయోగంబు దగనెరింగిచెద అదివినివేగంబె అభ్యశింపు -మనసుసంకల్పంబు మరి యేది చేయునో దేనినిదలచునో అవియుఅన్ని - చూచుటవినుటయూ తాకుటతినుటయు సుమ్మిఆఘ్రాణించు చూచునదియు -ఆత్మయేననియెంచి యాభావముంచుటా !!దర్వు!! చెందా

జేయూను ధారణం -అణిమామహిమాలు పొందాజేయూను స్మారణం యిందూనాలఘిమాగరిమా ప్రాప్తీ ప్రాకామ్యామూలు -అందూవోశిత్వామీశా మొందాగజేయూచుండూ !!చెందాజేయూను!!68!!

వినుముమూలాధార మున విఘ్ననాథుని యెందున మనసునూ పొందనిల్పి -స్వాదిష్టమున బ్రహ్మాస్థానంబునను వుంచి మణిపూరకంబునా మరియునిల్పి - ఘనఅనాహతమునా గౌరీశు నందుచి ముసు విశుద్ధంబునా ముదమునుంచి - ఆజ్ఞేయమందునా నటసదాశివునందు !!దర్వు!! సాహస్రకమలామందునా -సద్గూరువందున -సాహసంబూనానిల్పినా సకలాదేవాతాలందు సన్నూతింపూచునుంచి-సకాలామునందూ మనసుయికాచెందానివ్వాకానూ !!సాహస్రకమ!!69!!

ధ్యాన్నయోగము

సగుణధ్యాన్నంబునూ నిర్గుణధ్యాన్నంబు అనిరొండువిధములూనయ్యియుండు - సగుణంబు తనహృదయకమల పీఠమునందు సర్వేశరూపంబునగు విరాటు -పురుషుని నిల్పియుపూని మనుస్సుచే సకలవస్తువులందు సంగ్రహించి-షోడశవుపచార సోంపైనవిధులచే !!దర్వు!! పూజాశాయాగ వాలెనూ -పూనీమానసమున -పూజాశాయాగవాలెనూ -రాజీతామూగాబాంహ్యా మందేదికోరిత్యాక సాజాములోపాలన్ని సంకల్పామూను జేశీ !!పూజాశాయాగవాలెనూ!!70!!

సకలేంద్రియంబులు నిఖిలోపకరణంబు ప్రాణంబులుపచార భటులజేశి- గంగాత్రివేణులు కడుజలంబులుగాగ కమలంబులారుపుష్పములుగాగ -జఠరాగ్ని ధూపముదీపంబు చిత్కళల్ అనంద నైవేద్యమదియుగాగ -మండలత్రయములు మరిహరతులు జేశి !!దర్వు!! దేహలాయామునందునా దెదీప్యామైనా సాహస్రపీఠామందునా- సాహసమూనాశాంతి శీతాసామేతామూగా వూహారామూలా యెందూ చేర్చి అర్చించావలయూ !!దేహలాయామునందునా!!71!!

విరాసనంబునా విధిగను గూర్చుండి నయనంబులనుమూశి నాత్మయెందు అహముబ్రహ్మా అశ్మి అనువాఖ్యరీతిగ నెనెబ్రహ్మంబనీనిష్టనిల్పి -మూడుదేహంబులు ముదమొప్పగాన నీ పంచ భూతాంశలపంచకములు- వుపవాయువులకెల్ల వుత్తమోత్తమమైన!!దర్వు!! సాక్షీతానానితలచియూ అదివృత్తియేనని సాక్షీమీరియు నిలచియూ - వీక్షింపాకానుబ్రహ్మా నీష్టాద్వైయుండూటామె అక్షాయానిర్గూణాము అయినాధ్యాన్నాది నిష్టా !!సాక్షీతానానితలచియు!!72!!

సమాధివివరము

సవికల్పమనియును నిర్వికల్పంబని రొండువిధంబులు నగుసమాధి- దృశ్యానువిద్దము శబ్ధాను విద్దము సవికల్పములు వేగద్వివిధమగును -నిర్వికల్పము గూడినివిమూడు విధములు మూడుబాంహ్యాంతర భేదములచే -బాంహ్యాశబ్ధంబును బాంహ్యాదృశ్యంబును !!దర్వు!! బాంహ్యా మందూననిర్వీకల్పమూ -సమాధిఅదియు -అంతారమందూ దృశ్యమూ- అంతారశబ్ధామూ అగూ సావికల్పాము అంతారనిర్వీకల్పా మనీవుండు ఆరూవిధములు !!బాంహ్యామందూన!!73!!

యెదుటనుకనుపించె వెల్లచిదాభాసు కళలు తనకును వేరుగావటంచు- తెలసు తెలవీనెపుడు తెలుసుట బాంహ్యాము దృశ్యానువిద్ద సవికల్పకంబు -ఆజ్ఞెయమందునా అగుపడు కళలును వింతగాజూచుట అంతరంబు-దృశ్యానుసవికల్పకంబును అదియును!!దర్వు!! బైటావినబడెటి శెబ్ధమూ వినుటామెతానని వుండూటామూను వీనుమూ - యింటీలోప్రణవా నాదామినుటా అంతారశబ్ధ మంటామంతారశబ్ధా సవీకల్ప సామాదగును !!బైటావినబడెటి!!74!!

బాహ్యదృశ్యంబును బాహ్యశబ్ధంబును కనువినునాత్మను కనుటబాంహ్యా నిర్వికల్పంబుగూ నిజముగా అంతర దృశ్యంబుశబ్ధంబు వినెటినాత్మ -తెలయుట అంతరనిర్వికల్పంబును -యివిఆరు విధములూ యిటులవినుము- షడుసమాధుల విధము చక్కగనెరిగియు !!దర్వు!! సాధాకామూను కావలె -సంపూర్తిగాను వేధాకమూను చనవలే -బాధాలేదిట్టూలైతె భవబందామూలుతోలగూ వదాలాకవుండుటామె వసూదాసామాధియగునూ !!సాధాకామూనుకావలె!!75!!

హంసవిషయం

అజపగాయిత్రియునగు ననుష్టానము జపముచేయగ యుండ జర్గుచుండు- వుదయంబు నుంచియు వుదయంబువరకును వరుస షడాదారములనుజుట్టి - తిరుగు యిరువైవక్కవెయ్యారు నూరులు తరుగు అరువైఘడియలాయువందు - చనిపోవుచుండును చక్కగామదినిల్పి !!దర్వు!! చెయ్యావాలేను తానికా - సక్రమముతోడా - చేక్రాములందువినుమికా - చెయ్యానరేచాకాము పూరాకమూలాచేత - సయ్యానకుంభాకంబు సాధించి హంసాజపము !!చెయ్యావాలేను!!76!!

ఆధారమున ఆరునూర్లజపంబును అగునొక్కఘడియ నలుపదివిఘడియ -లందునఆది వినాయకమూర్తికి అర్పితంబొనరించి అందుపైన -స్వాదిష్టపురముకు చయ్యనచనుదెంచి చతురాననుకునూ సన్నుతించి -ఆర్వేలహంసలూ పదహారు ఘడియలు !!దర్వు!! వినుమూ వీఘడియాలన్నీయు-నలుపాదివరకు వినూతింపుచుండూనన్నియూ మనాసుంచిచేయా వలెనూ మరిఅర్పితాము యిన్ని-ఘనమూగా యిటులాజేశి ఘ్రూక్కూనా వెళ్లావలెనూ !!వినుమూ!!77!!

మణిపూరకము జేరిమహిరక్షకునకుసూ షడుసహస్రంబులు సన్నుతముగ పదహారు ఘడియలూ పరగ విఘడియలు -నలుపదివరకును నర్పితంబు -అనహతపురమునా హరునకు అంతయె అర్పితంబొనరించి అందుపైన-పరగ విశుద్ధమున వరజీవునకు వక్క!!దర్వు!! సాహస్ర హంసాలందునా రొండూ ఘడియాలు -సాహసంబూగానందునా -సరీగా నలుపాదిఆరు నైనా వీఘడియాలూను సంశాయించాగఆరూ హంసాలకాలామగునూ !!సాహస్రహంసా!!78!!

ఆగ్నేయకమలమూ నటసదాశివునకు నగు సహస్రాజపము అర్పితంబు - రొండుఘడియల నలుపదారు విఘడియలు ఆరుహంసలకాలమయ్యియుండు -సహస్రారమందునా సద్గురుమూర్తికి సాహస్రహంసలు జర్పవలయు-రొండుఘడియల నలుపదారు విఘడియలు !!దర్వు!! హంసాలారైనా కాలమూ-అయ్యావుండూను సంశాయింపాకజరుగునూ-యెంచాగా యోగామూతొ యెలామీతొ అభ్యాశింపా హంసావుశ్వాస నిశ్వాసమూతోడానైనా జేయూ !!హంసాలారైనా!!79!!

సచ్చితానంద రసామృతంబును గ్రోలిసమరసైక్యంబు సమాధియగును - దృశ్యప్రపంచంబు దృశ్యదేహంబును విషయవృషీకముల్ వినుముగ్జాత -జడదృశ్యకంబులు దృగ్వాదివస్తువుల్ దృశ్యంబులన్నియు నశ్యమనుచు- కడద్రోయగాప్రత్యగాత్మయు మిగులుండు !!దర్వు!! నదీయె పరమాత్మరూపమై నాశనములేకా -బాదాలేనాత్మాదీపమై -కదాలాకవున్నాయెంతా కడాపాట తెల్యాకుండూ - వదులాకవున్నామంచీ సగుణాసామాధియగునూ !!నదీయెపరమాత్మ!!80!!

నిర్గుణసమాధి అనుభవము.

అంతరంబందునా నగుపడు దృశ్యంబు దృక్కుఅంతకరుణ దృశ్యమనుచు శబ్దంబునాదంబు లోపలజేర్చియు నాదంబుఆత్మలో నణగియున్న-అంతరబాహ్యమునగు దృశ్యశబ్దముల్ నణగి యుండిన ఆత్మమిగిలియుండు-నిస్తరంగంబైన నిజసముద్రము తీరు !!దర్వు!! గాలిలేనట్టిదీపమూ

కరణీగాయెపుడు వెలాగూచుండూనురూపమూ- వెలీలోనా మరచీతానూ ఫలామేమీ జెందాకుంటె యిలాలోనా నిర్వికల్పా నీష్టాసామాధి యిదియే !!గాలీలేనట్టిదీపమూ!!81!!

సాధనంబులు యిన్ని సంహత్సరంబులు సాధించువారికి సర్వశక్తి -సమకూడియుండును స్వర్గాదిలోకాదు లకుపోనురానగు ప్రాకటముగ -యెన్నైన జేయును అన్నియుతానౌను మన్నన పొందును మహిలొయెపుడు - యేదికోరినగాని యెదురుగా వచ్చును !!దర్వు!! మాటతప్పాదూ పల్కినా -యిఘయేదిఅయినా - సూటీదప్పాదుచుల్కానా -నూటీకొక్కానికైనా దీటూపాడానిదీది మేటౌను తపసువలన పాటుండువిను దెల్పెదనూ !!మాటతప్పాదూ పల్కినా!!82!!

శిష్యవిగ్జాపనం.

యోగసాధనములు బాగుగాజేశినా మేలేమిలేనటుల జాడబడియె - పరలోకముకు బోయి మరలివచ్చుటకంటె యిహలోకముకు సాటియించుమించు - అదినీకుగుర్తెటుల అంటరేమొకాని యిాలోకములవలె అదియుచనును - వకఅంగడిలొగుఢము మధురంబు కనుగొన్న !!దర్వు!! ప్రకాటించివుండూ వేగమె - అంగళ్లన్నిటిలో వకాటేవిధమూనా వుండూనూ - వకాపాట్టణాముసాటి వకాపాట్టణాముగాని - యికాయేక్కూవేది యిందులొ అకాలంకామైనాపదవీ !!ప్రకాటించి!!83!!

యిాలోకప్రభువులు యిలజనులందరు యెలాగుచనువారొ అవిధంబు-బ్రహ్మావిష్ణాదుల బ్రతుకులావిధమును పన్నుగా సుఖదు:ఖమెన్నగోకటె -లోకేశులును సర్వలోకస్తులుండును లోకలోకంబుచనగనిర్లోకమగును - ఆలోకమునవాసమయ్యున్నమిప్పుడు!!దర్వు!!మొదలెప్రార్థించూ కుంటీనీ సంశయమూలాన్ని వదులాజేయూమీ అంటీనీ - అదారించినాను నేను అదీరెవాడాను గానూ -పదామూలు నమ్మీనాను వదూలాజేయూమీ అన్ని !!మొదలెప్రార్థించూ !!84!!

గురువాఖ్యము

అట్టిశిష్యుని గురుడుఘట్టివాడని మెచ్చిప్రకటించబూనెను ప్రవిమలముగను -యెటునేను జనిన యిాభటుడునన్నిడువడు యేదిజెప్తెననూ బోదమన్న -అనిశిష్యునప్పుడు అతిదయాతో బిల్చి యేదిజెప్పిన నీవునమ్మవిపుడు -నేననెహంకారమును బోయినప్పుడే !!దర్వు!! సంశాయామూలు తోలగూనూ-నీకెపుడూ గల్గే హింసాలెల్లానుబాయూనూ -సంశాయాదూలుఅన్నీ సమాకూడువిను మూ నీతో - వంశాపావాన నేనని సంకోచమొదలూతోడా !!సంశాయామూలు తోలగూనూ!!85!!

శిష్యవిజ్ఞాపనం.

నేననెహంకారి మేనుండువరకుండు యేలాగుచనిపోవు ఆదినాథ -హంకారమందున అఖిలప్రపంచంబు నణగుండునెటులన్న నవనివినుత -గాఢసుషప్తిలొ యెదిదృశ్యములేదు నేననెహంకారిలేదు గనుక -సర్వసూన్యంబాయె సకలంబు లేదాయ !!దర్వు!! ప్రకాటించీ పల్కు డిప్పూడూ అపుడేమిలేదు సకాలంబుపోయీనప్పూడూ - యికాయేదికలదో అదియూ వక్కాటేతెల్పూ మనగా-సకాలాము నీవూ చనగాయికాయేది కలదూఅనెగురు !!ప్రకాటించీపల్కు!!86!!

గురుశిష్యవుత్తరువు

నీవుపోయిన వెనుక నిలచెటులగంటివి వున్నదెటులగుపడు తిన్నగాను తెల్పరా వోశిష్య తెల్విజూశెదమనిన నేను పోయినసూన్యమాయగనుక - అంతఅలాగని మంతనంబున స్వామి అనుకున్నవాడను అమరవినుత నీతోనువున్నదా నీప్రపంచము తెల్పు!!దర్వు!! నీతోప్రాపంచామణగితె మరలాయెటుగల్గెనాతో జెప్పూముఅమరితె లోతూతోచాదు మొదలెనీచుడాననుచూ నేను మీతో

జెప్పితి వెగా దాతామ్రొక్కేదననియె !!నీతోప్రాపంచామణగితె!!87!!

శిష్యవిగ్నాపనం

మీరగుపడుటము నేననెహంకారముండువర కనుకొన్నదండిగాను - నేనులేనప్పుడు యెమి తోచగలేదు పిదపమేల్కనగను చుల్కనాయ సుషుప్తియెందున యేదిసూటితోచగలేదు -సూన్యమై యున్నది సుమ్మిఅటుల -సూన్యమేకావలెనేమొ అనుకొన్నను !!దర్వు!! వున్నదేదీయో తెల్యాదూ లేనిదేదీయో అన్నామాటలూతోచాదూ -పన్నూగా గురుడూ వినియూ సూన్యాబౌద్దుడవాయనినా యన్నాబౌద్దుడనూకానూ వున్నాడుదేవూడనుచూ !!వున్నదేదీయో తెల్యాదూ!!88!!

వున్నాడు దేవుడనుకున్నవాడనుకాని  యెన్నగాదేవుని యిపుడు మీతో తెలుసుకుందామనె తెల్విపున్నది సుమ్మిలేదనెవాదంబు లేదుయెపుడు అనగానె సద్గురుండతనితోనిట్లనె అట్టిభగవంతుని యెటులగనెవు వుండికనుగోందువా లేకకందువనగ !!దర్వు!! లేకాపోయినామీదానూ లేనెలేనీకా జోకాతొగనుటా యెప్పూడూ - పోకావున్నప్పూడేనూ ఖ్యాతీగా తెలియావలెను ప్రాకాటంబూగమీదూ మాటా సత్యాముగాని !!లేకాపోయినామీదానూ!!89!!

మీమాటనమ్మక యెమాటనమ్మిన నామాటజెడి నధోగతిగలంగి దుర్గతిగలుగును సద్గతి తొలగను నుద్దరించెరుమీరు ముద్దుగనుచు - సద్గతిదుర్గతి మరినీకుయెవ్వరు తెల్పినారిదివత్స తేటపల్కు అనగానెపరులనగ వినిఅన్ననెకాని!!దర్వు!! నాకూయెమీయు తెల్యదూ గురునాథా యిపుడు మీకూదక్కీనా వాడనూ - నాకేమితెలియాదనెవు నీకూయిది తెలుసూగదరా - మీకూ మ్రొక్కేను యిది వకటైతె తెలుసూనుగాని !!నాకూయెమీయు తెల్యదూ !!90!!

గురువాఖ్యం శిష్యవిగ్నాపనం

వినరోరి యిదివరదాక నాకేమియు తెలియదంచును నీవుతేటపరచి యిపుడొక్కటి తెలసు ననుచును బల్కెవు నీమాటనమ్ముటనీతిగాదు - నీవేషములు దొంగవేషములన్నియు నీభాషలును జూడనీతిలేదు -క్షణముకొక విధమును చెప్పుచున్నావనిన !!దర్వు!! దిగూలొందీవేగాలేచీయూ పదయుగములు బట్టి -బుగూలొందిభీతీ తోచియూ - జగామూలో మీతోసాటి యిఘాయెవ్వారూ నూ లేరూ -నగూబాటుగాదు తమరూ తగాజెప్పినటులావిందూ !!దిగూలొందీవేగాలేచీయూ!!91!!

అనిలేచి ద్వాదశవిధమొందనంబులు అష్టాంగములతోడ హర్షముగను సాష్టాంషగమొన రించి స్థానాంగభావాత్మలైన శిశ్రూషలు నమరజేశి -స్థిరభక్తితోడుత తనుమన ధనములు వంచనేమియు లేకవప్పగించి - నేనునాదియు లేకమీదెసర్వమటంచు !!దర్వు!! స్వామీసర్వాము మీరెనూ -యిఘయేమీలేదూ -పామారమోదిలె బాగానూ - వేమారుసర్వమంతామీరెకా నెవరూ లేరూ- నేమాము మీరావడము నానోముఫలమెకానీ !!స్వామీసర్వాము మీరెనూ!!92!!

అనిపాదములు నమరినయముతో శిరముంచినమృడైయుండినా -నట్టివాని కడగంటితో జూచి కరుణాసముదృడై నిజగురుండతనిని లేవనిలిపి -తొడలపైనిడుకొని తొందరబాపియు హస్తముమస్తకంనందుజేర్చి -భూతిఫాలమునందు బూశివ్రాతయుబాపి !!దర్వు!! దీక్షాత్రయములు తెల్పీయూ అక్షీసొగ్నాచె సాక్షిలెస్సాగ జూపియూ - అక్షాయమౌనునీ వూపేక్షించవలదూ పుత్రా - రక్షించి ఆభయామిడితీ నీక్షేపపరమూ తెలయూ !!దీక్షాత్రయములు తెల్పీయూ!!93!!

సకలదేశములందు సకలకాలములందు సకలవస్తువుల చంచలములేక -తనకుతానైనిండి అన్యంబుదోపక స్వతశిద్దమైశబ్ధసహితమగుచు-నామరూపక్రియా నటనలు జేసెటి శుద్దనిర్గుణవస్తు చూడుమనుచు దృష్టాంతముగగురు దృశ్యమగుపడజేయు!!దర్వు!! నంతాశిష్యునికి వేగామె నగు పడగా నిత్యాసంతోషమాయెబాగానె-అంతాగురుశిష్యాలపుడూ కొంతైనాలేకహెూమ- మంత అతికీయు వెలిగెరమంతా యెగిరీనావిధమున !!నంతాశిష్యునికి వేగావే!!94!!

చైతన్యోత్పత్తి లక్షణం

చైతన్యవివరము చెప్పెదవినవోయి మారుతవిధమది మౌనితనయ అటుగానచలనగుణమ య్యుండువాయువు ఆవాయుగగనమందమరికల్గె - అనిపల్కిపోయిరి మునుపెద్దలందరు ఆకాశమును శూన్యమను ప్రసిద్ధి -లేనిదానిలో వాయుపూనికల్గుటయట్టు !!దర్వు!! కానీచెప్పీరి పెద్దాలూ సామర్థులువారూ -లేనీదిపూనీకానీరీ -లేనీశబ్దాము అందులోపూనీ వున్నాది అనిరీ - దానీచె గగనామనుచూ నామామాయెను వేగా !!కానీచెప్పీరి పెద్దాలూ!!95!!

ఆకాశమును సూన్యమయ్యియుండిన శబ్ధగుణమున్నదియు గానగగనమగును ఆశబ్ధము ను మొదలు మేనేమిలేకుండి ఆకాశమును పేరు అనగవచ్చు - వారికివార్మనోక్రియల కందినఅంత పల్కినారదిగాను పరగవినుము - మొదలేమిలేకను కదులుటన్నదిలేక !!దర్వు!! ఆదిమద్యాంత సూన్యమె వినరాక అనక యెదీలేకానుసూన్యమై - సూదీమోపానుసందు యాడాలేకానునుండీ యేదీలేకాను తనకు తానెరొండోదిలేకా !!ఆదిమద్యాంతసూన్యమై!!96!!

ఆద్వితీయంబయ్యి అప్రమేయంబయ్యి అమలమై విమలమై అచలమగును-ద్వయదోష రహితమై త్రయమేమిలేకను -నిశ్శబ్ధమై సదానిర్గుణంబు -ప్రతియేమిలేనిదై బయలయ్యియుండినా వస్తుకేవలమెపుడు సుస్థిరంబు-కర్తుత్వ భోక్తృత్వ కర్తయుగాకను !!దర్వు!! అంతాతానయ్యీ యుండగా ఆవాంతరముగా వింతాగ ద్వనియూ కల్గాగా - అంతాలోగాలీ ధ్వనిలోవింతాగ శబ్ధా మాయె - మంతానామూనా జూడ మారూతామాయె ధ్వనియు !!అంతాతానయ్యీ!!97!!

ధ్వనితోటివాయువు తగగల్గెగావున వాయువేధ్వనిగుణక మాయవేగ యిందుకు దృష్టాంత మీగాలిలేనపుడు- పిండబ్రహ్మాండములరొండిలోన-ధ్వనిలేని అప్పుడుతగుక్రియా సూన్యమై జఢములై యుండు యిద్దరణిఅంత- శబ్దమేచైతన్యమయ్యుండు చైతన్య !!దర్వు!! శబ్ధామొక్కాటి ఆయెను యీగ్గాతాకిటులా బూద్దీకితోచానాయెనూ - శబ్ధాస్పరిశావాంతార వూధ్భావారూపామైనా లుబ్దాము లేకాశబ్ధాముద్భావమాయవేగా !!శబ్ధామొక్కాటి ఆయెను!!98!!

అట్టిచైతన్యమె అగ్నినికల్పించి అగ్నిలోతాను ఆవేశమయ్యి -అప్పునుయెర్పాటు వప్పుగా జేశీయు ఆజలంబులో తానులీనమయ్యి -పృథ్విసంకల్పించి పూర్వమందునయేమి లేనిది యీలాగుతానెవచ్చి పిలువనిదేవచ్చి భిడియంబు లేకను !!దర్వు!! కానీకార్యములు అన్నీయూ కల్పించీముందల తానె పెట్టూక అన్నియూ - లేనీవిసృష్టిజేశీ తానూతనచెతానైనా లేనాగ్ని జలమూ పృధ్వీపూనీచెశీయూ వేగా !!కానీకార్యములు అన్నీయూ!!99!!

అన్నిటిలోపలా తిన్నగాతనుజేరి అవినేనుకాదనిఅనుచునుండు- ఆతీరుగను సంచరించుచు తానొచ్చు విధమెరుగకను మళ్లివిగతమగుచు-అవాంతరంబుగ అవతరించితిననుచు తెలియ లేకనుయెపుడు తెల్విలేక-బ్రహ్మసృష్టించునువిష్ణురక్షించును!!దర్వు!! చంపూరుద్రూడుయనుచునూ లేనీవారీనీ మంచీగుందూరుయనుచూనూ- యెంచాగేర్పాటుజేశి పొంచీ యున్నారు మనలో కాంచూడీవారీతోను కల్పానంతాయెననుచూ !!చంపూరుద్రూడు!!100!!

జఢరూపమైనట్టి జననమరణంబులు క్షుదతృష్ణలును శోకమోహములును-యీషడూర్మ్మలు నాకు గలిగున్నవనుచును జన్మించజేశినా అజుడుయెట్లు -వ్రాశినాడో అదిఅవుచుంది అనుకొని వారిదేమితప్పవప్పగాను - తదుపరిమనపూర్వసంచితంబేకాని !!దర్వు!! తానూజేశీనాఖర్మమూ అనుభావించాక మానాదెవ్వారికైనానూ - కానీదేవూడుయెమీ పూనీచేశీనాడనుచూ- శానా వరకూనూ ఆర్వులు వేరెవున్నారూ యనుచూ !!తానూజేశీనాఖర్మమూ!!101!!

అనుకొనివారిని అతిభక్తితోజేరి నాల్గుశిశ్రూషలునమరజేశి -సాధనంబులునాల్గు సాధించి ద్వాదశ వందనంబోనరించి వరుసతోను -తనుమన: ప్రాణముల్ దారబోశియు గురునివినుతుల తోడనుప్రణుతిజేశి - నిలచున్న శిష్యుని నిరుపమానందుండు !!దర్వు!! కరుణాజేశెను బాగానూ దుష్కర్మామణచీ పరమూ జూపేదానానెనూ - వెరూవాకు యఘమూలాను దురమూలు బోవూ ననుచూ - స్థిరాబుద్ధీతోడా చంచలహరూఢైనా వాణ్నిజూచీ!!కరుణాజేశెను బాగానూ!!102!!

శిష్యోత్తమానీవు తిన్నగవినవోయి అల్పగుణములు బాశినిల్వుతోను - పృథ్వీఆపశ్తేజవాయు వాకాశంబు యివిపంచభూతముల్ వీటివలన -జ్ఞానేంద్రియము లైదు ఖర్మేంద్రియములైదు-అంత రేంద్రియముశబ్ధాదులైదు- ప్రాణముల్ అయిదునుపరగదేహము భూత !!దర్వు!! పంచాకమైనా దాయెనూ యిందూలోనీవు మించీయుండాగానాయనూ - వంచానామాయా అనాదినుంచీ నుండేటిదేహ -సంచీతాగ్నానీవయ్యి యెంచాదేహమూలన్నీ !!పంచాకమైనా!!103!!

యిన్నిటికిని మీరినున్నట్టివాడవు అయ్యిండిదేహింద్రియములు నేను- అనుకొన్నజీవుండవైతి వవిద్యచె కావునీవందులో యెదియేని - నీనిజరూపంబు నీజముగా గనుమనీ చూపించబూనెను సుందరముగ - నాటినుంచిదినీవు సూటి తెలియగలేక !!దర్వు!! చేటూలొందూచూనుంటీవి యిప్పూడు నీనిజసూటీ దెలయూమీఅంటినీ- మేటీవయ్యెవు తెల్విత్యా టాచె జూచినాను - వాటాము గాను సంశయబాటా బాశీనయెపుడే !!చేటూలొందూచూ!!104!!

అనిచెప్పగావిని అత్యంతదీనుడై మతిగరుగుచును చలనగతుడునగుచు- నాజన్మమీడేరె నాకర్మములు దొలగుసంసార మిఘయేలచాలుననుచు-గురువుకన్నను పరము వేరులేదనుచును శెక్తివంచనలేక శేవజేశి - పూజించితనమది పూర్ణభక్తిచలంగ !!దర్వు!! ప్రణూతూలు శేయాసాగెనూ ప్రాదక్షాణములూ వినూతులొనరించాబూనెనూ-ఘనామైనాగురుడూచూచి మనామూనా సంతా శించీ- పనీగల్గెననుచూ శిష్యుని వినుమాని తెల్పాబూనె !!ప్రణూతూలు శేయాసాగెనూ !!105!!

సచ్చిదానందము స్వప్రకాశమునీవు సాక్షివినీవులోకాక్షివీవు - చైతన్యమునునీవు క్షేత్రజ్ఞుడనీవు దేవుడవంచును తేజమొప్ప- చక్షురాగ్రమునందు నిక్షేపమయ్యున్న సూక్ష్మతేజంబును సూటిపరచి బ్రహ్మావిష్ణీశ్వరభావంబులును నీవు!!దర్వు!! నమ్మీయుండూమీతెల్పేదా నిష్కళయందూన కమ్మీ యుండేది జూపెదా- మ్మాళమూగ పంచాశక్త్యాది వర్ణామూలు సమ్మాతిగాను గంగాయెమునా సరస్వతి నదులు !!నమ్మీయుండూమీ తెల్పేదా!!106!!

పంచభూతంబులు పంచవర్ణంబులు పంచశక్తులు సప్తసాగరములు -పిండబ్రహ్మాండముల్ మండలత్రయములు త్రిగుణగుణంబులు త్రిపుటిద్విపుటి - సకలదృశ్యము కాళాసాన్నిధ్యమైవుండు వకటిలేకను సర్వమచటనుండు-నీయెందుసర్వంబు నిండుండువేగమే!!దర్వు!! సార్వా మందూనా నిండియూ -నున్నట్టివాడవు నిర్మాలంబయ్యియుండియూ - సర్వామునీవెయికా నీవెసర్వాము యనుచూ నీర్మాలామయ్యానట్టీ ధార్మాస్వారూపూడావు !!సార్వామందూనా!!107!!

### ప్రగ్జానవాఖ్య వివరము

గ్జానేంద్రియంబులా గల్గెవిషయంబులా యెగ్జానమెరగి గ్రహించుచుండు కర్మేంద్రియంబులా కడుప్రాణవిషయముల్ అమరిఅనుభవముల ననుభవించు- అంతరేంద్రియములా అంతకరుణా వృత్తివిషయముల్ అన్నియు పాసగగ్రోలు-పంచవింశతినెరిగె ప్రగ్నయేదియు కలదు!!దర్వు!! అదీయె ప్రగ్జానామందురూ-బుధవరులూఅందరు ముదామైనా బ్రహ్మమందురూ వీదీతంబుగానుశృతులూ వివారింపుచున్నా విటులా-మదీలో లక్ష్యార్థమెరుగా నదీమూఖ్యబ్రహ్మమగునూ !!అదీయె!!108!!

హరిహరబ్రహ్మాది సురలింద్రసనకాది మునులువ్యాసాదులు ముఖ్యవరులు - గరుడ గంధర్వులా ఘన -యక్షరాక్షస కిన్నెరకింపురుష పన్నగులును -వరశిద్దసాద్యులా నరమృగపశు పక్షి క్రిమికీటకాది సర్వాండములను -సర్వజీవులయందు సాన్నిధ్యమైవున్న !!దర్వు!! శూద్దాచైతన్యా బ్రహ్మమూ సగుణాత్మావకటె మూద్దూగున్నాదిబ్రహ్మమూ - వద్దీకాలక్ష్యార్థాము వరఅనుభావా మిదియూ -సాద్దూచేయాకచూడా -సార్వామందూనానిండీ !!శూద్దాచైతన్యా!!109!!

సురనరాది గజాశ్వక్రిమికోటి అండముల్ వాచ్యార్థమయ్యుండు వరుసతోను వాచ్యార్థములు అన్ని వరుసతోవీడిన లక్ష్యార్థమేవుండు రాజితముగ -నట్టిలక్ష్యార్థము ప్రజ్ఞానమనియును బ్రహ్మంబు అనుచునూ పల్కబడెను- ఆపరబ్రహ్మంబుఆత్మనిచైతన్య!!దర్వు!! వార్తాభేదామూలాయెనూ వస్తూవా వకటీ - పూర్తీతెల్యాగనాయనూ -ఆర్తిగా రుగ్వేదాము అర్తాముఅయ్యావుండూ సార్తాకసారా మిదియె ఆర్తాసారాంశామూను !!వార్తాభేదామూలాయెనూ!!110!!

### అహంబ్రహ్మాశ్మి వాఖ్యవివరము

అహమనిబ్రహ్మమని ఆశ్మనెవాఖ్యంబు అర్థమేదని అనిన అదియువినుము - దేహింద్రియ ప్రాణధీమనోహంకారములు అనిజడము వాచ్యార్థములును-అహంపదమున కవీ ఆయె వాచ్యాం బులు పరిపూర్ణముగనుండు బ్రహ్మపదము-బుద్దికిసాక్షియై స్ఫురియించివెలిగెటి !!దర్వు!! పూర్ణ బ్రహ్మమెఅహముకూ లక్ష్యార్థామగునూ- నిర్ణాయింపాగాజగముకూ వర్ణింపారాకాలోనా బైటా వ్యాపాకమైనా పూర్ణాత్మా లక్ష్యార్థాము భువానాబ్రహ్మాండ వాచ్యము !!పూర్ణబ్రహ్మమె !!111!!

ఆహముపదవాచ్యము బ్రహ్మవాచ్యంబుల దేహబ్రహ్మాండములతోశివేశి -వుత్తమలక్ష్యార్థములు రొండుగలిపినా అశ్మనేపదమునా కర్థమయ్యి -లక్ష్యార్థమయ్యుండు లావణ్యమగు బ్రహ్మతనుయేకమై నేనుబ్రహ్మమైతి-ననితెలసుకొనుటకే నాయవాఖ్యంబిది!!దర్వు!! వేదామట్టూలాబల్కునూ ఆ యెజుర్వేదా భేదామట్టూలానుండునూ-వాదాములన్నిమానీ నాదూ లాయామూజేశి భేదా మేమీయూ లేనీ కీలూతానయ్యా నిలచీ !!వేదామట్టూలాబల్కునూ !!112!!

### తత్వమశివాఖ్య వివరము

తత్వదత్వంపదా ఆశిపదవాఖ్యంబు తాత్పర్యమెరిగింతు త్వరగవినుము సర్వంబునందునా సాక్షివ్యాపకమయ్యి సర్వసమష్టియెతత్వదంబు - నకువాచ్యమైవుండు తగనులక్ష్యార్థంబు సృష్టికి పూర్వంబు సృజనలేక -నామరూపక్రియాలేమియుకానిది !!దర్వు!! యెకామయ్యానా బ్రహ్మమూ తత్వదమూ నాకూ యిదీయె లక్ష్యార్థాభావమూ -జోకాలేకాను శిష్యాచేకోను త్వంపాదార్తము పాకారిప్రముఖూలంతా ప్రాస్తూతించేటి విధమూ !!యెకామయ్యానా బ్రహ్మమూ !!113!!

మూడుదేహంబులు మూడునవస్తలు ముగ్గురభిమానులూ మూడుక్రియలు కూడి అందులో చేరిబింబించినా దేవుడేత్వంపదా వాచ్యమగును -మరియు దేహత్రయావస్త కోశంబు లంటకా వున్నదేసచ్చిదానందమయిన-కూటస్త చైతన్యబ్రహ్మలక్ష్యార్థము!!దర్వు!! ఆశీపాదమయ్యా యుండునూ తత్పాదత్వంపద విశాదాలక్ష్యములూగలయనూ- పొసాగావాచ్యార్థామూలు పొలూపొందా జీవేశ్వరులూ యెశామైనాప్రత్యాగాత్మ -పరామార్థా లక్ష్యార్థామూ !!ఆశీపాద!!114!!

అయమాత్మ వివరము

అయమని ఆత్మనీ అపరబ్రహ్మమని అయమాత్మబ్రహ్మంబునైన పదమూ - స్వప్రకాశపరోక్ష చైతన్యభావమె అయమను అర్థంబునాయవేగ-దెహింద్రియాదుల జఢమైనా హంకారముల నెరగు చుండెడి ప్రత్యగాత్మ- ఆప్రత్యగాత్మనే ఆత్మనునర్థంబు !!దర్వు!! ద్యూశ్యాపాదార్థామంతయూ బ్రహ్మండా మాది నాశ్యామయ్యేది అంతయూ- తోశీవేయాగనుండేశాశ్వీతా స్వప్రాకాశా భాశీతామూగా వెలిగె బ్రహ్మపాదార్థామగునూ !!ద్యూశ్యాపాదార్థామంతయూ!!115!!

ప్రగ్నానవాఖ్యము సొర్థనెరిగించియు అయమాత్మబ్రహ్మనుభవంబు జేశి -అహంబ్రహ్మఅశ్మి ఆదిలెస్స నెరిగించి తత్వమశ్శను వాఖ్యసరళిదెల్పి -బ్రహ్మమేనీవని నీవెబ్రహ్మంబని బోధించె నాల్గును పాదుగాను యీమంత్రమెప్పుడు యిఘమరువ వలదని !!దర్వు!! యింతాకంటేను యెక్కువా యిఘయేమీ లేదని చింతామానూమీ యెప్పుడూ -యెంతోభయమూను జెప్పి యేమీలేదాని తెల్పిన -అంతా చైతన్యామూను యెంతోనమ్మూకాయుండీ !!యింతాకంటేను యెక్కువా!!116!!

మరికొన్ని దినములు మడశినపిమ్మటా చైతన్యముకు మదిశంకగల్గి నామరూపక్రియాలేనిది యిదియనుచు పూనిచెప్పెను గురుడుమానుగాను-దీనియెందున శబ్ధనామరూపక్రియా భీతిభయమును అన్నిఖ్యాతిగుండె-అటుగాన పరమాత్మయెటులాయ ననుచును !!దర్వు!! సంశాయామూను జెందియూ సద్గురుణిజేరీ హింసాలొందేది దెల్పియూ -సంశాయామూనుగల్గె సంగాతులన్నిజేప్పీ -హింసా బాపీయు అన్ని ద్వంసాము జేయుమాని !!సంశాయామూను!!117!!

యీసంశయంబులూ యిఘదోచకూడదూ నీకర్మవశముచే నిన్నుజేరె నాయార్థమీరియు నటుదోచెనీకును-నావద్దికినిరాకునయముతోను గురిదప్పేనీదికాగుణము కుదురగలేదు ముఖము చూడగరాదు మున్నునీది- అనికోపమును జేయనంతలోశిష్యుండు!!దర్వు!! భయాభక్తి తోడానిలచియూ-సమయాముగాదని-నయామైనా యుక్తీపూనియూ వ్యయామయ్యేదంతా నాకు యెర్పాటుతోచానాయె - వ్యేయావెుుందానీదియెదో వెధామాన్పితెల్పామనుచూ !!భయాభక్తి!!118!!

యీరీతివివరించి యిఘవూరికెనువుండి కొంతవరకును యెరుకరంతుమాని తనలోన లెస్సగాతరచి శోధించియు యెగెసద్గురుకడకు బాగుగాను - వందనప్రియములు వరుస గావించియు సంతోషమొనరించె సరళితోను - వారుకరుణించగా వారనుగ్రహమును !!దర్వు!! పూనీపోందీ యూ గురువరా -యీదెహమెవరీ తోనూవచ్చెనూధీవరా - దీనీకిమూలామేది దేనీలొనుంచీవచ్చె పూనీయెచటీకిపోవూ దీనీకధిపాతి యెవరు !!పూనీపోందీయూ !!119!!

అనిప్రశ్నచాయగా వినిపూర్ణదయతోను వినజెప్పదొడగెనూ ఘనగురుండు యీ శెరీరం బునూ నీవల్లనే సృష్టినీకు - మూలముతేదు నిజముగావు -నీవవాంతరముగా నిటుగల్గితివి గాన నీకు మూలము దెలియజాలవెపుడు తెలశినప్పటికైన నిల్పిచేయవుగాన !!దర్వు!! కార్యాకారాణ

మూలునూ కానాగలేవూ -కోరిచేశీనాపానులూ -పూరానీచేతాజేశి యేదీతెల్యావుగాన వారీనీ లోనా యెంతో కోరీభ్రాంతిలోపొందీ !!కార్యాకారాణమూలునూ!!120!!

నీతోనె సర్వంబు నీవుతెల్యక భ్రమశి బ్రహ్మవిష్ణాదులని భ్రాంతిజెంది - వారితోనె సకలవ్యాపార మనుకొనుచు నున్నావుకాని నేలేనివాణ్ణి - అనినీకుతెలశితె అన్నినీవలెనని కనిలేకచనెదవు అనుచు గురుడు-చెప్పగావినిశిష్యుడుత్సాహమును బొంది !!దర్వు!! మున్నూబోధించూ మాటాకూ యీ మాటాజూడా -భిన్నామయ్యెనుతేటగూ -యెన్నైనవీరీతోను అన్నీపోగలవూనాకని - నున్నావస్తూవ గురుడు తిన్నాగా తెల్వూననుకొని !!మున్నూబోధించూ మాటాకూ!!121!!

సంతోషభరితుడై సాష్టాంగముగ ద్వాదశొందనంబులు నాలుగూడిగములు - అందంబుతో జేశి అతిదీనుడైనిల్చి అప్పుడుశిష్యుండు వప్పుగాను - త్రివిధప్రసాదముల్ తిన్నగాచేకొని అంజలీబద్దుడై అచటనిలువ - గురువుకు అత్యంతగుణశ్రేష్టుడనితోచి !!దర్వు!! తగీనాశిష్యూడు అనుకొనీ యీ బోధాకైతె మిగీలే భక్తూడుఅనుకొనీ - వగాజెందావలదూ పూర్ణత్రయామంత్రామూలవినియూ - పగా యేమిలేని వివియూ యిఘాదెల్పెదాను అనుచూ !!తగీనాశిష్యూడు!!122!!

ఆమంత్రమర్మము అతిశయంబునువినుము యీమూలమునులేని దేహమందు- గుర్తెరిగెడె లేని గురిషోడశియు సుమ్మిసుర్తి అన్నిటాబాపుషర్తుతోను అనిమంత్రరూపార్థమది బోధకము జేశి ద్వయమంత్రరూపంబు దెలుపదలచి- యిదియేమిలేదని మదితోనుకనుమని !!దర్వు!! కనూ సొగ్గాతోనూ కనుమనీ అప్పూడు గురుడూ వినీసొగ్గాతోనూ అనుమనీ - వినీకాని యింతా ఘనుని మును జూడాలేదూఅనుచూ- మనామూనానంధామొందీ అణాగీ సంతోషా మొందీ !!కను!!123!!

యిదియేమిహాశ్చర్యమింత సూత్రముయెంత గురువులైనను తెల్పకేగినారు - అన్నిశాస్త్రంబులు ఆపురాణంబులు వేదంబులునుశృతుల్ సూత్రములును - యేదిదెల్పకపాయ యీరహశ్యంబును నేను సృష్టించినా మేనుజగము - లేనిదేవతలెల్ల పూనినేకల్పించి !!దర్వు!! సూర్యాకిరణములా తోడానూ - మరుమారీచకములు పారీపొయ్యూనవాలెను - పారీపోవునూ నేనుదూరీపోయినా అన్ని - మీరీయుండీనా నేనులేని పనిపూర్ణామైతె !!సూర్యాకిరణములా!!124!!

పరిపూర్ణమన్నను పరమార్థమన్నను పరమపదంబన్న బ్రహ్మమన్న - అద్వితీయంబన్న అవ్యయ పదమన్న వాంగ్మనొక్రియకందరానిబయలు- లక్ష్యార్థముకుజూడ లక్ష్యంబుసరిపాయ- యీ ప్రపంచము వట్టిదేనుఅంటే - నాటినుంచెప్పుడు నమ్మికలేదాయె !!దర్వు!! సూటీఆయెను యిప్పూడూ నామదికీ అంతాబాటాదెలశీన యెప్పూడూ - యిట్టీ శిష్యూని గురుడూఘట్టీవారనుచూ యిరువురు యెట్టాకేలాకు శిఖికర్పూరామువలెనయ్యారి !!సూటీ!!125!!

చైతన్యరాహిత్యం

యెరుకపరిపూర్ణము యెరిగినతదుపరి రూపుబాసుట యెట్లు రూఢిగాను శబ్ధచైతన్యము లుబ్ధమవుటది యెట్లు ఆదరిశనముతోడ అణుగుటెట్లు - చెప్పవేయనిమ్రొక్కి స్థిరచిత్తమును నిల్చి మొరబెట్టెమిక్కిలి అగణితముగ-పరిపూర్ణమెరుకకు ప్రత్యేక్షమయ్యుండ!!దర్వు!!లేకాపోవుటా యెటువలె యీయెరుకామూలం రాకాపోవూటామెటువలె - ప్రకాటించీ దీనియొక్కా పద్ధాతిదెల్పూ మయ్యా వికాశించీయున్నాదీమది యికాయేదొతెల్పూగురవే !!లేకాపోవుటా!!126!!

పరిపూర్ణదర్శనా పద్ధతివినవోయి మధుజలంబునగలయు విధముసుమ్మి - అర్కునిదర్శించె అంధకారముబోలు ఆలస్వప్నమును మేల్కనమరినటుల-వెలిగారమును హేమముతొ అగ్నిలో

పొంది తనరూపుతో దగ్ధమైనవిధము - చైతన్యమును బాగపరిపూర్ణమును జూచి !!దర్వు!! అంతా లోపాల వేగానూ యీయెరుకాఅయితె అంతామాయామూజెందూనూ - వింతాగావాంతరముగా కొంతాశేపటికీ వచ్చీ యెంతోవింతాలు జేశిపంతాముతోడా యెరుకా !!అంతాలోపాలవేగాను!!127!!

చైతన్యమీరీతి చెలగిఐక్యమునొందుననియు చెప్పితిరి మహత్మయిపుడు వుండి-లేనట్లొన లేకనెపోవునా పరిపూర్ణ దర్శనాస్పర్శమునను -యిదిబోవుటేలాగొ మునుపుండుటది యెట్లు విదితంబుగను దీనివిధమునంత -తెలియజెప్పమటంచు తలపాదములమోపి !!దర్వు!! లేనీదిపోవూనంటీరీ లేనీదానికె వున్నానుచుందూనంటీరీ - విన్నాసందేహమిపుడూనన్నూ బాదించుచూను వున్నాది లేనీ యెరుకావుండీపోవూటా యెటులా !!లేనీదిపోవూనంటీరీ!!128!!

సద్గురుసంతోషచిత్తుడై శిష్యునిఅత్యంతకరుణతో అదురకనుచు - అటువంటిప్రశ్నయు యెటువంటి వాడైనా అడుగజాలడు వీడు అడుగుటరుదు - అనిమనమునూహించి మనయందు ధర్మము ఘనశిష్యుపరితాపమనగజేయ- వలెననిపిలచియు వినుచెప్పెదనుచును !!దర్వు!! పలీకె సద్గురుడూ నప్పూడు నీనోటయిటులా పలీకింతువీనూమిప్పూడూ- కలాకాలమూనూ లేనీకలా రూపామానె దాన్ని తలాచాలేనీది లేదని పలీకింతు నీదూనోటా !!పలీకెసద్గురుడూ!!129!!

చింతింపపని లేదుఅంతమీరెతెల్పి వంతుబాపెదరనుచు చెంతజేరి - అడుగబూనినవాడ వినికోపమొందినార్ఖుడిశెవాడనుగాను దీననాథ-యిదినివర్తించను యిఘమీరలెకాని వేరే యెవ్వరు లేరుకోరిచూడ - తమవంటివారలు తమరనేతోచును !!దర్వు!! వేరెయెవ్వారూ లేరికా ఆశరీరూలైతె కోరిచెయారుయేదికా - మీరెకానితరూలెవరూ లేరానిమదికీ దెలశె పారాదోలావె సంశయభారాములన్నీ బాపీ !!వేరెయెవ్వారు!!130!!

యెంతోచమత్కారవింతలు జేశేవు - నీతండ్రితల్లికి నీవుగల్గి- నప్పుడెక్కడనీవు వప్పుగా యున్నావు అనిఅడుగగను నేనుజఢుడననిన- మహబుద్ధిశాలివి మరిప్రసంగములోన శాస్త్ర పురాణముల్ చదువులెన్నొ చదివినవాడవు సర్వసూత్రములన్ని !!దర్వు!! సకలాముయెర్గీనాడవూ యీ భాగ్యామొకటి ప్రకాటించు జఢుడానంటవూ - వకాటీ అడిగీతె వేగా సకలాముయెటులాగుర్తు యికాదెల్పుమయ్యా దీనిని ప్రకాటించి లెస్సాగానూ !!సకాలాముయెర్గీనాడవూ!!131!!

తనశెక్తి ఘనశాస్త్రములు పురాణంబులు యితిహాసములు వేదశృతులుఅన్ని - ప్రకటించి చూచినా వకటైన అందులో పరితాపమును మాన్పెదొకటిలేదు - యికయిన్నిజేర్చియు వక సముద్రంబులో ముంచుటుత్తముగాని వుంచవలదు - అనివారిపాదములకతి భక్తితో మ్రొక్కి !!దర్వు!! యేది తెల్పాకపాయనూ - మీదయనేకానీ మీదుపాదములు విడువానూ - సాదారమూగ గురుడుచూచీ హస్తాముచాత - వేధా లేదనుచూ మదికి పాదూ లేపీనాతోడా !!యేదితెల్పాక!!132!!

యెరుకను విడిపించుటము

నీవుపుట్టకమునుపు లేవునిజమేకదా పోయిన తదుపరి ఆవిధంబు - మధ్యనేవచ్చియు మరికొంతశేపుండి నీవెలేకను పోదునేకమయ్యి - యిదియునిజమేకాద విదితంబుగను దెల్పు నిజమని పల్కెను ఘనునకపుడు - అనగానె నామాటవినిఅంటివోలేక !!దర్వు!! నీకేదృఢమానీ తోచేనా - తోచీతెవకటీ నాకూజేప్పూమి బాగానూ - నాకూసూషప్తియు గల్గీ లేకాయుండీనా యేమీ లేకా జాగ్రాతాగల్గు నాకూదోచాదు లేనిది !!నీకేదృఢమానీతోచేనా!!133!!

మొదలెచెప్పితి నీకునీవేవచ్చినవని తిరిగిఅడిగెదవేలతీవ్రపడియు-పంచభూతంబులనుంచి నీవైతివి పంచవింశతిభూత అంశకూడి-వెప్పిశరీరముసృష్టి అయనువేగ దానివలననె నేనుగల్గెగాన ఆదిపుష్పమందున ఆసువాసనరీతి!!దర్వు!! హంకారజాతామాయానూ ఆభూతాంశముతో - శంఖా లెస్సాగ కల్గెనూ -మంకూభూతములూ మొదటీ వంకాచేరేటికొరకూ సంకోచామొందానాది శంకాబాశీయుచూడు !!హంకారజాతా!!134!!

స్వామికించగ్గుడ లేదుసూక్ష్మము ఆదియునడుగగ వలశె విమలనాభ మొదలుదెల్పినదొకటి వివరించెదిపుడొకటి శ్రమబెట్టబోకు మీచరణసాక్షి - మరుగుబెట్టియు చెప్పినట్టుతోచెను నాకుమొదలులేకనె వచ్చినాడవనియు - పంచభూతంబుతో ప్రబలుచున్నావని !!దర్వు!! పంచా భూతాములందునా చేరుదువూతుదకూ మంచీగున్నారు అందున- యెంచా మీఅంతరాము నుంచన్నా మాటగాదు - కొంచాగాడానీ నన్నూ వంచించినానువిడువ !!పంచాభూతాము!!135!!

యెద్దైనదెల్పియు పోవలెననుకొని వున్నారేమోకాని మిమ్ముువిడువ - పొయ్యేవాడనుగాను యియ్యెడనాయందు కృపవుంచిపల్కవేనెపముబాపి-బ్రహ్మాదిదేవత బ్రహ్మాండమంతయు భూతంబు లేరీతిజాతమొందె - తెల్యజెప్పుమటంచు పరితాపమునుబొంద !!దర్వు!! యెరూకేమిలేనీ యప్పుడూ యెదీవున్నాదో మరీదెల్పుదానీనిప్పుడూ - మీరీదిదెల్పాకున్నా కోరివిన్నాదిఅంతా - సారామూలేనీదౌను బోధాశాయావెనాకు !!యెరూకేమి!!136!!

నీవుపుట్టకమునుపు నిలచెక్కడుంటివి నీకు కారణదేహరూపమైన - పంచభూతంబులు పరగనెటువలె నీవురానపుడెటులేవో అటువిధంబు - నీవలెనిఖిలంబు సకలంబునీవలె లేని విచారమె ల్యాతముదురు - బ్రహ్మాదిదేవతా బ్రహ్మాండమంతయు !!దర్వు!! వోచ్చేచూడూమి వేగామె నీవలెనే అన్ని హెచ్చీచచ్చూను వేగామె - మాచ్చీకతోడమాయా బ్రహ్మాదులంతావీను - స్వాచ్ఛాము గాను నీవె నిశ్చాయమూగ అంతా !!వోచ్చేచూడూమి!!137!!

సర్వంబుఖిల్విదామను బ్రహ్మావిధమును నీవె సకలంబును సకలమీవు - యిన్నియునీవు మునుపున్న దొక్కటి లేదుతుదకు నొక్కటిలేదు తరచిచూడ - రజ్జుసర్పభ్రాంతి మధ్యగల్గినయటుల కలిగినవెకాని మున్నులేవు పైన జెప్పినదాంట్లో వున్నదొక్కటిలేదు !!దర్వు!! అన్నాదిఆలాకించీయూ వినిసమ్మాతించి వున్నాదింతాని కాంచియూ - పన్నూగ వూరాకుండివున్నాది దెల్పూమనుచూ - యెన్నాశెఖ్యామూగాక వున్నాదిజూపూమనుచూ !!అన్నాదిఆలాకించీయూ!!138!!

మిధ్యాస్వరూపంబు మధ్యనుగల్గేది లేనట్టుతోచెనా లెస్సగాను - లేనివాడవ నీవు వున్నవాడవ తెల్పు - లేనివాడను నేను మానుగాను - లేనివాడవు నీవులేకనె పోతివి వున్నదానితో నీకుమన్ననేమి లేనివారికి లేనిసహవాసమునుకద్దు !!దర్వు!! వున్నావారీకి యెప్పుడు వున్నట్టి వారితో - మన్నానా గల్గూనెప్పుడు - యెన్నీవోస్తువులు గలవో - అన్నీటివాలె సుమ్మి - వున్నాదానితో పొందూ నిన్నంటు టాదియెట్లు !!వున్నవారీకియెప్పుడు!!139!!

గొప్పసందేహము యిప్పుడుకల్గెను సంభాషణకు మీతోచాలనైతి-కానిఆమాటలు కల్పించ కూడదు నేనులేకున్నను నాదుశక్తి - వున్నదంటరు యెమొ అన్యసాధ్యంబులె యెదన తోచదు ఆదినాథ- స్వాములతోడను పాములతోడను !!దర్వు!! సంగాతించూటకష్టామూ మీదయనేకాని పొంగీయుండీన నష్టమూ - రంగూగ తమకుయేది లాభామూగలదోదాన్ని అంగూగ దెల్పావలెనూ బంగారు వాఖ్యములచే !!సంగాతించూటకష్టామూ!!140!!

అదిలేక నీకేమిలోభమనెదరో యెమొ మీరులోభంబన్నదెదొనాకు లాభంబు అదిమహ లావణ్యమున్నదె తమరునాతో ముందువున్నదనుచు-తెల్పినారదిగాన నిల్వులేనీనేనులేకపొయ్యే వంటిసూటి యెటులో -వున్నదాన్నిట జూచికన్నంతమాత్రాన ॥దర్వు॥ నిక్కాముగాను పోవలె నిజ ముండావాలె పేక్కూలన్నియుచనవలె - మిక్కీలియింతాకన్నా యేక్కూవేమియులేదు వోక్కాపెట్టూన తెల్పి చీక్కూలన్నీయుబాపు ॥నిక్కాముగాను పోవలె॥141॥

వున్నదిజూడక పన్నుగా నేగితె మళ్లివస్తాననె మమతయిపుడు -అనిదిగులున్నది ఆకోదువ తీర్చితె మళ్లిరానెప్పుడు భిన్నమయ్యి -అదిచూడకోరికె కలిగున్నదియు గాన నున్నవాడవు ఆనెరు నన్నువేగ -మీరేవి నుడివినా మీరితప్పదుగాని ॥దర్వు॥ వున్నావాడావె అందూరూ మీమాటతప్పదు లేనివాడాని విందురూ - వున్నప్పుడుండివేగ అన్నీతెల్యాకపోతె -కొన్నీటీకొరకూ రావలె అన్నీ సమకూర్చూడనగా ॥వున్నావాడావె అందూరూ॥142॥

పృథ్వితత్వము బ్రహ్మ జలతత్వమిష్ణువు వహ్నిరుద్రుడు వాయు వీశ్వరుండు -ఆకాశమును సదాశివరూపమయ్యుండు - సృష్టికర్తగు పరబ్రహ్మమునకు నాల్గుముఖములయందు నాల్గు వేదంబులు పుట్టినావనివారు పుట్టిఅన్ని జంతుజాలంబులు జన్మింపజేయుచు ॥దర్వు॥ నున్నావాడాని పల్కుచూ శాస్త్రంబులన్నీ అన్నావానూచు మిడుకుచూ - అన్నారెకాని అనుభవ మున్నామాటిదియూ గాదూ పన్నూగ శాస్త్రగ్నులు వున్నాదన్నారెకాని ॥నున్నావాడానిపల్కుచూ॥143॥

పంచబ్రహ్మలవిధము పరబ్రహ్మమును సృష్టియెలాగొ దానినిబాగుగాను- పలుకుడి శాస్త్రంబు పలుకొకటంటిరి అనుభవంబును వెరెఅంటిరిపుడు - రొండుటివిధమెదొ నిండుకృపతో బల్కుదండి దాతలనోటినుండివినెద -శాస్త్రమర్మము మీతొచలగి విన్నాడను ॥దర్వు॥ అనూభావ మెదొ తెల్పూడీ ఆత్మనగా యెదో వినేభావమెదోకల్పుడీ - అనయామూగాను వ్యష్టి వినూడీ సామష్టి అనియె - ఘనాసంశాయములా బాపి ననుబ్రోవానీవెకాని ॥అనూభావమెదొ తెల్పూడీ॥144॥

అనుభవవాఖ్యము

అనుభవంబును నీకు అనువుగా వివరింతు ఆదికాలమునందు యెదిలేక - ఆద్వీతీయబ్రహ్మ ఆకార రహితమై నుండగా తనకుతా అందులోన -యెయాత్మగల్గెను ఆయాత్మచైతన్యమే పరబ్రహ్మని వాడుకయ్యె ఆబ్రహ్మమేపుట్టి ఆలచతుర్విధమైన ॥దర్వు॥ సృష్టిజేయూచూనుండూనూ జరాయు జాండజసృష్టి జరుపూచునుండునూ -స్వష్టాముగానుట ద్విజస్తావారా శ్వేతజాములూ సృష్టించె మాయా బ్రహ్మ నిష్టా అనుభవముతోడా ॥సృష్టిజేయూచూనుండూనూ॥145॥

దేహిదేహంబుతో కూడిపుణ్యంబును పాపఖర్మంబును పరగజేశి - నరకస్వర్గనుభవంబును తీర్చీ యాతన తనువు వీడును స్థూలతనువుపగిది-వీడినతనువునవ్యాప్తమైయుండిన వస్తు వాకాశమున స్వస్తమించు-భూతంబులందునా భువిదేహములయందు॥దర్వు॥ యెటులా అంటాకవుండునో మహభూతములతో అటులా అంటాకయుండునూ - అట్లాగెకొంతావరకూ ఆభూతమూలా వలన నాట్లాగె వుదకామధ్యమట్లూ ప్రావేశామయ్యా ॥యెటులాఅంటాక॥146॥

తర్వాతధరణిపై తగప్రవేశించియు ఓషధిరూపమై వనరుగాను - తదుపరి రసమయ్యి తగజీవులందునా కర్మశేషముచాత మనుజవరుని - గర్భమందునజేరి ఘనహృదయమందున నిర్భయంబుగ మూడు నెలలొశించి - విక్షేపమాయచే విశదంబుగను పురుష ॥దర్వు॥ వశామూ గుండీనా తెల్పీయూ స్త్రీగర్భమందు వశామైరోండూను కలశియూ - యెశామొందుపిండామయ్యి

మసాలూచు మనుజారూపు-విశాదామైయింద్రీయాదులు కుశాలామొర్దిల్లూనంతా !!వశా!!147!!

దేహింద్రియాదులు బాగముదిరిన వెనుక నెనువున్నాననె పూనికయ్యి - శబ్ధంబులో గూడి క్షేత్రగ్నుడనబరగి ప్రకటమై సుఖదు:ఖములు భరించు - వ్యష్టిభూతములైదు గలశి స్వష్టంబాయె పంచమహాభూతకంబువలన - యెర్పాటులైనట్టి మశపిపీలిక బ్రహ్మ !!దర్వు!! స్తంబాపర్యంతా మన్నియూ సామష్టిలోనా సంభావమైనావన్నియూ -కుంభీనీలోసామష్టి వ్యష్టీదేహాములందూ జృంభాణమూగ అంతా అంబారమైనా విధము !!స్తంబాపర్యంతామన్నియూ!!148!!

మహభూతములతోడ మరిభూతములతోడ వ్యష్టిసమష్టులు వేగకలశి - చైతన్యమని నమ్మ తగియున్నదియు గాన యిట్టియెరుకాత్మకు స్వష్టముగను - ఆదిమధ్యాంతములందు నిశ్చర్ధమై చలనములేనిదె విమలమైన కేవలాత్మేదీనికాధారమయ్యుండు !!దర్వు!! పరామాపదమయ్యావున్నాది యెరుకాత్మాకెపుడూ -పరబ్రహ్మమయ్యాయున్నాదీ- ఆరామారలేకాచూడు ఆర్యాసమ్మాతమైనా సిర్థావాఖ్యదృష్టాంతములు తరాచీచూడూమియింకా !!పరామాపదమయ్యావున్నాది!!149!!

వ్యష్టిభూతంబు సమష్టిభూతంబులు ఆత్మసమూలమందావరించి- అదిసూక్ష్మస్థూలంబులగు చరాచరమంత మాయప్రపంచము మానుగాను - చెప్పబడ్డవిఅన్ని చలగిభూతంబులో మిళిత మైనప్పుడు లలితముగను - మధ్యప్రపంచము మిధ్యలైపాయను !!దర్వు!! సద్దూచాయాకాచూడుమీ నీనిజరూపాము శుద్దామైనాదికానుమీ-యిద్దీప్రాపంచామంతా వుద్భావస్థితిలాయముకు యెద్దీగాకాను యెపుడు శిద్దామైయున్నాదాన్ని !!సద్దూచాయాకా!!150!!

నేనులేనప్పడు నీవోచ్చినంకను నీవు వున్నప్పడు నిండియుండు- చనిపోయినప్పడు చచ్చిన తర్వాత యేదివున్నదో దాన్ని చూడుమనుచు-హస్తసౌగ్నయు జేయనతడు సంతోషించి యిరువు రొక్కటి అయిరిబరువడిగను- కర్పూరదీపము కలశిపోయిన వెనుక !!దర్వు!! తీర్పూఅయ్యానా రీతీగా గురుశిష్యూలపుడూ దర్వాము లేనిభాతిగా - వోర్పూకన్నాను మీరినేర్వేమి లేకాఅపుడూ - యెర్పాటు కొంతావరకూ యెమి లేకాను యుభయులు !!తీర్పూఅయ్యానారీతీగా!!151!!

జనులు సర్వత్రులు జననమైనంకను శిశువుపై కలినీళ్లు మసలజల్లి - మంచిదినమొకనాడు యెంచినిర్ణయమించి తలితండ్రి తమబంధుబలగములును-పిలచిహితులందరు కలశి సంతోషించి వుయ్యాల బట్టియు వుచితముగను -శిశువునందులవుంచి అతిప్రియంబునవారు !!దర్వు!! పేరూబెట్టాగబూనిరీ వుల్లక్కిఆయని మారూజోగాల బాడిరీ - సారాము దెలియాలేకా సాత్యామె అనిరీఅంతా పేరార్థముల్లక్కాని దారి తెలియారు అంతా !! పేరూబెట్టాగ బూనిరీ!!152!!

జనులొగకార్యముకు వ్రాయనారంభించి కలముకాయిదమును కరమునూని - ప్రధమము శ్రీరాములూ నీవెకలవని పత్రికెవ్రాతురు పరగతుదకు- నిజమైనమాటనె నీప్రపంచము కల కలకు అధికారుడు కలనెయగును - అనినమ్ముకొనినీవు ఆవనిలోతెల్పకు !!దర్వు!! నీవూవుల్లక్కి అటువలె నిజమటులాకాదు తావయ్యాయుండూ తనవలె - స్థావారజంగమాది సర్వావస్తూవులందూ యేదీ అంటాకనుండె లీవెఅచలాము సుమ్మీ !!నీవూవుల్లక్కి అటువలె!!153!!

పరమాత్మమాయయని పరగశృతిస్మృతులందు పలుకుచున్నవి రొండు పలుకులవ్వి- లేనిదే మాయని వూహించి తెలియుమీ యేదిదృశ్యంబగును అదినశించు - జన్మించువానికి మరణంబు శిద్దంబు నిజము చలనబ్రహ్మకు నీవిధంబె-వున్నదనుటకు సర్వబ్రహ్మాండములనున్న!!దర్వు!! అన్నీటి కొచ్చూవేగమే సూషుప్తిమరణంబున్నాది విటీకిబాగనె- వున్నావోస్తూవ వీటి నెన్నాడెరుగాదు వినుమీ

నిన్నంటాబోవూయెపుడూ వున్నావోస్తూవజూడా !!అన్నీటికొచ్చూ వేగమే!!154!!

నిత్యంబుప్రతిమనిషి కద్దంబువలె స్వప్నముద్భవించును లేనిదద్భుతముగ - నావలెజగమని భావించుకోవలెనని సూచనంబుకు నవతరించు తెల్య -లేదదియెవరు తెలశియు నమ్మరు తెల్లకాగితముపై బెల్లమనుచు - వ్రాశినాకిన రుచిలేశమ్మైనుండునా !!దర్వు!! రంగూతోడూతా గొడాకూ వ్రాశినారవియూ శృంగారమ్మైనా జాడకూ -పోంగూగచీకాటీనీ మ్రింగేది గాదూచూడా అంగూబా బుచ్చీబాపీ మింగేఘనుడే కావలెనూ !!రంగూతోడూతా గొడాకూ!!155!!

చరితయోగజ్ఞాన క్రియనాల్గువిధములు అనిఖర్మగురువులు అనుసరించి - చరితమందున సదాచారంబుకలిగుండ అట్టిఆచారమును కొట్టిరొండు- తునీయలుచేశియు అందులో కులముల ఆచారమును మతాచారమొకటిరొండు యెర్వాట్లతో రొండువిధములునైన !!దర్వు!! శాఖాములయ్యే బాగానూ ఆరొంటీమధ్యా లోకాలిరికించనాయనూ -ప్రాకాటమూగ పెద్దాతనామూకు పొయినా వాడు లోకాములోనా శిష్యులనేకాము నడిచేరనుచు !!శాఖాములయ్యే !!156!!

ముందుమన మమరియు పొందినడువకపోతె శిష్యులటువలెనని చింతనొంది- ఆశిష్యులు ను తాముఅందులోనను యిరికియున్నారు యెందరో అందులోను-యిటువంటిగురువులు యిల ననేకము కలరు - కానీయీరీతియు కారువారు -భ్రాంతులకల్గించె భ్రాంతిరహితము జేశి !!దర్వు!! హస్తామందూనాబ్రహ్మమూ -కనుపరచాజేశి వస్తువందూనా నిరతమూ - స్వస్తామించాగ జేశి అస్థీరమూనూ బాపే - సుస్థీరాగురునీ వెతుకాసూటీగా కోటీకొకరూ !!హస్తామందూనా!!157!!

నీవునేననకను తానయ్యియుండినా పరిపూర్ణమాత్మని పరగబల్కి ఆయాత్మనేనని అనుచుందురితరులు కేవలాత్మందున నేనుఅనెటి - శబ్ధంబు తనకుతా చెన్నొందికల్గెను యిదెఆత్మ చైతన్యమనిరిబుధులూ- ఆమహకారణమగు శెరీరముకొంత!!దర్వు!! వరాకూరంతూను మానీయూ నేనైతెయింతా వరాకేమి లేనూఅనియూ-యెరీగెటి దానీకారణమనీరీ నిద్రాలో నుండి-సరాగూనాచేశె కార్యామంతా సూక్ష్మముఅనిరీ !!వరాకూరంతూను!!158!!

జాగ్రతనొందియు తగుప్రపంచంబంత దృష్టిచేభేదంబు స్పష్టపరచి-సర్వధర్మంబుతో సంసార మును జేశెదేదొ స్థూలంబైన దేహమనిరి - నాల్గుదేహములకు నాత్మతీతంబని అనియు నన్నారిక అదియు మేము అనుమాట విను వారుఆత్మనిఅన్నది !!దర్వు!! పరీపూర్ణ బ్రహ్మమంటీమీ శ్వతశిద్ధా మైనా - స్థిరాపాదమానికంటీమీ- వారుజెప్పీన నాల్గుదేహదారూలుమేము - వేరూ లేకాను రొండూ దేహాములన్నా మవియు !!పరీపూర్ణ!!159!!

విను శెరీరత్రయంబులు కూడివక్కటె స్థూలశెరీరంబు బాగుగాయె - యీ శెరీరత్రయంబుల లోను చేరిననదె సూక్ష్మదేహంబుననగ బరగు రొండుదేహంబులనిండు యెరుకొక్కటే నుండె చైతన్యము వుండదనుచు - లేదనిఅన్నాము సాదరంబుగయిది !!దర్వు!! యెటులానంటేను -తెల్వేదా పరిపూర్ణామాత్మని అటులానమ్మీక నిల్వగా - పటుతార చైతన్యాముయికా యెమిలేకా తెలయూ తటాకూనా పరిపూర్ణాము యెటుతానె అయ్యీవుండూ !!యెటులానంటేను!!160!!

యింకొకవిధమును కొంకకవినవోయి ఆదియునేలాగంటె మదియునెపుడుసంకల్ప రహితమై శంఖలేకుండిన పరిపూర్ణబ్రహ్మమని పల్కబడును-యిదియువాస్తవమును యిందుకు దృష్టాంతమును జెప్పెదను వినీనమ్మియుండూ - లవణముదకము నందుభువిలోగలశిన రీతి !!దర్వు!! కార్పూరకలితాదీపమూ కలశీయురొండూ నేర్పేమిలేని విధమునూ - దార్పామయ్యీన శిఖ్మాము కోర్చికరిపోరూనట్లూ వోర్పూనిస్సంకల్పములో తీర్పూ సంకల్పామట్లూ !!కార్పూరకలితా!!161!!

సంపెగపుష్పము సారమకరందంబు భృంగమపేక్షించబూనినట్లు - స్వప్నజనితుడు మేల్క జనితుని తోడను కలశివియ్యమునొంద దలచినట్లు - నరశృంగములతోడ నభముపోడిచిన యట్లుజలములో శర్కర గలయువిధము - ఆర్కుణిజూచిన అంధకారము భంగి !!దర్వు!! గోప్వా చైతన్యారూపమూ అప్పగిదీయగును గోప్వాకేవాలరూపమూ-చప్వాడులేకాకన్నా వుప్వాగ బోవువినుమీ -యిప్వాడప్పడు అనకాయెప్వాడు యెమీలేకా!!గోప్వాచైతన్యారూపమూ!!162!!

ధరపైన నుదకంబు తగనుపేక్షించియు చాతకంబును మేఘజలమునకును- యెరీతి ఆశించి యుండునో నారీతిశోధించవలెనివీ సోద్యముగను-వేరెమార్గంబుల వారిముచ్చటలన్ని సారంబులేనీవీ కోరబోక- పరిపూర్ణగురుకృపా పల్కెవాఖ్యములందు !!దర్వు!! మనాసుంచివినగా వాలెనూ మరిమారి అవియూ - వినీసంతాశించావాలెనూ - అనూవూగావిన్నా వెపుడు మదీలో శోధించావలెను- పనీబూనానంతారమునా నథీధ్యాసాకల్గావలెనూ !!మనాసుంచివినగా!!163!!

యేదిఅస్థిరమెరుక నదియు దక్షణగాను కోరిగురుమూర్తికి వేగనిమ్ము - నాకుబట్టదుగాని నీబాధకము తొలుగ విడిపించబూనితి విశదముగను - యిందుకు సందేహమీవునొందెదవేమొ పనికిరానిది నీకుపరగనాయె- నాశపదార్థంబు నాకేమిపనికోచ్చు !!దర్వు!! నీతోవిడుపించాబూనీతీ నిజముండాజూడా వాచాతెల్యాగ పల్కితీ - తోచాగ యిశ్తెఫలమూ నాకేమిఅంటావెమో - సూచాన చేతూవినుమూ తోచాగయిశ్తెఫలమూ !!నీతోవిడుపించాబూనీతీ!!164!!

అథితివక్కడు బిక్షమడుగ వచ్చినమనము అతిప్రియంబున బిక్షమిడుటవేళ్ల - ఆముష్టిలో భూషణములిడి వెశ్తేను స్వర్గలోకము ముందలబ్బినట్లు -నాశవంతంబయ్యే దేపదార్థము కలదో నదియు గురువుకు దక్షణనుచుయిశ్తె- నాశరహితంబైన నచలపదవియు దొరుకు !!దర్వు!! నీదీయేమీయు పోవునూ పోనివ్వారాదా బాధాదొలగీయు పోవునూ - పాదువిడుపించాకున్నా కాదునీవిడువాకున్నా భేదామెంచాక నీకూ బోధించినాను వినుమీ !!నీదీయేమీయు!!165!!

నాశవంతంబునునగు పదార్థంబేదో నాకుదెల్పితివేని నయముగాను - విడిచెవాడనెకాని ఝుడిశెవాడనుకాను వున్నదివున్నట్టు విన్నవించి - భ్రమరంబు కీటకంబును శేయుతనవలె నటువలె నాకంతప్రకటపరచి- మీఅంతవానిగానా అంతరముజేశి !!దర్వు!! అక్షాయమూగా కావవె అంతాటనుండె సాక్షీ జూపీయూబ్రోవవె - రక్షింపభారమంతా వీక్షింపమీదెయాని -వీక్షింపుచున్నా వాడపక్షా ముండావెనీవు !!అక్షాయమూగా కావవె!!166!!

మదిచంచలంబును మరలించుకొనివేగ యేకచిత్తుండవై యెలమివినుము - మదిచంచ లంబును మానక వింటివా సందేహసాగరంబందుమునగి - దర్శనప్రాప్తియు తగగలుగకుండును చక్కగావినుమికా నిక్కమొకటి - యినుమగ్నితోగాలి పెనుసమ్మెటలతోను !!దర్వు!! దెబ్బాలెన్నీయు తగిలియూ శ్రమనొందిదాని మాబ్బామలమూను విరిగియూ - గోబ్బానపర్శావేది దబ్బాన దలీగి నంతా నిబ్బారహెమామౌను అబ్బాయ వినుమీవేగా !!దెబ్బాలెన్నీయు తగిలియూ!!167!!

ఆలోహమగ్నిస్పరిశనమయ్యి మర్దన బాగుగాగాకున్న భవముబోక - అదికేటు హెమమౌ లటువిధంబున నాశవంతపదార్థము లనెటిమలము - యెమిలేకను దానిమూలంబువిడచినా శాశ్వితపదవియు సౌఖ్యమమరు -ధన్యుడవయ్యెవు అన్యంబు లేకను !!దర్వు!! మాయామయమైనా దంతయూ -శాశ్వితమూకాదు -మాయామయమైనాదంతయూ - మాయాయేదంటేనీకూ స్థాయీగా తెల్పెదానూ - వేయి విధమూలానైనా పోవాజెసూటా మేలూ !!మాయామయమైనా!!168!!

మాయయెరుక వివరము

ఆహమంత:కరుణమనుట యేదియుకలదో అదియె మాయకుమూలమగు కొమార అందు లోపల కల్గెపొందుగా త్రిగుణము లందుభూతములైదు అమరికల్గె -వీటితో దృశ్యంబు దృశ్యాత్మాంకం బైన- విశ్వంబుకల్గెను విమలతేజ- సర్వంబుమాయనుట సాదృశ్యమెులేదో !!దర్పు!! చూడూ మిందులో అన్నియు - మాయాని నీవుజాడాలెస్సాగ తెల్పుమీ - వేడూకమాయావకటీ జోడూగా రొండూనయ్యా యీడూగా ప్రకృర్తీ పురుషాభేదామాయెను మాయా !!చూడూమిందులో!!169!!

సత్తుచిత్తానంద సర్వాత్మలునుమాయ నాదుబిందూకళా నదియుమాయ- క్షేత్రక్షేత్రము మాయక్షరమక్షరముమాయ ప్రకృతిపురుషులుమాయ వికృతిమాయ- దేహిదేహముమాయ తేజం బులునుమాయ ఆంధకారమునాత్మ నాత్మమాయ- త్రిపుటిద్విపుటులు అన్ని తరచిచూచిన మాయ !!దర్పు!! నేకామన్నాను మాయనూ -అనేకామన్నాయేకామయ్యీనా మాయనూ - లోకా లోకములు మాయ లోకేశులంతామాయ - పాకాశాసానుడాది బ్రహ్మాదులును మాయ !!నేకామన్నాను!!170!!

చిద్రూపచిన్మయా సద్రూపమను యెరుకా సాక్షిరూపంబెరుక సర్వమెరుక ముక్తికాంతయు నెరుక శక్తులన్నియునెరుక భక్తివిరక్తులు యుక్తులెరుక కర్తయుభోక్తయు కారణంబులు యెరుక ఘనపరంజ్యోతనె కరణియెరుక - గ్నానగ్నేయము నిధిధ్యాన్సమననము లెరుక!!దర్పు!! అండా పిండములూ యెరుకనూ- బ్రహ్మాండమూలు ఖండాఖండములా యెరుకనూ- దండీస్వా రూపామయ్యా మెండూకార్యములుజేశి -ఖండామైపొయ్యెదంతా కన్నాదివిన్నాదంత !!అండా!!171!!

గ్నానేంద్రియంబులు కర్మేంద్రియంబులు అంతరింద్రియములు యెంచమాయ-పంచ కోశంబులు పంచప్రాణంబులు పంచతన్మాత్రాది పంచకములు-ద్రష్టదర్శనదృశ్య దృశ్యస్వరూపంబు నశ్యమయ్యే - వస్తువంతమాయ తనుచతుష్టయములు అధిపతులునుమాయ !!దర్పు!! అన్నీ మాయాని తెలియూమీ నీమదికీ దోచెఅన్నిమిధ్యాని తలచుమీ- యెన్నానితెల్పూదూను వున్నాదానీలో లేని యెన్నీగాలవో అవిఅన్నీ మాయాని తెలయు !!అన్నీమాయాని తెలియూమీ !!172!!

మనసునాడించేది బుద్దివ్యాపించేది తనువునొదలించేది తగనుమాయ-దృశ్యంబు కనులలో కనుపించజేశియు శబ్ధాన్ని విడుపించజేయుమాయ-మాయనుమాయనె మరి చలించగజేయు మాయనుంచేమాయ మాయమౌను-మాయతో మాయనే మాట్లాడుచుండును !!దర్పు!! సత్తామాత్రాము అన్ననూ - మాయానెలేనీ వుత్తాదంతాయుకన్ననూ - సత్తాదీనిచె నంటె రిత్తామాయనెకాని యిత్తారి యనుటా శిగ్గువస్తాది తెలశీనపుడూ !!సత్తామాత్రాము !!173!!

మాయనుంచేమాయ మరికనుపించును మాయనుంచెమాయమరి ప్రశిద్ది - మాయకే పరమాత్మ మగుపడెలాభంబు మాయనేజీవోద్భవంబు జేసు - భవసముద్రంబును బారదోలెది మాయ మాయనుంచె ముక్తిమరి లభించు - మాయనుంచే తెలశివిడుచుట లన్నియు !!దర్పు!! మూఢూలయ్యేది వేగమె ముక్తూలయ్యేది జాడాదొరుకేదిమాయనె - చూడూనీధానమూన వేదా శాస్త్రామూలన్నీతోడా - గూడీనావిశ్వమాది మధ్యాంతమంతా !!మూఢూలయ్యేది వేగమె!!174!!

సావదానస్థితి వేగకుదరించేది మాయనుంచెకాని వేరుకాదు - పరమార్థమును జూడపరగ అంజనమును మాయనుంచెకాని వేరుకాదు మాయనుంచె తెలయు మరిప్రపంచబంత- మాయ లేకుండినగ్నాన మెచట - భ్రాంతిరహితము జేశెభావంబుమాయనె !!దర్పు!! వింతాలెల్లాను మాయనెసాధకులాకూను -అంతూదెలశేదిమాయనే - వింతైనమాయాలేక యెంతాయోగూలా కైనా సంతోషామొందీపరమూ యెంతైనా తెలియారైరి !!వింతాలెల్లాను!!175!!

బోధస్థితి పురుషలక్షణం.

వున్నవాడెప్పుడు లేనని‌అనుకోడు లేనని‌అనుకోవటంబు లేక - వున్నవాణ్ణనుకోడు తిన్నగా వినవోయి -రొండోవిధమున నీకువిన్నవింతు -లేనివాడెపుడు వఘడున్నాడు అనకొనడు వున్నదను కోకనునున్నవాడు యేకాంగిననుకోడు ప్రాకటంబుగ వినుమి !!దర్వు!! గ్ఞానావంతూడు యెప్పూడు మదిలోనతాను గ్ఞానీననుకోడూ యెప్పుడు -పూనీప్రకృతీనీ యెరుగని పురూషుడున్నాడనుకోడు వున్నాదనుకోడు ప్రకృతిని యెన్నాపురుషూడనబడెడూ !!గ్ఞానావంతూడు యెప్పూడు!!176!!

అతిధనవంతుడు వెతదరిద్రంబును సతతమెరుగడు కాన అతనిమదికి భాగ్యవంతుడనని భావంబు దెలియక సహజంగవుండును సమరసమున- తేజోమయంబైన భానుడుచీకటి తెలియడు కావునతేజమేను అనుకోక అతినిర్మలంబుగా యుండును !!దర్వు!! మధూరామయ్యానా వస్తువూ చేదెరుగదుగాన -మధూరాము ననుచూ తెలియదూ- విదీతంబుగాను అగ్నివినూ శీతాలంబు నెరుగక- మొదాలూష్ణారూపూనానె విధమెరుకాలేకాయుండూ !!మధూరా!!177!!

సోముడూష్ణంబనె చోద్యమెరుగడుగాన చల్లదనుండనె సొఙ్ఞనెరుగ -జాలకుండియు తాను మేలుగనుండును యీవిధంబనుకోవటంబు లెల్ల -యివి వికారమె కదా యింకదెల్పెదవిను అవికారి యైనవాడెపుడుతాను -సవికారిననుకోక సహజంగవుండును !!దర్వు!! అవీకారిననుటా అటువలె అనుకొనడూ వేగమె సవీకారిగాక నటువలె - యీవీధామూనాయెపుడు పరిపూర్ణుడైనా వాడు భవాసూన్యామున్నా దనుచూ అవానీలో దెల్యాకుండూ !!అవీకారిననుటా అటువలె!!178!!

పరిపూర్ణుడెప్పుడు పరగశూన్యంబును వున్నదెరుగడు గానతనుతాను-పరిపూర్ణ నిర్గుణ భావుండ ననుకోక సహజంగవుండును సత్యమిదియు అవికారంబులు అన్నివుండిన వంటె- సవికారమెకదా సత్యముగను - యీవికారాదులు అన్నికల్పనగదా !!దర్వు!! యీట్టీకల్పాన లన్నియూ మిధ్యానెకాదా వట్టీలేనివి అన్నియూ - యిట్టీకల్పానలన్ని యితారూలా వలనాగాని - వోట్టీకల్పాన లివియు దీట్టాము తోడాజూడా !!యీట్టీకల్పాన లన్నియూ!!179!!

అరోపణము జేశెవారు కల్పనగదా కావునయిటువలె వేగవినుము- సత్యగ్ఞానానంద సత్య ద్వితీయమై వున్నటి బ్రహ్మంబు యెన్నడేని- ఆనృత దు:ఖాత్మమైయున్న యెరుకయు - పిండబ్రహ్మండ జీవేశ్వరులు వేగద్వైత -భావంబనితగ నెరుంగగ లేరు !!దర్వు!! సత్యగ్ఞానాది తీతుడూ ద్వితీయ బ్రహ్మము- నీత్యుడనుకోన జాలడూ- యిత్తారితోనూ వుండే దెత్తారినంటావెమో - వూత్తాబయలూలో అదియు నీత్యాముగానూ వుండూ !!సత్యగ్ఞానాది తీతుడూ!!180!!

యీవుత్తబట్టబయలేమి లేదనువస్తు -యీచెప్పబడినవె మాత్రమైన యీమూలమును లేని గుర్తెరిగె హంకారమయ్యున్న యెరుకయు యగువికారి-యెరుగకపోవునా యెప్పుడైననుగాని యెరుగుచుండుట వలన యెరుకయెపుడు-బట్టబయలునుగాక భవరూపమయ్యున్న !!దర్వు!! వూత్తామాయాది రూపమూ- వుత్పత్తిస్థితిలయ మొత్తామయ్యానారూపమూ హత్తించి హంకారము చే అభిమానమూనూబొందీ - సత్తాయెమీయులేకా చచ్చీపుట్టూచునుండు !!వూత్తా!!181!!

స్వప్నంబు లేనట్టి సకల దేవతలంత స్వప్నంబుయెరుగరూ సత్యముగను - మేల్కలున్నామనె మెలెపుడు తెల్కక-సహజంగవుందురు సమరసమున -ఆతీరుగురునిచే మేల్కొన్న పురుషుడు లేని ప్రపంచంబునేను అనుచు కనుగొనడదిగాన మతిమంతుడీరీతి!!దర్వు!! వినీసంతాసంబు నుండునూ రెండోదిలేని ఘనావస్తూవూను యెందునూ -వినాలేదురొండోదనుచునూ- తను వున్నాననుచూ యెపుడూ అనూకోనా జాలాడినుమూ పనీబూనీఅంతావాడు !!వినీసంతా!!182!!

కేవలాత్మ వివరము

సార్వకాలమునందు చలనమేమియులేని-దింకదెల్పెదవినుమి మంకువదలి చలన మొందెటిదాన్ని చెప్పితివినవోయిసూన్యపదంబిది సొంపుగాను-బిందువుసున్నని పేరు సూన్యంబుకు అక్షరంబిదిగాదు లక్షణముగ లెఖసూన్యమెకాని వక్కకాయిదముపై !!దర్వు!! వుండూ పేరూను లేకనూ సూన్యానికిన్ని - వుండూకాయిదమూదాపునూ - నిండూగా నకమొకాల నుండె కాయిదమె వుండెనిండూ కాయిదము సూన్యమొందానిదయ్యి వుండూ !!వుండూపేరూను లేకనూ!!183!!

అక్షరసూన్యోద్భవంబొందేటందుకు అదివుండిపోవను అన్నిటికిని- స్థానమైవాటిలో యెది నొక్కటి గాక లోబాహ్యమధ్యను లోనబైట పూర్ణప్రపూర్ణము పూర్వమైయున్నది అక్షరవ్యవహరమైన యపుడు కార్యంబు జర్వపుడు కల్గకవున్నపుడు !!దర్వు!! లేకాపోయీనా యెప్పూడూ చేలించినపుడూ జోకాలేకుండూ నెప్పుడూ - రాకాపోకాడ అక్షరాకారమూకెకాని - జోకాలేనిది యెపుడు కాకీతామాని తెలయు !!లేకాపోయీనా యెప్పూడూ!!184!!

బిందువేసూన్యము జెందియున్నదికాన శబ్ధమెప్రకృతనుచు చెప్పబడును- అదియె ఆకాశ గుణ శబ్ధమయ్యుండును నిశ్శబ్ధమేబ్రహ్మతత్వమగును-యిదినిర్గుణంబును అదియు సగుణంబును మాట్లాడునదిగాన మరియు వినుమి-కేవలాత్ముండేది చేయబూనినవాడు!!దర్వు!! చేపించేవాడు కాడికా బోద్యుండుకాడు వోప్పూబోధకుడు కాడికా - యెప్పూడు సూదీ శిలవలె తప్పూచంచలమూ లేకా యెప్పగిదీ చేయాబోకా వోప్పీచేయించాబోకా !!చేపించేవాడు !!185!!

సకలేంద్రియావిషయ పతి కతీతుండును చుంబకపాషాణచెలనములును- లోహంపు చేష్టల భావించియెరుగడు ఆరోపణాదృశ్యరూపములును- ద్రష్టత్వమెకాని దర్శనదృశ్యముల్ కావు నీనిజరూపమాదియైన నిత్యనిరంజన నిర్మలచలంబును !!దర్వు!! ఆకారమూనుగానీదీ అదృశ్యామయ్యి రాకాపోకాలులేనిదీ- ప్రాకాటమూగ అంతాబట్టాబాయాలునయ్యి- జోకా యేమీయు లేకా యెకామైయున్నా స్థిరమూ !!ఆకారమూనుగానీదీ!!186!!

మహకారణాతను మరీఆత్మగ్జానంబు కారణంబగ్జాన కాయమగును- అన్యధాగ్జానంబు అదిలింగదేహంబు స్థూలమెవిపరీత గ్జానమగును -ద్రష్టదర్శన దృశ్యముల కతీతుడుఆత్మ -ద్రష్టత్వమె బంధకారణంబు -యిదివిడచుటె మోక్షపరమని తెలయుమి !!దర్వు!! సత్తూ సదసత్తూలాకునూ మధ్యావర్తీవత్-హత్తుగాకొన్నీరూపునూ - సాత్తాసర్వాముకనకా దృశ్యామున్నాదికాదు-నిత్యామయ్యానా వాడూ దృశ్యాదృశ్యము నెరుగడు !!సత్తూసదసత్తూలాకునూ!!187!!

వుదయాస్తమయములు నొందని వుస్తువు యెంచరాకను అంతతానెఅయ్యి - స్థానంబు లేకను సకలమైయుండును చంద్రుడు తాపంబుజేయునటుల - అగ్నిశీతలమును అగ్రహించును వినుమ భానుడంధంబును జేయువాడ - యివిఅన్నియెలాగొ అలాగెఅదియికా !!దర్వు!! పాట్టు విడపూలులేనీదీ దృశ్యామునుంచి ద్రాష్టత్వమయ్యాయున్నాది- ద్రాష్టత్వబంధామేను ద్రూశ్యాభావాము నందూ-ద్రష్టాకు ద్రష్టత్వాము దృష్టామొందనిదె ముక్తి !!పాట్టువిడపూలులేనీదీ!!188!!

గ్జానగ్జేయమురొండు పూనిలెస్సగయున్న వ్యాళ్లజాగ్రతవృత్తి వాశిగాను - వృత్తిసూన్యమె నిద్ర వరుసయీరొంటిలో-యెరుకమరుపులు లేనిదేమిగాక-దు:ఖసందానాదులును యేమిలేనిది అమృతరూపము తీపిఅయ్యివుండు - కనకచేదును యెరుగజాలకుండునుఅది !!దర్వు!! సూర్యా ప్రాకాశా రూపమూ అయినాదిఅంధకారామెరుగాని రూపమూ -సారామైనాది లక్ష్యఆనందమయ్యా

నాది - మీలీఆనందావిషయా సారామెరుగాకనుండూ !!సూర్యాప్రాకాశా!!189!!

సర్వసంకల్పోపశాంతమయ్యితె స్ఫురణ భావమౌస్థిరముగా భక్తవినుము- స్ఫురణభావమె వా:కు విషయభావము సుమ్మీ వా:క్కువిషయంబది కాదుగాన- జఢమువలెనె వుండెవునికి మాత్రమె కాని నిద్రలేదది కానమేల్కకనదు - యీరొంటివార్తల యెరుగకుండెది యెపుడు !!దర్వు!! దేహపాలాన జేసునూ -చైతన్యారూపము మొహకల్పాన జేసునూ - ఆహంబ్రహ్మాంబుఅన్ని ఆడించా జేసూవినుమూ వూహచెతానె అన్ని దేహము లెరుగూచుండూ !!దేహపాలాన!!190!!

అందుకొరకై ఆదిఅన్ని దేహములకు పృథకుగాకను వుండు ఘటములకును - మృత్తిక లేకను ఘటములెటుగల్గవో ఘటముకుమృత్తికా పృథకుగాక-వున్నటులమృగజలా ప్రామాణ్యా ముండునూ వంధ్యపుత్రుడు రజ్జుసర్పములకు - చావువసుదలోలేదు ఆవిధంబున యిది !!దర్వు!! సంసారభ్రమలూ లేనిదీ-కనుపడుటామెల్లా సంశాయములకూ తల్లిదీ-సంసారమను తారంగం బింసామనోనాదీయూ ధ్వంసామయ్యానతోడ సంశాయమూలుచనునూ !!సంసార!!191!!

సంసారమదినదీ సంపూర్ణనదిలోను మిళితమయ్యినతోడమిత్తిలేక - పరిపూర్ణమైయ్యున్న పరమచలముండును - పిండబ్రహ్మాండములు రొండుకూడి - నభవిలాసంబు యానభవిలాసము దెల్ప యెవరివశమును సర్వవ్యాపకంబు భూతభవిష్యత్ వర్తమానంబుల !!దర్వు!! అవారించూక యున్నదీ -ఆఅచలమూను ఆవర్ణమొందాకున్నదీ - యువీధా నామంబు లేక సవీకారమొందాబోక భవానాశామూలు లేనీదగూనాకాశామె అంతా !!అవారించూక యున్నదీ!!192!!

యింతదవ్వాకాశముకు బ్రహ్మలకుభేదమేమి లేదదికాన పూనివినుము-జడము నిరాకాశమ జడము బ్రహ్మము అదియు నెలాగంటె పదిలముగను -జీవబ్రహ్మము నీర్జీవ మాకాశము అదియు చిదాకాశమనగబడును - యిదినిరాకాశంబు నిస్థరంగంబైన !!దర్వు!! శింధూసంపూర్ణమైనదీ లోస్ఫురణాలేకామీదాసంచారికానిదీ-ఆదీబైటాదృశ్యామానె వాయూ సంచారి కానిది- శిదీలామయ్యేటి దానిస్థితియెన్నాడెరుగానీది !!శింధూసంపూర్ణ!!193!!

పూర్వయుగములయందు పుణ్యాత్ములీరీతి తెల్పినారది వత్సతెల్లముగను- మునువశిష్టాదులు ఘనులకటువలె తెల్ప జననబాధలు బాపినయముతోడ - అవ్యయపదమును అదితేటగాజూపి వ్యయమయ్యె దెరుకని వేగజెప్పి -నటులనీకును దెల్పపటుతరంబుగ యెరుక !!దర్వు!! పాదూౕ పెకలించానాయనూ - పరమార్థమూను పాదుస్థాపించానాయనూ - మదీతోను మడశీనీవు పరిపూర్ణమైనాతోడా-వదాలాకుకాయామొదలీతుదానొందెవరకూదీన్ని !!పాదూపెకలించా!!194!!

యింతకంటెను యెక్కువిఘలేదు వినుశిష్య మంతనంబున బేదమెంచబోక - నీకు బోధించితి నిజమైన తత్వంబు సాటిలేదింకొకటి తేటకెపుడు- ఆత్మనాత్మలకును అదికేవలాత్మయు అంతయింతనుటకు అంతులేదు - దాచలేదిదినీకు ధర్మసాక్షిగసుమీ !!దర్వు!! నీవూమరువాకు యెప్పుడూ గురుపాదములాన పోవూయెరుకొదలూనపూడూ - నీవూజెప్పార నీకునేనూజెప్పీన యటులా - రావురా నిజమాబ్బీతె నీవెపల్కారవినెదా !!నీవూమరువాకు యెప్పుడూ!!195!!

జన్మహేతు వివరం.

జాగ్రతబోందగా జగయుగంబులుతాను స్థావరజంగమాసర్వవస్తు- సమకూడెతనవలె విన వోయి సర్వంబు తానుసర్వంబొకటి వేరుకాదు- విశ్వనామముబోంది యిహపరసౌఖ్యముల్ విశ్వశించియు చేసుస్వస్తముగను - మదిలోనకల్పించి మరియేదినుడువునో !!దర్వు!! అదీయె

దృశ్యాము కనుపడూ -అలస్వప్నామందూ -మొదాలెచేశీనాదగుపడూ- అదిఅంతా అనుభావించు తరీనీద్రానొందీపిదపా - అదెస్థూలాగ్జానావస్త మగూడీవస్తుందీ వినుమూ !!అదీయెదృశ్యాము!!196!!

ఆలాగుజన్మంబు యాలోకమునకల్గు చతురు వింశతిభూత రతుడనయ్యి-విశ్వుడభిమానుడై దృశ్యజాగ్రతయందు బాలయవ్వనము కౌమార్యవృద్ద-దశలందు దుష్కర్మసత్కర్మమేదేది ఆశ నొందియు చేశిమోసమొంది- సతిసుతహితవస్తు మతిశెరీరముగృహము !!దర్వు!! సతాతా మన్నీయునావనీ చనిపోయిస్వప్నాగతారూపమూను దాల్చియు- వ్యతాయాతానాము బొంది మతీ తోను జన్మమందు- క్రతూవేది జర్గీనాది అతూలీతమూగా అదియూ !!సతాతామన్నీయు !!197!!

యాతనవస్తుచే అతులితంబుగ నరకస్వర్గనుభవంబులు నయముతోడ - అనుభవంబును తీర్చి అదికారణము చేత మగుడిజన్మము కొచ్చుఅగడుజెంది - మునుపుజేశిన ఖర్మమును అనుభ వించుచు మరలనావిధమున మగుడిజేసు- యావిధంబున జర్గుయిాజగత్తంతయు!!దర్వు!! వకాటే విధమూను అంతాయూ-ఆవస్తాత్రయములు ప్రకాటించుజనులాకంతయూ- యికాజన్మానరకా స్వర్గామొకాటాని తెల్యావలెను-వికాశించావస్తాత్రయములు విన్నావించూచునుడూ !!వకాటే!!198!!

జీవన్ముక్తి వివరము.

జాగ్రతయందుతా జర్పినక్రియలన్ని స్వప్నమందగుపడూ సరవితోడ - అటువలె జన్మమందెటు వలెకల్గునో పటుతరభ్రాంతుడై పనులునడిపి- వెసనమొందుచు మరణదశయందు ఆశచే మిగిలుండిఆవలమగుడిగల్గు - భ్రాంతులకెల్లను పట్టణంబైయున్న !!దర్వు!! భ్రాంతూలకెల్లా మూలమూ అయ్యుండీతాను వింతాలెల్లాను జరుపునూ - మంతానంబూన నీవు యెంతొయాదీతో నుంచి - అంతామూ వరకూ ఆశకొంతైనా నిల్పాబోకూ !!భాంతూలకెల్లా మూలమూ!!199!!

మూడవస్తలయందు మూడుకాలములందు వేడుకదు:ఖముల్ కూడునపుడూ దెహింద్రియా విషయ బోగయోగములందు కారణకార్యముల్ జర్పునపుడు - కర్తృత్వ భోక్తృత్వ కర్మధర్మలయెపుడు కీర్తిబొందెటివేళ్ల కీడువేళ్ల - కర్తభోక్తక్రియ కారణసూన్యుడై !!దర్వు!! వుండావాలేను యెటువలె నిండూనిర్బయలులో వుండునీవెపుడూ నటువలె - దండీగా సర్వాభీజా సాక్షీ సూన్యామవ్వూను-నిండూ దేవూడు యెరుకాముండామోపీనతోడా !!వుండావాలేను !!200!!

వినుము జాగ్రతయందు విశ్వుడభిమానుడై జర్వేటిక్రియలందు వోర్పుతోను-అలస్వప్నమందు తా వినుతైజసుండునై కలకార్యసుఖదు:ఖకరణియందు- ఘనసుషుప్తికి ప్రాజ్ఞుడును విభుడై యుండు నప్పుడు తూర్యమందెప్పుడేని-నాల్గురూపములునై ననుభవించెటివేళ్ల!!దర్వు!! నయామైనా బ్రహ్మామందునా- అనయామూ మరువక ప్రియామైనా బయలూనందునా- భయామేమిలేకా మదినిర్బయాలందే చెందీయుండా- మయామైనాబ్రహ్మాముండు మదీనీవుగనుటా నిజము !!నయామై!!201!!

విజనస్థలములున్న సుజనులలోనున్న జనసంఘములనున్న జాతిలున్న - యెకాలమందైన యెకార్యమందైన యెమిజేయుచునున్న యెట్టులైన- పడియుండువేళ్లను పణతిసంగమువేళ్ల నిద్రించువేళ్లను నిందెవేళ్ల - నిద్రమేల్కొను తరినిలచి యున్నప్పుడు !!దర్వు!! దాలీనడచేటివేళ్లాను దయజేశెటివేళ్ల కోరీభోంచేయు వేళ్లాను- కోరీకలేకా సర్వాక్రియాలాకా కర్తావయ్యి - మారూపల్కాని బట్టాబయాలందే ఐక్యామొందు !!దాలీనడచేటివేళ్లాను!!202!!

సకలదేశములందు సర్వకాలములందు సర్వకార్యములందు సముచితముగ- లోకలోకము లందనేకవస్తువులందు యిహపరంబులయందు యిడుములందు- గృహారామ క్షేత్రాదితను విత్తముల యందు సతిసుతహితబంధు సంఘమందు- కరుణకలినములందు కల్లనిజముల యందు!!దర్వు!! వకాటెవస్తువూ నందునా-వికశించీనీవె ప్రకటించుమనమూ నందునా యికాజేర్చి యెప్పాటీకి వికాశింపకుండాజేశి- వకాకొంతాశేపూఅయినా యికామర్వాబోకూ యెపుడూ !!వకాటెవస్తూ!!203!!

నీవునేనూ మేను యెకలలొచ్చెనో ఆకలమేల్కన అదియురిత్త - సర్వదృశ్యంబులు సమ యించు నటుమీద నిబ్బరసూన్యంబు దబ్బరాయె - కలలోని పనులెల్ల కనిమేల్కజెందియు తెలశేమి శేయనితెరువువిధము - యిహపరాదులు తాను యిలయెల్లస్వప్నము !!దర్వు!! అంతామిధ్యాని యానుచూ ఆఅమలామందే సంతోషమూనాపొందూచూ- కొంతైనాలేక సర్వామంతావుల్లక్కీఆయె యెంతోవింతాలుగాల యెరుకంతా సూన్యామాయె !!అంతామిధ్యాని!!204!!

గురువు అభయప్రదానం.

కారణాచార్యులు కరుణించిదయతోడ నాకుబోధించినరీతినీకు-తెల్పుటకీకృతి తెల్పితి వినుశిష్య నీకుబోధించను ప్రీతితోడ - నిష్కళంకంబుగ దీనినిచ్చితి నీకు దాచుకోనెప్పుడు చూచు కొమ్మి- నీకుబోధించను నిర్మించెదేవుండు !!దర్వు!! నాకేమిపనియు లేదికా మీకొరకెకాని చేకోని చేయాలేనికా - ప్రాకాటమూగ పూరాఫలామనుభావించెయెరుకా - జోకాబాపించిరాబడె శోకాము మాన్పె గురువరు !!నాకేమిపనియు లేదికా!!205!!

నిన్నాశ్రయించిన నిజభక్తులకు నెల్లపటుతరంబుగ దీనిపద్దతంత -తెల్పుమిమది నెరిగి నిల్పేటివారికి అల్పమతులకు దీన్ని తెల్పవలదు - వినునట్టివారికి తగినట్టి బోధను ఘనులుముందిటు తెల్పిచనిరివేగ - మనసులోసంకల్పమదియేది గల్గునో !!దర్వు!! అదీయేపల్కూచు నుండూనూ కార్యములూ అన్నిమొదాలేచేయూచు నుండూనూ - యిదీవేగనెరిగీవానికి తగీనంతాసత్కారించు వదులాకునాదూమాట పదీలాము నీదూమనసూ !!అదీయేపల్కూచు నుండూనూ!!206!!

గురుని లక్షణం.

సాధుమితభాషియు సజ్జనవృతియు వాదభేదంబుల జూదగతుడు - శాంతిశమదమ విశ్రాంతి చిత్తంబును బ్రాంతులేమియు లేనివింతమతులు - విమలసద్వేదాంత విత్తసంపన్నులు నిర్మలగుణచేష్ట నీతిపరులు - ఆచార్యుడును సదాచారంబుతో నుండు !!దర్వు!! అతాడేగురుడాని యందూరూ సద్భక్తులంతా గతీమోక్షామూలు గందూరు - పతీతాపావానమూర్తి పరమా పరమాధీపతియూ అతానీపై అవేశామై గతూలన్ని బాపూజనులకూ !!అతాడేగురుడాని !!207!!

మమకారహంకార మాయరాహిత్యులు సహజామనస్కులు సత్యహితులు - గ్నానఅనుష్టాన ఘనశిద్దిఆర్యులు భూతదయాపరుల్ భువిలోహితులు - సద్భక్తప్రియవరుల్ సజ్జనహృదయులూ సమదర్శనోన్నతుల్ సత్యమతులు యిటువంటి గురువరుల్ యిలలోన శిష్యుల!!దర్వు!! కర్మారహితూలా జేతూరు -తమశిష్యులాను నిర్మాలమతులా జేతురూ- ధర్మాసామంధామైనా తనాయూడు వీడూయాని మర్మామంతాయు దెల్పి మరీఆశ లేనీవాడూ !!కర్మారహితూలా !!208!!

శిష్యలక్షణం.

చిత్తశుద్ధియుగల్గి మత్తతలేకుండ మాత్సర్యమొదలియు మదియునిల్పి - గ్నానవైరాగ్యముల ఘనభక్తియుక్తుడై శాంతుడై యెప్పుడుభ్రాంతులొదలి యితరములన్నోదలి గతినీవె యనుచును మతిలోన గురుశేవమరియు సల్పు తలిదండ్రిధోరదాత గురుదైవమనుకొని !!దర్వు!! సతాతామీరీతీ నుండూను-సచ్ఛిష్యుడు యెపుడుగతాకామ్యూడయ్యా వుండూనూ- హితావూదెల్వేటివారి గతూలెంచాబోకాతాన మతీశూద్దమూను జేశి -వెతాలేని పదవీనోందీ !!సతాతామీరీతీ !!209!!

నిత్యబ్రహ్మానంద వొస్తువివేకంబు యిహపరభోగవిరాగమొంది- శమదమంబులు శాంతిశ్రద్ధో పరతులును శ్రవణమననధ్యాసశేవలందు - అర్చనవందన ఆత్మనివేదన అష్టవిధంబులనమరిచేశి తనుమన:ప్రాణముల్ గురుణికర్పించినా!!దర్వు!! గురూపుత్రుడాని యందూరు- దుర్గుణములు లేక పరామాపదమూను కందూరూ - గురూడూ దేవూడుగాని నరూడాని యెంచాబోకా - అరాలేకా శేవాజేశి స్థిరామైనా పదవీనొందు !!గురూపుత్రుడాని యందూరు!!210!!

యీబోధవిన్నను యేబోధబట్టదు ఆబోధలామీదిదచలబోధ-యిదివిన్నవారికి యిఘభక్తి శిద్ధించు చదివిన గ్నానంబుసమయకూడు-వినిపించిఅర్థముల్ వివరముల్ దెలిపినాతత్వగ్న్యు లౌదురు ధరణియందు - చదివించివిని అర్థసారంబు దెలశినా !!దర్వు!! భక్తూలందారు వెగాను వీరాగామొందీ ముక్తూలయ్యేరు వెగానూ - భాక్తీతో గురునీనోటామోట్టామొదాలె విన్నా సూక్తీదెలశిన వారికీ శేక్తీద్వయ రహితామౌను !!భక్తూలందారు వెగాను!!211!!

కవివంశాను క్రమము

శ్రీకరంబుగ శుభశేకరంబైయున్న అన్నమరాజవంశోద్భవుండు - భరద్వాజగోత్రుండు పరమ పవిత్రుండు అనంతకృష్ణయ్య అలర పేరు - జనకుండునాకును జననిసరస్వతి అలసత్యవతిసతి ఆవనిలోన - భాగవతోత్తమ మతభావయుక్తుడ !!దర్వు!! రామాచంద్యూడు అందూరూ పామార జనులూ నామరూపాములా కందురూ - ప్రేమాతొగురుణిబోధా నెమాముగనియూ వేగా - పామారమార్గమూల సారాముపదులానాయె !!రామాచంద్యూడు అందూరూ!!212!!

విక్రమార్క శకంబు వినుముపందొమ్మిది నూటయిరువై వకటిప్రాకటముగ - శాలివాహన శకందగను పద్దెన్మిదినూర్ల యిరువదియేడు గడువనాయె - కలిగతాబ్ధంబును కడుపంచసాహస్ర వత్సరంబులు ఆరువరుసనైన వినుము విశ్వావసు సహ్మత్సరంబున !!దర్వు!! చైత్రాశుద్ధామూ నందూనా స్థిరవాసారమునా మీత్రాసప్తామి నందునా - శోత్రీయులాకు మేలుసూత్రాము దెలయూకొరకూ ధాత్రీలో పలుకానాయె తలాచాదేవూనికృపతో !!చైత్రాశుద్ధామూ నందూనా!!213!!

గ్రంధకర్త ఆశీర్వచనము.

గురుమహిమెందాక గూడివర్తించునో అందాకయిాబోధ అధికమించు - వసుదాజలంబగ్ని వాయువాకాశంబు యెందాకనుండునో నంతవరకు - యెందాకరవిశెశి తారాంబుధులునుండు నందాక యిాబోధనతిశయిల్లు - వర్ధిల్లుచుండును వసుదపై దీనిని !!దర్వు!! ఆర్యూలా కెల్లామ్రొక్కీయూ ఆర్పించితిరశికా వర్యూలాకేనూ దక్కీయూ - వారీలొవేశీనాను వసూదాలొ యెంచకున్నా - మీరీ వర్ధిల్లూచుండూ ధీరామగు గురుణీకృపచె !!ఆర్యూలా కెల్లామ్రొక్కీయూ!!214!!

మంగళము.

జయజయనిశ్శబ్ధ జయజయమనిర్వాచ్య జయమునిరాకార బయలునకును - జయనాత్మ నాత్మలాత్పర కేవలాత్మకు జయమచలాత్మకు జయముజయము - జయనిర్వికారముకు జయనిర్మ లాత్మకు - జయజయమవికల్ప విమలమునకు -జయజయమమలాత్మ జయనిశ్చలాత్మకు !!దర్వు!! అవ్యాయమైన పదవికీ - ఆదిఅనాదీ సవ్యామయ్యాన పదవికీ - అవ్యాయపదమూనకును అదిజేయ ముండూగాక - భవాపాశరహితామైనా అవాకాశమూకూ జయము!!అవ్యాయమైన పదవికీ!!215!!

గద్య!! ఇతిశ్రీమద్వేదాంతసారుండును - సచ్చిదానందతీతుండును -క్షేత్రక్షేత్రఙ్ఞ రహితుండును క్షరాక్షరోపాది విలక్షణుండును - ప్రకృర్తి పురుషద్వయదోష రహితుండును - పరమపవిత్రుండును ఆశేరీరుండును ఆప్రమేయుండును - అచలుండునునైన -శ్రీమత్ భారలింగదేశికేంద్ర నిజగురు చరణకమలకురువిందారు విందమరంద పానతుందిలతా-మందమందానంద మిళింద బృందంబున-అన్నమరాజవంశోద్భవ భరద్వాజసగోత్ర పవిత్రకుండగు-వెలివెర్తి రామబ్రహ్మ ప్రణితంబైన సర్వార్థనిర్గుణ సీసార్థ దర్వులు సర్వము సంపూర్ణము

శ్రీఅచలగురు చరణారవిందార్పణమస్తు

# శ్రీభారలింగ శతకము మొదటి బాగము

శ్రీగురుండునైన చిన్మయాతీతునీ జేరుకొరకునిన్ను జేరికొలచి - ఆర్యులందరికిని ఆత్మలో వినుతింతు -కర్మరహితరంగ భారలింగా!!1!!

నిన్నువినుతి జేయనిఖిల వేదములన్ని - చాలవనుచుమదిలో సన్నుతించి చెప్పబూనితయ్య సత్కృపా సారంబు -కర్మరహితరంగ భారలింగా!!2!!

నిఖిలమందునీవు సకలంబునీలోన - వుండునయ్య యెపుడుదండిగాను - అండబాయ కెపుడు అంటకనుందువు - కర్మరహితరంగ భారలింగా!!3!!

లోకవాసులకును లోకేశులకునెల్ల - లోకములకుబైటలోన వెలగు - ఖ్యాతిపతికి యెపుడు ప్రీతితో మ్రొక్కెద - కర్మరహితరంగ భారలింగా!!4!!

విశ్వవందనునికి విశ్వాధిపతికిని - విశ్వమునకు సర్వదృశ్యమునకు - మ్రొక్కెదాను సర్వ మోహంబు విడనాడి - కర్మరహితరంగ భారలింగా!!5!!

యెతిగణంబులన్ని యెర్వరించ్చియుచెప్ప - వశముగాదు చదువులోదురలేదు - నీదుకృపచె కల్గెనీవా:కులన్నియు - కర్మరహితరంగ భారలింగా!!6!!

తప్పవప్పులనియె తిప్పలేమెరుగక - చెప్పినాడరశికులొప్పిరనుచు - తప్పులున్నదిద్ది తత్వంబు నరయుడీ - కర్మరహితరంగ భారలింగా!!7!!

లేనిస్వప్నమందు లేకనేకల్గియు - పరులజూచిక్రియలు పరగజేశి - భారగురుణి చేత బాశితి సర్వంబు - కర్మరహితరంగ భారలింగా!!8!!

వట్టిమాటలుగావు దిట్టమైచూడండి - ప్రణవమందుగల్గె పద్యసరళి - పట్టువిడుపు లేనిపద్ద తిందులో కలదు - కర్మరహితరంగ భారలింగా!!9!!

జననమరణఘోర తరుణంబుబాయను - గురుణిజేరవలయు అనుదినంబు - కాయమస్థి రంబు గతమౌనుక్షణములో - కర్మరహితరంగ భారలింగా!!10!!

గురువులెందరైన గలరు యీధరలోన - కానిఅచలగురుడు కానరాడు - అట్టివార్ని వెతకి ఆశ్రయింపగవలయు - కర్మరహితరంగ భారలింగా!!11!!

చతురువిధములైన శిశ్రూషలొనరించి- వసుధపైన ద్వాదశొందనములు - చేశి సాధనముల చేపట్టవలె నాల్గు - కర్మరహితరంగ భారలింగా!!12!!

వేదశాస్త్రములును వైలపురాణముల్- ఘాతలోనజిక్కిగాశిజెందీ- రానుపోను శుణక జ్ఞానంబు విధమాయ - కర్మరహితరంగ భారలింగా!!13!!

గురువులందరికిని గురుడు ఆత్మడుసుమ్మి - అట్టివానికచలుడధికుడరయ - వార్ని జేరసర్వ వర్తనలుడుగును - కర్మరహితరంగ భారలింగా!!14!!

అన్నివిద్యలెల్ల ఆభ్యశించినగాని - అందలేరుపరము అదియు నిజము - గురుణికరుణ బడయ గుట్టుబయలైవుండు - కర్మరహితరంగ భారలింగా!!15!!

సాంఖ్యతారకములు సాధకమమనస్క - యోగమెల్ల ఆత్మసారమగును - పూర్ణబోధగనిన బొంకులన్నియు గావె - కర్మరహితరంగ భారలింగా!!16!!

మంచిజేసుటెల్ల మహలోక సుఖముకు - చెడ్డజేశిచేరు శమనపురికి - నీదుశేవచేయ నిత్య పదవినిపొందు - కర్మరహితరంగ భారలింగా!!17!!

కర్మధర్మలనుచు కాంక్షించి చేతురు - కర్మధర్మలకును కర్తవకటి - కల్పనంతనిన్నుకనలేని మార్గంబు - కర్మరహితరంగ భారలింగా!!18!!

త్రివిధదీక్షలొంది త్రివిధంబులనుబాసి - ఆత్మత్రివిధములను అట్టెగ్రోలి - వుండునాతడెపుడు వుత్తమపురుషుండు -కర్మరహితరంగ భారలింగా!!19!!

త్రయముత్రయముత్రయముత్రయములన్నియు బాశి - ద్వయములనియెద్వంద భయము వీడి - గుట్టుదెలయువాడు గురువనదగునయా - కర్మరహితరంగ భారలింగా!!20!!

అవనిలోనమతములరుదుగ మెండాయె - లేనిపోనిక్రియలు పూనికాయె - యెన్నిజూడ మాయయెరుకొక్కటైవుండె - కర్మరహితరంగ భారలింగా!!21!!

సంశయంబుచేత సదమదమొందుచు - భ్రాంతులొందువాడు బద్ధకుండు - చింతలన్ని బాయ శిఖరంబుతానాయె - కర్మరహితరంగ భారలింగా!!22!!

యెన్నిజాతులైనను అన్నజాద్భూతాని - అనుచుశృతులుబల్కు అవనిజనులు - కొన్నివేరె అనుచు కోతులైచత్తురు - కర్మరహితరంగ భారలింగా!!23!!

కులమువిద్యవిడచి గురువులనిరశించి - కర్మధర్మములను గరుపుకొనుచు - బ్రాహ్మలైనవారు బ్రహ్మవిద్యెరుగరు - కర్మరహితరంగ భారలింగా!!24!!

కర్మరహితమనుచుకాల్చియెన్నోచదువ - వచ్చునాముక్తందుపిచ్చిగాక - అట్టులైతెపశువులన్ని మోక్షముజెందు - కర్మరహితరంగ భారలింగా!!25!!

యిష్థలింగమనుచు యిలలోనవకరాయి - తెచ్చికట్టుకొన్న తెల్వియగున - తెలివిలోన శివుని తెలియంగవలయును - కర్మరహితరంగ భారలింగా!!26!!

అన్నిమాయయనుచు అడవికిబోయిన - ఆలినిడచివకడు యేగలేడు - ఆలిమనసేకదా ఆత్మునకెప్పుడు - కర్మరహితరంగ భారలింగా!!27!!

జన్మవృద్ధిక్షయము జయమపజయములు - కల్గియుండి జీవికష్టపడును యిన్నివున్నగాని యిదివదులదెందుకో - కర్మరహితరంగ భారలింగా!!28!!

తాంమ్రమృణ్మయంబుదారుప్రతిమలు జేసి - పూజజేతురిలను బుద్ధిమాలి - యెదుటనుండు బ్రహ్మమెప్పుడుగనలేక - కర్మరహితరంగ భారలింగా!!29!!

చెప్పవచ్చు అన్ని చేయించగావచ్చు - చేయవచ్చుఅ సర్వచేష్టలెల్ల - పాయరాదుయిన్ని పరకృపా సాధ్యంబు - కర్మరహితరంగ భారలింగా!!30!!

గురునికృపను వడశి గుట్టుదెలశినవాడు - పుట్టబోడువాడు గిట్టబోడు - చేశిచెయ్యనట్టి శ్రేష్టలు వారిక -కర్మరహితరంగ భారలింగా!!31!!

ఆశలెల్లబాశి అనుభవంబులరోశి- పాశవర్గములను భంగపరచి- దోషద్వయములన్ని రోసుట మోక్షంబు - కర్మరహితరంగ భారలింగా!!32!!

అచలభావులైన ఆర్యులసేవించి - అధికమైనదాని అభ్యశించి - లోకభ్రమలుబోయి యేక బయలయ్యుండు - కర్మరహితరంగ భారలింగా!!33!!

నీకటాక్షంబున నిశ్చలుడైయున్న - వాడుయెందునున్న బాధలేదు - అడవియందునున్న గృహమందునుండిన - కర్మరహితరంగ భారలింగా!!34!!

కాంతమాయయనుచు కడద్రోచిలోపలి - కాంతగూడుటెంతవింతగాద - యీవలోదులు కున్న ఆవల అదియేమి - కర్మరహితరంగ భారలింగా!!35!!

ముట్టురక్తమమరి ముదిరిదేహములయ్యె - యిట్టిదనుచు మర్మమట్టుపరచి -ముట్టకంట్ట కనుచు మురుశేరు తెల్యక - కర్మరహితరంగ భారలింగా!!36!!

అవనిలోనమంన్న మన్నింటికిని కల్గె - అన్నరసమె బిందువాయతనువు - వక్కదానికెన్నో పెట్టి భ్రమింతురు - కర్మరహితరంగ భారలింగా!!37!!

దేవుడనగ దేశమంతట నున్నాడు - దేహిగాకదేహవెతలులేక - నామరూపక్రియ నాటక మావల - కర్మరహితరంగ భారలింగా!!38!!

జగమునమ్మువారు జనితమగుచుండిరి - తనువునమ్మువారు తగులపడిరి - నిన్నునమ్ము వారు నిత్యులైవుండిరి - కర్మరహితరంగ భారలింగా!!39!!

అన్ని యోగములకు నధికమైవుండిన - నదియెరాజయోగమనగనొప్పు - నదియు తెలియ నచలభావజ్ఞుడైవుండు - కర్మరహితరంగ భారలింగా!!40!!

హఠముయోగమెల్ల అభ్యసించియుఅష్ట - శిద్ధిబొందిఆహమధికమొంది - మహత్తుజేశి తనుమాయకు లోనౌను - కర్మరహితరంగ భారలింగా!!41!!

పంచభూతములను ప్రబలినదేహముల్ - అందులోనఆత్మనుండునొకటి - యివియుగాక వేరుమూలంబు అనుటెట్లు -కర్మరహితరంగ భారలింగా!!42!!

బ్రహ్మాండమందుభాను తేజముభంగి - గృహములోన దీపకళలబోలె - ఆత్మదేహమందు ఆరీతినుండును - కర్మరహితరంగ భారలింగా!!43!!

దేహవృక్షమునకు దేహికారణమయ్యె - కార్యమేనుశాఖ ఆకులయ్యె - క్రియలుపుష్పఫలము నియమించిచూచిన - కర్మరహితరంగ భారలింగా!!44!!

పాపలోనజ్యోతి దీపంబుగతినుండి - వెలగజేయుసర్వజగముమేను - ఆదియు లేకపోవ అంతసున్నయ్యుండు - కర్మరహితరంగ భారలింగా!!45!!

ధాత్రిలోనసర్వ గాత్రంబులందున - సూత్రమొకటిగలదు నేత్రమందు- నీదుకరుణలేక నిది దెలియలేరయా - కర్మరహితరంగ భారలింగా!!46!!

బ్రహ్మాండమందు అండాండములునుండు - అండమందుపిండమమరియుండు - అందు యిందునందు నంటకుందువు నీవు - కర్మరహితరంగ భారలింగా!!47!!

పిండమందుసర్వ బ్రహ్మాండముండును - బ్రహ్మాండమందుపిండముండు - యెందుజూడ నీవునిండియున్నాడవు - కర్మరహితరంగ భారలింగా!!48!!

అండమందుయెపుడు పిండంబులుండును- పిండమందుబ్రహ్మాఅండముండు - సర్వమందు ఆత్మ సాన్నిధ్యమయ్యుండు - కర్మరహితరంగ భారలింగా!!49!!

వకటిరొండుమూడు నోయ్యననాలుగు - అయిదుఆరుయేడు యెన్మిదమరు - నయనద్వయ ములందు నాటుకమరియుండు - కర్మరహితరంగ భారలింగా!!50!!

నేనుజూడబోతె నెనేమిలేదాయ - నిన్నుజూచినంతఖండమాయ - నేనునీవు చనగతానేమి లేదాయ - కర్మరహితరంగ భారలింగా!!51!!

పృథ్విజలముఅగ్ని వాయువాకాశంబు - యివియెసృష్టిరూపమెల్లదాల్చె - యిందులోన భేద మెన్నంగవచ్చునా - కర్మరహితరంగ భారలింగా!!52!!

యెరుకయెంతకైన యెన్నంగవచ్చును - అచలమెన్నటికిని యెన్నరాదు - అదియునిదియు దెలువ అంతటభ్రమదొలగు - కర్మరహితరంగ భారలింగా!!53!!

యెరుకమూలమెరుగ యెరుకనె అయ్యుండు - యెరుకమూలమెరుగ యెరుకచనును యెరుకలోనియెరుక యేగినబయలవును - కర్మరహితరంగ భారలింగా!!54!!

కర్తజూడసర్వకారణంబయ్యుండు - సృష్టిజూడనదియు నష్టమగును - అవనిలోనివన్ని అందులో లయమవును - కర్మరహితరంగ భారలింగా!!55!!

యెరుకదేవుడనుచు యెన్నేరు జనులంత - మరుపుయెందుగల్గె మరిగిచూడ - యెరుక మరుపునెరిగెయెరుకకు మిగులుండు - కర్మరహితరంగ భారలింగా!!56!!

యేదిజేతమన్న యెరుకొక్కటైవుండె - వూరకుందమన్న వుల్కిపడును - కానిదానికింత కష్టంబు లాయెను - కర్మరహితరంగ భారలింగా!!57!!

బాంహ్యక్రియలుమాన అంతరంబొకటుండు - అంతరంబుమానబాంహ్యముండు - ఆదియు నిదియు బోవ అంతచలమయ్యుండు - కర్మరహితరంగ భారలింగా!!58!!

జ్ఞానభక్తితోడగలిగి విరక్తితో - వూరకుండువాడు వుచితుడరయ - కానిఅచలమార్గ కార ణంబులు కావు - కర్మరహితరంగ భారలింగా!!59!!

స్వప్నమందుసర్వసౌఖ్యంబులనుబొంది - మేలుకొందిచూడయేదిలిత్త - ఆవిధంబు జగము లన్నియు వుళ్లక్కి - కర్మరహితరంగ భారలింగా!!60!!

ఆదిశెక్తిచూడ అందరికిని తల్లి - ఆదియుదారయనుచు అంటికూడి - వాదుజేయనేల ఆదిమూలము గనుక - కర్మరహితరంగ భారలింగా!!61!!

లేనియెరుకనమ్మి లేకనేపోయిరి - వున్నదాన్నినమ్మి వుచితులైరి - రొంట్టినెరిగె వాడు మింటిపై నుండును - కర్మరహితరంగ భారలింగా!!62!!

గుర్తుచేతగాద గుణనిర్గుణంబులు - యెరుకచాత చాలయెన్నబడియె - గుర్తుయెరుగు టిదియె గురుద్రోహమయ్యుండు - కర్మరహితరంగ భారలింగా!!63!!

తండ్రిలేనివాడు తల్లివుల్లక్కియు - తానుదబ్బరంతతూలిపాయ- యిందులోనకొంత యెట్లెరుంగ గవచ్చు - కర్మరహితరంగ భారలింగా!!64!!

బ్రహ్మవిష్ణుశివుని పట్టిబంధించియు - తల్లినెత్తిగొట్టి తానుగిట్టి - అట్టివాణ్ణి తెలియఅవనిలో లేరయా - కర్మరహితరంగ భారలింగా!!65!!

గురుడు జూపినట్టి గురిగానగాలేక - మత్తులైరి వ్యర్థతొత్తులైరి - వుత్తదానికెంత వూహ పోహలు గల్గె - కర్మరహితరంగ భారలింగా!!66!!

పంచకళలమీరి పండువెన్నెలదేరి - పరముగాంచువాడు పరమయోగి - వార్నిగాంచువారు వసుదలో లేరైరి - కర్మరహితరంగ భారలింగా!!67!!

పక్షులైదునొక్కపాముమ్రింగెనుచూడ - అట్టిపామునెపుడొగద్దజంపె - గద్దనొక్కచీమ గరచి మాయంబాయ - కర్మరహితరంగ భారలింగా!!68!!

చింతమాను మీదసంతభీజంబుండి - జంత్రములను నాడజేయుచుండు -తంత్రమిదియు ననుచు తగనమ్మరార్యులు - కర్మరహితరంగ భారలింగా!!69!!

తల్లితండ్రులనుట తప్పువాదమెకాని - తానెతల్లితండ్రితనయులంత - దీనిమూలమెవరు తెలశి నిల్వుట లేదు - కర్మరహితరంగ భారలింగా!!70!!

కుక్కగుర్తుయెరిగె జ్ఞానులజ్ఞానులు - యిదియు తెల్యలేరు యెన్నటికిని - జ్ఞానతీతమైన ఘనులకే నలవగును - కర్మరహితరంగ భారలింగా!!71!!

ఆహమెుదలినిలచి దేహంబుదిగనాడి - వదలివదలకున్న వచ్చుముక్తి - దారిదెలియలేక తల్లడపడనాయ - కర్మరహితరంగ భారలింగా!!72!!

అడవిలోన ఫలములాకుల బక్షించ్చి - తిరుగగానె ముక్తితేటపడదు - యెందుజూచినాను అందున్న నిజమెుకటి - కర్మరహితరంగ భారలింగా!!73!!

సృష్టికన్నముందు స్వష్టమైయుండిన - వస్తుకేవలాత్మ స్వష్టమైతె - యిచ్చటచ్చటనక యెచ్చట తానుండు - కర్మరహితరంగ భారలింగా!!74!!

కర్తగాదుగానకారణంబును సువ్వి - క్రియలులేకబోగ మమరలేదు - కర్మలేదుగాన ధర్మంబు సున్నాయె - కర్మరహితరంగ భారలింగా!!75!!

చూపురూపులకును సూన్యభీజంబాత్మ - దానిలోనెల్యాతముదురుదోచె - నిజమువలెను గాదు నీచమెప్పుడుకనిన - కర్మరహితరంగ భారలింగా!!76!!

చూపుకందనట్టిరూపంబె నిజమవును - క్రియలకందనిదియెకేవలంబు - మనుసు వా:కులకును మరి అందనిబయలు - కర్మరహితరంగ భారలింగా!!77!!

నేనునీవుజగము లేనిస్వప్నంబయ్యె - నాదినీదిఅనుట వాదుగాదె - తానెసర్వమైన తత్వంబు గనలేక - కర్మరహితరంగ భారలింగా!!78!!

రానిపోనిదేదొ పూనియుండును యెపుడు- లేనిపోనిదెపుడు లేకవుండు - దాన్నిదీన్ని దెలిపె జాడవు నీవయా - కర్మరహితరంగ భారలింగా!!79!!

జన్మమొందగానె జననిజనకులు నెల్ల - వుల్లక్కియనుచు పేరుపెట్టిరపుడె - వుత్తదానికెచ్చ మధికంబువలె జగము - కర్మరహితరంగ భారలింగా!!80!!

వక్కరింటకొకరునొక్క కార్యముగూర్చి - పావనడుగయేమిలేదటండ్రు - కాని కారణంబు కార్యంబులాలాగె - కర్మరహితరంగ భారలింగా!!81!!

మూలమేమిలేనిజాలంబుమేలెరిగి- వుండువాడెకాదఖండమూర్తి - మేలుకీడులేకవెలుగును నీలోన - కర్మరహితరంగ భారలింగా!!82!!

దేహిదేహమనియె తెగువలుబరిమార్చి - వీడివీడనట్టివిదుడుయెవడొ చచ్చివుండుతనకు చావడెవ్వరుకనిన - కర్మరహితరంగ భారలింగా!!83!!

అంగలింగములునుభంగమవుదాకను - అనగవలయుపదియుఆరునెపుడు - యెంతవరకు ఆత్మనున్నంతవరకును - కర్మరహితరంగ భారలింగా!!84!!

ద్వాదశంబులున్న తత్వంబుమేలెరిగి - షోడశంబుఅనియెద్వారమొదుల - కేవలాత్మయుండు కీలునీచే తెలియు - కర్మరహితరంగ భారలింగా!!85!!

మూడునాళములకు ముఖ్యమైయుండిన - నాడికాగ్రమందునాతిదేరి కళలుమీరియుండ ఘనబ్రహ్మమైయుండు - కర్మరహితరంగ భారలింగా!!86!!

యోగులైనగాని భోగులైనను సర్వ - త్యాగులైన అచలసరళిదెలశి - మెలగువాడుగాద మెప్పైరినీలోన - కర్మరహితరంగ భారలింగా!!87!!

తొమ్మిదిరంధ్రములతోలుతిత్తీమలము - మూత్రముండుఆత్మసూత్రముండు - కాని అచలమునకుగనపించదిందేది - కర్మరహితరంగ భారలింగా!!88!!

పరమపదమటన్న పరమార్ధమయ్యుండు - పరమనంగబట్టబైటనుండు - బయలులోన బయలు భ్రమతొలగతానవును - కర్మరహితరంగ భారలింగా!!89!!

యెరుకమరుపునెరిగె యెరుకలెస్సగదెలశి - దానిచేతబయలుకాననేర్చి - నట్టియెరుకచనగ నచలమొక్కటియుండు - కర్మరహితరంగ భారలింగా!!90!!

అచలమనగఆత్మశక్తిగుణములుకాదు - పంచభూతమయముపరగగాదు - ఆదినాదులకెల్ల ఆదియైవిలశిల్లు - కర్మరహితరంగ భారలింగా!!91!!

నయనద్వయములున్ననాతినిగూడియు- అవలితత్వమందునైక్యమైన- పుట్టడనుచు శృతులు పూర్వమందేకలవు - కర్మరహితరంగ భారలింగా!!92!!

శబ్ధముండుచోట చెలగిప్రాణములుండు - శబ్దమనగప్రణవశబ్ధమగును - పలుకులేనిదేదొ బయలయ్యిరాజిల్లు - కర్మరహితరంగ భారలింగా!!93!!

పేరులేకయెపుడు పూర్ణమయ్యుండిన -యెరుకచేతబయలుయెన్నబడియె - యెరుక బోవపేరు యెవ్వరెరుంగరు - కర్మరహితరంగ భారలింగా!!94!!

యెరుకమూలమెరిగి అచలంబుమరుగెరగి - యెరుకదోచకున్నయెంతమాట - అట్టివారు కోటికొకరైనలేరైరి - కర్మరహితరంగ భారలింగా!!95!!

కాయపంజరమునఖంబ్రహ్మమనుపక్షి - ఖర్మచేతజిక్కిగాశిజెందు - పశిరికాయపురుగు ప్రాణిచందంబాయె - కర్మరహితరంగ భారలింగా!!96!!

పొడవు అడ్డమొంక పొంకలంకారము - తిరుమణి గందంబు మన్నుభూతి - యెన్నిబెట్ట మన్నెనిందేదినధికమౌ - కర్మరహితరంగ భారలింగా!!97!!

అవనిలోనముణిగి అప్పులోనణగక - అగ్నిగాలి వాయుకదరిపడక - వున్నదేదొనదియు వుత్తమ బ్రహ్మంబు - కర్మరహితరంగ భారలింగా!!98!!

ఆయుధంబులకును అణగదు చిణగదు - హస్త్రశస్త్రంబుల హతముగాదు - యెన్నిజేసినాను అన్నిమాత్రముబోవు - కర్మరహితరంగ భారలింగా!!99!!

యిట్టిపద్యములలో గుట్టునిజమోకాదో - చూడరయ్యా దీక్షతీయమైన - గ్రంధమొకటి గలదు గని వూరకుండుడి - కర్మరహితరంగ భారలింగా!!100!!

ఆరుపదవులకును ఆత్మఅధిపతియును-పదవులేమిలేవు బయలునకును- సర్వ పదవులకును సద్గతైవుండును - కర్మరహితరంగ భారలింగా!!101!!

సాధనములచేత సాధించగారాదు - సకలసాధకముల సాక్షిమరువ - సాక్షిబోయినంత సర్వంబు బయలవును - కర్మరహితరంగ భారలింగా!!102!!

అచలమెటులనుండు అదిసొజ్ఞగురుణిచే - తెలశితన్ను మరువతేటయైన - అచలమందు తాను ఐక్యమొందును వేగ - కర్మరహితరంగ భారలింగా!!103!!

వూరుపేరులేని వుత్తకల్లగునాకు - పేరుబెట్టిగుర్తుబాగజేశి -పిలతురయ్య జనులు తలతు నిన్నెప్పుడు - కర్మరహితరంగ భారలింగా!!104!!

తండ్రికృష్ణయాఖ్య తల్లిసరస్వతి - తనయుడనుచు పిలుతురవని జనులు - పేరు రామదాసు వూరు వెలివెర్తయ - కర్మరహితరంగ భారలింగా!!105!!

శతకమందు మంత్రశాబ్దార్థమును గని - పఠనజేశిరేని పరముదక్కు - గతులుయేమిలేక కల్మషంబులు బాయు - కర్మరహితరంగ భారలింగా!!106!!

పద్యములను యెవరు పఠియించిచెప్పిన - వచ్చుముక్తి అరుదు వసుధలోన - వ్రాశిచదివి నంత వైభవంబులు గలుగు - కర్మరహితరంగ భారలింగా!!107!!

జయము జయమునీకు జన్మపావనచరిత - జయముజయము యెరుక యఘవినాశ జయము జయమునిత్య నిరుపమఆనంద - కర్మరహితరంగ భారలింగా!!108!!

!!శ్రీభారలింగ శతకము సంపూర్ణం!!

# దేశికేంద్ర శతకము రెండొభాగము

శ్రీకరుణాకర శుభకర -ప్రాకటగురురాజయోగ భవ్యసుశీలా - నికునునిజముగ మ్రొక్కెద చేకొను గురుదేశికేంద్రా సద్గురుచంద్రా!!1!!

శ్రీ కరమగు సద్గురునకు-సాకల్యముగానుపూజసల్పెద భక్తిన్- మాకును పరము లొసంగుము భీకర గురుదేశికేంద్ర సద్గురుచంద్ర!!2!!

స్థిరచిత్తంబున మీపద - చరణంబుల ధ్యాన్నమతిచె స్మరణముజేతున్- హరిహరఅజుడవు నీవని - కరుణించవే దేశికేంద్రా సద్గురుచంద్రా!!3!!

రావేసద్గురుశేఖర - రావేగురురాజయోగ తేజవిరామ - రావేనిను శేవించెద - రావేగురు దేశికేంద్ర సద్గురుచంద్ర!!4!!

ధరసింహ్మాసన మందున మరిరత్నపు మరకతములు మంగళకరమౌ-వరసింహ్మాసన మిచ్చెద యిరవందగ దేశికేంద్ర సద్గురుచంద్రా!!5!!

ఆద్యంతంబులులేకను - చోద్యంబగు పాదములకు పాద్యములిత్తున్ - భేద్యంబులేక కొనుమిక సాద్యంబుగ దేశికేంద్ర సద్గురుచంద్రా!!6!!

హస్తముమస్తక మందిడి- సుస్థిరమగుపదవి జూపి అస్థిరముడిపే - హస్తంబులకర్ఘ్యంబును యిస్తిని గురుదేశికేంద్ర సద్గురుచంద్రా!!7!!

స్వచ్ఛమగు నదులవుదకము - మచ్చికతోదెచ్చి మీకు మతి శుద్ధముతో - యిచ్చెద ఆచమ నంబును - మచ్చికతో దేశికేంద్రసద్గురుచంద్రా!!8!!

పంచామృతములతోడను - మంచిగ స్నానంబుజేశి మించినదయతో - సంచితములు పోదోలుము - అంచితముగ దేశికేంద్ర సద్గురుచంద్రా!!9!!

గంగాయమున సరస్వతి - శృంగారంబైననదుల సంగమజలమున్ - మంగళస్నానము శాయవె - అంగుగ గురు దేశికేంద్ర సద్గురుచంద్రా!!10!!

అభయప్రదాతవనుచును - అభిమానము లెల్లమాని అహమునువీడి - అభివస్త్రంబుల నిచ్చెద శుభముగగొను దేశికేంద్ర సద్గురుచంద్రా!!11!!

అగ్నానతిమిరమణచియు - సుగ్నానాంజనము నొసగె సొగ్నుడవనుచున్ - యెగ్నోపవీత మొసగెద - ప్రగ్నుడగురు దేశికేంద్ర సద్గురుచంద్రా!!12!!

శంఖుం చక్రకిరీటము - అంకితమణికుండలములు రాజిత భక్తిన్ - యింకననేక సుభూషణ మంకెతొగొను దేశికేంద్ర సద్గురుచంద్రా!!13!!

గంధ కచూరము కుంకుమ - చందన కర్పూరమగరు అందంబలరన్ - గంధం మేనుకు నలరెద - సుందరమగు దేశికేంద్ర సద్గురుచంద్రా!!14!!

చంగల్వకుసుమ చంపక - సంగతిచామంతివకుళశతపత్రంబుల్ - అంగుగ సర్వసు పుష్పము రంగుగగొను దేశికేంద్ర సద్గురుచంద్రా!!15!!

కర్పూరమగరు గంధము - మెప్పగుఘృతమగ్నియందు మురయుచు వేతున్ - ఘుప్పున ధూపంబొసగెద -రంగుగగొను దేశికేంద్రా సద్గురుచంద్రా!!16!!

వత్తిత్రయములతోడను - మత్తతలేకుండఆజ్య మగ్నిచలంగన్ - వుత్తమదీపంబిచ్చెద -అత్తుగ గురు దేశికేంద్రా సద్గురుచంద్రా!!17!!

శాల్యన్నము షడ్రసములు - మేలగుబహుపంచభక్షపక్వాన్నంబుల్ -చాలగ అర్పించెదకోను శీలము గల దేశికేంద్రా సద్గురుచంద్రా!!18!!

పోకలవంగముల్యాలకు - ఆకులుకర్పూరజాజి జాపత్రులతో - మీకును విడెమర్పించెద చేకొనుమిక దేశికేంద్రా సద్గురుచంద్రా!!19!!

తనుమనధనమర్పించియు - వినయంబుగబోధ వడశికరుణను బొందిన్ - ఘనమగు యెరుకను దక్షణమును యిచ్చెద దేశికేంద్రా సద్గురుచంద్రా!!20!!

శృంగారమైన గురునకు బంగారపుపళ్లెరమున సంగతితోడన్ - మంగళహారతులిచ్చెద అంగుగవర దేశికేంద్రా సద్గురుచంద్రా!!21!!

నాదములోపల తుదిగల - మోదంబగుప్రణవపుష్ప మర్పించెదయే - భేదంబులేక కొనుమిక మీదయతో దేశికేంద్రా సద్గురుచంద్రా!!22!!

ప్రాదక్షణంబు జేశెద - ప్రాగ్దక్షణ పశ్చమోత్తరంబగు దిశలన్ - పదపడిశేతు ననేకము పదమున కును దేశికేంద్రా సద్గురుచంద్రా!!23!!

యిష్టంబగు దైవంబని - అష్టాంగము చేతనీకు స్పష్టముతోడన్ - నిష్టతొ మ్రొక్కుద నిరతము శ్రిష్టస్తుత దేశికేంద్రా సద్గురుచంద్రా!!24!!

ఛత్రంబులు చామరము - పవిత్రపువింజామరములు అందోళికముల్ - పాత్రుడనై నీకిచ్చెద మిత్రుడవగు దేశికేంద్రా సద్గురుచంద్రా!!25!!

స్వచ్ఛమగు భక్తితోడను - హెచ్చరికయు జేశెదాను యిచ్చతొమదినే - స్వచ్ఛమగు ప్రభుడ వీవని - మచ్చికతో దేశికేంద్రా సద్గురుచంద్రా!!26!!

ఆలించుమయ్యనామొర - లాలించుమనుచు యెరుక రంకులుబాపీ - దూలించుమయ్య కృపతో పాలించుమి దేశికేంద్రా సద్గురుచంద్రా!!27!!

జోజోముద్దుల మురహర - జోజోగురుసుప్రకాశ జోయఘవీరా - జోయనిజోగల బాడెద జోజోగురు దేశికేంద్రా సద్గురుచంద్రా!!28!!

నిద్రించుమయ్య నాకిక - భద్రంబగు పదవియందు బాగుగ గల్పీ - రౌద్రంబుబాపి కృపతో నిద్రించుమి దేశికేంద్రా సద్గురుచంద్రా!!29!!

షోడశవుపచారంబుల - వీడకపూజింతు యెరుక వేగమెబాపీ - కీడుతొలంగెటి సత్కృప జూడుమి నిజదేశికేంద్రా సద్గురుచంద్రా!!30!!

ఆదిత్యవారమందున- ఆదిపరబ్రహ్మమునకు అతులితభక్తిన్ పాదుగ మది భజింయించెద మోదంబున దేశికేంద్రాసద్గురుచంద్రా!!31!!

యిందునివారము నందున - పొందుగభజియించెదాను చెందినవేడ్కన్ - బంధముల నెల్ల బాపుము - అందంబుగ దేశికేంద్రాసద్గురుచంద్రా!!32!!

మంగళవారము మరువక - అంగుగనుతియించెదాను పొంగిచెలంగె - మంగళకరముగు గురునకు - రంగుగవర దేశికేంద్రాసద్గురుచంద్రా!!33!!

బుధవారము బుధవర్యుని - సదనంబున చేరికొలచి సన్నుతిజేతున్- సుధనంబగు నీనామము - వదలుండను దేశికేంద్రాసద్గురుచంద్రా!!34!!

గురువారము గురుభజనము - అరుదుగ అర్చనము వందనము శ్రవణంబున్ - బరువడి దాస్యముతోడను - స్మరియించెద దేశికేంద్రాసద్గురుచంద్రా!!35!!

భార్గవవారము నెప్పుడు - శాఙ్గ్నపద్మాదిధరుని సన్నుతి జేతున్ - దుర్గతి వదలప వర్గము మార్గంబుకు దేశికేంద్రాసద్గురుచంద్రా!!36!!

శనివారము భజియించిన - ఘనమొందినపూర్వఖర్మ ప్రాలుబ్ధంబుల్ - మునుజన్మజరా మృత్యువు - చనిపోవును దేశికేంద్రాసద్గురుచంద్రా!!37!!

యెవారమైననీవే - నీవారమెయనుచు యెపుడు నిన్నేతలతున్ - మావారు నేనుమీలో పోవారము దేశికేంద్రాసద్గురుచంద్రా!!38!!

వత్సర రుతువయసంబులు - మచ్చిక నక్షత్ర కరణ యోగములందున్ - యిచ్చతోనిన్నె తలంతున్ -సచ్చరితుడ దేశికేంద్రాసద్గురుచంద్రా!!39!!

అదివనాదివినీవె - అద్యంతము మధ్యమందు అన్యమువేరే - లేదికయెప్పుడు కనినను నీదయనే దేశికేంద్రాసద్గురుచంద్రా!!40!!

నీకథలు ఆలకించ్చెద - నీకీర్తనస్మరణ జేశినిన్నె తలతున్ - పాకారి వినుతనీకృప -చేకొందును దేశికేంద్రాసద్గురుచంద్రా!!41!!

వందనము దాస్యశేవయు - బృందంబగు చరణములకు అర్చనఆత్మా - విందునుచేశెద చేకొను అందంబుగ దేశికేంద్రాసద్గురుచంద్రా!!42!!

హరిహరఅజయింద్రాదులు - సురనరసనకాదియోగ శిద్దమునింద్రుల్ - నగురోరధికం బనుచును - స్మరియింతురు దేశికేంద్రాసద్గురుచంద్రా!!43!!

కరుణామృత నిజగురుపద - స్మరణంబున హృదయకమల మధ్యమునందున్ - మరికొలతు నయ్యె యెప్పుడు - యిరవందగ దేశికేంద్రాసద్గురుచంద్రా!!44!!

భక్తాధారపరాత్పర - భక్తప్రియభక్తలోల భక్తశరణ్యా - భక్తాభీష్టఫలప్రద -భక్తాత్మక దేశికేంద్రా సద్గురుచంద్రా!!45!!

హృదయాసనమున నుండిన - వదులనిఛాండాలులిరువు - రొదులగగొట్టిన్ - వదలక కూర్చుండుమి నిను - మదిమరువను దేశికేంద్ర సద్గురుచంద్రా!!46!!

హంకారము మమకారము - సంక్కరఛాండాలములను సుంక్కణగించీ - శంకలు లేక బయలులో - యింక్కించవె దేశికేంద్ర సద్గురుచంద్రా!!47!!

నినుసర్వభూతమయుడని - ఘనయోగులు కనియు గ్రంధకల్పన శేయన్ - వినిగురుణి చేతకన్గొని - చనిపాయను దేశికేంద్ర సద్గురుచంద్రా!!48!!

యేరూపము కన్గొనినను- నీరూపమునిండియుండు నిఖిలము నందున్ - అరూపమందు నణగును - నారూపము దేశికేంద్ర సద్గురుచంద్రా!!49!!

మ్రొక్కెదను నీదుపదముకు - సొక్కెదనే షోడశోదలి సొంపులుమానీ - దక్కెదను అచల పదవికి - నిక్కముగురు దేశికేంద్ర సద్గురుచంద్రా!!50!!

గురునామాక్షరద్వయముకు - సరిలేవికసర్వమనుచు సజ్జనులనిరీ - అరుదుగ అనుభవ శాస్త్రము - గురువా:కును దేశికేంద్ర సద్గురుచంద్రా!!51!!

పదిరెండుయెండ్లుగడచెను-హృదయంబుననీదుశేవ అర్చనములునే- మదినిముషముంచి చేశితి - యిదియెరుగవ దేశికేంద్ర సద్గురుచంద్రా!!52!!

మాతాపితృహితాదులు - దాతవు గురుదైవబంధు భ్రాతవునీవె - ప్రీతిగసతి పతిసుతుడవు ఖ్యాతిగ గురు -దేశికేంద్ర సద్గురుచంద్రా!!53!!

ధరలోనీవలె దాతలు - మరిలేరని మదిలోదలచి మురయుచునుందున్ - యిరవందకల్ల బోలిక - స్థిరవచనము దేశికేంద్ర సద్గురుచంద్రా!!54!!

యెందరుదేవతలున్నను - అందరునీసమమురారు అదియెటులనినన్ - ముందేనను పాలింతురు - యిందీవర దేశికేంద్ర సద్గురుచంద్రా!!55!!

క్రియవాచకముల కంటెను- నయమే మదియనుచు శృతులుమరిగురువాఖ్యం - మయమైన వనుచునమ్మియు - భయముడిగితి దేశికేంద్ర సద్గురుచంద్రా!!56!!

యేకస్వరూపుడవు అనేకముగాదోచియెన్నో ఆత్మల భవమున్-ఛీకాకుజేశినీలో -చేకొందువు దేశికేంద్ర సద్గురుచంద్రా!!57!!

ఆత్మానాత్మలుగైకొని ఆత్మాత్మలనంటకాను అచలాత్మంబై- సూత్రమెపరమై నిలచిన చిత్రంబువు దేశికేంద్ర సద్గురుచంద్రా!!58!!

యెస్థానంబున జూచిన - నీస్థానమె స్థావరంబు జంగమమందున్ - నాస్థానమందు స్థానము - చేస్తివిగద దేశికేంద్ర సద్గురుచంద్రా!!59!!

అష్టాదశవర్ణములకు - యిష్టముగాకుండు యిదియు కష్టముదోచున్ - స్పష్టముగ మర్మ దెలశిన -నష్టంబగు దేశికేంద్ర సద్గురుచంద్రా!!60!!

వకనాడు గురువరేణ్యులు - అకలంకము బయలునందు అణగుండగా - సుకృతంబు చాత వకనరు - యికమ్రొక్కెను దేశికేంద్ర సద్గురుచంద్రా!!61!!

తారకసాంఖ్యమనస్కము - సారంబునుగ్రోల యెరుకచేష్టలు విడకా - సారంబుగాన లేకను చేరెను మిము దేశికేంద్ర సద్గురుచంద్రా!!62!!

ద్వాదశసాష్టాంగంబులు -మోదంబున జేశి నిలచిమొరలిడుచుండన్ - భేదంబు లేక అచలము -బోధించెను దేశికేంద్ర సద్గురుచంద్రా!!63!!

తనుమనధనమర్పించియు - వినయంబున పూడిగములు విధితోజేయన్ - ఘనగురుడు సంతశించియు - వినదెల్పెను దేశికేంద్ర సద్గురుచంద్రా!!64!!

వినరా నిజమును దెల్పెద - కనరాకనువుండు బయలు నదికనుగొనుమీ - కనుపడెడు దృశమంతయు - చనవలెననే దేశికేంద్ర సద్గురుచంద్రా!!65!!

శరణంబుజేయు శిష్యుని - గురువర్యులు కరుణతోడ గూఢపదంబున్ - విరళముగ దేల్ప బూనెను - కరమరదుగ దేశికేంద్ర సద్గురుచంద్రా!!66!!

అచలము మొదలెరిగించియు - విశదముగా యెరుకనెల్ల వివరించిమరిన్ - సచలము కడద్రోచెదనని - వచియించెను దేశికేంద్ర సద్గురుచంద్రా!!67!!

బయలైఅంతటనిండియు - బయలైభావింపరాక పలుకగరాకన్ - నయమైన మనుసు కందక - బయలైనది దేశికేంద్ర సద్గురుచంద్రా!!68!!

అదృశమున్న బయలును - సాద్రుశ్యము చూడుమనుచు - దృశ్యము జేసెన్ - యాదృశ్య మెరుక లేదనె - తాదృశ్యము దేశికేంద్ర సద్గురుచంద్రా!!69!!

యోగంబులెల్ల దొమ్మరి -యోగంబులు ఆగమనుచు అచలము దెల్పన్ - బాగుగ బయలులో గలిగెను - శ్రీగురుడును దేశికేంద్ర సద్గురుచంద్రా!!70!!

పుట్టకగిట్టక యెప్పుడు- పుట్టింపక చంపబోకదిట్టంబై కను - పట్టేమి లేక అంతట - పట్టైనది దేశికేంద్ర సద్గురుచంద్రా!!71!!

యిందున అందుననన్నిట - సందిడియున్నట్టి యెరుకసత్యంబగునా - యెందునజూచిన నిండియు - సందిడనిది దేశికేంద్ర సద్గురుచంద్రా!!72!!

యెప్పుడు కనపడకుండిన - చప్పుడులేనట్టి బ్రహ్మసరళియు బయలే - అప్పుడు యిప్పుడు అనకను - యెప్పటికదె దేశికేంద్ర సద్గురుచంద్రా!!73!!

భావింపరాని అచలము - భావించెదమనెరు యెట్లుభావాతీత - భావింపరాని మార్గము భావంబిది దేశికేంద్ర సద్గురుచంద్రా!!74!!

అకాశాదిక భూతము - ఆకారము యీజగంబులయ్యెను అచలం - ఆకారమేమి లేదిది శ్రీకరమగు దేశికేంద్ర సద్గురుచంద్రా!!75!!

యింతఅంత అనగరాకను - యెంతోవింతలును లేక యేకమయంబై - చింతలు నన్నది యెరుగదు - రంతుడిగిన దేశికేంద్ర సద్గురుచంద్రా!!76!!

ధరవిత్తుచెట్టు విధమును - సరవిగజలజంతువులను సలిలము కనునా - అరలేని అచల మెరుకను - యెరుగదు గద దేశికేంద్ర సద్గురుచంద్రా!!77!!

ఆకాశ మెటులనంటక - ప్రాకటముగ సర్వమందు వ్యాపకమొందున్ - యీకలలో బయలు నిండియు - చేకొనదిక దేశికేంద్ర సద్గురుచంద్రా!!78!!

యెరుక వుత్పత్తితెల్యగ - ధరలోమహమహులకైన తరమా యెరుగన్ - నరుడెంతవాడు అదిగన - గురుకృపకే దేశికేంద్ర సద్గురుచంద్రా!!79!!

వుత్తత్రాడందు సర్వము- రిత్తగుభ్రాంతెటులదోచె అత్తరినేనున్ - వుత్తమ మగు బట్టబయలున వత్తును అటు దేశికేంద్ర సద్గురుచంద్రా!!80!!

నిద్రందుమేల్కలేకనె- రౌద్రంబునగల్గునటుల నటువలె నేనున్ - బద్రమగు బయలునందున వుద్భవమును దేశికేంద్ర సద్గురుచంద్రా!!81!!

నేనెటుల సంబవంబన - మానుగజలచరము సందు బుగ్గలరీతి - మిణుగురు పువ్వుల వలెనె - చనుతెంచును దేశికేంద్ర సద్గురుచంద్రా!!82!!

కట్టెందు నిప్పులేకనె - కట్టెలనొక సమయమందు కనుపడునటులన్ - మట్టుపడి మెరుపు కైవడి పుట్టుననటు దేశికేంద్ర సద్గురుచంద్రా!!83!!

స్థాణువునందున పురుషుడు - లేనటువలె బయలునందు లేకనెయుందున్ - లేనిది సంభవమిటువలె - మానుగగురు దేశికేంద్ర సద్గురుచంద్రా!!84!!

ఆహమెజగముకు మూలము-ఆహముకు మూలంబుజగము యివిరొండెపుడున్- వూహాలు పోహాలు చేసును - ఆహమెకద దేశికేంద్ర సద్గురుచంద్రా!!85!!

తొలిమేనొక్కటి కల్గియు- వలిమేనుల మూటినదియె యేర్పడ జేశీ- వలిమేనులతో గల్గను కలలోపల దేశికేంద్ర సద్గురుచంద్రా!!86!!

తేజంబగు మాయొక్కటి- సహజంబుగగల్గెనాదు తోయమునందున్-తేజంబె సత్వమనెదను రాజుండెద దేశికేంద్ర సద్గురుచంద్రా!!87!!

త్రిగుణంబుల కల్పించుక- త్రిగుణంబులయందు నేనుసగుణుడనయ్యున్ - మగుడిజన్మించెద మరచెద సుగుణోత్తమ దేశికేంద్ర సద్గురుచంద్రా!!88!!

ఆకాశవాయువగ్నియు - యేకంబుగ జలముపృథ్వి - యేర్పడజేయన్ - చేకొందుమాయ నొక్కటి - భీకరముగ దేశికేంద్ర సద్గురుచంద్రా!!89!!

తొర్రలుతొమ్మిది గల్గిన- బుర్రనుయేర్పాటుజేసి-భుస్సనియనుచూ- చిర్రునలేచుచు నుండును యెర్రదిగద దేశికేంద్ర సద్గురుచంద్రా!!90!!

వడలెటుల లేని తెరగున - తడబడిబ్రహ్మాండమటుల తగ గనుపిచున్ - విడువక నిజమని సుడిలో - పడుచుండెద దేశికేంద్ర సద్గురుచంద్రా!!91!!

రజ్జువెసర్పభ్రాంతిగ- ముజ్జగములు బయలునందు ముద్దుగతోచే - చిజ్జడమాయను నాతో సజ్జనసుత దేశికేంద్ర సద్గురుచంద్రా!!92!!

బిందువని దీనిపేరె- కందురుమరి ఘనము యనుచు ఘనబుధవరులీ-బిందువు పూజకు నర్థము - చెందున్నది దేశికేంద్ర సద్గురుచంద్రా!!93!!

యేర్రది తెల్లదినల్లది - కర్రెదిదానగ్రమందు కలదొక్కటియా - బుర్రను వేగమె జేశియు చొర్రెళ్లను దేశికేంద్ర సద్గురుచంద్రా!!94!!

పలుకేమి లేనిబయలులో - పిలువనిదే వచ్చినేను భిడియము లేకన్ - కలలోనకల్పన లన్నియును జేశెద దేశికేంద్ర సద్గురుచంద్రా!!95!!

నేనేపుట్టెద చచ్చెద - నేనేపుట్టించెదాను నేర్పుతోపెంతున్ - నేనేచంపెద చచ్చెద - నేనేకద దేశికేంద్ర సద్గురుచంద్రా!!96!!

నేనేదేవుడ జీవుడ - నేనేదేవాదిదేవ దానవులందున్ - నేనేస్థావర జంగము నేమాయను దేశికేంద్ర సద్గురుచంద్రా!!97!!

నేనేబ్రహ్మని విష్ణుని- మానుగమాహేశుడనుచు మరికలరనుచూ - మేనుకు నేనధికుండను నేగానను దేశికేంద్ర సద్గురుచంద్రా!!98!!

నేనే నేననువాడను - నేనేకద నీవటన్న తాననిఅన్నా - నేనేసర్వం బన్నను లేనిదియది దేశికేంద్ర సద్గురుచంద్రా!!99!!

నేనేనానామతములు - నేనేకులగోత్రములను నానాజాతుల్ - నేనేవర్ణశ్రమములు నేసర్వము దేశికేంద్ర సద్గురుచంద్రా!!100!!

నేనేవచ్చెద హెచ్చెద - నేనేచచ్చేటివాడ రచ్చలుజేశీ - నేనేయిచ్చలు జేసెద - నేనకద దేశికేంద్ర సద్గురుచంద్రా!!101!!

నేనేచదువులు జేసెద - నేనేవినిచదివెదాను నేనేవిందున్ - నేనే విననవి చదువను నేలేనిదె దేశికేంద్ర సద్గురుచంద్రా!!102!!

ఘడియకు వకవిధమయ్యెద - ఘడియలలో వచ్చిపోదు గంతులు వేతున్ - సుడిబడియెద తడబాటుతో కడతేర్చవె దేశికేంద్ర సద్గురుచంద్రా!!103!!

స్త్రీపురుషాదులు నేనే - పాపము పుణ్యములు నాకు బంధము మోక్షం - వోపదు వోపనునేనే యేపెదయిటు దేశికేంద్ర సద్గురుచంద్రా!!104!!

గురుశిష్యులనెటి భావము - గుర్తెగెచేశెదాను గుణనిర్గుణముల్ - గురిగని గోప్యములడగెద కరుణించె దేశికేంద్ర సద్గురుచంద్రా!!105!!

కట్టెను దేవుండనెదను - ఘట్టిగవకరాయిదెచ్చి ఘనమనిఅందున్ - యిటువలె మాయలు జేశెద - తటుకునబహు దేశికేంద్ర సద్గురుచంద్రా!!106!!

తీర్థంబులు సాగించెద - ఆర్తితో జనులొచ్చెయుక్తి - అదినేచేతున్ - కీర్తింపించెద జనులను కర్తవ్యము - దేశికేంద్ర సద్గురుచంద్రా!!107!!

నాదముబిందులో కల్గెను - నాదంబుచె బిందువనుచు నామంబాయె - బిందువునాదము నందున - పొందునుమరి దేశికేంద్ర సద్గురుచంద్రా!!108!!

సత్తేచిత్తునుజేశి - ఆసత్తని బహుకాల్చిపేల్చి - వుత్తదౌను తా అత్తరి తానెటుబోవిది - రిత్తంత యు దేశికేంద్ర సద్గురుచంద్రా!!109!!

నేనన్నను మేనన్నను - తానన్నదివక్కటేను తత్వమరశితె - మేనేమిలేక అంతట పూనున్నది దేశికేంద్ర సద్గురుచంద్రా!!110!!

తత్పదత్వంపద వాచ్యముకు - త్తము అశిపదము లక్ష్యముఖ్యంబాయె - యెత్తరిగాకను వుండును - వుత్తచలము దేశికేంద్ర సద్గురుచంద్రా!!111!!

సృష్టిస్థితిలయముకు - వుత్కృష్టంబై వున్నయెరుక నష్టంబైతె - కష్టంబులన్ని బాశియు స్వష్టంబౌ దేశికేంద్ర సద్గురుచంద్రా!!112!!

సంకల్పమె జన్మమూలం - సంకల్పమెసకల దు:ఖసౌఖ్యములన్నీ - సంకల్పముడుగ మది నిస్సంకల్పము దేశికేంద్ర సద్గురుచంద్రా!!113!!

తత్పద త్వంపద అశిపద - మొత్తంబగు యెరుకరూపు మోదముతోడన్ - వుత్తమ బయలుకు లేవివి - నిత్యంబును దేశికేంద్ర సద్గురుచంద్రా!!114!!

నీనిజరూపంబటువలె - కాదెన్నడు నేనుమేను కల్లకవుండున్ - మానుగకల్గెటి దానిని పూనదు గురుదేశికేంద్ర సద్గురుచంద్రా!!115!!

నరశృంగంబులు యెటువలె - మరికనుపడకుండు యెరుక - నటువలెనుండున్ - సరగున అచలము కనినను - కరమరదుగ దేశికేంద్ర సద్గురుచంద్రా!!116!!

ముందేమిలేని వంధ్యా -నందనుడై నటులనేను -నడుమంత్రముగా - వుందునుపోదును పోదది - ముందున్నది దేశికేంద్ర సద్గురుచంద్రా!!117!!

లేనిది లేదని తెలశిన - లేని వుపద్రముల యెరుక లేకనె వుండున్ - పొనిదిపోదెన్నటికిని మానుండును దేశికేంద్ర సద్గురుచంద్రా!!118!!

యెప్పటికి వున్నదానిలో - చప్పుడుతోవుండె దానిజాడ దెలశితె - వప్పుగ వున్నదెవుండును చప్పుడు చని దేశికేంద్ర సద్గురుచంద్రా!!119!!

జాలముయింద్రమహింద్రము- జాలముజగ స్వప్నమిధ్య- జాలముల్లక్కీ చాలగబయలై అంతట మేలుండును దేశికేంద్ర సద్గురుచంద్రా!!120!!

అన్నదివిన్నది కన్నది - సున్నాయను చూచెయెరుకసూన్యంబాయన్ - వున్నదివున్నట్టాయను యెన్నిక దేశికేంద్ర సద్గురుచంద్రా!!121!!

నరుడే అధికుండనుచును- స్మరియింతురు పొట్టకొరకు సద్గురుడుండన్ -విరివిగ కవనంబవునది - యిరవుగవర దేశికేంద్ర సద్గురుచంద్రా!!122!!

యిదికవనంబును కాదని - మదిలోపల నిశ్చయించి మరిపొగడితినే - నదియెట్ల ఫలకాంమ్యము - వదలుంటిని దేశికేంద్ర సద్గురుచంద్రా!!123!!

గురువరునామాంకితముగ - గురుపుత్రులు గూఢపదము గుర్తెరుగుటకై - కరుణరచించితి చరణము - కర్పించితి దేశికేంద్ర సద్గురుచంద్రా!!124!!

భరద్వాజసగోత్రుండును - పరమపవిత్రుండు కృష్ణప్రభువరుసతికిన్ - సరస సరస్వతికినినే మరికల్గితి దేశికేంద్ర సద్గురుచంద్రా!!125!!

భాగవతోత్తమవ్రతుడను - బాగుగవరరామదాసుడందురు భక్తుల్ - భాగవతోత్తములను నిడ వేగంబున దేశికేంద్ర సద్గురుచంద్రా!!126!!

వ్రాశియు చదివియు విన్నను - వాసవపుర మెగెదారు వైభవమమరున్ -జూశిపఠించే వారికి - మోసంబిడు దేశికేంద్ర సద్గురుచంద్రా!!127!!

మంగళమును అచలాత్మకు - మంగళమును అంగలింగభంగబయలుకున్ - మంగళము కేవలాత్మకు - మంగళమును దేశికేంద్ర సద్గురుచంద్రా!!128!!

ఇది

శ్రీమదఖండ అచలగురు భారలింగ దేశికేంద్ర ప్రియశిష్యుండును అన్నమరాజ వంశోద్భవ భరద్వాజస గోత్రుండునగు అనంతకృష్ణయ్య ద్వితియ్య పుత్రుండు రామదాస విరచిత భారలింగ శతకము. దేశికేంద్ర శతకము సంపూర్ణం!!

శ్రీసద్గురు చెరణార వింధార్పణమస్తు

# శ్రీ అచల పరిపూర్ణ నిజగురు భావసంగ్రహము

శ్రీ శ్రీధర శివరామ అప్పగురు పరశురామ శ్రీ శీతారామ
శేషమాంబ భారలింగ అచలగురు పరబ్రహ్మణెనమ:

శ్లోకం!! యెస్యాంత్తర్ నాదిమద్యం నహికరచరణం - నామశోత్రం - నసూత్రం -నోజాతీ నైదవనోన్- నభవతి - పురుషోనా - నపుంసోనచస్త్రీ - నైవకారం -నహిజన మరణం నాశ్తిపుణ్యం - నపాపం -నోతత్వం- తత్వమేకం- సహజసమరసం- సద్గురుంతంనమామీ!!

1. అచలతత్వం. ఏకతాళం. రాగము;

జయము జయమూ అచలమునకూ - జయము జయమూ అమలాముకూ - జయము బయలునాకూ నెప్పుడూ - జయమస్తూ జయమూ !!జయ!!1!! నాదిమధ్యాంతములు గాకా నామరూప క్రియలులేకా - పాదుకొన్నా బ్రహ్మమైనదీ పలుకేమిలేనిది!!జయ!!2!! పుట్టుచావూ లేనీ వట్టీబట్టబయలై వున్నాది - గుట్టు చతురూ విధములున్నది గురుసూచనముకూ !!జయ!!3!! మూలమేమి లేని యెరుకా ముఖ్యమూగా నాల్గువిధముల - కీలు గురుణీ నోటావినవలె చాల శేవించి !!జయ!!4!! లేనిస్వప్నా మందూముందూ లేనిదొచ్చి పోవువిధమూ - మానితముగా పంచాదేశులూ వీనాగవలెనూ !!జయ!!5!! పలుకులేని పరమూగుట్టు పలుకుతోనూ పల్కారాకా చుల్కదానామయ్యా వున్నది సద్గురువుకు !!జయ!!6!! చూపులాకు అందరాకా రూపమూను యేమీ లేకా - పాపలో నీరుబాగా పరమయ్యి వున్నది !!జయ!!7!! మదికి గోచారంబూగాదు విధికినైనా తెల్యాబోదూ - సదనమందూనానూ వున్నది సద్గూరూక్తంబున !!జయ!!8!! భావాభావామూలానైనా బయలుపాడానట్టి బ్రహ్మం - యీవలావా లనకా వున్నది యెవాలజూచిన !!జయ!!9!! సకలదేశా మూలాయెందు సకలకాలామూలయందూ- వికలమెన్నడు కానిది- సకలామూనందూ !!జయ!!10!! యిట్టిబ్రహ్మవిద్యా గురుడూ వట్టిగాను తెల్వాబోడూ - పట్టువిడుపు లేనివస్తువా -పరమా రహశ్యం !!జయ!!11!! నాల్గువిధమూలా సాధనమూ నాల్గువిధమూలా శశ్రూషా - లోలతా గావించూవారికే చాలాకాలముకు !!జయ!!12!! యెన్నిగ్రంధమూలూ చూచీన అన్నివిద్యాలేల్ల జదివిన - వున్నవస్తువందూ తెల్పరూ - అన్నా గురువూలు !!జయ!!13!! సప్తకోటి మంత్రాజాలా సాధనాము కాదుకాదూ గుప్తమైన గురు గుహ్యము - చెప్పారు అదియూ !!జయ!!14!! అడిగినప్పుడే తెల్పుటకూ అల్పవిద్యాలూనుగాదూ - ఆదిబ్రహ్మవిద్యా సుమ్మీది - అల్లాడినాదా !!జయ!!15!! అతి వీనాయమూలతోడ అనుసరించి గురుణీవేడి - అడిగిబోదా కొందురెందరో హితవేమీలేకా !!జయ!!16!! అచలులాము అనుచు కొందరు ఆత్మానాత్మ దారిదప్పి - వచన భ్రష్టాలయ్యి పొయ్యేరు అచల మెరుగారు అయ్యితె !!జయ!!17!! యెముడు బట్టీ యీడ్చీనపుడె యెరుక అవును దుష్టులాకు శెమనపురికి చెంద జేసునూ - దయయేమి లేకా !!జయ!!18!! వాశిగా కేశావపురిలో దాసుడైన రామదాసుడు వాసమొందినపుడు పల్కెనూ - శ్రీవాసునాకూ !!జయమూ!!19!!

గణపతి ప్రార్ధన

చ!! శ్రీగణనాధు శివునిసుతు - శిద్ద వినాయకుడు ఆదిదేవుడున్ - బాగుగ విద్యలన్నింటికి భవ్యసుదాముడు భక్తలోలుడున్ - జాగునులేక సత్క్రియల దన్యత నిల్పును ఆగ్రదేవుడై - వేగమె వచ్చి యీక్షితిని వెడ్కచలంగ ఆవిఘ్నరాజుయై !!

కం!! ఆధారంబున నిలచియు సాధారణ విద్యలన్ని సమయించి కడున్ - ధరణిలో సువిద్యలు వేదంబులు పాదుకొల్పు విమల గణేశా !!

2. తాళం: కురుజంపె రాగము:

శ్రీగణేశ పాహిమాం - వోగణేశపాహిమాం - జాగులేలజేసెదవు రాగణేశ పాహిమాం !!ప!! గౌరిప్రియ నందనా ఘనత సువీచందనా - శౌరిమంత్రధ్యాన్న నిరత శంభుశంకరాసుతా !!శ్రీ!!1!! ఆదిగణపతీవిగా వేదఘనమతివుగా - పాదుకొన్న బ్రహ్మమందూ యీదు గణపతీవుగా !!శ్రీ!!2!! సర్వవిఘ్నమూలనూ సగనుబాపు చుండరా - నిర్విశేషమూగ ధర్మ నిజము నీవు నిల్వరా !!శ్రీ!!3!! సకల సంపత్కరములూ సర్వశుభ ఫలంబులూ - వికలమొందకుండ జేయు అకలంకుడ వీవెరా !!శ్రీ!!4!! వాశినొంది యుండినా కేశవపురమందునా - వాసులకును దయతొవిద్య గాశిలేక నివ్వరా !!శ్రీ!!5!! రామదాసనుత సుఖా రాజినొందు ప్రియసఖా - నేమనిష్ఠనిజవ్రతంబు నిల్పజేయు గజముఖా !!శ్రీగణేశా పాహిమాం!!6!!

బ్రహ్మస్తుతి ఆటతాళం: రాగము:

కం!! స్వాదిష్టాన పురంబున - పాదుగని వశించి సృష్ఠి పదిలము జేయున్ - ఆధారంబైతి విక్రమ మోదంబున చతురువేద సారవిచారా !!

3. బ్రహ్మసుత్తి ఆటతాళం: రాగము:

చతురానన రాగదే- సత్క్రమమూన- చతురానన రాగదే- చతురు విధముల సృష్ఠి జేయను చక్రధరుని ఆజ్ఞవుండేను - క్రతువ్రతంబులు కర్మయోగము - హితవు దెల్పి శృతులనిల్పను !!చతు!!1!! శ్రీయఃపతి బోడ్డు నాతమ్మిచూలీ శికయందుమును గల్గినా - పాయకను క్షీరాంబు నందున ఫనికినై ప్రస్తాపమొందగ - న్యాయముగ తపశబ్దమయ్యున వైలవత్సార్యము జపించిన !!చతు!!2!! తపమూశిద్దించగాను తగుపరమాత్మ తరలోచ్చిచెప్పాగనె- యీపనేకదననుచు తెలసీ యిలలో సర్వాసృష్ఠికల్పన - తేపతేపకు జేయుచును మదితెల్పికందిన కల్పనొడశిన !!చతు!!3!! కలికాలమైదు వైయిలూ గడచియు అంతా కాలనీతియు దాప్పియూ - కులము స్థలములు కూలిమనుజులు కుచ్చితపు ధర్మములు హెచ్చియు - కలిమిలో అన్యాయమెచ్చియు కాటిపాలైపోవ సాగేను !!చతు!!4!! మెచ్చి సృష్ఠించుమన్ని వరధర్మములు యిచ్చాగబ్రోయుమన్నీ - మచ్చమొసగిన నాల్గువేదము మహిని ప్రజ్వలింప జేయుమి - స్వచ్ఛముగ వరరామదాసుడు చదివె కేశవపురము నందున !!చతురానన రాగదె!!5!!

కం!! మణికమల పురమునందున - మణిమయ దివ్యాంబరములు మరిధరియించీ - అణిమాదులందుకోని బహు - గణుతింపగ బ్రోవవయ్యా ఘనశ్రీకృష్ణా !!

4. విష్ణుస్తవం. తాళం. ఆది రాగము:

లక్ష్మీ హృదయలోలా నన్ను - రక్షించుమి చాలా పక్షివాహన పరమకృపావన - అక్షయ దర్మాల క్షణశుభకర !!లక్ష్మీ!!1!! పన్నగాదిశయనా సురముని సన్నుత నిజచరణా - సన్నుతించెదాపన్న పరాత్పరా విన్నవింతునిటు మన్ననెంచుమి !!లక్ష్మీ!!2!! శ్రీశభోగదీశా సురవర పాశంకుశ హంసా - దాసదాస నిజదాసజనాశ్రిత - వాసవాదిసుర వర్ణనీయహరి !!లక్ష్మీ!!3!! గరుడగమన దేవా భక్త కరుణామృత భావా - మురహర సన్నుత మునిగణ శేవిత - ధరణిపాలకా ధర్మరక్షకా !!లక్ష్మీ!!4!! రమ్మిమ్రొక్కెదాను రాజని నమ్మిదక్కెదాను - కమ్మవిల్తుని కన్నతండ్రివట - యిమ్మునాయెడ సొమ్ము

నీవెనట !!లక్ష్మీ!!5!! కేశవాదిపురిలో నిన్ను నివాస దేవుడనుచూ - దాసుడైన రామదాసుని వాసము చేశియు కావుముగాశియు బెట్టకు !!లక్ష్మీహృదయలోలా!!6!!

శివస్తుతి

కం!! అనహతపురము నందున - వినయముగాజేరి సర్వహృదయము లందున్- విను ప్రాణలయము జేతువు - అనయము నిను నమ్మినాయువధికము శంభో !!

5. శివస్తుతి తాళం: జుల్వ రాగము:

శరణు శరణూ శంకరా మము కరుణజూడు శుభాంకర - మరణజ్వాల సంకటములా మరుపు జాయవె హంకార !!శరణు!!1!! దురితములను తూలనేసియు భరితముగను కావరా - సరసిజాది సన్నుతుడావై మురసి భక్తుల బ్రోవరా !!శరణు!!2!! గౌరినాథా గంగవరదా శిరియు శౌరి ప్రియసఖా - పరమపుణ్యా అగ్రగణ్యా వరమునీంద్రా సన్నుత !!శరణు!!3!! ప్రళయకాళా ఫాలనేత్రా భస్మధారణాసూత్రా- సలలితో కైలాసనిలయ సాధురక్షణ హరహర!!శరణు!!4!! దుష్టహసురా శిక్షకా శిష్టజనపరిపాలకా - కష్టకర్మకాల సంస్మర స్వష్ట నిర్గుణ శివశివా !!శరణు!!5!! వాసిగాను కేశవా పురదాసమానస ధీవరా - దాసుడైన రామదాసా తాపదు:ఖ సంహరక !!శరణు!!6!!

సరస్వతీ స్తవము

కం!! అజురాణీయగు సరస్వతి భజనము - వీణాధరించి బహుజేసెదవే సుజనమె వాక్కున నిలిపియు సృజియించుమి బ్రహ్మావిద్య శుభగుణధామ !!

6. సరస్వతీ స్తవము. తాళం. ఆట రాగము:

శారదాంబా సకలవిద్యా ధారణాంభా శారదానీరాద శాశ్విత వారదా నిగమాదివందిత కారణాదిచారినీ అజురాణివీ పూరాణివమ్మా !!శార!!1!! నీకుమ్రొక్కి నిగమాది రహస్యం పోకదక్కి జోకలేకను శ్రీకరంబుగ లోకముల ప్రభవిల్లజేసియు ప్రాకటంబగు పరమవిద్యలు నీకువశమై వున్నవమ్మా !!శార!!2!! వాణివమ్మా అలకుల పలుకుల వేనివమ్మా - పాణివీ గీర్వాణివీ హరిరాణి లక్ష్మికి కోడలావు- వీణాధరివి శరప్రకాశీ శూరుణీ వదినావూ గదవే!!శార!!3!! యుల్లమందు తలవగ విద్యాలెల్ల కందూ- పల్లవాధరీనాదు వాక్కున పల్కెపలుకులు పరమ శ్రుతులై- చల్లగా వర్థిల్లజేయుమ యెల్లవారలు యెంచెదరు నిను!!శార!!4!! దాసుండమ్మా వెలివెర్తిలో రామదాసుండమ్మా గాసి నొందెను దూషకులతో వాసిగా కేశావపురముల వాసమై పల్కెనువారు దోషకులు దూరాము నుండుమీ!!శారదాంబా!!5!!

లక్ష్మీస్తవము

మ!! శ్రీలక్ష్మీ శిరిసన్నుతాంగీ విమలాసింధూ సుకన్యావతీ - లోలాక్షి కమలాక్షీ లోకమాతా పాలాక్ష గౌరీనుతా లక్ష్మీదయ దాక్షణాదీ విమలీదన్యాత్ము హృదయేశ్వరీ మాలక్ష్మీమహాసంప్రదాయ కరణీ వోలక్ష్మీ మోక్షప్రదా !!

7. లక్ష్మీ ప్రార్థన. ఆటతాళం. రాగము:

శ్రీలక్ష్మీ వినవే సద్భక్తులకు శిరులివ్వగనవే - శ్రీలక్ష్మీమహాలక్ష్మీ శిరిసంపత్కరదేవి - పాలాక్షి ప్రతినూత పరమాకళ్యాణివీ - పాలవారధిలోన గల్గితివి - పరమా స్వరూపిణి లోలవైహరిలోన మెలగితివి - మేలుగాశ్రీహరి వరించెను లాలితాగుణ లక్షణంబుల - చాలగని తనసతిగ గైకొని

మేలుమేలని మెచ్చిసతినీ !!శ్రీలక్ష్మీ!!1!! నారయణీవే హరిరాణిరో పరాయణివే - సారాసనర లక్ష్మీ సామ్రాజ్యదాయిణీ - కోరీనవారికి కొంగుబంగారమూ - వారిజాక్ష వసుధపరిపాలీ - వరధర్మకీర్తి మీరీనా సౌభాగ్య సురపాలీ - వారవారము వేరుభూషణ ధారణంబులు జేయుచుందువు - వేరులేకను విష్ణుమూర్తికి వేడ్కలోసగెటి రాజ్యలక్ష్మివి !!శ్రీలక్ష్మీ!!2!! పతివ్రతవుచాలా పరమాత్మునికి సతియైన చాలా - అతివారో అణిమాదులన్ని నీకొనగోటూ - సతతాము అతిమహిమా అంది భువనము - గతులు అన్ని బ్రోవుఘనులకునూ - సద్గతులు నోసగి మితముగను హరివరుల బ్రోవాను - మతిలో నిర్మలమూగ నమ్మి అతిహితంబుతో రామదాసుడు - శృతముజేశెను కేశవాపురి పతికి జెప్పియు పరములిమ్మనె !!శ్రీలక్ష్మీ!!3!!

పార్వతీ స్తవము.

మ!! శ్రీగౌరిహరురాణి శిందుకరుణా శీఘ్రఫలాదాయినీ - మాగౌరీ మముగన్నతల్లీ హరిణీమాం పాహిజయమంగళవో గౌరిసురనాయకీ గుణమణీ వైభోన్నతీ పార్వతీ రాగౌరి రజీతాద్రి పీఠనిలయీ రక్షించవె యీశ్వరీ !!

8. పార్వతీ ప్రార్థన. జుల్వతాళం: రాగము:

యీశ్వరీ జగధీశ్వరీ పరమేశ్వరీ మాహేశ్వరీ - శాశ్వితా సౌఖ్యప్రదాయిని సకలదురిత నివారిణి !!యీ!!1!! శంకరీ శుభాంకరీ ఛండిదుర్గా శాంభవీ - పంకజాక్షీ పరమపావని పార్వతీ వరనాయకీ !!యీ!!2!! అంభవే జగదాంభవే శంభుశంకరు రాణివే - కంబుకందరి గౌరిగుణవతి కుంభిణి ఫలదాయకీ !!యీ!!3!! రజితగిరి నీవాసినీ రత్నహేమ సింహ్మాసినీ - భజితి భక్తపాలినీ బంధ భవసంహారిణి !!యీ!!4!! హేమవతి హిమనందనీ హైమవతి అతివర్ధనీ - ప్రమధ గణత సమేతనీ బాలసుందరి బ్రహ్మణీ !!యీ!!5!! దాసమానస ఖేలనీ దౌత్యులకు సంహారిణీ - దాసరామా పోషిణీ కేశవపుర వాశినీ !!యీశ్వరీ జగధీశ్వరీ!!6!!

నిజగురు ప్రార్థన

గీ!! భారలింగమనగ బయలయ్యి - రాజిల్లు భారలింగమనగ బ్రహ్మమగును - భారలింగ మనగ బహుమాయశక్తుడు - భారలింగమనగ బ్రమలు దొలగు !!

9. నిజగురు ప్రార్థన ఆటతాళం: రాగము:

నిజగురూ శ్రీభారలింగా మజగురూ - నిజగురుండవు నీవునుండగ సుజనులందరు పొగడుచుండగ అజహరాదుల కందరావని భజనజేసెద భక్తవరదా!!నిజ!!1!! సద్గూరూ సకలాధీకారా మద్గురూ - సారసారవిచార సాగరసర్వ సౌఖ్యసుఖ ప్రదాయక - పారవారవిహార భక్తాపాలి హృదయ పరమనాయక !!నిజ!!2!! అచలమూ వచియింపగరానీ రచనము - వసుధలో అసమానులైనను సచలులేకద సరియురారు - వచనమేమియు లేని వస్తువ ఆశనమె అయున్నవాడా !!నిజ!!3!! బయలువె బ్రమదొలిగినంతనిర్భయలువె-నయము అయ్యిన అచలమంత్రము ఆశ్రయించిజపించినంతనె - భయముబాసును మాయ అనియెడు బంధములు తెగివూడిపోవును !!నిజ!!4!! దాసుడూ గురుదాసూలకు హరిదాసుడూ - భాసురము వెలివెర్తి యందున భూసురుండగు రామదాసుడు - వాసమై కేశావపురమున యీశుడావని పొగడు చుండును !!నిజగురు!!5!!

శా!! శ్రీమత్పరమగురు స్వరూపమైయ్యి అవనిన్ ప్రత్యక్షమై భక్తులన్ ప్రేమంజేసి భవంబులున్ దునిమి పెంపారంగ మోక్షప్రదం క్షేమం బొందగయిచ్చి చెప్పితివి సూయోగంబు అచలంబనిన్ దామంబైతివి శేషమాంబయనగన్ సేవింతు యెల్లప్పుడున్!!

10. పరమగురు ప్రార్థన ఆటతాళం: రాగము:

పరమా గురువర పాలించవే నన్ను సరగూన జేరి లాలించవే- కరుణాకరత్వాము ఘనమూగ మరినీవే కరవూ దీర్చితివమ్మా హరిహరి మరినాకు - పరమగురువర ప్రణుతసుందర భక్తపాలా కర దురంధర - సరసిజాది సురమునీంద్ర సన్నుత శ్రీశేషమాంబా !!పర!!1!! నీమాటయేమాని పల్కూదూ నన్ను యేమాటలేదాని తెల్పూదు - ప్రేమాతో నిజగూరు స్వామీస్వప్నమునందు యేమాట తెల్పితి వామాట వెలుగొందె - నామనంబుకు జూడనీకృప యేమనీ వర్ణించరాకను - ధామమైనది అన్నిటికినీ దలపనూ శఖ్యంబుగాని !!పర!!2!! తలపూలన్నియు కల్పాతరువూలూ నీదు పల్కులన్నియు అమృతాతరువులు - కలకాలమన్నిట కామాదేనువులెన్నో తిలకింపనీ చింతామణులూ తలుపగనో సలలితంబుగ కలితకాలము కల్మషంబుల బాపి సతతము - ఫలితములు సమకూర్చనీ సరి పరులు యేవ్వరులేరు నీసరి !!పర!!3!! యేమారాకను నన్నుబ్రోవూమీ తల్లి రామదాసును నన్నూ కావూమీ - ధామూడు వెలివెర్తి దైవాము నీవయ్యి - నేమాము కేశావపురమందు నిల్పూమి - రామరామ నీదుబోధయు రత్నముల హారములు సుమ్మీ - కామ్యములు సమకూర్చితివి నిష్కామ మొదవగ జేయుతుదకూ !!పరమా!!4!!

ఆ!! శ్రీపరమేష్ఠి సద్గురుడు చిన్మయతీతుడు శిద్ధఅచలుడున్ - ఆపరశురామవంశుడు అగు శీతారామస్వామి అచ్చుతుడరయన్ - పాపములెల్లను బాపెను. వాపోవగ శిష్యవరుల వరసక్రమమున్ సూపెను యోగంబచలము యీపట్లను కలయుగమున యీశుడు తానై !!

11. పరమేష్ఠి గురుప్రార్థన. ఆదితాళం. రాగము:

పరమేష్ఠి గురుపరశూరామా సీతారామా పావన పారంధామ - సరసీజభవవిష్ణు సన్మూని సన్నూత కరుణాసాగర కర్మాహరణా మృదుపాలాన - పరమపద ప్రత్యక్ష మాదవా వరవాసుదేవా వరములొసగెటి బిరుదుగలభావా - కరుణాసాగర కలుషభంజన స్మరణజేసెద మరణరహిత - అరమరెంచక బ్రోవవలెను దొరవునీవే పరమపావన !!పర!!1!! తల్లీతండ్రివి దాతవయ్యా రామా యెల్లబంధుడ వివేనయ్యా - కల్లాసంసారము గాశిల్ల జేయాను ముల్లోకములకెల్ల ముఖ్యామైయ్యిన స్వామి - వుల్లమందున వుబ్బిననుబ్రోవు - నీవాడనైతిని యెల్లభారము యుంచిమరికావు - అల్లిబిల్లిగాను వున్నా అప్రమేయామైన మాయను - యెల్లగొట్టివేయవె వొనల్లనయ్య నలినపోషక !!పర!!2!! నిన్నేసేవించెదానయ్యా రామా నన్నూమన్నించు మాయయ్యా - అన్యామే మెరుగాను యెన్నిదేవతలున్నా - మన్నాన కొరకయ్యి మరియు స్మారించితి - యెన్నవశముగాక వున్నావు-మరి యెప్పుడయ్యిన సన్నుతింపారాకయున్నావు - అన్నఅన్నానీదుచరణము కన్నులారా జూతు సతతము మన్ననెంచియు కావవయ్యా మక్కువా బహునెంచి వుంచియు !!పర!!3!! భవహారా భువనప్రకాశా రామా భక్తారక్షకా బంధానాశ - అవనిలోవెలివెర్తి ఆరామదాసునూ సవినయముగబ్రోవా ఘనులూ లేరెవ్వారూ - నవవిధంబుల భక్తులొసగుము - అనన్యబాహ్య అంతరంబుల సేవలోసగుమూ - యీవిధముగ మది సంతసించియు వుత్తమంబగు పదమునొందియు - సవినయము కేశావ పురమున సరగున నినుబొగడ నాయెను !!పరమేష్ఠి!!4!!

12. జీవస్తవం. ఆదితాళం. రాగము:

కం!! విశద విశుద్ధపురంబున వశియించియు సత్వమయుని వరస్వప్నమున్ - అసమాన ప్రతిఫలితుడె - వశమై కంఠంబునందు వరజీవుండై !!

జీవుణీ దెల్పేద వినవే బావామందూ నిల్పావే - దేవుణిప్రతినీడా మాయా భావమందూ గల్గెనే !!జీ!!1!! అద్దాములో నీడారీతి అయెమదిలో చూడవే - శుద్దాబ్రహ్మామందూ రెండూ పద్దులాయె తెల్పావే !!జీ!!2!! ఘటజేలా చంద్రూణీ రీతి ఘటమునందూ గల్గెనె - నటనాతోనమ్మీ ప్రాపంచము నట్టె జేయుచుండూనే !!జీ!!3!! పంచ్చాభూతాలోలూడితడే ప్రస్తుతంబులెందుకే - యెంచాగా ఆవాలివానీ పంచజేరవాలేనె!!జీ!!4!! సత్తూచిత్తూ సమరాసాము సాంఖ్యామాయే చూడవే - వుత్తామా పురుషూణీ ఆవలా చిత్తాగించికలియావే !!జీ!!5!! రామాదాసూ బల్కినాది స్వామీసాక్షియానావే ప్రేమతో కేశావపురిలో దామూడు పల్కించెనే !!జీవుణీ!!6!!

కం!! ఆగ్నేయపురమునందున సౌగ్నతో నున్నట్టిస్వామి సమదేవుండై - అగ్జానములను నణచును - ప్రగ్జానుడు వినరజీవ ప్రణుతించుమిరా !!

13. దేవస్తవం. ఏకతాళం. రాగము:

క్షేత్రమైన ఆగ్నేయపురంబున క్షేమమ క్షేత్రగ్జామూ- గాత్రమైన భ్రూమద్యదళంబున గణుతించిన పాత్రామూ!!ప!! గంగయెమునలూ ఘనసరస్వతీ సంగ్గమనది క్షేమమా - రంగుగ నుండి నరవిసోమాగ్నులు మండలములు మంగళమా !!క్షేత్ర!!1!! రక్తశ్వేతములు కృష్ణనీలములు రంజిల్లుచు నున్నావా - యుక్తమైన పీతముల మీదను ముక్తియుండె క్షేమమా !!క్షేత్ర!!2!! బంగరు కాంతిచే రంగాలయమున అంగనబాగున్నదా - సంగతితోడుత తటజలబింబము మంగళమున నున్నాదా !!క్షేత్ర!!3!! పంచవర్ణముల పంచకాశము పావనమై వున్నావా - మంచిగచిన్మయ మగ్నతనొందిన మహరుషలును పావనమా !!క్షేత్ర!!4!! కేశవపురమున దాసుడుబిలచితె యీశు డు మరివిన్నాడా వాశిగ రామదాసుడు వెలివెర్తి వాసునిమది గన్నడా !!క్షేత్రమైన!!5!!

కం!! సహస్రారపురమునందున ఆహంపద బ్రహ్మామునకు ఆశిపదమైతా - వూహయు త్రిగుణము భూతము సాహసమున భువనములును సగనేర్పడియున్ !!

కం!! శ్రీపరమేశు చిన్మయుడు చిద్ఘనశక్తియుతుండు ఆత్ముడున్ - ఆపరమేశుడచ్చుతు డనంతుడు ఆద్వయుడాది దేవుడున్ - చూపులమించినట్టి సుగుణోత్తమునిర్గుణ సుగుణు బొగడెదన్ !!

14. ఏకతాళం. రాగము:

శేషాశెయాన వాసుదేవా - సహస్రారవిహార వాసవార్చిత దైవసుభావా - శేషసన్నుతా చెక్ర దరాయుధ - దోషరహితభవ దూషకసంహ్మార !!శేషా!!1!! వాసావార్చిత శ్రీనివాసా వసుదా ప్రకాశా దాసామానాస హృదినీవాసా బాసమాన విలాశిత శుభకర- యీశ సర్వనీవాస దామోధర !!శేషా!!2!! సర్వాస్థావార జంగమవేషా- సురమునీఘోషా - నిర్వాణా భర్తకర్తాబాసా గర్వితదానవ గణసంచ్చేదన దుర్విచార నరధూర్తఖండితా !!శేషా!!3!! నన్నూమన్నాన జేయావయ్యా - అన్నియునీవై యున్నావు కన్నతండ్రివయ్యా - సన్నుతించెదను వుండుమినాయెడ - సున్నజేయు నాకున్నబాదలను !!శేషా!!4!! యీశాకేశావపురి నీవాసా - రామాదాసా వాసాసనకాది సన్మునిహసా - యీా సమయంబున యిష్టభక్తులకు దోషముబాపను యెసుకోబిరుదును !!శేషాశెయాన!!5!!

కం!! శ్రీరాజేశ్వరి రాజరాజ జననీ - శింధూకృపాంబోనిధీ - పారావారవిహర లోకపాలి పద్మాయుతాయుష్మణీం-దారాపుత్ర ధనాదిబంధుకాంతీ దాన్యాదిబలవర్ధనీ-సారాబ్రహ్మ విచారణాది సుగుణీం - సాంబ్రాజ్యలక్ష్మిప్రదా - రారాజేశ్వరి రత్నకంకణమణీ రాజీవ చింతామణీ !!

15. ఆదితాళం. రాగము:

మాతల్లిజననీ మాయమ్మా నన్నూప్రీతీతో బ్రోవాగాదమ్మా - భూతాలంబున నీవు భువన ప్రాకాశివి - మాతావుత్రిగుణా ఆతీతావురా తల్లి - చేతోముదమున శేవజేశెద ఘూతములు పోదోలి నీదయ- చూతువనిమదిలోన నమ్మితి - పాతకంబులు బాపవమ్మా !!మా!!1!! శ్రీరాజారాజా రాజేశ్వరీ వోతేజావిరాజ భువనేశ్వరీ - పారావిహరీ పరిహరిమా: కవికాదూరీ విహరి జెగన్మాతావు గురుపత్ని యీజెగంబుల కెల్లకరై అందరికినీ జెననివీవై - రాజుకును భిన్నంబులేని తేజ ఆత్మగదమ్మా కోమలి !!మా!!2!! ముగ్గురికి మూలామోయమ్మా - యీజెగమూకు జననీవోయమ్మా - మగువారో మముగన్న మహిమా సారాస్వాతి - సుజనూలెవ్వరులేరు మరినీకు సరితల్లీ - బుగులు బట్టినాను మాయకు భువిలోననుపాలించవమ్మా-అగడుబెట్టిరిఅసురులంతా-అందిహరిని అటు వుండవమ్మా !!మా!!3!! న్యారాములెన్నాకు తల్లీ నన్నూమరువాకు జనకల్పవల్లీ - సారములేని విచారాములను బాపి- మీరియుండిన దురితామీదాజేయుమమ్మా- కోరికేమియులేదువరములు కోమ్మరో నీదయనెకాని- దూరిభవములపారదోలియు బారముంచుముసారాసాక్షిరో!!మా!!4!! నినునమ్మీ యున్నాను సుమ్మీ- నీవేమునువెనుకా గాచూమాతల్లీ- పనిభూని బ్రహ్మాండా పాలానజేయుచూ- వినకకనకున్నావు విశ్వాంబరీదేవి- వినయముగ వరరామదాసుడు వినుతి జేయుచునున్నవాడు -అనయమూ కేశావపురమున ఆర్తిబొందెనుచూడుకృపతో !!మాతల్లీజననీ!!5!!

ఉ!! శ్రీగురుమూర్తి నెల్లపుడు చిత్తములోపల దలచిమ్రొక్కెదన్ - బాగుగనేలుమంచు భవభంధము లన్నియు బాపుమంచునే - వేగమె భక్తియుక్తముగ వేయివిధంబుల వేడుచుండెదా మాగురువాన సుమ్మిమము మక్కువనేలుము దిక్కునీవయా !!

16. స్వగురుధాన్య కీర్తనలు. ఆదితాళం. రాగము:

గురుమహరాజ ప్రభుమహరాజ- భారలింగ దేశికమహరాజ- హరిహర అజసుర నిజబంధూ వర కరుణాకర సద్గురుమహరాజ !!గురు!!1!! నిజభక్తాశ్రిత భజచరణామృతా - సుజనసుఖాస్పద గురుమహరాజ !!గురు!!2!! నిత్యనిరామయ నిశ్చల నిర్గుణ - సత్యసంకల్పా గురుమహరాజ !!గురు!!3!! సత్తుచిత్తు ఆనందసుఖాస్పద- వుత్తమ పురుషా గురుమహరాజ !!గురు!!4!! భవభయభంజన భక్తనిరంజన- సవినయ సత్పద గురుమహరాజ !!గురు!!5!! వాదభేదనిర్వేద నిరామయ - సాధుపోషణ గురుమహరాజ !!గురు!!6!! ఖండాఖండామండలవర్జిత - దండిపరాత్పరా గురుమహరాజ !!గురు!!7!! అంగలింగప్రత్యాంగ వుపాంగ - అంగపాలనా గురుమహరాజ !!గురు!!8!! చతురువేద శేవితలక్ష్యార్థా అతివిలక్షణా గురుమహరాజ !!గుఱు!!9!! క్షేత్రక్షేత్రవర క్షేత్రదాయకా -సూత్రసూత్రిరా గురుమహరాజ !!గు!!10!! అతిమహిమోన్నత అమిత దయాకర - పతితపావన గురుమహరాజ !!గురు!!11!! శబ్ధా శబ్ధా క్షేమకరోన్నత-అబ్దిభావకా గురుమహరాజ!!గురు!!12!! పూర్ణపూర్ణసంపూర్ణ అచలపరి పూర్ణరూప సద్గురుమహరాజ !!గురు!!13!! సతతము తమపద సరశీరుహములు - మతినిదలంచెద గురు మహరాజ !!గురు!!14!! ధరకేశవపుర యిలరక్షాధర- వరముని సేవిత గురుమహరాజ !!గురు!!15!!

పల్లవి !! గురుబ్రహ్మ సద్గురురాయా నామొరాలకించవే ప్రభురాయా !!

తే॥గీ॥ గురువరా నన్నుగావుమా కరుణతోడ - తప్పులువప్పులు మన్నించు దండమయ్యా - చెప్పినటువంటి కృతినీవు చెందవయ్య - దాసమానస ఖేలన ధన్య చేరితా॥

17. కీర్తన ఆదితాళం. రాగము:

గురువరమన్నించరా -దూర్గుణమూల వంచించరా - గురువర మన్నించు సరగూనమమ్ము జేరి-భరితాములయ్యున్న దురితాములన్నిబాపి॥గు॥1॥ బాలాప్రాయమూనుంచీ పలికించితెచాలాగా భక్తినుంచి - వాలాయమూగమారి పోయిన పోకలెల్ల - లీలాలుగల్గెమేలు గల్గించియు॥గు॥2॥ కవనాము విద్యలెమీ నేకాలనైన అవియూ జూడానూ స్వామీ - భవమూలెమున్నాను బంధించి భక్తుని- సవరించి బ్రోవూమి సద్గూరుమూర్తివి యెతిగణా ప్రాసాములూ - అవియెంచక అతిగాను కవనములు మీరినర్తాము లతిరాస మెరుగాక - మతియెందు కల్గెను మన్నించు మ్రొక్కెద॥గు॥3॥ తనయూని పునరూక్తులు తలువారు తల్లితండ్రి యూక్తులూ - వినయావినయములన్ని వినగోరి నాదునోట- అనయామనిపించూట అన్ని నీమహిమానె ॥గు॥4॥ కేశావపురమూనందూ - పల్కెనూ వాసామైయున్నా యెపుడూ - గాశిపల్కులు యెన్ని మోసాములున్నావో - వాశీగ బాపిరామదాసును కరుణజూడు ॥గురువర॥5॥

కం॥ శ్రీభారలింగ గురువర - మాభారముఅంతనీదే మయసర్వేశా - లాభాదిరూప సత్వద యేభయమును లేకకావు యిటుభారేశా ॥

18. కీర్తన ఆదితాళం. రాగము:

రారాశ్రీభారలింగా రమ్యాగుణాంతర రంగా- సారాసువిచారాము పారాము నొందుటాకు॥ప॥ అచలారుషివి నీవు ఆత్మానాత్మలతోడ - సచలాముతోడ వచ్చీ చెప్పినమాట కిపుడు ॥రా॥1॥ క్రమమూ తోడూత అచల సొగ్గాకను పాడాజేసి - భ్రమాయంచు మర్మాముంచక యెరుకా యెరిగించీవి ॥రా॥2॥ ల్యాగావెంబాడి ఆవు ప్రేమతోదగులు రీతీ - వేగా స్వారూపామూన వోచ్చి పల్కూమీ అన్ని ॥రా॥3॥ నేనైతె జపము తపము క్రతువేమి జేయలేదు - మున్నేమి జేయలేదు అన్ని నీదయనేకాని ॥రా॥4॥ పూరూపేరూను లేనివుత్తా కల్లాగుమాయా - మారూలేనట్టి బయలున మళ్లీరానట్టి ॥రా॥5॥ దేహి దేహము లేని దైవాసంగాము యెపుడూ - మోహత్మానుండు వరకూ యుక్తాము నొందు వరకు ॥రా॥6॥ నీవే దైవాము గూరు నీనుంచ్చికానిదేది - భావాములోన ముఖ్యభక్తుంచి మ్రెక్కెదాను ॥రా॥7॥ యెప్పాటికున్నావాడా - యేలా యెడజేసెదావు గూప్పూము నీదూకృపా చెప్పాను నీదునోటా ॥రా॥8॥ నీవూనెనానెదేమి లేని నీర్భయలూనందూ - పోవూను మదిగల్గి రానాత్మానందూ నుంచను॥రా॥9॥ స్వప్నామందెప్పూడైనా సన్నీదిజేసినటులా- యిప్పూడూ మేల్కాయెందు యెప్పాటికుండీతెల్పా॥రా॥10॥ మోహముగాదు సుమ్మీ - సాదారణ ధర్మమిదియు - అహమునుండూ వరకూ అచలామునోందువరకు॥రా॥11॥ మూలములేనికలలో ముత్తైదావచ్చీనాది-చాలా వెదుకూచు రంమ్మీసన్నీదియిచ్చినాది ॥రా॥12॥ మొదాలు పురూషాడవామెకు తదుపారి దేశికువూ తుదాకూ అచలూడావైతివి సదానామందూనాజేరా॥రా॥13॥ పతివ్రాత తీలకాము సతీవెంకామాంబ తమకూ - హితావుగల్గిన పుత్రావరులా శిష్యులబ్రోవ ॥రా॥14॥ ఆవాహనామూ గమ్మి ఆలీశ్యామొందూ సుమ్మీ- భావాభావాములేని బట్టాబయలూవురమ్మి ॥రా॥15॥ మంగళవారము నందు రంగైనా స్థలమునందూ-పోంగూచు నీవాసామొంది మంగాళమివ్వూమాకు॥రా॥16॥ కేశవపురము నందూ వాసామైవున్నాయెపుడు - ఆశించివేడేరామా దాసూడు జాగ్రాతందు ॥రారా॥17॥

పల్లవి!! కారణగురు జేరవెమనుసా - భారము నీదని అనుచును మనుసా !!

కం!! నిజగురు కృపసంపూర్తిగ - సుజనులకగు గాని దుష్టజనముల కగునా - భజనము త్రివిధము జేసిన - నిజభక్తుల భాగ్యమిదియు నీచుల కలవా !!

19. ఏకతాళం. రాగము:

నిజగురు కృపగల్గితె జాలు - నిత్యపదంబుకు బహుమేలు - సుజన గణంబగు సురులు మునులు నర - భజన గణంబులె భవహర మొందెరు !!నిజ!!1!! హరిహరాది జగదీశ్వరులూ - గురు ననుసరించి పరమేశ్వరులూ - శిరియుగౌరి వాణియుపతిభక్తులు - కరుణవడసిరి మరితమ వరులతో!!నిజ!!2!! దాతమాతలకు ధారకుడూ ప్రఖ్యాతిగాను సర్వేశ్వరుడూ - ప్రీతిగాను భవఘాతము జేశియు - రీతి జనములకు పాతకముడుపును !!నిజ!!3!! ఆత్మజ్ఞానులకు హరిఅయ్యి సాత్మరామమె యిల గురువయ్యా-ఆత్మనాత్మ పరమాత్మలుదెల్పి- శుద్దాత్ముల జేసియు ఖ్యాతి వహించెను !!నిజ!!4!! ఆగమసంచిత ప్రాలుబ్దం - గురుఆగము లణచును హరిశబ్ధం - బాగుగ నమ్మిన భక్త జనములకు భోగము లొసగియు బోంకులు బాపును !!నిజ!!5!! అనుభవంబులను అణగించూ చెడు అనుభవంబులను దూలించూ - మనువులు మొదలగు మరి ధర్మంబుల- అనయము నిల్పును ఆగురుసత్కృప !!నిజ!!6!! కేశావాదిపురి దీశుండూ - రామదాసును బ్రోచు మహేశుండూ - వాశగుపాతకవారదికోట్లను - గాశిలజేయును లేశమునుంచక !!నిజగురుకృప!!7!!

కం!! గురువర శరణము జేసెద కరుణతో సద్భక్త వరులకావవె యెపుడున్ - బరువడి దాస్యము జేశెద - కరువుడుగగ మది భజింతు మరువను గురవే !!

20. జంపెతాళం. రాగము:

శరణు జేశెదనయ్య గురవె- మమ్ముచెపట్టి రక్షించు ప్రభువే - శరణు జేశెదనయ్య ధరణిపై సాష్టాంగ - కరుణించవే వఘటి మనవిజేశెద వినుమి !!ప!! భక్తులను కాపాడవయ్యా గురవె భవ బంధములు బాపవయ్యా - భక్తులను బాంధవుల శెక్తులకు నివ్వకుము - యుక్తముగ రక్షించి ముక్తులివ్వుము ముందు!!శర!!1!! జీవన్ముక్తుల జేయువయ్యా-మాకు భావముల భ్రాంత్తుంచకయ్యా శేవకుల కెప్పుడూ చెడుగుణంబులు బాపి - కావవే కరుణించి కలుషముల పోదోలి!!శర!!2!! పుత్రామిత్ర్యులబ్రోవవయ్యా గురవే కళత్రులను కాపాడవయ్యా - శత్రుసంఘంబులను పూర్తిగనుబరిమార్చి- పాత్రజనములనెల్ల పాలించునాస్వామి !!శర!!3!! ఆయుర్ధయము లియ్యువయ్యా గురువె పాయనీపదవుంచవయ్యా - కాయసౌఖ్యంబులను కడుఅమితములు నొసగి - మాయలో బడనివకు వేయివిధములనైన !!శర!!4!! సర్వపీఠములందు గురవె - మంచిసద్భక్తులను నిల్పు ప్రభువే - పర్వమొచ్చుదాక పాలించు దీనులను - సర్వమయుడవు నీవె నిర్వహించుమిదేవా !!శర!!5!! చక్కనీ సద్గురుడవయ్యా గురవె - మ్రొక్కెదను వేలుకోట్లయ్యా - వక్కడవె నిజగురుడ వసుధ అంతటికినీ - మక్కువను మదినెంచి దక్కించుకో మమ్ము !!శర!!6!! కలికాలమైదు వేలయ్యా గురవె- కాలనీతులు దప్పిపొయ్యా- ఫలకాములై అసుర ఫలవలంతొకటయ్యి- కలకాలా అనగనూ ఘనుల భాదించిరీ !!శర!!7!! వీరధర్మము జూపవలెనూ గురవె దారిమంచిది నిల్పవలెనూ వీరభోగంబులను విడుము నీకెకీర్తి - కోరికేమియు లేదు భారగురుణి ఆన !!శర!!8!! నీమహిమ వర్ణించతరమా గురవె - నామాటనీకునూ ఘనమా - రామదాసుండనని ప్రేమనీదుంచీయు భూమిలో వెలివెర్తి ధామాపాలించుమి !!శరణుజేశెదనయ్యా!!9!!

21. ఆటతాళం. రాగము:

ముక్తికాంత పెండ్లి వుయ్యాలో- భక్తులందరు రండి వుయ్యాలో- రక్తులన్నియు బాశివుయ్యాలో ముక్తి నొందగవాలె వుయ్యాలో !!ము!!1!! యిడపింగళ నడమ వుయ్యాలో - నడినాడి కాగ్రమునవుయ్యాలో- నడుమరంధ్రమునందు వుయ్యాలో - నాతివున్నది కనుడి వుయ్యాలో !!ము!!2!! గంగయమునల నడుమ వుయ్యాలో - ఘనమైన కొలనుంది వుయ్యాలో - మంగళ స్నానంబు వుయ్యాలో మరి అందుజేయుడి వుయ్యాలో !!ము!!3!! హంసవాహనమెక్కి వుయ్యాలో - అదియు దాటగవాలె వుయ్యాలో - సంశయంబులు బాపి వుయ్యాలో - సౌకరంబులు గనుడి వుయ్యాలో !!ము!!4!! యెక్కిపోవుచునుండు వుయ్యాలో- చుక్కలా మెరుపులు వుయ్యాలో- చక్కనీ వర్ణములు వుయ్యాలో చాలాయెన్నో కలవు వుయ్యాలో!!ము!!5!! సూర్యచంద్రులవాలె వుయ్యాలో-చూడఅగ్ని కళలువుయ్యాలో సారసంబుగ వెలగు వుయ్యాలో - చెప్పరాని మహిమ వుయ్యాలో !!ము!!6!! నిండుపున్నమ కాంతి వుయ్యాలో- పండువెన్నెలకాంతి వుయ్యాలో- యెండదీప్తులవాలె వుయ్యాలో - వుండునా పర్మితము వుయ్యాలో !!ము!!7!! మణులుదాపీనట్టి వుయ్యాలో - మరిరత్నములవాలె వుయ్యాలో - మాణిక్యముల కాంతి వుయ్యాలో - మరి ముత్యములవాలె వుయ్యాలో !!ము!!8!! బహుచిత్రవర్ణములు వుయ్యాలో - పరమభక్తిగలదు వుయ్యాలో - భానుకోటి తేజముయ్యాలో - పలుక వశముగాదు వుయ్యాలో !!ము!!9!! వనపుష్ప వృక్షములు వుయ్యాలో - వర్ణింప తరమౌన వుయ్యాలో - మునులశిద్దుల గుహలు వుయ్యాలో - వనములెన్నో కలవు వుయ్యాలో !!ము!!10!! గుళ్ళు గోపురములు వుయ్యాలో - గురుతుగల దేవతలు వుయ్యాలో - గండ్లలోపలవన్ని వుయ్యాలో - కదలకాచూచితె వుయ్యాలో !!ము!!11!! గురుడు చెప్పినముద్ర వుయ్యాలో - గురిచక్కగానిల్పివుయ్యాలో - హరిద్వారమును జేరి వుయ్యాలో-అందులో కనుగొనుడి వుయ్యాలో!!ము!!12!! పంచరంగులతోను వుయ్యాలో పర్దలైదును కలవు వుయ్యాలో - పరకాంత అందులో వుయ్యాలో తళకుతళకు మనును వుయ్యాలో !!ము!!13!! వెయ్యిదళముల యందు వుయ్యాలో - వెలుగులో వెలుగయ్యి వుయ్యాలో - వరగురూరాయుండు వుయ్యాలో - వరుడు అందులో కలడు వుయ్యాలో !!ము!!14!! జోడుబాయక అదియు వుయ్యాలో - కూడి వెలగుచునుండు వుయ్యాలో - చూడుడీ మనసుంచి వుయ్యాలో చూపులెస్సగనిల్పి వుయ్యాలో !!ము!!15!! దేవవాయిద్యములు వుయ్యాలో దివ్యనాధంబులు వుయ్యాలో దేదీప్యమానంబు వుయ్యాలో - తేజంబు వెలుగొందు వుయ్యాలో !!ము!!16!! తలంబ్రాలు వేయుడి వుయ్యాలో - తలపులన్నియు మాని వుయ్యాలో - ఫలములను బొందుడి వుయ్యాలో - తొలుకనీమదివుంచి వుయ్యాలో !!ము!!17!! జ్యోతిదర్శనమాయె వుయ్యాలో-పాతకంబులు బాసె వుయ్యాలో దాతదైవంబాని వుయ్యాలో - ధన్యుని పొగడుడి వుయ్యాలో !!ము!!18!! జనన మరణములేదు వుయ్యాలో - జన్మమొందము మళ్ళి వుయ్యాలో - అనుమానమును బాసె వుయ్యాలో - అంతటా బయలాయె వుయ్యాలో !!ము!!19!! యిదిచదివి తెలిసిన వుయ్యాలో యిఘముక్తి దొరుకును వుయ్యాలో - మదినిల్పినంతలో వుయ్యాలో - మరిమోక్షమమరును వుయ్యాలో !!ము!!20!! ధరయందు వెలివెర్తి వుయ్యాలో - ధాముని సాక్షిది వుయ్యాలో - వరరామదాసుండు వుయ్యాలో వచియించె సత్యంబు వుయ్యాలో !!ముక్తికాంత పెండ్లి!!21!!

కం!! నీవాసంబును కాశికాపురిగదా - నిభేన్ద భాసాంగదాభావా భావము కందరాని బ్రహ్మం - ప్రఖ్యాతమున్ జెందగా కావామాకును కర్తవై తెల్పినా కారుణ్యవాఖ్యంబునన్ - లేవాకడు

రమ్య మంగళవర రాజీవ భారాంహ్వామా !!

22. మంగళహరతి. రూపకతాళం. రాగము:

శ్రీమంగళవర నిలయా - శ్రితజన హృదయాద్రి సదయ!!ప!! కాశీపుర నిలయమునీ వాసమె అనివర్ణించెద - వాశగు రామేశ్వరాది వరపుణ్యా భూమిదెకదా !!శ్రీ!!1!! వరభద్రాచలమనినను వైకుంఠంబని యన్నను - శిరివెలిగెడు వెలివెర్తిల స్థిరవచనం బిడితివిగద !!శ్రీ!!2!! ధరయెందున దామెరగిరి పురియందున బయలయితివి - మరిశోభాకృతు జ్యేష్ఠవరశూద్ధా దశిమందున !!శ్రీ!!3!! అభయంబిడి అధికారము శుభమగునని శెలవిచ్చియు - సభలోపల సద్భక్తుల అవమానంబిది యెందుకు !!శ్రీ!!4!! నీకరుణకు పాత్రుడనై - నిజమచలమె నిశ్చయింప - నీచంబని కొందరనుట వాచలక ముడుపుము యిక !!శ్రీ!!5!! యీకవనము పలికించుట నాకెందుకు లోకనింద - యేకవనము విద్యలునే నెరుగను సుమి నీయిష్టము !!శ్రీ!!6!! దేశిక నేజేశితి భవ దోషంబులు లెక్కింపక మోసంబులు బాపియు రామదాసును చేపట్టుమియి !!శ్రీమంగళవర!!7!!

శ్రీశ్రీశ్రీఅన్నమరాజు సత్యమాంబగారి విరచిత - మంగళహరతులు

కర్పూరారతి ప్రాణకాంతా శ్రీరామా- నేర్పుమీరగ చెంతజేర్చవెప్రేమా !!కర్పు!!1!! హరి షడ్వర్గములా నన్నాంట నివ్వకుమా - కరువు దీరగనాదూ కాంక్షదీర్పుసుమా !!కర్పు!!2!! నోట నుడివిన పలుకు నాటేనా మదికి - సూటిదప్పక ముందు చూతునెప్పటికి !!కర్పు!!3!! కలుష తిమిరపతంగా కరుణాంతరంగా - అస్కలితసద్గుణ బృంగా ఘనసుప్రసంగా !!కర్పు!!4!! సతతా శ్రీవెలివెర్తి సదనవివేకా - క్షితిసత్యమాంబ పోషిత మోక్షతీత !!కర్పురారతి!!5!!

2. పాండురంగా మంగళహరతి

పాండురంగాయ భక్తపాలనా మనోహరాయ - పరమకళ్యాణదాయ పాహి మంగళం !!ప!! దేవకీనందనాయ దేవదేవ బృందనాయ - భావజాది వందనాయ భవ్యమంగళం !!పాండు!!1!! గోపీజన వల్లభాయ గోపబాల పాలనాయ - గోవర్ధనగిరిధరా గోపాల మంగళం !!పాండు!!2!! రుక్మిణీ సమేతాయ దు:ఖసంహరణాయ - చక్కనిగుణగణాయ సాక్షిమంగళం !!పాండు!!3!! భక్త పరిత్రాణాయ భవభయా విమోచనాయ - ముక్తికాంతశేవితాయ ముఖ్యమంగళం !!పాండు!!4!! అపత్కాల బాంధవాయ అచ్యుతాయ అనంతాయ-అప్రమేయయా వర్యఆర్యామంగళం !!పాండు!!5!! పుండరీకాయ వరద పండరీ నివాసాయ - అండజాదివాహనాయ అమిత మంగళం !!పాండు!!6!! యిలలో వెలివెర్తిశాయ యిష్ఠదైవ దేవతాయ - సలలిత ఐశ్వర్యదాయ సత్యమంగళం!!పాండు!!7!!

సర్వం సంపూర్ణము శ్రీ సద్గురు చరణార విందార్పణమస్తు

ఇతిశ్రీమద్వేదాంతసారుండును-సచ్చిదానందతీతుండును-క్షేత్రక్షేత్రజ్ఞ రహితుండునుక్షరా క్షరోపాది విలక్షణుండును - ప్రకృర్తి పురుషద్వయదోష రహితుండును - పరమపవిత్రుండును ఆశేరీరుండును అప్రమేయుండును - అచలుండునునైన -శ్రీమత్ భారలింగదేశికేంద్ర నిజగురు చరణకమలకురు విందారువింద మరంద పానతుందిలతా- మందమందానంద మిళింద బృందం బున- అన్నమరాజవంశోద్భవ భరద్వాజసగోత్ర పవిత్రకుండగు -వెలివెర్తి రామబ్రహ్మప్రణితంబైన శ్రీ భారలింగ శతకము మొదటిభాగము - దేశికేంద్ర శతకము రెండోభాగము - శ్రీఅచలపరిపూర్ణ నిజగురు భావసంగ్రహము మంగళహారతులు సర్వము సంపూర్ణము.

శ్రీ అచలగురు చరణార విందార్పణమస్తు

విషయసూచిక

## విషయసూచిక

విషయసూచిక

విషయసూచిక

విషయసూచిక